1955

ద్వితీయ ముద్రణము

రామచంద్రపురమున శ్రీ ఆనంద తీర్థ ప్రెస్ నందు
ముద్రింపబడెను.

శ్రీ

"ఆంధ్రకవితరంగిణి" ప్రథమసంపుటము 1947 వ సంవత్సరమునఁ బ్రచురించితిని. ఆంధ్రప్రజానీకము చూపిన ఆదరాభిమానములచే నేటికి పండ్రెండవ సంపుటములు ప్రకటింపఁగలిగితిని. ఇంకను పదుమూఁడు సంపుటములు ముద్రణము నందవలసి యున్నవి

ఈ మొదటి సంపుటమునకు ద్వితీయ ముద్రణము ఒనర్పు అవకాశము కలిగినందుల కెంతయు సంతసించుచున్నాఁడను. నా యొనర్చిన కృషికి ఆంధ్రపాఠక మహాశయులు చూపిన మెప్పుదలయే యీ యవకాశమునకు హేతువు. ద్వితీయ ముద్రణమున గ్రంథములో మార్పులేవియు లేవు. ఇందు ఆయా పట్టుల నేను చేసిన నిర్ణయములకు అన్యథాత్వము కల్పించు ప్రబలచారిత్రక సాక్ష్యములు ఇటీవలి పరిశోధనలలో బయలుపడకుండుటచే గ్రంథమున్నది ఉన్నట్లుగనే ముద్రించితిని.

కవి జీవిత చరిత్రలతోఁబాటు కావ్యవిమర్శయు నుండుటమేలను మతమును గూర్చి ఎడనెడ మనవి చేసికొనియే యుంటిని. మన యుత్తమ కావ్యములను గూర్చిన సమగ్రవిమర్శగ్రంథము వెలువడుట అత్యావశ్యకము. అట్టి గ్రంథమును వెలువరించుట కెంతేని కుతూహలము కలవాఁడనయ్యు, విద్వాంసుల సాహాయ్యము లభించునను విశ్వాసముండియు, గ్రంథ ముద్రణమునకగు వ్యయప్రయాసలను తలపోసి వెనుకంజ వేయుచున్నాఁడను. ఇప్పటి పరిస్థితులలో గ్రంథ ముద్రణభారము వహించుట ఎంతకష్టసాధ్యమో అనుభవజ్ఞులగు రచయితలకు నేను వేఱుగా మనవిచేయనక్కఱలేదు. ఉదారహృదయులగు ఆంధ్రభాషాభిమానుల ప్రోత్సాహము ఇతోధికముగా లభించునెడల నా ప్రయత్నము నెరవేరఁగలదనియు నాకు దృఢవిశ్వాసము లేకపోలేదు.

ఇంతవఱకు నా యుద్యమమునకు బహువిధముల సాహాయ్యమొనర్చిన శ్రీమంతులకు, విద్వాంసులకు, ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులకు నాకృతజ్ఞత తెలుపుకొను చున్నాఁడను. ఇఁకముందుకూడ ఆంధ్రసహృదయులు నాకృషికిఁ బ్రోత్సాహమిచ్చి, నేను చేయఁబూనిన యీ ఆంధ్రవాఙ్మయ సేవయందు నన్ను కృతార్థుని జేయుదురని ఆకాంక్షించు చున్నాఁడను.

మన్మథ: కార్తికపూర్ణిమ॥ గ్రంథకర్త.

# తొలిపలుకు



ఆంధ్రగీర్వాణములందు అలంకారశాస్త్ర గ్రంథములు, వ్యాకరణములు అనేకములున్నవి గాని వాఙ్మయచరిత్రలు, కవిజీవితములు మన సాంప్రదాయమునకు క్రొత్తవి. ఆంధ్రమున నిట్టి కృతులకు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారును, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును మార్గదర్శకులు, వీరొనర్చిన భాషాసేవ అగణ్యము. అయినను వారి యుద్యమము అపూర్వమగుటచేతను, దత్కాలమున లభ్యమైన సామగ్రి అధికము గాకపోవుటచేతను, వారి కవిజీవితములు అసంపూర్ణములును, అసమగ్రములునై యున్నవి. చరిత్రకు బరిశోధన ఆధారము. పరిశోధనలవలన దినదినము క్రొత్తవిషయములు విదితములగుచుండును. అట్టివిషయము లన్నింటిని జేర్చి వ్రాసిన చరిత్రలే సార్థకములగును. నన్నయభట్టు జీవితము ఒకరిద్దరు వ్రాసిరిగదా, మరల నింకొకరెందుకు వ్రాయవలెనని యాక్షేపించుట అసమంజసము షెల్లీ అను ఆంగ్లేయకవిజీతము ఎందరోవ్రాసియున్నను మొన్నటి దినము మరల నింకొకగ్రంథము ప్రకటింపఁబడినది. 150 సంవత్సరములకు బూర్వము జీవించిన షెల్లీని గురించియే నూతనాంశములు పరిశోధనవలన బయల్పడుచున్నప్పుడు ఇక పురాతనులైన ఆంధ్రకవులమాట చెప్పవలెనా!

శ్రీ చాగంటి శేషయ్యగారు ఇంతవరకు లభించిన విజ్ఞానము నుపయోగించుకొని ఆంధ్రకవి జీవితములను వ్రాయఁదొడగినది కొనియాడఁదగిన కార్యము. వీరి యుద్యమము ఎంత శ్లాఘనీయమో ఒక్కసంగతి చెప్పిన దెలియఁగలదు. ఇంతవరకు బ్రకటింపఁబడిన కవిజీవితములన్నింటిని గలిపినను, మొత్తము కవులసంఖ్య మూఁడువందల

యేఁబది దాటలేదు. శేషయ్యగారి లెక్కప్రకారము తేలిన కవుల సంఖ్య పదమూఁడువందలు. గ్రంథము సాంతముగ ముద్రించిన దాదాపుగ నైదువేల పుట లగునట!

ముద్రించిన 250 పుటలు మాత్రమే నేను చదువఁగల్గితిని. విపులత్వము, విచక్షణ, విమర్శ—అన్నిగుణములు నున్నవి. వీరు ఉపోద్ఘాతమునఁ జెప్పినట్లు శాసనవాఙ్మయపరిశోధనాది సాధనముల మూలమున లభ్యమైన యనేకవిషయములు వీరిగ్రంథమునఁ జేర్పఁబడి యున్నవి.

ఆంధ్రలోకము ఇట్టి మహాకార్యమును ఆదరాభిమానములతో బ్రోత్సహించి పోషించునుగాక యని నాప్రార్థన.

7-10-1946

పా. వెం. రాజమన్నారు
మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి

# PROCEEDINGS OF
# THE DIRECTOR OF PUBLIC LIBRARIES
# ANDHRA STATE

MADRAS

Dis.3331/54 Dated 21–9–54

Sub:--Books and Publications - Book entitled 'ANDHRA KAVI TARANGINI Commendation for use in Public Libraries and in libraries of schools and colleges.

Ref:--Letter dated 17th June 1954 from Sri Chaganty Seshayya, Kapileswarapuram; East Godavary.

The Book entitled 'ANDHRA KAVI TARANGINI in ten volumes written by Sri Chaganty Seshayya' is recommended for use in all public libraries and in libraries of schools and colleges. The undermentioned officers are therefore, requested to bring this publication to the notice of all the concerned authorities.

2. The cost of each valume is Rs. 3/–, and copies may be had from the author, c/o The Hindu Dharma Sastra Grandha Nilayam, Kapileswarapuram, East Godavari District

(Sd.) K. Raghava Reddy,
For Director of Public Libraries.

(True copy Forwarded By Order)
L. Subbarao
Superintendent.

To

All the District Educational Officers, Inspectress of Girls Schools. Copy to The Principals of all colleges Arts and Professional. Copy to the Divisional Inspector of Schools. Copy to Sri Chaganty Seshayya, Author Andhra Kavi Tarangini, Kapileswarapuram, East Godavari District.

(True Copy)

## SRI C. RAMALINGA REDDY Kt.

M. A. (CANTAB), HON. D. LITT

Vice-Chancellor, Andhra University.

"I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini" It is a remarkably fiine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archæological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

......... Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the andhra world with an authoritative Lives of Andhra poets.

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature.

## ఆంధ్రప్రభ

ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథములేని లోటు దీనితో తీరినట్లయింది. తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించ దానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రులపై నున్నది."

## THE HINDU

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto laid hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions.....

# విషయసూచిక



శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

"శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్రేయసే"

## నన్నయభట్టు.

జగమెఱింగిన బ్రాహ్మణుఁడగు నీమహనీయుని చారిత్రము నిదివఱ కెందఱో చరిత్రకారులు లిఖించియున్నారు. ఆంధ్రభాషఁ గావ్యరచనకుఁ బూనినకవులలో గ్రంథారంభమున నీతని నుతింప కుండిన వారరుదు. పుణ్యపురుషకీర్తనమునఁ జర్వితచర్వణదోష ముండదు. ఆంధ్రకవితరంగిణి యం దీతని చరిత్రమును మొదట నుల్లేఖింప నా లేఖిని యువ్విళ్లూరుచున్నది.

### నన్నయ నన్నియలు భిన్నవ్యక్తులా ?

ఈ మహాకవినామము దాదాపు వేయిసంవత్సరముల నుండి చరిత్రకారులచేతను, పండితులచేతను, కవులచేతను "నన్నయభట్టు" అని వాడఁబడుచున్నది. నందంపూడి శాసనము బయలు వడిన పిమ్మట నీతనిపేరు "నన్నియభట్టు" అని స్పష్టమయినది. నన్నయయనినను నన్నియయనినను ఒక్కవ్యక్తియే కాని యిరువురు కారు, చిరకాలమునుండి ప్రచారములో నుండుట కారణముగా నీ కవి నిందు నన్నయ యనియే పేర్కొనుచున్నాఁడను. ఇతఁడు రాజరాజ నరేంద్రుని యాస్థానపండితుఁడై భారతమును రచించినవాఁడు. నందంపూడి శాసనమునందును, మండశాసనమునందును శాసనకావ్యకర్త 'నన్నియభట్టు' అని లిఖింపఁబడియున్నది.

ఈ రెండుశాసనములును భారతకృతిపతియైన రాజరాజు బ్రాహ్మ
ణుల కగ్రహారములిచ్చి వ్రాయించినవి. ఈ శాసనములను భారత
కావ్యకర్తయే రచించినాఁడని చెప్పుట యుక్తము. శాసనములను
రాజులు తమ యాస్థానపండితులచేతనే వ్రాయించుచుందురు. వేమ
భూపాలుని యాస్థానకవియైన శ్రీనాథభట్టనేకశాసనములను రచియించి
యుండెను. విశ్వేశ్వరభూపతి యాస్థానవిద్వాంసుఁడగు విస్సకోట
పెద్దన, విశ్వేశ్వరరాజశాసనమును వ్రాసియుండెనని విదితమయినది.
ఇట్టి యుదాహరణముల నింకను జూపవచ్చును. శిలాశాసనములలో
లిఖింపఁబడియుండుటచే నీకవియొక్క నిజనామము నన్నియయే యై
యుండునని మనమూహింపఁదగియున్నది. 'నన్ని' శబ్దము కర్ణాటక
భాషలోనిదనియు, దానికి "సుందరము లేక ప్రియము" అను నర్థమున్న
దనియు, బండితులభిప్రాయమిచ్చియున్నారు. నందంపూడి శాసన
ములో నారాయణభట్టును "నన్నినారాయణాయ" అని వ్రాసియు
న్నాఁడు. ఈ కవి నామము నన్నియయే యైనను, నది యాంధ్రభాషలో
నించుక మార్పుఁజెంది నన్నయ యని వాడఁబడుచువచ్చినది. భారత
మందలి గద్య పద్యాదులలోఁగూడ నీ మార్పు చేయఁబడిన ట్లూహింపఁ
దగియున్నది. నన్నిచోడకవిని, "నన్నచోడుఁ" డని "నన్నెచోడుఁ"
డని పిలుచుచున్నారు. సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు ప్రాచీన
శాసనములలో నామాంతరములయందు వచ్చెడి 'అయ్య' బదులుగా
"ఇయ" అని వాడుచువచ్చిరని వ్రాసియున్నారు. ఏది యెట్లున్నను
నిది వాడుకలోవచ్చిన మార్పు దక్క నన్యము కాదు. ఆ కాలములో
నీపేరు, నన్నియ యనియో లేక నన్నయయనియో ఏదియో యొక్క
రూపములోనే యుండును. కాని కొందఱు నన్నియయనియుఁ
గొందఱు నన్నయ యనియుఁ బండితులు వాడియుందురు. అందుచే
నన్నియ నన్నయ లొక్కరేకాని భిన్నులుకారు.

నందంపూడి శాసనకావ్యకర్త నన్నియభట్టనియు, మహాభారత
కావ్యకర్త నన్నయభట్టనియు, వీరిరువురును భిన్నవ్యక్తులనియు శ్రీమారే
మండ రామారావుగారు భారతి (వృష-కార్తికము) లో వ్రాసి

యున్నారు. కాని వారి యూహయందు సత్యమున్నదని నాకుఁ దోచఁ లేదు. రాజరాజు నాస్థానమున నన్నియ—నన్నయ నామధారు లిరువు రుండినట్లు వేఱుసాక్ష్యము వలన ఋజువయిన నేకాని, రామారావుగారి యభిప్రాయముతో నేకీభవింపఁజాలను. శాసనమునందు నన్నయభట్టు తనను గూర్చి యేమియుఁ జెప్పుకొనకుండుటయును నారాయణభట్టున కగ్రహారమిచ్చిన రాజరాజు నన్నయను సత్కరింపకపోవుటయును, నందంపూడి శాసనకావ్యకర్తయు, మహాభారతకర్తయు నొక్కఁడుగాఁ డని చెప్పుటకుఁ గారణములని శ్రీరామారావుగారు వ్రాసియున్నారు. కాని యీ కారణములనుబట్టి యీభిన్నకర్తృత్వము ధ్రువపడఁజాలదని నా యుద్దేశము. శాసనకావ్యకర్తలు తమను గూర్చి శాసనముల యందు జెప్పుకొను నాచారమునకప్పటిదు. శ్రీనాథుఁడు తాను గ్రంథకర్త నని శాసనములలోఁ జెప్పుకొనలేదు. శాసనకావ్యకర్తలు తమను గూర్చి విశేషముగాఁ జెప్పుకొనిన శాసనములు నేఁజూచినంతవఱకు లేవు. చరిత్రకారులందఱును నన్నియ నన్నయలు భిన్నవ్యక్తులు కాని నిర్ణ యించియున్నారు. బలవత్తమమయిన సాక్ష్యము లభించినఁగాని భిన్నత్వ మంగీకార్యము కాదు.

## నన్నయ వంశము

పంచమవేదమని ప్రశస్తిఁగాంచిన శ్రీమహాభారతాంధ్రీకరణము నకుఁ బూనుకొనిన యిమ్మహాకవి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. ముద్గల గోత్రుఁడు. ఇతఁడు తన తల్లిదండ్రుల పేరులనుగాని తన పూర్వు ల యుదంతమునుగాని జెప్పుకొనియుండలేదు. నిరాడంబరజీవనులగు మహాపురుషులు కేవలలోకోపకార తత్పరులై ఘనకార్యములను జేయు చుందురు. వారికి యశఃకాంక్ష యుండదు. నన్నయభట్టాతరగతికిఁ జెందినవాఁడు. తనను గూర్చి యీక్రింది పద్యమును మాత్రమెవరో చెప్పినట్లు కృత్యాదిని రచించియున్నాఁడు. నిజముగా నీపద్యము నేనా రాయణభట్టయిన రచియించియుండెనేమో యని యనిపించును.

సీ॥ తనకుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ । జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది । నానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్రి । జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి । శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ॥ నిత్యసత్యవచను మత్యమరాధిపా । చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా । భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ.

ఈ పద్యమునుబట్టి నన్నయ, వేదాధ్యయనతత్పరుఁ డనియు నిర తాగ్నిహోత్రి యనియు, బహుపురాణార్థవేది యనియు, ప్రాపంచిక ధర్మవిజ్ఞాని యనియు, నిత్యసత్యవచనుఁడనియు, నుభయభాషాకావ్యరచనాభిశోభితుఁ డనియు, బుద్ధిని గేవలము బృహస్పతి యనియు, మనకుఁ దెలియుచున్నది. ఇట్టి మహాపురుషుఁడు, ఇట్టి పవిత్రహృదయుఁడు మహాభారతము నాంధ్రీకరింపఁ బూనుట యాంధ్రులయదృష్టము భారతమునం దీతని రచనాభాగమునఁ బ్రతిపద్యమునందును, పవిత్రత కాన్పించుచుండును. ఈతని సౌజన్యాది గుణము లీతనిపద్యములలోఁ బ్రీతి ఫలించుచుండును.

## నన్నయభట్టాంధ్రుఁడు — భీమనభట్టు కుమారుఁడు.

నన్నయ మహారాష్ట్రుఁడని కొందఱును, గర్ణాటకుఁ డని కొంద ఱును దలంచుచున్నారు. కాని యందుల కాధారములు లేవు. కర్ణా టక శబ్దమగు 'నన్ని'నిబట్టి యాతఁడు కర్ణాటక బ్రాహ్మణుఁడని కొంద అనుచున్నారు. కాని యంతమాత్రముచే నన్నయ కర్ణాటకుఁడు కాఁజాలఁడు. కర్ణాటాంధ్రములు సన్నిహితము లగుటచేతను గర్ణాటు లాంధ్రదేశమును, ఆంధ్రులు గర్ణాటకమును బరిపాలించుటవలనను, గర్ణాటాంధ్రభాష లప్పుడప్పుడు రెండుగుటను నామములలోనేమి శబ్దజాలము నందేమి మిశ్రణము జరుగుచువచ్చినది. ఆకాలపు కవుల యాంధ్ర గ్రంథములయందుఁ గన్నడపదము లెన్నియో చేరినవి. నన్నయనామము కూడ నారీతిగ వచ్చెనదే కాని యన్యము కాదు. నన్నయ శుద్ధాంధ్ర బ్రాహ్మణుఁడు.

భారతమునుబట్టి నన్నయ పూర్వులవిషయము మన కేమియుఁ దెలియదు. భారతకృతిపతియైన రాజరాజనరేంద్రుని తండ్రి యగు విమలాదిత్యుఁడు, వజ్జియప్రెగ్గడ కగ్రహారమునిచ్చి వ్రాయించిన రణస్థిపూఁడి శాసనముయొక్క కావ్యకర్త భీమనభట్టు. రాజరాజు వ్రాయించిన కోరుమిల్లి, కలిదిండిశాసనముల కావ్యకర్త భీమనభట్టు కుమారుఁడైన చేతనభట్టు. ఆరాజరాజ నరేంద్రుఁడే వ్రాయించిన నందంపూడి, మండశాసనములను రచించినది నన్నియభట్టు. రణస్థిపూఁడి శాసనకర్తయైనభీమనభట్టును, కోరుమిల్లి కలిదిండి శాసనకావ్యకర్తయైన చేతనభట్టునకుఁ దండ్రి యగుభీమనభట్టును నొకవ్యక్తియే యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. (కోరుమిల్లి శాసనకావ్యకర్త చెట్టనభట్టని కొందఱు) నన్నియభట్టు భీమనభట్టుయొక్క రెండవకుమారుఁడో కాక చేతనభట్టుయొక్క కుమారుఁడో, అయియుండునని నాయభిప్రాయము. భారతములోఁ దాను రాజరాజునకుఁ గులబ్రాహ్మణుఁడనని నన్నయభట్టు చెప్పుకొనియున్నాఁడు. ఈవిషయము నాయూహకుఁ బలమొసంగుచున్నది. కులబ్రాహ్మణుఁ డనఁగా రాజకుటుంబము నాశ్రయించి వంశానుగతముగా వచ్చుచున్న బ్రాహ్మణుఁడని యర్థము. ఈ నన్నియభట్టు శాసనమునఁ దండ్రిపేరేల చెప్పలేదని ప్రశ్నించుటవలనఁ బ్రయోజనములేదు. భారతముననే చెప్పుకొననియాతఁడు, దానపత్రమువంటి యీశాసనమున లేఖరినామ ముదహరించినట్లు తననామమును మాత్రమే యుదాహరించును. కాని, తనచరిత్రమును లిఖించునని తలంపరాదు. రాజాస్థానములలో సంధివిగ్రహి యుద్యోగము నందున్నయాతఁడు శాసనగ్రంథములను వ్రాయుచుండునని స్మృతులలోఁ జెప్పఁబడినది. దీనినిబట్టి భీమన, చేతన, నన్నయలు సంధివిగ్రహులని యెంచఁదగియున్నది. సంధివిగ్రహి మంత్రులలో నొకఁడు. ఈవిషయము శాసనములవలనఁగూడ స్పష్టమగుచున్నది. భావిపరిశోధనమువలన భీమన, చేతన, నన్నియల బాంధవ్య మెఱుంగఁబడునని విశ్వసించుచున్నాఁడను. ఈ సందర్భమున నీదిగువ శాసనమును గమనింపవలసియున్నది.

"శకాబ్దే యుగనందరంధ్రగణితే చైత్రం గతే భాస్కరే
శ్రీమార్కండ మహేశ్వరాయ వసతే గోదావరీప్రాంతకే
ప్రాదాద్దీప మఖండవర్తి మనిశమ్ విప్రప్రదీపాన్స్వయమ్
భీమశ్శ్రీమదమాత్యకృత్యనిపుణో మాతా పితృశ్రేయసే"

స్వస్తి సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర ౧౨ శ్రీహివిష్ణుసంక్రాంతి నిమిత్యంబున మార్కండేశ్వరమహాదేవరకు భీమన ప్రెగ్గడలు పెట్టిన యఖండవర్తి దివియ... ... ...

ఈశిలాశాసనము గోదావరిమండలమందలి రాజమహేంద్రవరమున మ్యూజియములో నున్నది. (A. R. 1933 పుట 55-56) ఈశాసనము శక ౯౯౪ క్రీ.శ. ౧౦౭౨ నాంటిది.

ఈశాసనమందలి సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజు మహాభారతకృతిపతియగు రాజరాజనరేంద్రుని సవతిసోదరుఁడగు విజయాదిత్యుఁడేకాని యన్యుఁడు కాఁడు. దొరతనము వారి శాసనపరిశోధకశాఖవారీతనిని రాజరాజుకుమారుఁడగు కులోత్తుంగచోడుఁడని భావించిరి. కాని యది సరికాదు.

ఆ విజయాదిత్యునియొద్ద మంత్రిగానున్న భీమనప్రెగ్గడ వ్రాయించిన శాసనమిది. ఈ భీమన యెవ్వరో మనము తెలిసికొనవలసియున్నది. ఈ భీమనప్రెగ్గడ నన్నయభట్టు కుమారుఁడని నాయభిప్రాయము. నన్నయభట్టుతండ్రి భీమనభట్టు కావచ్చునని పైన వ్రాసియుంటిని. తండ్రిపేరు తనకుమారునకుఁ బెట్టునాచార మీప్రాంతముల యందు చిరకాలానుగతమై యుండుటచే, నన్నయభట్టు తన తండ్రిపేరు కుమారునకుఁ బెట్టియుండవచ్చును. వంశానుగతమైన రాజాశ్రయము నన్నయభట్టునకుఁ బిమ్మట నీ భీమనప్రెగ్గడకు వచ్చియుండును. రాజరాజునకు తరువాత నాతని సవతిసోదరుఁడైన వేఁగిదేశపరిపాలనాధికారము వహించిన విజయాదిత్యునియొద్ద నీభీమన మంత్రియై యుండును. ఈశాసనము రాజమహేంద్రవరమునందే యుండుట వలనను, అందలి

మార్కండేయస్వామికే యఖండవర్తి యుంచుటవలనను, నితఁడు రాజమహేంద్రవర వాస్తవ్యుఁడై రాజమహేంద్రవరము రాజధానిగా రాజ్యమేలిన విజయాదిత్యునికడ మంత్రిగా నున్నాఁడని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు. ఆ పక్షములో నీతఁడు నన్నయభట్టుకుమారుఁడని తలంచుటలో తప్పులేదని నాయూహ. ఈయూహ సత్యమయ్యేనేని, నన్నయ భట్టు నియోగిశాఖకుఁ జెందినవాఁడని యూహించుటకు కనువగుచున్నది. కాని యిందితరేతరాశ్రయదోష మున్నదని కొందఱన వచ్చును. అయినను భావిపరిశోధకులకు తోడుపడునను నాశతో నీవాక్యముల నిటఁ జేర్చినాఁడను.

## నన్నయ భట్టు సోమయాజియా?

నన్నయభట్టు యజ్ఞమును జేసినట్లు పట్టమట్ట సరస్వతి సోమయాజికవి, పృథుచరిత్రమునం దీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాడు.

ఉ. నన్నయభట్టుగారు యజనం బొనరించినచోట జిమ్మిచె
ట్టున్నది తణుకు తూర్పున, సమున్నతమైనది దాని నీక నే
నున్నతలిన్ శిశుత్వమున నున్నతరీతి వరం బొసంగుచున్
నన్నుఁ గృతార్థుఁ జేసితిరి నాయుమ నీవును భీమనాయకా.

భారతమునఁ దాను సోమయాజినని నన్నయ చెప్పలేదు. "అవిరళ జపహోమతత్పరు"అను మాటలో నీ యర్థ మున్నదని తలంచుట అతివ్యాప్తి యగును. భారతరచనాకాలము నాఁటి కీతఁడు యజ్ఞము చేయలేదేమో! ఈతఁడు జన్న మొనర్చినతణుకు గ్రామము గోదావరి మండలమున గోస్తనీనదీతీరమున నున్నది. భారతకృతిపతియైన రాజరాజనరేంద్రుని రాజధాని గోదావరి మండలమునందలి రాజమహేంద్రవరము. పైని జూపిన పద్యములో "తనకులబ్రాహ్మణు" అని చెప్పియుండుటచే నన్నయ రాజరాజనరేంద్రునియొద్ద రాజమహేంద్రవరము నివాసముఁగా గలవాఁడని తలంచుట న్యాయము. అఖండగోదావరీతీరస్థలమును, కోటిలింగపుణ్యక్షేత్రము నగు రాజమహేంద్రవరమునఁ

జేయక నన్నయభట్టు తణుకుపురమున నేల జన్న మొనరించెనో తెలి
యదు. నన్నయజన్మస్థానము తణుకు గాని, తత్సమీపము గాని యయి
యుండునేమో! విశ్వామిత్రమహర్షి గోస్తనీనదీతీరమున తణుకునకు
నాల్గుమైళ్ళ దిగువనున్న రేలంగిగ్రామము చెంత, యజ్ఞము చేసెనని
యు, నందలి దక్షిణాగ్నియందు జనించిన కృత్యయే 'మంటలమ్మ' యను
పేరుతో గోస్తనీనదీతీరస్థాలయమునఁ గొలువబడుచున్న దనియు
నొకప్రతీతి కలదు. అందుచే గోస్తనీనదీతీరమున పవిత్రతరమని
యెంచి నన్నయ, యచ్చట యజ్ఞ మొనర్చెనో లేక, యాకాలము
నకు రాజరాజనరేంద్రుఁడు కాలధర్మము నొందుటచేతను, నాతని
కుమారుఁడు రాజమహేంద్రవరమున నుండక చోళరాజ్య ప్రభుత్వమును
స్వీకరించుటవలనను, తన్నాదరించువారు లేక నన్నయభట్టు రాజమ
హేంద్రవరమును వీడి తణుకునకుఁ బోయి యచ్చట నివాసమేర్పరుచు
కొనియెనో! ఏమి చెప్పుటకును నాధారములు లేవు. ఈ యూహలన్ని
యు సరస్వతి సోమయాజిపద్యముపై నాధారపడియున్నవి.

## భారతగ్రంథప్రాశస్త్యము.

నన్నయ తాను రచింపఁబూనిన గ్రంథప్రాశస్త్యమును గృత్యా
దియందీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

నిజముగా నాంధ్రభాషయందు భారతమువలె సర్వజన రంజకంబగు గావ్య మింకొకటిలేదు. 'వింటే భారతమే వినాలి. తింటే గారెలే తినాలి' యను సామెతయే యిందులకుదాహరణము. భారతాంధ్రీకరణము సామాన్యకార్యము కాదు. అయినను, రాజాదరణముచే దానీ కార్యము నకుఁ బూనితినని నన్నయ ఈ క్రిందిమాటలలోఁ దనభావమును వెలిబుచ్చియుండెను.

"చ. అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రములయశేషపారము మనంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థ జలగౌరవ భారతభారతీ సము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁ బోలునే.

వ. అయినను దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద."

ఇట్టి మహోత్తమకావ్యరచనమున నారాయణభట్టు తనకుఁ దోడుపడియెనని నన్నయభట్టు తన కృతజ్ఞతను భారతకృత్యాదిని వెల్లడించియున్నాడు. నారాయణభట్టు చారిత్రమును నీగ్రంథమున వేఱుగ వ్రాయనెంచితిని. ఈవిషయము నచట విపులముగఁ జెప్పఁదలఁచి యిట వదలితిని.

## భారతాంధ్రీకరణమునకు రాజరాజు ప్రోత్సాహము.

నన్నయభట్టు విరచితమైన మహాభారత కావ్యమును గృతినంది శాశ్వతయశోలాభమును బడసిన పుణ్యపురుషుఁడు చాళుక్యవంశజుఁడగు విష్ణువర్ధన మహారాజు. ఇతనికి రా జ రా జ ని యు, రాజరాజనరేంద్రుఁడనియు, రాజమహేంద్రుఁ డనియు నామాంతరములు. ఇతని రాజ

థాని గోదావరి మండలములో నఖండ గోదావరీనదీ తటమున నున్న రాజమహేంద్రవరపట్టణము. ఈపట్టణమున నే మహాభారతాంధ్రీకరణము నకుఁ బునాది ఏర్పడినది. ఇది మా నివాసమున కుత్తరమున దశక్రోశ మాత్రి దూరమున నున్నది. రాజాస్థానమున మహారాజు. భారతాంధ్రీకరణమునకు నన్నయను బ్రోత్సహించినట్లు కవి రచించినభాగము నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

"అఖిల వేలావలయవలయిత వసుమతీవనితా విభూషణాయ్త్రైన వేఁగి దేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబు నందు మహేంద్ర మహిమతోఁ బరమానందంబున ననవరతమహామహీ రాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువన లక్ష్మీనివిలాస నివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రిపురోహితసేనాపతి దండనాయకదౌవారికీ మహాప్రధానాంత సామంత విలాసినీపరివృతుండయి యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును మృదుమధురసభావభాసురనవార్థవచన రచనా విశారదులైన మహాకవులును వివిధతర్కవిగాహితసమస్తశాస్త్ర సాగరగరీయఃప్రభ్యుతులైన తార్కికులును నాదిగాఁగలుగు విద్వజ్జనం బులు పరివేష్టించి కొలువ సుఖోపవిష్టుండై యిష్టకథా వినోదంబుల నుండి యొక్కనాఁడు,

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
   స్త్రములతెలుం గెఱింగితి నుదాత్తరసాన్వితకావ్యనాటక
   క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యము లైనయీశ్వరా
   గమములయందునిల్పితిఁ బ్రకాశముగా హృదయంబుభక్తితోన్.

వ. అయినను నాకు ననవరతంబును శ్రీ మహాభారతంబునందలి యభి
   ప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు.

మ. ఇవి యేమున్ సతతంబు నాయెడఁ గరంబిష్టంబులై యుండుఁబా
   యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
   శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యానపూజామహోత్స
   వమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

వ. మఱియు నడియునుంగాక.

చ. హిమకరుఁదొట్టి పూరుభరతేశకురు ప్రభుపాండు భూపతుల్
క్రమమున వంశకర్తలుఁగా మహిఁబొల్చిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

క. జనసుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

క బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్.

ఈగద్య పద్యములవలన రాజరాజెంతటి సత్పురుషుఁడో, ఎంతటి భాషాభిమానియో స్పష్టపడుచున్నది. ఈ మహామహుని మూలమున నాంధ్రభాషకు నాంధ్రలోకమున కెంతయో మేలుసమకూరినది. మహోత్కృష్ట కార్యనిర్వహణార్థము, భగవంతుఁడప్పు డప్పు డందులకుఁదగు పురుషుల సృజియించి యొక్కచోఁ జేర్చుచుండును. నన్నయ రాజనరేంద్రుల సంఘటనమునికి మహాభారతాంధ్రీకరణకార్యము ప్రయోజనము. జైన బౌద్ధమతములచే వైదికమతమునకు హానికలుగనున్న సమయమున జనసామాన్యమున వైదికమత సంరక్షణమునకై భారతాంధ్రీకరణము మిగుల తోడుపడినదని చెప్పవచ్చును. రాజరాజు తలిదండ్రులు జైనమతావలంబకులు. రాజరాజనరేంద్రుఁడు వైదిక మతాభిమాని, సామాన్య ప్రభువుకాఁడు. కవిపండిత పోషకుఁడు. విద్వత్ప్రభువు "అర్ధ ధర్మ శాస్త్రముల తెఱం గెఱింగితి నుదాత్తరసాన్వితకావ్య నాటక క్రమములు పెక్కు సూచితి" అను వాక్యము లీవిషయమును ధ్రువపరచుచున్నవి.

## నన్నయభట్టు భారతము నెంతవఱకు రచించెను?

లోకోపకారమునే మనసునందిడుకొని నన్నయయు రాజరాజును నీమహాకార్యమును సంకల్పించుకొనిరి. కాని వారి సంకల్పము పూర్తిగ నెరవేరినది కాదు. "శ్రేయాంసి బహు విఘ్నాని" కదా!

నన్నయభట్టు భారతమునం దాదిసభాపర్వములును, నరణ్యపర్వమున మూఁడాశ్వాసములును నాల్గవయాశ్వాసమున గొంతవఱకును మాత్రమే రచింపఁగలిగెను. ఆరణ్యపర్వమున మిగిలినభాగమును ఎఱ్ఱాప్రెగ్గడకవి చేసెనని యింతవరకు వాడుకగా నున్నది. ఇట్లుండగా నీనడుమ కొందఱు పండితులు, నన్నయభట్టారణ్యపర్వమునుగూడఁ బూర్తిగనే రచించెననియు నందుఁ జివరఁ గొంతభాగములో నచ్చటచ్చట గొన్ని భాగములు శిథిలములై పోఁగా నాశిథిలభాగములను మాత్రమే యెఱ్ఱాప్రెగ్గడ పూరించెననియు నందుచేత నే యాశ్వాసాంతగద్యలు నన్నయ పేరుతోనే యున్నవనియు నొకక్రొత్తవాదమును దెచ్చిపెట్టియున్నారు. అందుచే నన్నయభట్టు, ఆరణ్యపర్వమును బూర్తిగా రచియించెనా? యనుప్రశ్న యేర్పడినది. నన్నయభట్టు, ఆరణ్యపర్వమున నాల్గవ యాశ్వాసమునఁ గొంతవఱకు మాత్రమే రచియించె ననియు మిగిలినది యెఱ్ఱాప్రెగ్గడ కృతమనియు నా యభిప్రాయము. ఈ విషయమును గూర్చి యెఱ్ఱాప్రెగ్గడ చారిత్రమున విశేషముగా వ్రాయఁదలఁచి యిట విడచి వైచితిని.

## భారతరచన మెందువలన నాగిపోయినది?

నన్నయభట్టు రచనమంతటితో నాగిపోవుటకుఁ గారణ మాతని మరణమని కొందఱును, నాతని మతిభ్రమణమని మఱి కొందఱును ననే కులనేకవిధములుగాఁ జెప్పుచున్నారు వేములవాడ భీమకవి రచించిన రాఘవపాండవీయమును నశింపఁ జేయుటచే నన్నయకు మతిపోయిన దనియు, నంతటితో భారతరచన మాగిపోయెననియుఁ గొందఱందురు. కాని యీకథ విశ్వాసార్హమైనది కాదు. ఇందునుగూర్చి భీమకవి చరిత్ర

మున వ్రాసినను. భారతము నంతవఱకును రచించినపిమ్మట నన్నయ
భట్టు కాలధర్మము నొందియుండునని బ్ర॥ వీరేశలింగము పంతులుగా
రభిప్రాయపడి యున్నారు. కాని రాజరాజనరేంద్రుని మరణముచేతనే
భారతరచన మాగిపోయెనని నాయభిప్రాయము. నన్నయభట్టుమరణా
నంతరము భారతమును బూర్తిచేయుటకయి రాజరాజనరేంద్రుఁడు
ప్రయత్నించెనని చెప్పెడుకథ లన్నియుఁ గట్టుకథలుగాని విశ్వాసార్హ
ములయినవి కావు. ఆసంబంధమైన గ్రంథస్థనిదర్శనము లేమియు లేవు.
తనను బోషించు ప్రభువును కృతిపతియునైన రాజరాజనరేంద్రుఁడు
భారతారణ్యపర్వరచనా మధ్యకాలమునఁ గాలధర్మము నొందుటయు,
వానితరువాతఁ గదివఱకే చోళరాజ్యముకొఱకు దక్షిణదేశమునం
దుండి యాంధ్రభాషయందభిమానము లేకయుండుటయుఁ గొంతకాలము
వఱకును రాజమహేంద్రవర సింహాసనమున భాషను బోషించుటకుఁ
దగిన ప్రభువు లేకుండుటయు భారత రచనమునందు నన్నయభట్టునకు
విరక్తిఁ గలిగించియుండును. అతఁడు రాజరాజునకుఁ దరువాత ననతి
కాలములోనే స్వర్గము నలంకరించియుండును. రాజరాజనరేంద్రుని
వంశీయు లెవ్వరును భారతశేషమును బూర్తిచేయించుటకై ప్రయత్నింప
లేదు.

## భారతరచనాకాలము

నన్నయభట్టు భారతము నెప్పుడు రచించెనో యాగ్రంథమును
బట్టి తెలియదు. భారతకృతిపతియైన రాజరాజనరేంద్రుఁడు క్రీ. శ.
౧౦౦౨ మొదలు ౧౦౬౧ వఱకు నున్నవాఁడు. నన్నయభట్టాకాల
మునందున్నమాట నిశ్చయము. నన్నయభట్టు వంశానుగతముగా
వచ్చిన బ్రాహ్మణుఁడ నని చెప్పుకొనుటచే, నీతఁడు పసితనమునుండి
యు ననఁగా రాజరాజు తండ్రియైన విమలాదిత్యుని నాఁటినుండియు
నీరాజకుటుంబాశ్రయమునఁ బెరిఁగియుండు నని యూహింపవచ్చును.
ఇతఁడు రాజరాజుకంటె వయసున నొక్కింత పిన్నవాఁడేమో యని
యూహకలుగుచున్నది. క్రీ. శ. ౧౦౫౦—౧౦౬౦ నడుమ నన్నయ

భట్టు భారతభాగమును రచియించియుండునని నేనభిప్రాయ పడు
చున్నాఁడను. చరిత్రకారులలోఁ జాలమంది కిట్లే యభిప్రాయపడి
యుండిరి విమర్శాదక్షు: బిరుదాంచితులగు నడకుదుటి వీరరాజు
పంతులుగారు నన్నయభట్టు గతించినకాలము క్రీ. శ. ౧౦౫౫ ప్రాంత
ము" అని (భారతి ౧౧ సం. ౧భా ౩౫౬ పుట) వ్రాసియున్నారు.
కాని వారి యభిప్రాయముతో నే నేకీభవింపఁజాలకున్నాఁడను.

భారత రచనాకాలము క్రీ. శ. ౧౦౨౫-౧౦౩౦ నడుమ జరిగి
నదనియు ౧౦౩౦-౧౦౩౨ నడుమ రాజరాజు నాతని సవతిసోదరుఁ
డైన విజయాదిత్యుఁడోడించి రాజ్యభ్రష్టునిఁ జేసెననియుఁ, దనప్రభువు
నకుఁ గల్గినకష్టము హృదయవిదారకము కాఁగా నన్నయ హఠాన్మరణ
మొందె ననియుఁ దనకష్టమునకును నన్నయమరణమునకును, నారణ్య
పర్వరచనమే కారణమని తలంచి, రాజరాజు తరువాతఁ దిరిగి భారతము
ను బూర్తిచేయించుటకై ప్రయత్నింపలేదనియు, క్రీ. శ. ౧౦౫౩ లో
రచింపబడిన నందంపూడిశాసనకావ్యకర్త, యీనన్నయభట్టు కాఁడని
యు నన్నయ నామధారుఁడగునాతఁడు వేఱనియు, శ్రీ మారేమండ
రామారావుగారు, భారతిపత్రికలో వ్రాసియున్నారు. కాని నేను వారి
యభిప్రాయముతో నేకీభవింపఁజాల కున్నాఁడను. నారాయణభట్టు
భారతరచనమున నన్నయకుఁ దోడుపడలేదని యనలేము. నారాయణ
భట్టునకు భారతరచనాకాలమునం దీయక నందపూడి యగ్రహారమును
నన్నయభట్టు మరణానంతర మిరువది యేండ్లకిచ్చెనని తలంచుటసమం
జసముకాదని నాయభిప్రాయము. రాజరాజు పట్టాభిషేకమయిన పిదప
౩-౪ సంవత్సరములమధ్య నన్నయ భారతరచనము పూర్తి యైనదని శ్రీ
రామారావుగారి యభిప్రాయము. ఈలోపుననే "యగ్రజన్మలకు...
అగ్రహారములిచ్చె" ననుట కాధారములేదు. ఈతఁడిచ్చిన యగ్రహా
రములన్నియు, పైనఁ జెప్పిన కాలమునకుఁ దరువాతనే యైనట్లు శాసన
ములవలనఁ గానవచ్చుచున్నది. భారతమునందు రాజరాజున కెంత
యభిలాష కలదో కృత్యాదిపద్యములవలనఁ దెలియుచున్నది. అట్టి
వాఁడరణ్యపర్వభీతియున్నచో దానినివదలి తదనంతరగ్రంథము నైనను

మఱియొకనిచేఁ బూర్తిచేయించుటకు ప్రయత్నింపకుండ నుండఁడు. ఈకారణములనుబట్టి భారతరచనము ౧౦౩౦ తో నన్నయ మరణ మూలమున నాఁగిపోయెనని తలంపవీలులేదు.

## నన్నయభట్టాదికవియా?

ఆంధ్రకవిత్వమున కాదికవి నన్నయభట్టనికొందఱును కాఁడని కొందఱును దలంచుచున్నారు.

సంస్కృతకవిత్వము వాల్మీకితోఁ బ్రారంభమైనది. కావున సంస్కృత కవిత్వమునకు వాల్మీకి నాదికవిగాఁ జెప్పుచున్నారు. నన్నయ భట్టు కూడ నాంధ్రమున కట్టి యాదికవియేనా యని యడిగినచోఁ గాఁడని చెప్పుకొనుటకు సంశయింపఁబని లేదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము, పండరంగని అద్దంకి, కందుకూరి శాసనములు మొదలగుకొన్ని శాశనములయందు ఆంధ్రపద్యము లుండుటచే నన్నయభట్టునకుఁ బూర్వ ము స్వల్పముగనైనఁ బద్యకవిత్వ ముండెనని యొప్పుకొనక తప్పదు. నన్నయభట్టునకుఁ బూర్వమున నాంధ్రభాషయందు గ్రంథము లుండె నా యని ప్రశ్నించినచో మనకు లభ్యము లయినవానిలో నన్నయ భట్టునకుఁ బూర్వము రచింపఁబడినవి లేవని మాత్రమే చెప్పఁగలము. కాని నన్నయకు పూర్వ మాంధ్రగ్రంథములే రచింపఁబడలేదని ధైర్య ముగా సమాధాన మీయఁజాలము. నన్నెచోడుని కుమారసంభవము నన్నయకుఁ బూర్వము రచియింపఁబడినదేమో యని కొందఱు సంశయించుచున్నారు. అది కాకపోయినను, ఏవయిన కావ్యములు రచియింపఁబడి కాలగర్భమునఁ బడిపోయెనేమో! ఎవరు చెప్పఁగలరు? ఇంద్రవిజయమను కావ్యమును నన్నయభట్టు రచియించెనని రంగరా ట్ఛందమునం దుదాహరింపఁబడిన పద్యమువలనఁ దెలియుచున్నది. అది సత్యమయ్యెనేని యది భారతమునకుఁ బూర్వము రచియింపఁబడి యుండవలయునుగదా! అప్పుడు భారతమాదికావ్యము కాదు. తిక్కన సోమయాజి విజయసేనము, ఎఱ్ఱాప్రగ్గడ రామాయణము, అధర్వణభార తము, ఇంక నిటి వెన్నియో గ్రంథములు మన కిప్పుడు లభించుటలేదు.

అట్లే నన్నయభట్టునకుఁ బూర్వము రచింపఁబడిన గ్రంథము లుండియు
నవియనకు లభ్యము కాకపోయి యుండవచ్చును. నన్నయభట్టాది
కవి కాఁడనియు, భారత మాదికావ్యము గాదనియు నన్నంతమాత్రమున
నన్నయకుఁ గాని, భారతమునకుఁ గాని నించుకంతయు గౌరవలోపము
రానేరదు. బ్ర. వీరేశలింగముపంతులుగా రనినట్లు శ్లాఘ్యమయిన
యాంధ్రమహాకావ్యరచనమునం దీతఁ డాదికవియే. కావ్యమునకును
గవికిని గౌరవమును తెచ్చునది కావ్యమందలి గుణము కాని కాలము
యొక్క ప్రాచీనత కాదు. నన్నయ కాలమున నారాయణభట్టు ఆంధ్ర
భాషయందుఁ గవియై కవిరాజశేఖరబిరుదమును వహించియున్నట్లు
నందంపూడి శాసనము చెప్పుచున్నది. ఇదిగాక నన్నయభట్టు భారత
కృత్యాదియందు వ్రాసిన యీ క్రిందిపద్యమును బట్టికూడా నన్నయ కాల
మున కవీంద్రులుండిరని తెలియుచున్నది.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థ యుక్తిలో
నారసి మేలు నాసితరులక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

ఇందలి కవీంద్రు లాంధ్రభాషయందుఁ గవిత్వము చెప్పఁగలవా
రనియే తలంపవలయునుగాని యితరభాషలయందుఁ గవిత్వము చెప్పఁ
గలవారని యర్థమును చెప్పుటలో సారస్యము లేదు. సంస్కృతమునకు
వాల్మీకి నాదికవి యని చెప్పినట్లాంధ్రభాషకు నన్నయ నాదికవినిగాఁ
జెప్ప వలనుపడదనుట నిశ్చయము.

భారతకృత్యాదియందు నన్నయభట్టాంధ్రకవుల నెవ్వరిని నుతింప
లేదు. కావున నంతకుఁ బూర్వ మాంధ్రకవులు లేరని నిశ్చయింపఁ
దగియున్నదని కొందఱనుచున్నారు. కాని యీయుక్తియందు బలము
లేదు. నన్నయభట్టు సుకవినిందను గురుస్తుతిని తనవంశవర్ణనమును గూడఁ
గృత్యాదియందుఁ జేయు లేదు. దీనినిబట్టి నన్నయకు గురువు లేఁడని
నిరయింపరాదు కదా!

## నన్నయ కవిత్వగుణము

నన్నయకవిత్వమునందలి గుణవర్ణనమును జేయుటకు విశేష సామర్థ్యము కావలయును. అది నిండు వెన్నెలవంటిది. మానవ హృదయముల కాహ్లాదముకలిగించు వస్తువులలో నన్నయ కవిత్వ మొకటి. ఈతని పద్యములను జదువునప్పు డందలి మాధుర్యముచేఁ బాఠకుల హృదయము లుప్పొంగుచుండును. ఎన్ని మారులు చదివినను దనివి యుండదు. ఈ కవివతంసుఁడు పరమేశ్వరుని మనమున నిలిపి, లోకశ్రేయః కాంక్షియై యార్యధర్మములను దృష్టియందుంచుకొని నిర్మలహృదయముతో గ్రంథమును రచియించెనని యాతని పద్యములను జది వినవారికి తోపింపఁ జేయుచుండును. ఇతఁడు శబ్దశాసనుఁడు, లక్షణవేత్త. కవిరాక్షసు డనిన ట్టాంధ్రకవిత్వమున కీతఁడు పెట్టినది భిక్ష.

నన్నయకవిత్వమున సంస్కృతశబ్దములు మెండుగా నున్నను నవి మృదులములై సుబోధకములై మనోహరములుగానుండి హృదయమున కానందము గల్గించుచుండును. ఇతని కవితాధార యెగుడుదిగుడు లేక పూర్ణనదీవంటివలెఁ బ్రవహించుచుండును. ఉదాహరణమునకై రెండు పద్యముల నుదాహరించెదను. సంస్కృతమున నున్న

యథా నవనీతం హృదయం బ్రాహ్మణస్య
వాచి క్షురో నిశిత స్తీక్ష్ణధారః
తదుభయ మేత ద్విపరీతం క్షత్రియస్య
తదేవంగతే నశక్తోహం తీక్ష్ణహృదయ
త్వా త్తం శాప మన్యథాకర్తుం గమ్యతాం.

అనుదానిని యీ క్రిందిపద్యములో నతి మనోహరముగా నాంధ్రీకరించియున్నాఁడు.

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పండతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపగన్.

నహ్యనాఢ్యః సఖాఢ్యస్య నావిద్వాన్ విదుష స్సఖా
నశూరస్య సఖా క్లీబః సఖి పూర్వం కిమిష్యతే॥
నాశ్రోత్రియః శ్రోత్రియస్య నారథీ రథిన స్సఖా
సామ్యాద్ధి సఖ్యం భవతి వైషమ్యా న్నోపపద్యతే॥

చ. ధనపతితోడ దరిద్రునకుఁ దత్త్వవిదుం డగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁగ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూథితోడ నవరూథికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే!

క. సమశీల శ్రుతయుతులకు
సమధనవంతులకు సమసుచారిత్రులకుం
దమలో సఖ్యమును వివా
హము నగుఁ గా కగునె రెండు నసమానులకున్.

నన్నయ కవిత్వమున "నిరంకుశాః కవయః" అను సూక్తిచేఁ దప్ప సాధువులుకాని ప్రయోగము లచ్చటచ్చటఁ గలవు. ఇట్టి ప్రయోగములు తిక్కన శ్రీనాథాది మహాకవుల కావ్యములలోఁ గూడనున్నవి. వైయాకరణులు వానికి గతి కల్పించుకొనవలసినదే కాని యవి దోషములని పరిహరింపరాదు. 'ప్రయోగ శరణమ్ వ్యాకరణమ్.'

## నన్నయభట్టును నుతించిన కవులు.

నన్నయభట్టు కవిత్వమందలి గొప్పదనమును నామాటలలోఁ దెల్పుటకంటె సుప్రసిద్ధపండితకవు లాతనినిగూర్చి చెప్పిన పద్యములఁ గొన్నిటి నిట నుదాహరించుట యుక్తమని యెంచి యట్లు చేయుచున్నాఁడను.

ఉ. ఆదరణీయ భారతవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండు దొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

—తిక్కన సోమయాజి.

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటముం న రేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట సన్నుతించెదన్.

—ఎఱ్ఱాప్రెగ్గడ.

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠ గాథప్రతిభున్.

—శ్రీనాథుఁడు.

ఉ. సారకథాసుధారసమజస్రము నాగళపూరితంబుగా
నారఁగ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మునుఁ ద్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్.

—మారన.

క. ఇట్టుల మగుమతి భారత
ఘట్టమునకు నడవ యచ్చుఁ గట్టినకవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్.

—పిల్లలమఱ్ఱి పినవీరన్న.

శ్రీనాథుఁడు రచించిన పద్యమును బినవీరన్న రచించిన పద్యము ను నొక్కపోలికగా నున్నవి. శ్రీనాథుని గ్రంథములను జదివియుండు టచేఁ బినవీరన్న యిట్లు వ్రాసియుండును.

ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
వ్రాయుచు చెప్పిరట్లు రసబంధురభావభవాభిరామ ధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులునాఁగ బ్రశస్తికెక్కరే
యేయెడ నన్నపార్యగతి నిద్ధరనట్టి మహాత్ముఁగొల్చెదన్.

— జక్కన - విక్రమార్కచరిత్ర.

చ. ప్రకృతి యుగంబుదీర్చు మునివర్యులకున్సముఁడైన పుణ్యుని
వికృతికిశిక్షగాఁగ బదవిద్యరచించినవాని నంధ్రవా
క్ప్రకటకవిత్వకల్పతరురాజముబీజము సర్వవాక్యశా
సకబిరుదాంక నన్నన విచక్షణచంద్రు నమస్కరించెదన్.

గీ. ప్రాణివర్ణక తద్ధర్మ భవ్యనామ
సంఖ్యపరు పామహోన్మహత్ స్థిరమయాంధ్ర
వాగ్జగత్కర్త భూకవివాగ్విసెలైఁ
జాఁగి క్రమొక్కెద నలశబ్దశాసనునకు.

— అహోబలపండితుఁడు - కాళిందీకన్యకా పరిణయము.

ఉ. ధారజెలంగినిత్యపరితర్పితరాజరసజ్ఞమై యసా
ధారణ భారతాద్భుత పదమ్ములమించి నిరంతరక్షణా
ధారమహోత్తమహత్త్వ సహితంబగు నన్నయభట్టు భారతీ
సారసుధారసంబు బుధసంస్తవనీయము గాకయుండునే.

— చదలువాడ - మల్లయ్య.

క. ఆ భారతపర్వత్రయ
మాభారతవర్షమెల్ల నెఱుఁగ దెనుఁగునన్
శ్రీభారతిగతిఁజెప్పిన
నాభావకు (భరతుం) డని తలంతు నన్నయభట్టున్.

— కోఱవి గోపరాజకవి

## భారతాంధ్రీకరణవిధానము.

నన్నయభట్టు సంస్కృత భారతమును మక్కికి మక్కిగా నాంధ్రీకరింపలేదు. అందలి భావముల నవగతముచేసికొని, సందర్భానుసార

ముగాఁ బెంచియుఁ గుదించియు గ్రొత్తభావములను జేర్చియుఁ గొన్ని
విషయములను విడచియు యథేచ్ఛగా నాంధ్రీకరణమును సాగించి
నాఁడు. చదువువారికిది యనువాదీకరణమువలెఁ గన్పట్టక స్వతంత్రరచ
నమువలెఁ జూపట్టుచుండును. సంస్కృత భారతమందలి కొన్నికథల నితఁ
డాంధ్రీకరింపలేదు. రాజసూయయాగసందర్భమున భీష్మునిచే ననుజ్ఞా
తుఁడై ధర్మరాజు శ్రీకృష్ణుని బూజించినపుడు శిశుపాలుఁడనిన వాక్య
ములు సంస్కృతభారతమున ముప్పదిశ్లోకములలో నున్నవి వాని నెని
మిది పద్యములలో నన్నయ యాంధ్రీకరించినాఁడు. ఈతని యాంధ్రీక
కరణ విధానమును స్థాలీపులాకన్యాయమునఁ జూపనెంచి యా శ్లోకము
లను నాపద్యముల నిక్రింద నిచ్చుచున్నాఁడను.

"నాయ మర్హతి వార్ష్ణేయ స్తిష్ఠత్స్విహ మహాత్మసు
మహీపతిషు కౌరవ్య రాజవత్ పార్థివార్హణామ్. ౧
నాయం యుక్తస్సమాచారః పాండవేషు మహాత్మసు
యత్కామాత్ పుండరీకాక్షం పాండవార్చితవానసి ౨
బాలా యూయం నజానీధ్వం ధర్మస్సూక్ష్మో హి పాండవాః
అయం చ స్మృత్యతిక్రాంతో హ్యాపగేయోఽల్పదర్శనః ౩
త్వాదృశో ధర్మయుక్తో హి కుర్వాణః ప్రియకామ్యయా
భవత్యభ్యధికం భీష్మో లోకేష్వవమతస్సతామ్ ౪
కథం హ్యరాజా దాశార్హో మధ్యే సర్వమహీక్షితామ్
అర్హణామర్హతి తథా యథా యుష్మాభిరర్చితః ౫
అథవా మన్యసే కృష్ణం స్థవిరం కురుపుంగవ
వసుదేవే స్థితే వృద్ధే కథమర్హతి తత్సుతః ౬
అథవా వాసుదేవోఽపి ప్రియకామోఽనువృత్తవాన్
ద్రుపదే తిష్ఠతి కథం మాధవోఽర్హతి పూజనమ్ ౭
ఆచార్యం మన్యసే కృష్ణమథవా కురునందన!
ద్రోణే తిష్ఠతి వార్ష్ణేయం కస్మాదర్చితవానసి ౮

ఋత్విజ మన్నసే కృష్ణ మథవా కురునందన
ద్వైపాయనే స్థితే వృద్ధే కథం కృష్ణోఽర్చిత స్త్వయా ౯
భీష్మే శాంతనవే రాజన్ స్థితే పురుషసత్తమే
స్వచ్ఛందమృత్యుకే రాజన్ కథం కృష్ణోఽర్చిత స్త్వయా ౧౦
అశ్వత్థామ్ని స్థితే వీరే సర్వశాస్త్రవిశారదే
కథం కృష్ణ స్త్వయా రాజ న్నర్చితః కురునందన... ౧౧
దుర్యోధనే చ రాజేంద్రే స్థితే పురుషసత్తమే
కృపేచ భారతాచార్యే కథం కృష్ణ స్త్వయార్చితః ౧౨
ద్రుమం కిం పురుషాచార్య మతిక్రమ్య త్వయార్చితః
భీష్మకే చైవ దుర్ధర్షే పాండవ త్కృతలక్షణే ౧౩
నృపేచ రుక్మిణి శ్రేష్ఠే హ్యేకలవ్యే తథైవచ
శల్యే మద్రాధిపే చైవ కథం కృష్ణ స్త్వయార్చితః ౧౪
అయం చ సర్వరాజ్ఞాం వై బలశ్లాఘీ మహాబలః
జామదగ్న్యస్య దయిత శ్శిష్యో విప్రస్య భారత ౧౫
యే వాత్మబల మాశ్రిత్య రాజానో యుధినిర్జితాః
తం చ కర్ణ మతిక్రమ్య కథం కృష్ణ స్త్వయార్చితః ౧౬
నైవ ఋత్విఙ్న చాచార్యో న రాజా మధుసూదనః
అర్చితశ్చ కురుశ్రేష్ఠ కిమన్య త్ప్రియకామ్యయా ౧౭
అథ వాభ్యర్చనీయోఽయం యుష్మాకం మధుసూదనః
కిం రాజభి రిహానీతై రవమానాయ భారత ౧౮
వయంతు నభయా దస్య కౌంతేయస్య మహాత్మనః
ప్రయచ్ఛామః కరాన్ సర్వే నలోభా న్నచ సాంత్వనాత్ ౧౯
అస్య ధర్మప్రవృత్తస్య పార్థివత్వం చికీర్షతః
కరా నస్మై ప్రయచ్ఛామః సోయ మస్మా న్నమన్యతే ౨౦
కి మన్య దవమానాద్ధి యదేనం రాజసంసది
అప్రాప్తలక్షణం కృష్ణ మర్ఘేణార్చితవానసి ౨౧
అకస్మా ద్ధర్మపుత్రస్య ధర్మాత్మేతి యశోగతం
కో హి ధర్మచ్యుతే పూజా మేవం యుక్తాం నియోజయేత్ ౨౨

యోఽయం వృష్ణికులే జాతో రాజానం హతవాన్ పురా
జరాసంధం మహాత్మాన మన్యాయేన దురాత్మవాన్ ౨౩
అత్యధర్మాత్మతా చైవ వ్యపకృష్టా యుధిష్ఠిరాత్
దర్శితం కృపణత్వం చ కృష్ణోఽర్ఘ్యస్య నివేదనాత్ ౨౪
యది భీతాశ్చ కౌంతేయాః కృపణాశ్చ తపస్వినః
ననుత్వయాపి బోద్ధవ్యం యాం పూజాం మాధవార్హసి ౨౫
అథవా కృపణైరేతా ముపనీతాం జనార్దన
పూజా మనర్హః కస్మాత్త్వ మభ్యనుజ్ఞాతవానసి ౨౬
అయుక్తా మాత్మనః పూజాం త్వం పునర్బహుమన్యసే
హవిషః ప్రాప్య నిష్యందం ప్రాశితా శ్వేవ నిర్జనే ౨౭
న త్వయం పార్థివేంద్రాణా మవమానః ప్రయుజ్యతే
త్వామేవ కురవో వ్యక్తం ప్రలంభంతే జనార్దన ౨౮
క్లీబే దారక్రియా యాదృగంధే వా రూపదర్శనమ్
అరాజ్ఞో రాజవత్పూజా తథా తే మధుసూదన ౨౯
దృష్టో యుధిష్ఠిరో రాజా దృష్టో భీష్మశ్చ యాదృశః
వాసుదేవోఽప్యయం దృష్టః సర్వమేతద్యథాతథమ్ ౩౦
ఇత్యుక్త్వా శిశుపాలస్తా నుత్థాయ పరమాసనాత్
నిర్యయౌ సదస స్తస్మా త్సహితో రాజభి స్తదా. ౩౧

మ. అవనీనాథు లనేకు లుండగ విశిష్టారాధ్యు లార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వు రుండఁగ ధరిత్రీనాథ గాంగేయుదు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తందఱకు దాశార్హుండు పూజార్హుఁడే.

చ. కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యులి
ట్లొడఁబడ నిష్టుఁడై కలిపి యుత్తములుండఁగ వాసుదేవుఁ డ
న్జడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే.

చ. ఇతనికిఁ గూర్తుఁ రేరె ధనమిత్తు రభీష్టము లైనకార్యముల్
మతి నొనరింతు రిష్టుఁ డని మంతురు గాక మహాత్ము లైనభూ
పతులయు విప్రముఖ్యులసభా విధి దృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁ డనియచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే.

సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ వసుమతీశ!
ఋత్విజుం డని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి
నాచార్యుఁ డని వినయమునఁ బూజించితే
కృతనుతుల్ ద్రోణుండుఁ గృపుఁడు నుండ
భూనాథుఁ డనియెడుబుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ

ఆ. పూజనీయు లైనపురుషులలోపల
నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁ డిట్టులేల
పూజ్యులయినవారిఁ బూజింపనొల్లక
భీష్ముపలుకుఁ జేసి బేలవయితి.

చ. పురుషవిశేషవిత్తముఁడు పూజ్యుఁడు రాజులలోన నీయుధి
ష్ఠిరుఁ డని నీగుణాళి ప్రకటించి మనంబులలోన ధారుణీ
శ్వరులు భవన్మఖంబునకు వచ్చిన నిండఱ కిన్నిధంబునం
బరఁగ నవజ్ఞ సేయు టిది పాడియె ధర్మువె ధర్మనందనా

క. నీ వెఱుఁగక యిచ్చిన నిది
నా విషయమె యని మనంబునం దలఁపకల
జ్ఞావిరహితుఁ డయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ గొను టుచితంబే.

క. చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క

స్యానుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టిలన్.

ఉ. ఈయవనీశ్వరప్రవరు లిందఱు నిన్ను నరింగ నిట్లుగాఁ
జేయుదె ధర్మరా జనువిశేషపమాఖ్య నిరర్థకంబుగా
ధీయుత యంచు ధర్మజనదీసుతకృష్ణుల నెగ్గు లాడుచుం
బోయెనుసదంబు వెల్వడిసపుత్త్రబలుండయి చైద్యుఁడల్కతోన్.

సంస్కృతశ్లోకములు సులభములుగా నుండుటచేతను, గ్రంథ విస్తరభీతిచేతను వానియర్థమిట నీయలేదు. నన్నయ మితవచనుఁడు. తిక్కనయు నట్టివాఁడే. వీరిభాషాంతరీకరణము పౌనరుక్త్యాది దోషములులేకుండ గాంభీర్యముతో నుండును. సంస్కృతమున ధర్మరాజును సంబోధించినపదములును కృష్ణునెట్లు పూజించితివను నర్థమిచ్చు పదములు ననేకమారులు వచ్చినవి. ఆంధ్రమున నట్లులేదు. కర్ణజరాసంధాదులను గూర్చిన ప్రశంస తీసివేయఁబడినది.

## నన్నయభట్టారకుని యితరరచనములు

నన్నయభట్టారకుఁడు భారతముగాక మఱికొన్ని గ్రంథములను రచియించెనని చెప్పుచున్నారు. వానిపేరు లివి:—

౧. చాముండికావిలాసము

౨. ఆంధ్రశబ్దచింతామణి.

౩. ఇంద్రవిజయము.

౪. లక్షణసారము.

౫. రాఘవాభ్యుదయము.

ఈ గ్రంథకర్తృత్వము వివాదగ్రస్తమైనది. ఒక్కొక గ్రంథమును గూర్చి వేఱువేఱుగ నిరూపించ వ్రాయుచున్నాఁడను.

## చాముండికావిలాసము.

దీనికిఁ జౌడేశ్వరీవిలాసమని నామాంతరము. ఇది మూఁడాశ్వాసములు గల యొక చిన్న పద్యకావ్యము. ఇందు నందవరీక బ్రాహ్మణు

లనుగూర్చి ప్రథమాశ్వాసమునను, ద్వితీయ తృతీయాశ్వాసములయందు "తొగట" కులమువారని చెప్పఁబడియెడి దేవాంగుల కథలను రచింపఁబడినవి.

ఆశ్వాసాంతగద్యలు మూఁడాశ్వాసములకు నీక్రిందరీతిని మూఁడు విధములుగా నున్నవి.

౧. "ఇది శ్రీ సకలభాషావాగనుశాసన శ్రీ నన్నయభట్ట విరచితంబైన చౌడేశ్వరీ విలాసంబను మహాప్రబంధంబు నందు ప్రథమాశ్వాసము"

౨. "ఇది శ్రీ సకలసుకవిజనశ్రేష్ఠ శ్రీ నన్నయభట్ట విరచితంబైన చౌడేశ్వరీ విలాసంబను మహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము"

౩. "ఇది శ్రీ సకలవిబుధవినుత సర్వవిద్యావిచక్షణ నన్నయభట్ట విరచితంబైన శ్రీ చౌడేశ్వరీ విలాసంబను నొక్క మహాప్రబంధంబు నందు తృతీయాశ్వాసము"

దాదాపు నూటయిరువది పద్యములుగల యొక్క చిన్న పుస్తకమును మూఁడాశ్వాసములుగా విభజించుటయు నందు మూఁడువిధములగు గద్యలను వేసికొనుటయు నన్నయవంటి మహాకవిచేయు పనులు కావు. నన్నయవంటి వేదవేది, నానా పురాణవిజ్ఞాననిరతుఁడిట్టి కథలు వ్రాసినాఁడనుటకంటె హాస్యాస్పదమైన విషయ మింకొకటి యుండదు. ఆతఁడు రచించిన శ్రీ మహాభారతమునందా శ్వాసాంత గద్యలన్నియు "ఇది శ్రీ సకలసుకవిజనవినుత" అని యొక్కరీతిగా నున్నవి.

ఈ చిన్నపుస్తకమును రచించినకవి నన్నయనామధారి మఱి యెవ్వఁడో యై యుండునని తోఁచివేయుట కవకాశము లేకుండ గ్రంథాదియందలి యీక్రిందిపద్యమత్యంతము గల్గించుచున్నది.

సీ. వ్యాసాదిఋషులకు వందనం బొనరించి
కవిభల్లటుల చాల ఘనత నెంచి
సుకవీశ్వరుల నెల్ల సొంపుగా వినుతించి
గురుపాదపద్మముల్ సరసఁ గాంచి
యిష్ట దేవాళి సంహృష్టత సేవించి
మంత్రాది దేవత ల్మదిని నుంచి
సర్వజనాళికి సంతోష మొనరించి
పార్థివసభల వైభవము గాంచి
యాంధ్రవాక్యానుశాసనం బతిశయిల్లఁ
జేసి లోకోపకారార్థసిద్ధిఁ జెంది
ఘనత రాజనరేంద్రుని కరుణ వడసి
నట్టివాఁడను నన్నయభట్ట నేను.

భారతమునఁ దననుగూర్చి చెప్పుకొనిన "తనకులబ్రాహ్మణు" ఇత్యాదిపద్యమునకును పైపద్యమునకు నెంత భేదమున్నదో పరికించి నచో, నీగ్రంథములు నన్నయభట్టు రచించినవది కాదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పై సీసపద్యమునందలి, ప్రథమ పాదమునందును రెండవ పాదప్రథమార్థమందును వడులను, రెండవపాదద్వితీయార్థమూఁడవపాద ప్రథమార్థములఁ బ్రాసయతులను బ్రయోగించినాఁడు. నన్నయకృత భారతము నందెచ్చటను సీసములలో నట్టియతిసాంకర్యము లేదు. వడిలో నారంభించిన సీసమంతటను వడులే యుపయోగించియు, ప్రాసయతిలో మొదలిడిన సీసమునందుఁ దుదికంటఁ బ్రాసయతులే వేసియు సీసపద్య రచనము పట్ల నన్నయ యొకనియమమునవలంభించినాఁడు. చాముండే శ్వరీవిలాసమున నట్టినియమము లేదు. భారతమునుండి పై నుదాహరిం చిన (తనకులబ్రాహ్మణు-ధర్మేత త్త్వజ్ఞులు-ఇత్యాది) సీసపద్యములనుబట్టి నన్నయమహాకవి నియమములను గ్రహింపవచ్చును.

చాముండికావిలాసము నన్నయకవికృతము కాదని బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగా రనేకకారణములను జూపి నిర్ధారణ మొనర్చి

యున్నారు. ఆ విషయమున భిన్నాభిప్రాయము లేదు చౌడేశ్వరీవిలాస మును జదివినవారెవ్వరు నది నన్నయ కృతవని చెప్పఁజాలరు. సామాన్యుఁ డెవఁడో యీచిన్న పుస్తకమును రచించి నన్నయ మహాకవి పేరుపెట్టియున్నాఁడని చెప్పుట కావంతయు సందియము లేదు. ఇఁక నీవిషయమును గూర్చి చర్చింపవలసినయావశ్యకత లేదు.

## ఆంధ్రశబ్ద చింతామణి

ఆంధ్రభాషావ్యాకరణ మొకటి యెనుబదియెనిమిది ఆర్యావృత్తములలో (ఎనుబది రెండనియుఁ గొందరు) సంస్కృతమున రచియింపఁబడినది. దానికి "ఆంధ్రశబ్దచింతామణి"యని పేరు. దానికి మహామహోపాధ్యాయబిరుదాంచితుఁ డగు ఎలకూచి బాలసరస్వతి టీక వ్రాసియుండెను. దీనికే అహోబలపండితుఁడు సంస్కృతమున వ్యాఖ్యానమును రచించియున్నాఁడు. దానికి అహోబలపండితీయమని పేరు. కాకునూరి అప్పకవి అప్పకవీయ మను పేర గద్యపద్యాదులతో నాయాంధ్రశబ్దచింతామణికి వివరణమును వ్రాసియున్నాఁడు. ఈయాంధ్రశబ్దచింతామణిసూత్రములను నన్నయభట్టు రచించెనని కొందఱును, నన్నయ రచింపలేదని కొందరు నభిప్రాయపడుచున్నారు. ఉభయపక్షముల వాదములును యుక్తిప్రయుక్తులతో నిండి యిదమిత్థ మనినిర్ణయించుటకుఁ దోడుపడకున్నవి. ఈవిషయమును మఱల నిటఁజర్చింపఁబూనుట వివాదకారణమే కాని వేఱొండు గాదు. అట్లని యీవిషయము నెత్తకుండ నుండుట చరిత్రకారులకుచితము కాదు. ఇట్టిపట్టులసహృదయుల కంతరాత్మయే ప్రమాణము. ఈగ్రంథము నన్నయకృత మగునా కాదా యని సంశయము కలుగుటకు గలకారణములను క్లుప్తముగా నిట వ్రాసి నిర్ణయమును జదువరులకు వదలిపెట్టెదను. ఇచ్చట నేను వ్రాయువిషయములలోఁజాలభాగ మిదివఱకు పండితులచేఁ జర్చింపబడినవేయైనను, నూతన పాఠకులకవి క్రొత్తవే యగును.

ఆంధ్రశబ్దచింతామణి యజ్ఞాతవాస మారువందలవత్సరములు,

నన్నయభట్టు పదియవశతాబ్దివాఁడు. ఆంధ్రశబ్దచింతామణికిఁ డీక వ్రాసిన బాలసరస్వతి పదునాఱవశతాబ్దిని తుదిభాగమునను పదునేడవ శతాబ్ది మొదటను నున్నవాఁడు. అనఁగా నాఱువందలసంవత్సరము లీయాంధ్రశబ్దచింతామణి నెవ్వరు నెఱుఁగరని యర్థము. ఈ మధ్యకాలములో నెందఱో మహాకవులు, ఎందఱో లాక్షణికులు బయలుదేరి వ్యాకరణములను, లక్షణగ్రంథములను, మహాకావ్యములను వ్రాసియుండిరి కాని వారెవ్వరు నీ గ్రంథమున్నట్లెఱుఁగరు. నన్నయభట్టునకుఁ దరువాతివాఁడైన కేతనకవి తనయాంధ్రభాషాభూషణమున

క. మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబుల కరుణన్.

గీ. సంస్కృతప్రాకృతాదిలక్షణము చెప్పి
తెలుఁగునకు లక్షణము మున్ను దెలుపకునికి
కవిజనంబులనేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపు గాని.

అని చెప్పియుండుటచేఁ దిక్కనాదిమహాకవులు గాని, కేతనాది లాక్షణికులు గాని యీగ్రంథము నెఱుంగరని తేలుచున్నది.

ఎవ్వరు నెఱుంగకున్నంతమాత్రముచే నది నన్నయకృతము కాదని చెప్పుటకు వలనుపడదు. నన్నిచోడుని కుమారసంభవము నథర్వణాచార్యునివఱకు నెవ్వరెఱింగి యున్నట్లు గానరాదు. అంతమాత్రమునఁ గుమారసంభవము నన్నిచోడునిది కాదని చెప్పరాదు కదా! ఇట్టి వనేకము లుండవచ్చును. కాని యట్టి గ్రంథములు బయలుపడినప్పుడు, అవి లభ్యములైనతావులు, వాని మూలప్రతులు మొదలగునవి వాని సత్యత్వమును గూర్చి సాక్ష్య మిచ్చుచుండును. ఆంధ్రశబ్దచింతామణి కట్టి

ప్రాశస్త్యము లేదు సరికదా! అది లభ్యమయిన వృత్తాంతము విపరీతసంద ర్భములతోఁ గూడి విశ్వాసానర్హమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఆంధ్ర శబ్దచింతామణి మొట్టమొదట బాలసరస్వతికే లభించినది. అది తనకు లభించినమార్గము నాతఁడు క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

## బాలసరస్వతి చెప్పిన కథ.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబుచేసి, మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్య కాపాలికోపాగమ స్నేహసాహచర్యుండగు శివ యోగివర్యుచే దేవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబు లోకోపకారార్థంబుగాఁ డీక గావింపంగోరి నెమ్మనంబున.

ఉ. ఏమి మహాద్భుతం బది! హరిహరి! యెక్కడి యాంధ్రశబ్ద చిం
తామణిఫక్కి! యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా! మదగణ్య పుణ్యసముదగ్రతఁ జేపడెఁ గాదె యిన్నియున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యాన క
ర్తలు గానోపరె పెక్కువత్సరము లంతర్భూతమై యున్న యీ
తెలుఁగు వ్యాకరణంబు నాకొసఁగె బ్రీతిం డీక గావింపు మం
చలసిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్.

కవికిష్టదైవమగు విరూపాక్షుఁడే వచ్చి యిచ్చిన ట్లొకసిద్ధుఁ డీ గ్రంథమును దనకిచ్చెనని యీ పద్యములోఁ జెప్పఁబడినది. గ్రంథ మంతయు గలిపి (యెనుబదిరెండు శ్లోకములు ఆసిద్ధుఁ డీ శ్లోకములు వ్రాసియున్న తాళపత్రప్రతి నిచ్చెనో లేక యాతఁ డాశ్లోకములను బాలసరస్వతికి ముఖతః చెప్పెనో పై పద్యముల వలన స్పష్టముగా మన కుఁ దెలియుటలేదు. ఇది తనకు లభించువఱకు నంతర్భూతమై యున్న దని బాలసరస్వతియే యంగీకరించినాఁడు. ఈ సిద్ధుఁడు దేవతాస్వరూ

ఫుఁడు గాక యొక మానవుఁడే యని తలంచితిమేని, నన్నయభట్టు కాలమునుండి పరంపరగా నెందఱో యీ వ్యాకరణసూత్రములను బాఠముగాఁ జెప్పుకొనుచురాఁగా రాఁగా, తుది నీసిద్ధుడు గురుముఖమునఁ జెప్పుకొనె నని తలంపవలసియుండును. ఆపక్షములో నిది యంతరఖ్యాతమై యుండుట పొసఁగదు. తాళపత్త్రప్రతి నే యీ సిద్ధుఁ డెచ్చటనో సంపాదించి బాలసరస్వతి కిచ్చె ననుటయే సమంజసముగా నుండును. అప్పకవి యీ సిద్ధు డెవ్వఁడో నిర్దిష్టము చేసి యీ కథను మఱింత విశ్వాసానర్హముగాఁ జేసినాఁడు.

## అప్పకవి కథ

నన్నయభట్టు మొదట నాంధ్రశబ్ద చింతామణిని రచించి యీ పిమ్మట భారతాంధ్రీకరణమునకుఁ బూనుకొనెననియు, నాతఁడు భారతము రచించుచుండఁగా వేములవాడ భీమకవి రాఘవపాండవీయమును జేసి నన్నయకుఁ జూపుటకై తెచ్చియిచ్చెననియు నాతఁడు దానిని మరల నీయక యడఁచివేసెననియు నందులకుఁ గినిసి భీమకవి నన్నయ యింటికడ లేనప్పు డాతనిభార్యనో, కుమార్తెనో యడిగి యాంధ్రశబ్దచింతామణిని గ్రహించి దానిని గోదావరిలోఁ గలపెననియు, నా వ్యాకరణము లేకపోవుటచేఁ గవిరాక్షసుఁడు నన్నయ భారతమున మొదటి మూఁడుపర్వములయందును జెప్పిన నియమముల నుల్లంఘించి కవులెవ్వరును గావ్యములను జేయరాదని నియమము చేసెననియు నన్నయభట్టు ఆంధ్రశబ్ద చింతామణిని రచించునప్పుడు పసివాఁడుగ నున్న సారంగధరుఁడు (రాజరాజ నరేంద్రునికుమారుఁడు) ఆ సూత్రములను బఠించి యుండెననియు, నాతని చేతులు, పాదములు ఖండింపఁబడిన పిమ్మట మత్స్యేంద్ర సిద్ధుని యనుగ్రహముచే సిద్ధుఁడై యుండి యాతఁడే మతంగ పర్వతమునొద్ద కీలకనామసంవత్సరమున బాలసరస్వతి కాసూత్రముల నిచ్చెననియు నప్పకవి యీ క్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

తే. ఆంధ్రశబ్ద చింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పి నన్నయభట్టు దొల్లి
పర్వములు మూఁడు శ్రీమహాభారతమున.

వ. ఆ సమయంబున.

తే. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవ పాండవీయము నడంచె
ఛందము నడంచ నీ ఫక్కి సంగ్రహించె
ననుచు భీమన గొంతయు నడఁచె దాని.

వ. తదనంతరంబ.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగా బడియె నెందును దానినె కాని సూత్ర సం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని ద్రాక్షవాటికవి రాక్షసుఁ డీ నియమంబు సేసినన్.

క. ఆ మూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువుతెరఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైనతొంటి తెనుఁగు గవీంద్రుల్.

తే. రాజరాజ నరేంద్రతనూజుఁ డాగ్ర
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బఠనం బొనర్చె
నన్యు లెవ్వ రెఱుంగ రీయాంధ్రఫక్కి.

క. అతఁడు దనకాళ్లు చేతులు
మతిచెడి జనకుండు దఱుగ మత్స్యేంద్రుని సం
గతి నవి గ్రమ్మఱ మొలచిన
క్షితి సిద్ధులఁ గలసి యొక్కసిద్ధుం డయ్యెన్.

క. ఆ లోకనుతుఁడు మొన్నటి
కీలక సమ నా మతంగగిరి కడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతిఁ
డోలిఁ దెనుఁగు టీక దాని కొప్పుగఁ జేసెఁ.

క. ఆగిరి భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర
త్మాదయతునిపట్టి దానిమహిఁ వెలయించెన్.

రాజరాజనరేంద్రునకు సారంగధరుఁడను పుత్రుఁడుగాని, రత్నాంగి చిత్రాంగులను భార్యలుగాని లేరని చరిత్రకారులు నిర్ణయించియున్నప్పుడు సిద్ధరూపమును ధరించిన సారంగధరుఁ డీ యాంధ్రశబ్ద చింతామణిని బాలసరస్వతి కిచ్చెననిన నెవ్వరు నమ్మెదరు? పై పద్యములననుసరించిచూడ సారంగధరుఁడు పూర్వులువ్రాసియుంచిన తాళపత్రప్రతిని సంపాదించి యిచ్చుటగాక తానా యేనుబది రెండు శ్లోకములను ముఖతః బాలసరస్వతికిఁ జెప్పినట్లు తోఁచుచున్నది. లేదా సిద్ధరూపమున నున్న సారంగధరుఁడు తాను, ఆరువందల సంవత్సరములకుఁ బూర్వము పసితనమునఁ జదువుకొనిన శ్లోకములు నప్పుడు తాళపత్రములపై లిఖించి బాలసరస్వతికిచ్చి యుండవలయును. ఈ కథలపై వ్యాఖ్యాన మనవసరము. ఈకథలను జెప్పకుండ గ్రంథము నన్నయభట్ట విరచితమని యూరకున్నచోఁ గొంతవఱకైనను నమ్మకముండెడిదేమో! ఆ విశ్వాసముపోయి యాంధ్ర శబ్ద చింతామణి నన్నయభట్టకృతము కాదనుభావము దృఢమగుట కీ కథలు కారణములగుచున్నవి.

ఈ యాంధ్రశబ్ద చింతామణి, యప్పకవికి లభించిన మార్గము కూడ నద్భుతముగానే యున్నది. కవి కిష్టదైవమగు గోపాలదేవుఁడు స్వప్నమునఁ గన్పడి, "యాంధ్రశబ్ద చింతామణి" మతంగ పర్వత బ్రాహ్మణునివలన నీయింటికి వచ్చుననియు, దానిని నీ వాంధ్రీకరించి

లోకోపకారం మొనర్పవలయునని యు నానతిచ్చెనఁట! ఆ మఱునాఁటి దినముననే యొక బ్రాహ్మణుఁడు మతంగపర్వత నివాసివచ్చి యప్ప కవి కాగ్రంథము నిచ్చెనఁట! ఈసంగతు లప్పకవీయము నందలి యీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. ఇల నెనుబది రెండార్యలు
కలిగి పరిచ్ఛేదపంచకంబునఁ దగు నీ
విలసితఫక్కి మతంగా
చలవిప్రునివలన నీవు సదనముఁ జేరున్.

క. సురభాషయందు సల్లా
క్షణముల బహుసూచితార్థసారము లిమిడిం
తురు సూత్రంబుల నవి వి
స్తరముగఁ దెనుఁగింపకున్నఁ దరమే తెలియన్.

తే. నారికేళపాకంబుగా నన్నయకవి
ప్రక్రియాకౌముదిని ముట్టఁ బలికెఁ గానఁ
గేవలాంధ్రులు గాన రాత్రోవ నీవు
గోస్తనీ పాకమైఁ యుండఁ గూర్పవలయు.

చ. అని యతఁ డానతిచ్చె చన నంతట మేల్కని నాల్గుదిక్కులుం
గనుఁగొని యద్భుతంబుఁ గుతుకంబును డెందమునం బెనంగ వేఁ
గినఁ గల కేది బద్ధమని కేరుచు నుండెడు వేళ నామతం
గనగనివాసి పుస్తకనికాయధరుం డొకరుండు వచ్చినన్.

క. ఆ విప్రు నతిథిఁగా సం
భావించి భుజింపఁ బెట్టి భాషించు నెడన్,
దా విశ్వశ్రేయ యనుచు
నీవచనము సదువ నెచట దిది యన నతఁడున్.

క. నన్నయ భట్టీయములో
నెన్నఁగఁ బ్రథమార్య గాదె యీపాత్రములో

నన్నవి యని యెనుబది రెం
డన్న మహాద్భుతముఁ బొంది యప్పు డెల్లరకున్.

సిద్ధరూపమునయున్న సారంగధరునివలన మతంగపర్వతము మీఁద నీయాంధ్రశబ్ద చింతామణి బాలసరస్వతికి లభించినది. ఆ మతంగపర్వతనివాసి యగు బ్రాహ్మణుడే అప్పకవి కీ గ్రంథము నొసంగినాడు. బాలసరస్వతికి లభించినది పుస్తక రూపముననున్నదో కాదో చెప్పఁజాలము కాని యప్పకవికి లభించినది మాత్రము పుస్తకమనుట నిశ్చయము. అప్పకవికిఁ బుస్తక మిచ్చిన బ్రాహ్మణుఁడు బాలసరస్వతి యని యన వీలులేదు. బాలసరస్వతియొక్క గ్రంథమునకు బ్రతి వ్రాసికొనిన మఱియొక బ్రాహ్మణుఁడై యుండవలయును. అప్పకవికి స్వప్నము వచ్చినది మన్మథసంవత్సర శ్రావణబహుళాష్టమి. గ్రంథము లభించినది నవమి. అప్పకవీయరచనారంభము దశమి. ఈవిషయము లీ క్రిందిపద్యములవలనఁ దెలియవచ్చినది.

సీ. ధాత రెండవపరార్థమున నాదిదినంబు
  పగటివరాహకల్పంబునందు
మహిత వైవస్వతమనువేళ దేశంబు
  లర్థింప నైన మహాయుగమునఁ
గలిసమయంబునఁ దొలిచరణమున
  మానితం బగుచంద్రమానమునను
శాలివాహన నామశకమున గజశైల
  శరసుధాకిరణుల సంఖ్యనడవ

తే. నంగజాబ్దంబునను దక్షిణాయనమున
జలధరర్తువు మొదటిమాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి
నట్టియష్టమి సనుదేర నధికభక్తి.

క. శశమిా సురగురువాసర
శశితారావజ్రయోగ షష్ఠకరణయు
క్తశరాసనలగ్నంబున
శిశిరకరాంశమున మొదలు సేసితిఁ గృతికిన్.

కీలక సంవత్సరమున నాంధ్రశబ్దచింతామణి బాలసరస్వతికి లభించినది. కీలకమునకు మన్మథమునకు నడుమ నలువది యెనిమిది సంవత్సరములు గడచినవి. కీలకనాటికే బాలసరస్వతి చాల గ్రంథములను రచించియున్న వాఁడగుటచే మన్మథ సంవత్సరమునాఁటికి దాదాపు నూఱుసంవత్సరములవయసు కలవాఁడగును. కావున నాతఁడు స్వయముగా నీగ్రంథము నప్పకవి కిచ్చియుండఁడు. బాలసరస్వతి యొద్దనుండి ప్రతి వ్రాసికొనిన కేఱొక బ్రాహ్మణుఁడే, అప్పకవి కిచ్చినవాఁడని నిశ్చయింతము. ఈపుస్తకప్రదానసంబంధములైన వైపద్యములను జదివినచో, నెనుబదిరెండార్యలు గల మూలగ్రంథమును మాత్రమె తెచ్చి యిచ్చినట్లు తోఁచును గాని యది సత్యము కాదు. బాలసరస్వతి వ్యాఖ్యానముతోఁ గూడ నున్నప్రతినే యిచ్చియున్నాఁడు. దానినే తానాధారంబుగాఁ గైకొంటినని యిప్పకవి యీ క్రింద వచనములో నంగీకరించియున్నాఁడు.

"ముందు బృందారకభాష నశేషవిద్యా జలజాసనుండగు శబ్దానుశాసనుండు సంక్షేపంబుగాఁగూర్చిన యాంధ్రవ్యాకరణంబునందలిసంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁబలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛేదంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్యపరిచ్ఛేదంబును, సంధిపరిచ్ఛేదంబును, తత్సమపరిచ్ఛేదంబును దేశ్యపరిచ్ఛేదంబును, క్రియాపరిచ్ఛేదంబును నను నామంబుల నభిరామంబులగు నాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి బాలసరస్వతి సకలభాషాకవిమహోపాధ్యాయ ప్రణీతాంధ్ర వ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా రచియింపఁబూని"

బ్రాహ్మణుఁడు తనకు గ్రంథము నిచ్చిన మఱునాఁడే అప్పకవి తనగ్రంథమును నారంభించి యుండుటచే, బాలసరస్వతి టీకను మఱి

యొక్కప్పు డప్పకవి సంపాదించెనని యనుటకు వీలులేదు. ఆ టీక నది వఱకే యప్పకవి సంపాదించి యుంచెననుటకు నవకాశములేదు. మతంగ పర్వతమున బాలసరస్వతికి గ్రంథము లభించుటను దెలిసికొనిన బ్రాహ్మణుఁడు, అతఁడు టీక వ్రాయువఱకు నూరకుండి, టీక వ్రాసెనని తెలిసినపిమ్మట బాలసరస్వతి యొద్దకుఁ బోయి (బాలసరస్వతి మతంగాచలవాసి కాఁడు) టీకాసహితముగా నాతనియొద్దఁ బ్రతివ్రాసికొని దానిఁ దీసికొనివచ్చి యప్పకవి కిచ్చియుండవలయును. ఈకథ కూడ విశ్వాసార్హముగాఁ దోఁచుటలేదు. ఆంధ్రశబ్దచింతామణి పీఠికయందు బాలసరస్వతి వ్రాసిన వచనమును రెండుపద్యములను పైని వ్రాసి యున్నాఁడను. అట్టి భావములనే, (కలికాదిని, ఎక్కడిమతంగ పర్వతము, అంతర్భూతము మొదలగు పదములనుంచి) తెలుపుచు నప్పకవి యీ క్రిందిపద్యములను వ్రాసియుండుట చిత్రముగా నున్నది

ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యాకలికాదిని జెప్ప దాని భీ
మన్న హరించెఁ గ్రమ్మఱ మహాత్ముఁడు రాజనరేంద్రుపట్టి దా
మొన్న నొసంగె విప్రునకు మూల మతం బొనరించెఁ డీక నా
కన్నది మున్ను విన్నదియుఁ గాదు మహాద్భుత మబ్బె నాకిటన్.

క. మూలము చెప్పిన నన్నయ
భూలోకబ్రహ్మ యతనిబుద్ధిఁ దెలిసి వ్యా
ఖ్యాలక్ష్యంబు లొనర్చిన
బాలసరస్వతులఁ బోలు ప్రాజ్ఞులు గలరే.

క. ఎక్కడిమతంగపర్వత
మెక్కడికామెపలి సుకవు లీలో లేరే
గ్రక్కున నిది దెలిఁగింపక
దక్కుట నను ధన్యుఁ జేయుతలఁపున నేమో.

క, ఆ తిక్కనముఖ్యకవి
వ్రాతముచే నీ తెలుంగువ్యాకరణము ధా

త్రీతలమునఁ గడు నంత
ర్వ్యాభతం బై తెనుఁగు గాకపోవుట లెల్లన్.

వ. మత్పురాతనజననఘనతపోవిశేషంబువలనన కదా యనిచింతించి నితాంతసంతుష్టాంతరంగుండ నై.

అహోబలపండితుఁడు చెప్పినకథ.

ఆంధ్రశబ్దచింతామణికి సంస్కృత వ్యాఖ్యాన మొనరించిన యహోబలపండితుఁడు, అప్పకవి చెప్పినకథనే యీక్రింది శ్లోకములలోఁ జెప్పియున్నాఁడు.

శ్లో. సోయం కృతి ర్వేములవాడభీమప్రబంధకర్త్రా హితమత్సరేణ
గోదాజలే నాశమవాపితాభూ దిత్యుద్గతాసీ ద్భువి కింవదంతి॥

* * *

రాజరాజతనూజాతః సారంగధరబాలకః
సకృతః పాణిపాదేన రహితో జనిహేతునా
మత్స్యేంద్రినామసిద్ధేంద్ర మహిమ్నాసిద్ధతాం గతః
జగ్రాహ వ్యాకృతిం తస్మాత్కవి బాలసరస్వతీ
ఎలకూచి కులాంభోధి శరద్రాకానిశాకరః
సమస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే.

ఈ విషయమున నప్పకవి వ్రాసినదానికంటె నహోబలపండితుని వలన మనకుఁ దెలియవచ్చిన విశేషమేమియు లేదు. కాని,

"మతంగశైల విప్రేంద్రాదన్యద్వ్యాకృతిపుస్తకమ్
కాకునూర్యప్పకవి నా గృహీతంతత్రషడ్గతాః॥
పాఠభేదాస్తు బహవోదృశ్యం తేపుస్తకద్వయే
మయాప్రాయస్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే॥

అను శ్లోకములలో, కాకునూర్యప్పకవికి లభించిన వ్యాకరణములో నాఱుశ్లోకములు పోయినవనియు, అప్పకవిగ్రంథమునకును బాలసరస్వతి గ్రంథమునకును పాఠభేదములు విశేషములుగా గలవనియుఁ దాను తలఁచుగా బాలసరస్వతిపాఠమునే గ్రహించుచు వచ్చితిననియు నాక

యభిప్రాయమును వెలిబుచ్చియున్నాఁడు. బాలసరస్వతియు నప్ప కవియు స్వహస్తములతో వ్రాసికొనిన గ్రంథము లహోబలపండితునకు లభించినవని చెప్పుటకు నవకాశము లేదు. అహోబలునకు లభించిన బాలసరస్వతి గ్రంథప్రతిని అప్పకవీయ గ్రంథప్రతికిని పాఠభేదములు గల్గినవని తలంపవలసియున్నది. అప్పకవి క్రీ. శ ౧౬౫౬ ఆగస్టునెలలో నప్పకవీయమును బ్రారంభించియుండెను. దానిని బూర్తిచేయుటకు నాల్గు సంవత్సరములు పట్టెనని యనుకొంటిమేని ౧౬౬౦లో బూర్తి యయ్యెనని చెప్పవలసియున్నది. అహోబలపండితుఁడు క్రీ శ ౧౭౦౦ ప్రాంతమువాఁడు. కావున నప్పకవీయములోఁ నప్పకవికిఁ దరువాతఁ బండితులు మార్పులు చేసినారనుట కవకాశము తక్కువగా నుండును. బాలసరస్వతికిని, నహోబలునకును నూఱు సంవత్సరములకుఁ బైగా వ్యవధియున్నది. ఈకాలములోఁ బండితులు. బాలసరస్వతి గ్రంథమున మార్పులుచేసివారనితలంచుట కవకాశ మెక్కువగాఁ గలదు. మూల గ్రంథములో నప్పకవియే మార్పులుగావించి తనయప్పకవీయమును రచించెనని యనుటకుఁ గూడ నవకాశము లేకపోలేదు. కాని యప్ప కవి తనగ్రంథమును బాలసరస్వతిగ్రంథము నాధారముగాఁ గైకొని రచియించితినని చెప్పియుండుటచే నందలిసూత్రములను, అప్పకవి మార్చినాఁడని తలంపరాదని నాయుద్దేశము.

అప్పకవీయమునందు, మూలసూత్రములను గొన్నిటిని వ్రాసి, పిమ్మట నప్పకవివ్రాసిన యాంధ్రవివరణము చేర్పఁబడుచు వచ్చినది. అందుచే నప్పకవీయసూత్రములు మూలగ్రంథానుసరణములని తలంచుట కవకాశమున్నది బాలసరస్వతీయమునం దట్లులేదు. ఏసూత్రమున కా సూత్రమును దాని టీకయు నున్నది. మఱియు, బాలసరస్వతీయటీక లని చెప్పఁబడువానిలో విశేషభేదములు గన్పట్టుచున్నవి. ఉదాహరణ మున కొకటి రెండుసంగతులను జెప్పెదను. వావిళ్ళవారు బాలసరస్వతిటీ కాసహితాంధ్ర శబ్దచింతామణి యని యొక గ్రంథమును బ్రకటించి నారు. అది బాలసరస్వతి టీక కాదని చెప్పుచు నాంధ్రసాహిత్య పరి షత్తువారు నిజమైన బాలసరస్వతిటీక యిదియని వేఱొక గ్రంథమును

ప్రకటించినారు. నా కీనడుమ బాలసరస్వతి టీకాసహితాంధ్రశబ్ద చింతామణి తాళపత్ర ప్రతియొకటి లభించినది. అది యీ రెండింటికిని భిన్నముగా నున్నది. అందు భారతము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, మొదలగు గ్రంథములనుండి లక్ష్యములుదాహరింపఁబడియున్నవి. దీనినిబట్టి బాలసరస్వతీయటీకలలోఁ బండితులు విశేషములుగా మార్పులు గావించియుండిరనియుఁ దమటీక కనుగుణముగా మూల సూత్రములను దాఱుమాఱు గావించి యుండిరనియుఁ దలంపవలసియున్నది. నేను జూచినంతవఱ కప్పకవీయమున నిట్టిమార్పులు గన్పట్టుటలేదు. బాలసరస్వతీయమునఁ బండితులు తాఱుమాఱు చేసినప్రతియే యహోబలపండితునకు లభించియుండుననియు, నాపాఠమునే యహోబలుఁడు గైకొని యంతమాత్రమున నదిమూలానుసరణమని తలంపరాదనియు నా యభిప్రాయము. అప్పకవీయమునకు వ్యతిరిక్తముగా నున్నపాఠములు బాలసరస్వతికిఁ బిమ్మటఁ బండితులచేఁ జేయఁబడినవనియే నావిశ్వాసము. మూలసూత్రముల నప్పకవి మార్పుచేసెనని తలంపరాదు. అహోబలపండితుఁడు కూడ నప్పకవిపాఠములను గ్రహించిన ట్లీక్రింది శ్లోకములోఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ అప్పార్యపుస్తకారూఢ పాఠభేదాస్సముద్ధితం
మయాసంగృహ్యతే రూపంతదప్యత్ర ధ్వాణోక్తితః.

ఆంధ్రశబ్దచింతామణి యేఱువందల సంవత్సరముల డనుక నణఁగియుండుటచే నిపాఠభేదములు కలిగెనని కొందఱనుచున్నారు. కాని యీవాదమునందు సారములేదు. బాలసరస్వతికిని నన్నయభట్టునకును గల మధ్యకాల మూఱువందల సంవత్సరములు. ఈకాలములో గ్రంథమునులేదు. పాఠభేదములును లేవు. బాలసరస్వతికి లభించినది మొదటిది. అప్పకవికి లభించిన గ్రంథము రెండవది. ఈరెండింటిలోనే పాఠభేదములు. ఇవియే మాతృకలు. ఈ మాతృకలపుత్రికలలో పాఠభేదములు గలవు. ఈపాఠభేదములు, గ్రంథమాఱువందల సంవత్సరములడఁగి యుండుటచే వచ్చినవి కావు. గ్రంథము బయటపడినపిమ్మట,

నది ప్రచారములోనికి వచ్చినతరువాత, నందుండులోపములను సవరించుటకో లేక ప్రమాదవశముననో, పండితులు లేఖకులు స్వమతముప్రతులలోఁ జేసినమార్పులే యీపాఠభేదములు కావున నీపాఠభేదములు వచ్చుటకుఁ గారణము గ్రంథ మూఁడువందల సంవత్సరము లడఁగియుండుటయని చెప్పరాదు.

ఆంధ్రశబ్దచింతామణికిఁ బ్రసిద్ధుఁడైన సారంగధరుఁడు ఒక టీక వ్రాసియుండెనని యు, దానిని స్పష్టముగా వివరించుటకయి నన్నయభట్టే తానుగా నవతరించితి ననియు, నహోబలపండితుఁడీక్రింది శ్లోకములోఁ దెలిపియున్నాఁడు.

శ్లో॥ ప్రసిద్ధసారంగధరేణ టీకా మపి స్ఫుటీకర్తు మతీవహర్షాత్
వాతూలవంశేవవతారభూయ శ్రీ నన్నవిద్వానహమేవసోస్మి

దీనినిబట్టి, యాంధ్రశబ్దచింతామణికి సారంగధరుకృతమైన సంస్కృతటీక యొకటి యున్నట్లు సూచితమగుచున్నది.

భారతమును రచించిన నన్నయభట్టుగాక మఱియొకఁడో నన్నయ యనుపండితుఁ డీయాంధ్రశబ్దచింతామణిని రచియించి యుండు ననియు, దానికి సారంగధరుఁ డనుపండితుఁడు సంస్కృతమునఁ డీకను రచియించియుండుననియు, దానికి బాలసరస్వతి యాంధ్రమునఁ డీకను వ్రాసియుండుననియు. నన్నయ, సారంగధరనామములను బట్టి యప్పకవి యీకథ నల్లియుండవచ్చుననియు నొక యూహ కలుగుచున్నది. బాలసరస్వతి రచించినవని చెప్పఁబడుచున్న (పైనుదాహరించిన యొక వచనమును, ఉత్పలమాల మత్తేభవృత్తములును) గద్యపద్యములు బాలసరస్వతి కృతములుగాక యిటీవలి వారెవరో రచియించి యుండిరని తలంపవలసియున్నది. బహుశః అప్పకవిగాని, అతని పద్యములను బట్టి మఱియొకఁడుగాని యీగద్యపద్యములను వ్రాసియుండును. సారంగధరకృతటీక యిప్పుడు గన్పడుటలేదు ఈవిషయమును బాలసరస్వతిగాని, యప్పకవిగాని తలపెట్టలేదు. దీనియందు విశేషముండకపోవుట

కారణమైయుండును. బాలసరస్వతికిఁ దాతకుఁ దాని సన్నయ యొకఁ
డున్నాఁడు కాని యాతఁడు పండితుఁడని చెప్పఁబడక పోవుటచే
నాతఁ డీగ్రంథకర్తయని యనఁజాలము.

### ముద్రితాముద్రిత ప్రతులలోని గద్యలు.

ఆంధ్రశబ్దచింతామణి ముద్రితాముద్రితప్రతులలో నుదాహరింప
బడిన గద్యలీ వివాదమును బరిష్కరించుటకుఁ దోడుపడ లేదు. ఇవి
యనేకవిధములుగా నుండుటయు, నన్నయభట్టారకకృతమని చెప్పుట
కాధారము లేకపోవుటయు నిట్లనుటకుఁ గారణములు. ఈసందర్భమునఁ
గవిభల్లటుని చారిత్రమున వ్రాసిన వాక్యములను గూడఁ జూడవలసి
యున్నది.

### వ్యాకరణకర్తలు మువ్వురినామములు తొలగింపఁబడినవి.

ఇఁకను సూత్రములనుబట్టియీ వివాదమును తీర్మానించుట
కేమయిన నవకాశము కలదాయని యాలోచింపవలసి యున్నది.
అప్పకవీయములో సంధిపరిచ్ఛేదమున ౧౩వ వృత్తమున "నమోస్తో
హాల్యథర్వణాఖ్యమతాత్" అని యొకసూత్రమున్నది. ౧౭ వ వృత్త
మున "హేమోక్తేఃపరుషాణాం గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే" అని
యొకసూత్రమున్నది. పదియవ వృత్తమున "లోపోవాస్యాత్ త్రైషా
మితశ్చ దద్వౌ త్రివిక్రమమతేన" అని యొకసూత్రమున్నది. ఈసూత్ర
ములలోఁ జెప్పఁబడిన యథర్వణాచార్యుఁడును, హేమాచార్యుఁడును
త్రివిక్రముఁడును వ్యాకరణకర్తలు. వీరు మువ్వురును నన్నయభట్టునకుఁ
దరువాతివారు. ఈసూత్రములు నన్నయభట్టకృతములేయైనచో నథర్వ
ణాదులను దలపెట్టుట యసంభవము. కావున నివి నన్నయకృతములు
కావని బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. బాల
సరస్వతీయములని ప్రకటింపఁబడుచున్న నన్నయభట్టీయములలో ఈ
సూత్రమునందలి 'నమోస్తో' యనుపదమును పదునేడవవృత్తమందలి
"హేమోక్తేః" యను పదమునకు బదులుగా నుంచి, మిగిలినసూత్రము

తీసివేయఁబడినది. పదియవవృత్తమందలి పైనినుదాహరించిన "లోపో
వా స్యాత్" అనుసూత్రమునకూడ తీసివేయఁబడినది. నన్నయభట్టు
తనగ్రంథమున నథర్వణాచార్యుని హేమచంద్రుని త్రివిక్రముని దలపెట్టు
టయసంభవమనితలంచి బాలసరస్వతీయమును దత్పూర్వులెవ్వరైన సవ
రించినారా? లేక అప్పకవి మూలములో లేని యీ సూత్రములను
వ్యాకరణకర్తల నామములను జేర్చి తన గ్రంథమునఁ దెచ్చిపెట్టు
కొనియెనా? యనునది తీర్మానింపఁబడవలసినసమస్య. ఈ సూత్రము
లను అప్పకవి తెచ్చిపెట్టుకొని యుండఁడనియు నాతని కందువలనఁ
గలిగెడు ప్రయోజనము లేదనియు ననుకొనినచో, నీసూత్రములు
నన్నయకృతములు కావనియు, బ్ర శ్రీ వీరేశలింగము పంతులుగారని
నట్లు బాలసరస్వతియో, లేక మఱియొకరో యీ సూత్రములను రచించి
పుస్తకమునకు గౌరవమును దెచ్చుటకై మహాకవియగు నన్నయభట్టు
నకు దీనికర్తృత్వము నాపాదించియుండుననియు నిస్సంశయముగాఁ జెప్ప
వచ్చును. బాలసరస్వతీయములో నీవ్యాకరణకర్తలు మువ్వురిపేరులను
గూడ లేకుండుట చిత్రముగనే యున్నది. పైనివ్రాసిన వాక్యములనన్ని
టిని జదివి చదువరులు తమయంతరాత్మకు సత్యమని తోఁచినరీతిని నిర్ణ
యించుకొందురు గాక!

## ఇంకనొకటిరెండు విషయములు

నన్నయ ముందుగా నాంధ్రశబ్దచింతామణిని రచించి పిమ్మట
భారతమును రచించెనని కొందఱనుచున్నారు. నన్నయ భారతమున
నాంధ్రశబ్దచింతామణియందలి నియమములకు విరుద్ధములగు ప్రయోగము
లున్నవని బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవుల
చరిత్రమునఁ జూపియున్నారు. గ్రంథవిస్తరభీతిచే వాని నిందు మఱలఁ
జూపలేదు. శబ్దశాసనుఁడని పేరొందిన నన్నయమహాకవి తానుచేసిన
నియమముల నుల్లంఘించెననుటకంటె, నా నియమము లాతఁడు చేసిన

వికావని యెంచుటయే ధర్మముకదా. అయితే లక్షణగ్రంథమును వ్రాయుట వేఱు లక్షణదోషములేకుండ కావ్యనిర్మాణ మొనర్చుట వేఱు. కావ్యమునం దెచ్చోటనయిన దోషమున్నంత మాత్రమున నాలక్షణము నాతఁడు చేయలేదనియో, ఆకావ్యము నే యాతఁడు చేయలేదనియో నిర్ణయించుట సత్యేతరమగునని పైని చెప్పినయుక్తికి సమాధానము. అదియును నిజమే దానికనేకోదాహరణములను జూపవచ్చును. ఇట్టి యుక్తిప్రతియుక్తుల కెంతయేని యవకాశమున్న యీ విషయమును గూర్చి యింక పెంచి వ్రాయుట యుపయోగము లేనికార్యము పండితులును కవులును, ఆంధ్రశబ్దచింతామణిలోని నియమములకంటె భారత ప్రయోగములకే యెక్కువ విలువనిచ్చుచున్నారు. చింతామణిననుసరించి దోషమయినను, ప్రయోగముననుసరించి సాధువులైనచో వాని ననుసరించి తమకావ్యములయందు శబ్దములను బ్రయోగించుచునే యున్నారు.

ఆంధ్రభాషాచారిత్రమును రచించిన శ్రీ డా. చిలుకూరి నారాయణరావుగారు, నన్నయభట్టు కాలమున జతుర్థీవిభక్తికి "కునై" యను ప్రయోగముండెడిదనియు, "కొఱకు" అనునది విభక్తిగాఁ గాక యొక శబ్దముగానే యాకాలపుకవు లుపయోగించుచుండెడివారనియుఁ గొన్ని ప్రయోగములను జూపుచు, నాంధ్రశబ్దచింతామణియందు "కొఱకు కై చతుర్థ్యాః" అనుసూత్రముండుటచే నీగ్రంథము నన్నయతరువాత రచింపఁబడినదే కాని నన్నయ కృతము కాదని, యిట్టివే మఱికొన్ని యుదాహరణముల నిచ్చుచు, నిర్ధారణ మొనర్చియున్నారు. గ్రంథవిస్తరభీతిచే నాచర్చయంతేయు నిట వ్రాయలేదు.

వీనినన్నిటిని బట్టిచూడఁగా నాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారకకృతముకాదనియే, తేలుచున్నది.

పదునేడవశతాబ్దివాఁడైన మంచళ్ల వాసుదేవకవి యాంధ్రశబ్దచింతామణికి సంస్కృతమున వృత్తిని వ్రాసియుండెను.

## లక్షణసారము

కస్తూరిరంగకవి రచించిన యానందరంగ రాట్ఛందమునందు నన్నయభట్టు లక్షణసారములోనివని యీక్రిందిపద్యము లుదాహరింపఁబడినవి. నన్నయభట్టు లక్షణసారమును రచియించినట్లు అప్పకవ్యాది లక్షణవేత్తలెవ్వరును జెప్పియుండలేదు. కవులుగాని పండితులుగాని చరిత్రకారులుగాని యిదివఱ కెవ్వరును, నన్నయభట్టు లక్షణసారమును రచియించినట్లు చెప్పలేదు. అట్టిగ్రంథము రంగకవి కీలక్షణసార మెచ్చట లభించెనో తెలియదు. తృప్తికరమయిన సాక్ష్యము లభించిననే తప్ప నీపద్యములు నన్నయభట్టువని తలంప వీలులేదు. అయినను భావిపరిశోధకుల కుపయోగములుగా నుండునని యీపద్యములనిట వ్రాయుచున్నాఁడను.

మ. స్వరవర్గప్లుతముల్ విసంధిగణబిందుప్రాగ్విభేదోర్వసు
స్వభిన్నప్రభుకాకువిశ్వములు దేశ్యజ్ఞోభయాఖండముల్
సరసాదేశవిభాగవృద్ధులును మాసంయుక్తవైకల్యముల్
గరిమం బోలిక చక్కటెక్కటి యనంగా నివ్వి దేడాయతుల్.

గీ. ఒకటి కరసున్న కలిగి మూఁటి కవిలేక
ప్రాసములు లఘుపదము లై నైని జెల్లుఁ
గృతుల నొక్కొక్కచో నది యొప్పులవిన
వికను నెఱిఁగింతుఁ జెప్పు డీసుకవు లనఁగ.

గీ. కనఁ దవర్గద్వితీయ థకారమునకుఁ
బ్రాస మొకచోఁ జతుర్థ ధ వర్ణ మైనఁ
గాకయు దకారమునకు ధకార మైన
నమరి నదియు వప్రాస మండ్రు గృతుల.

గీ. స్వరముతుదనుండు లు ప్రవిసర్గకోత్వ
మైనగూఢస్వరయతి దాసోఽహ మనఁగ

నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లనఁగ నమ్మాధవుఁడు యశోవ్యాప్తి యనఁగ.

గీ. కృతులలో శబ్దశాస్త్రజ్ఞ మతముచేత
వృద్ధి యొందును రూఢిగా నెసఁగి యుండె
సత్క్రియెడఁ బ్రకృతివికృతుల ననుసరించి
యుభయమును జెల్లు వల్లకు శుభచరిత్ర

గీ. అచ్చు హల్లును సాపశబ్దాదివర్ణ
ములకుఁ జెప్పినఘుణ్ యతులనఁగఁ దనరు
నంబుకుహాగేహిని మధురాలాప యనఁగ
లక్ష్మి వాగ్జితకోకిలాలాప యనఁగ.

గీ. షష్ఠబహుళకు ముకారంబు పూర్వమునను
గాక పైఁగాని చెప్పఁ జక్కటి యతియగు
ముష్టిఁగొని కృష్ణుఁ డురమునఁ బొడిచె ననఁగ
బుధుల వినుతులఁ దగె వ్యాసముని గనంగ.

గీ. తొలుతఁ బ్రాకృతసూత్రంబువలన జ్ఞాకు
నార్ణ మాదేశముగ వచ్చి యమరుకతనఁ
బ్రాకృతాదేశ సరసవిరామ మైత
సర్వఁ గృతుల శుకుండు సుజ్ఞాని యనఁగ.

ఇందు మొదటిపద్యము కవివాగ్బంధనములోనిదని తంజావూరు పుస్తకభాండాగార పట్టికవలనఁ దెలియవచ్చుచున్నది.

తంజావూరు పుస్తకభాండాగారమున లక్షణసారమను ఛందోగ్రంథ మొకటియున్నది. దానికర్తపే రందు లేదు. దానిని నేను చూడఁజాలకపోవుటచే నదియు నిదియు నొక్కటియగునో కాదో చెప్పఁజాలను. ఇవి రెండును నొక్కటియే యగునెడల నందధ్యణాచార్యునిచే నుదాహరింపఁబడియుండుటచే నీ లక్షణసారకర్తృత్వము నన్నయభట్టునుండి తొలఁగి యన్యునిపైఁ బడును.

## ఇంద్రవిజయము.

నన్నయభట్టు ఇంద్రవిజయమను నొక కావ్యమును రచియించె నని వాడుక కలదు. కాని యాగ్రంథ మిప్పు డెచ్చటను లభించుట లేదు. నన్నయభట్టు ఇంద్రవిజయములోని వని యీక్రింది రెండుపద్యము లానందరంగరాట్ఛందమున నుదాహరింపఁబడియున్నవి.

క. ఆ సరసిజాక్షి కౌనుకు
గా సరి యొక్కింత పోలుకతమునఁ గద యా
కాశ మనంతాహ్వయమునఁ
గేసరి హరినామమునఁ దగెఁ విను మింద్రా!

చ. ఒకపలువాతఁ గొన్నికిటియుం దలలో నిడుకూర్మభర్త నా
లిక లిరుగన్నసీదిరవు తేజు పయోధరధారఁ బొట్టఁ బెం
చు కులనగాళి యీడు ప్రతిజోడనయెం చనఁగూడ దేరికె
న్నికగ యయాతి యొండెధరణిన్ భరియించి చెలంగు వానికిన్.

ఈ పద్యమున 'నాలుక' యనుటకు బదులుగా 'నాలిక' యనుటయు, ల, ఱ, ళకు యతిమైత్రిఁ జేయుటయు, ద్రుతాంతశబ్దముపై వచ్చు పరుషమును బరుషముగా నుంచుటయుఁ జూడ నీగ్రంథము నన్నయమహాకవికృతముగాక నన్నయనామధారియగు మఱియొకనిచేఁ రచింపబడినదై యుండునని యుఁ దలంపఁ వలసియున్నది.

## రాఘవాభ్యుదయము.

నన్నయభట్టు రాఘవాభ్యుదయ మనునొక గ్రంథమును వ్రాసియున్నట్లొకరు వ్రాసియున్నారు. కాని యందుల కాధారమేమియు లేదు.

## నన్నయ యేశాఖా బ్రాహ్మణుఁడు.

నన్నయార్యుఁ డేశాఖాబ్రాహ్మణుఁ డనువిషయము వివాదాస్పదమయినది. కొందఱు వైదికశాఖాబ్రాహ్మణుఁ డనియుఁ గొందఱు నియోగిశాఖాబ్రాహ్మణుఁ డనియు ననుచున్నారు. ఈ విషయమున

నిదివఱకు పలుమారులు చర్చలు జరిగియున్నవి. ఈ చర్చలన్నియు
జరిగినపిమ్మటనే బ్రి. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్ర
కవుల చరిత్రమున క్రీ. శ. ౧౯౧౭ వ సంవత్సరములో నిట్లు వ్రాసి
యున్నారు.

## ఆంధ్రకవుల చరిత్రాభిప్రాయము.

"ఇతఁడు ముద్గలగోత్రజాతుఁ డగు వైదిక బ్రాహ్మణుఁడు.
ఒకానొక రీతఁడు వైదిక బ్రాహ్మణుఁడు కాఁడనియు, తెలుఁగు కవి
త్వమునకు మొదటినుండియు నియోగులే ప్రసిద్ధులయి యుండుటచేత
నీతఁడును నియోగియే యయియుండునవియు, భట్టశబ్ద మాత్రధారణచేత
నీతఁడు వైదికియని భ్రమింపఁగూడదనియు, నియోగియైన శ్రీనాథ
కవిగూడ తన కాశీఖండములోని "చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి
నాఁడు" అను పద్యములోఁ దన్నుఁ గూర్చి "శ్రీనాథభట్టసుకవి" యని
చెప్పికొనియెననియు, వ్రాసియున్నారు. నన్నయభట్టు కాలమునాఁ
టికే యాంధ్రస్మార్త బ్రాహ్మణులలో వైదిక నియోగిభేద మేర్పడి
యుండినను, నియోగివైదికుల కిరువురకును సమానముగానే "భట్టశబ్దము
చెల్లుచుండినను, నన్నయభట్టు తాను రాజుయొక్క కులబ్రాహ్మణుఁ
డయినట్టు" తన కులబ్రాహ్మణు ననురక్తు నవికల జపహోమతత్పరు...
నన్నపార్యుఁ జూచి "పరమ ధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ
డిట్టులనియెఁ గరుణతోడ" నని యాదిపర్వములోఁ జెప్పుకొని యుండు
టచేత నన్నయ వైదికశిఖామణి యనియే నిశ్చయింపవలసియున్నది.
కులబ్రాహ్మణులయి వంశపరంపరగా రాజపురోహితత్వము నిర్వర్తించు
చుండుట వైదికులలోనే కాని నియోగులలో లేదు. ఇంకొకరు చాళు
క్యులు పశ్చిమమునుండి వచ్చినవారగుటచేత నన్నయభట్టు మహారాష్ట్ర
దేశప్రాంతములనుండి రాజరాజనరేంద్రుని పూర్వుల వెంట వచ్చిన
మహారాష్ట్ర బ్రాహ్మణులసంతతివాఁ డయి యుండుననీ వ్రాసియున్నారు.
అదియు విశ్వసనీయము కాదు. నన్నయ వేఁగినాటి బ్రాహ్మణుఁడని
యూహించుటకు తగిన నిదర్శనములు నన్నయార్య విరచితమైన భారత

భాగములోనే కనుపట్టుచున్నవి. ఇతఁ డర్జునుని తీర్థయాత్రలను వివరించుటలో నీక్రింది వర్ణనము నాదిపర్వము నందుఁ జేసియున్నాఁడు.

సీ. దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁ గగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్టమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

గీ. ణాంబురాశితీరంబున కరిగి చరిత
పావనంబైన కావేరీ మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుఁ జేసి కృతార్థుఁడగుచు.

స్వదేశమునం దభిమాన మెల్లవారికిని సహజమయి యుండును గదా! ఈతఁడు వేఁగివాటివాఁ డగుటచేతనే మూలగ్రంథమైన సంస్కృతమహాభారతములో లేని వేఁగిదేశమహత్త్వవర్ణనము నుత్తమ విశేషణములతోఁ దెలుఁగు భారతమునఁ జొప్పించి తన యసమాన దేశాభిమానమును గనఁబఱిచి యున్నాఁడు"

నన్నయభట్టు నియోగి బ్రాహ్మణుఁడని వాదించువారిప్పటికిని గలరు. వీరిలో ముఖ్యులు కవిశేఖర వఝా సూర్యనారాయణగారు, విమర్శాదక్షక కీ. శే. సడకుదిటి వీరరాజు పంతులుగారు, కల్లపాలెపు వెంకట నారాయణప్పగారు మొదలగువారు. వైదికబ్రాహ్మణుఁ డని వాదించువారిలో ముఖ్యులు విమర్శకాగ్రేసర బిరుదాంచితులగు కీ. శే. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు. ఈయన నన్నయభట్టారకచారిత్రమను నొకగ్రంథమును గూడ వ్రాసియుండిరి. నన్నయ వైదికుఁడైనను

నియోగియైనను, సర్వజనపూజ్యుఁ డనుటకు సంశయము లేదు. ఇప్పటి పండితులలోఁ బెక్కురు, ఈ చర్చవలన ప్రయోజనము లే దనితలంచు వారు కలరు. అది సత్యమే కాని యీచర్చను వదలివైచి యీమహా కవిచారిత్రమును ముగించితి నేని చరిత్రకారుల ధర్మము నుల్లంఘించిన వాఁడ నగుదు నేమోయను భయముచేతను ఆవిషయములఁ దెలిసికొన నభిలషించువారీగ్రంథమునుజూచి నిరాశ చెందుదురను తలంపునను, భావి కాలపాఠకుల కుపకరింపవచ్చు ననియుఁ దలంచి యా యంశములలో ముఖ్యములైనవాని నిటఁ జూపెదను. వీనిని జదివి పాఠకులు తమ యిచ్చవచ్చినరీతిని నిర్ణయించుకొందురు గాత! పండితు లింతవఱకు చర్చించినయంశములనుబట్టి నన్నయభట్టీశాఖకుఁ జెందినవాఁడని నిస్సంశయముగా చెప్పుటకుఁదగిన యాధారములు లభింపలేదనియు, విషయ మింకను సందిగ్ధముగానే యున్నదనియు నా యభిప్రాయము.

నన్నయభట్టు తననుగూర్చి భారతమున వ్రాసికొనిన "తనకుల బ్రాహ్మణు" ఇత్యాదిపద్య మొక్కటియు నాశ్వాసాంతగద్యయుఁదక్క నాతనివృత్తాంతమును దెలుపునాధారములు మనకు లభింపలేదు. నన్నయ యేశాఖకుఁ జెందినబ్రాహ్మణుఁడో నిర్ణయించుటకుఁ దగినయాధారములను జూపునట్టివి, ఆకాలమునాఁటి శాసనములు గాని గ్రంథములు గాని, నన్నయకృతములుగాని యితరకవి రచనములుగాని లేవు. ఇఁక నీ విషయమును జర్చించుటకు పైని జెప్పిన గద్యపద్యములు రెండే యాధారములు. ఈ రెండింటిలో "తనకులబ్రాహ్మణు" "నన్నయభట్టు" యను రెండుశబ్దముల విషయమై పండితులు భిన్నాభిప్రాయులుగా నున్నారు. వాని నటుండనిండు. అందలి తక్కినశబ్దము లుభయశాఖా బ్రాహ్మణులకునుగూడ నన్వయించును. ఈవిషయమున సంశయము లేదు. ఎవ్వరేని యాశబ్దములలోఁ గొన్ని ప్రత్యేక మొక శాఖలోని వారికే వర్తించునని చెప్పినచో, నందువలన వారి సంకుచితహృదయము వెల్లడియగునే కాని, సత్యము బయటఁబడదు. అందునుగూర్చి విశేషముగాఁ జర్చింపనవసరమును లేదు. ఇఁక పైని జెప్పిన రెండుశబ్దములలో

భట్టశబ్ద ముభయశాఖా బ్రాహ్మణులకును గూడ నాకాలమున వర్తించుచుండెనని, సామాన్యముగా నుభయపక్షములవారును గూడ నంగీకరించుచున్నారు. వైదికశాఖా బ్రాహ్మణులకు భట్టశబ్ద ముపయోగింపఁబడుననునది నిర్వివాదాంశమే. నియోగిశాఖా బ్రాహ్మణులలోఁ గూడ నీభట్టశబ్దము నుపయోగించునాచార మున్నదనుటకు నియోగి బ్రాహ్మణుఁడగు శ్రీనాథుఁడు తాను "శ్రీనాథభట్టసుకవిని" అని చెప్పుటయే నిదర్శనము. ఆజ్జకవు పేరయలింగకవి నియోగిబ్రాహ్మణుఁడు, అతని పూర్వుఁడుకొండుభట్టు. వేదవేదాంగ సంపన్నుఁడు. అగ్రహార పరిగ్రహీత. ఇట్టి వింక ననేకదృష్టాంతములు చూపవచ్చును. నన్నయ భట్టునకు, భారతవచనమునఁ దోడుపడిన నారాయణభట్టు నియోగి బ్రాహ్మణుఁడైనట్లు నందంపూడి శాసనమువలనఁ దెలియుచున్నది. అందుచే భట్టశబ్దము శాఖానిర్ణయమునకుఁ దోడుపడఁ జాలదని తలంపవలసియున్నది.

## "కులబ్రాహ్మణ శబ్దచర్చ"

ఇఁక "కులబ్రాహ్మణ" శబ్ద మొకటియున్నది. కులబ్రాహ్మణ శబ్దమునకుఁ బురోహితుఁ డనునర్థమును జెప్పి నియోగి బ్రాహ్మణులలోఁ బురోహితవృత్తిని గైకొనినవారు లేరు కావున నన్నయ నియోగి కాఁడనియు వైదిక శాఖా బ్రాహ్మణుఁ డనియుఁ గొందఱు తలంచుచున్నారు. రెండవ అమ్మరాజు విజయాదిత్యుని శాసనములో (ద. హిం. శా. సం॥ ౧ పుట ౪౬) తన కులబ్రాహ్మణుఁడును కౌండిన్య గోత్రుఁడు నైన యొకబ్రాహ్మణునకు ప్రాక్తనక్షేత్రమును దానమిచ్చి నట్లు లిఖింపఁబడియున్నది. ఇందుపయోగింపఁబడిన కులబ్రాహ్మణశబ్దమును బాశ్చాత్యపండితులు Family preist అని భాషాంతరీకరించి యున్నారు. ఈ శాసనము పదియవ శతాబ్దమువాటిది. నన్నయభట్టు వైదికోత్తముఁ డని వాదించువారుకూడఁ గులబ్రాహ్మణ శబ్దమునకుఁ బురోహితుఁ డని యర్థమును జెప్పుటకంగీకరింపక యాశబ్దమునకు వంశానుగతముగా రాజకుటుంబము నాశ్రయించుకొనియున్న బ్రాహ్మణుఁ డని మాత్రమే

యర్థము చెప్పవలయునని యభిప్రాయపడుచున్నారు. కులబ్రాహ్మణ శబ్దమునకు, "పురోహితుఁడని యర్థము చెప్పరాదు" దని నన్నయభట్టు నియోగియని వాదించువారు కూడ చెప్పుచున్నారు. కాని వీరిరువురితను అభిప్రాయములలో భేదమున్నది.

పౌరోహిత్యము నీచవృత్తియనియు నిత్యసత్యవచనుఁడును అవిరళజపహోమ తత్పరుఁడు నగు నన్నయ యిట్టి నీచవృత్తి నవలంబించి యుండఁ డనియు, రాజాశ్రయుఁడును బూజ్యుఁడును నగు బ్రాహ్మణునిగా మాత్రమే యుంచి నన్నయగౌరవమును గాపాడవలయుననియు, మొదటివారి యభిప్రాయము. ఇప్పటివలెఁ బురోహితవృత్తి యాకాలమున నీచముగాఁ బరిగణింపఁబడుటలేదు. ఈకాలము గూడ నన్నయకున్న లక్షణములను గల్గియున్నచో నాతఁడు రాజపురోహితుఁడుగా నుండినను గౌరవింపబడుచునే యుండును అందుచేఁ గులబ్రాహ్మణుఁడనఁగా, పురోహితుఁ డనినను నన్నయ గౌరవమునకు భంగము రానేరదు. కులబ్రాహ్మణుఁ డనగా మంత్రి యనియు, నన్నయ, రాజరాజనరేంద్రుని యొద్ద మంత్రులలో నొకఁడుగా నుండెననియు, శ్రీవఝా సూర్యనారాయణగారు వ్రాయుచు, తమవాదమును బలపరుచుటకుఁ గొన్ని విషయముల నుదాహరించి యున్నారు. అవియివి:—

౧. నారదుఁడు ధర్మరాజును కుశలప్రశ్నము చేయు కథాసందర్భమున సభాపర్వములో మంత్రిలక్షణములను వివరించుచు,

క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహక్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులుగా
నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్.

అను పద్యమును నన్నయ రచించి యుండెను. "పితృపితామహక్రమమున వచ్చిన విప్రు" లనఁగా "కులబ్రాహ్మణు"లని యర్థము. మంత్రులకుఁ బ్రధానలక్షణము రాజునం దనురక్తులై యుండుటయు శాస్త్రాను

క్రమముగా వచ్చు బ్రాహ్మణుఁడై యుండుటయు నై యున్నవి. ఈ యభిప్రాయమును మనసునం దుంచుకొనియే, నన్నయ తనకును రాజునకును గల సంబంధమును జెప్పినప్పుడు మొట్టమొదట నే "తన కుల బ్రాహ్మణుఁడు, ననురక్తుఁడు" అను లక్షణములు రెండిటినిఁ జెప్పి "తాను రాజువొద్ద మంత్రులలో నొకఁడనని సూచించియున్నాఁడు. కావున నన్నయకవిని పురోహితునిగాఁ గాక మంత్రులలో నొకనిగా భావించుట యుక్తము.

౨. ఈ సందర్భముననే నన్నయ పురోహితుని లక్షణములను గూడ నీ క్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

క. ధీరుఁడు ధర్మార్థతత్త్వవి
శారదుఁడు బహుశ్రుతుండు సముచితుఁడు వా
ణీరమణీశ్రితవదనస
రోరుహుఁ డనఁ దగునె నీపురోహితుఁ డధిపా!

ఈ లక్షణములలో "కులబ్రాహ్మణ" "అనురక్త" అను లక్షణములు చెప్పఁబడలేదు. కావున నన్నయ పురోహితుఁ డనుట సమంజసముకాదు.

3. దాదాపుగా నన్నయకాలమువాఁడైన నన్నిచోడమహాకవి కుమారసంభవము నందలి యీక్రిందిపద్యములలోఁ గులవిప్రుఁడు మంత్రి యని చెప్పియున్నాఁడు.

క. పతిహితుఁ గులవిప్రోత్తముఁ
జతురు సదాశుద్ధుఁ గార్యసంవేదిఁ బరేం
గితవిదు ధైర్యాన్వితు ని
గ్గతమతియుతు రాయబారిగాఁ బనుపఁదగున్.

ఇట్లు రాయబారిగా వెళ్లినవాఁడు బృహస్పతి పౌత్రుఁడు. సుమతియనువాఁడు. తాను ప్రధానుఁడ నని యీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. ఏనమరదూత హారిసే
నానులు సురపతియు, దనుజనాయకునితో సం
ధానమునకుఁ బుత్తెంచిన
దానికిఁ జనుదెంచిరం బ్రధానుఁడ నెందుఁగా.

ప్రధానుఁడు, ప్రధానిశబ్దములు మంత్రియందు రూఢములై యున్నవి. కావున నిచ్చటికులవిప్రశబ్దము మంత్రినే బోధించుచున్నది.

కావున కులబ్రాహ్మణశబ్దమునకు, మంత్రియనియే చెప్పవలయును గాని, పురోహితుఁ డని చెప్పరాదు. ఇది కవిశేఖర సూర్యనారాయణగారి వాదసారాంశము. మంత్రి, అమాత్య, ప్రెగ్గడ, శబ్దములు చిరకాలమునుండి నియోగిబ్రాహ్మణులయందు రూఢములై యున్నవి. కావున కులబ్రాహ్మణశబ్దార్థము మంత్రయైనయెడల, నన్నయను నియోగి బ్రాహ్మణునిగాను, పౌరోహిత్యము వైదికబ్రాహ్మణులలోనే కలదు కావున కులబ్రాహ్మణశబ్దమునకుఁ బురోహితుఁ డనియర్థమైనచో, నన్నయను వైదిక శాఖాబ్రాహ్మణునిగాను నిర్ణయింపవలయునని వీరి మతము.

నన్నయ, వైదిక బ్రాహ్మణుఁడో, నియోగియో నిర్ణయించుటకు, కులబ్రాహ్మణశబ్ద మొక్కటిదక్క మఱియొక యాధారమేమియు లభింపకపోవుటచే, నీశబ్దము నింతగా వేధింపవలసివచ్చినది. సభాపర్వములోని పద్యము సంస్కృతభారతమున కాంధ్రీకరణము. సంస్కృత భారత రచనాకాలము నాఁటికి వైదిక, నియోగిభేదము లేదు. కావున నా పద్యమునందలి కులబ్రాహ్మణ మంత్రిశబ్దములు శాఖా నిర్ణయమునకుఁ గోడుపడవు. కాని నన్నయ కాలమునాఁటికి శాఖాభేదములున్నవి. కావున మంత్రి లక్షణములలో ముఖ్యములైన వానిని దన మనసునం దుంచుకొని తననుగూర్చి చెప్పుకొనునప్పుడు, తాను మంత్రినని తెలుపుటకై యాలక్షణములనే తన కుపయోగించుకొనినాఁడని తలంచిననే గాని యీవాదమునకు బలములేదు. తుదకు శబ్దార్థవిచారణ మెట్లున్నను, నన్నయ, సాభిప్రాయముగా నాశబ్దము నుపయోగించెనా ? లేక, శబ్దార్థ

మును విచారింపక సామాన్యదృష్టితో నాశబ్దమును వేసియుండెనా ? యనునది వివాదాంశముగా నున్నది. సామాన్యదృష్టితోనే యాపదములను బ్రయోగించి యుండెనని యెంచితిమేని, యాశబ్దార్థచర్చతో మనకుఁ బని లేదు. ఆపక్షమునందు నీశబ్దములనుబట్టి నన్నయశాఖను నిర్ణయింప బూనుట వృథాప్రయాసము అట్లుగాక సాభిప్రాయముగా వాఁ డాపదముల నుపయోగించెనని నిశ్చయించి చెప్పుడే. యాశబ్దచర్చయవసరమగును. పింగళి సూరనార్యాది మహాకవులు గ్రంథముల యందలి పాత్రలలో దమను బ్రతిఫలింపఁ జేసియుండిరని పండితు లంగీకరించుచున్నారు. ఇట్టి యుదాహరణములను సంస్కృత గ్రంథములనుండియు, నాంధ్రగ్రంథములనుండియు, విశేషముగాఁ జూపవచ్చును. స్పష్టముగాఁ జెప్పుటకంటె స్వవిషయములను సూచనగాఁ జెప్పుటయందే యప్పటి వారు కుతూహలమును జూపెడివారనుట సర్వాంగీకృతమైన విషయము. నన్నయమహాకవియుఁ దనకు రాజుతోఁ గల సంబంధమును దెలుపగోనునప్పుడు సూచనగా సభాపర్వాంతర్గత పద్య లక్షణములను దెలుపుకొని యున్నాఁడని భావించుటలో విరుద్ధమేమియు నుండదు.

ఈసందర్భమునఁ బాఠకులు తీర్మానించుకొనవలసినవిషయములు రెండు:—

మొదటిది—నన్నయ కవి, కులబ్రాహ్మణాది శబ్దములను విశేష దృష్టితో నుపయోగించెనా? సామాన్యదృష్టితోఁ బ్రయోగించెనా ?

రెండవది—విశేషదృష్టితో నుపయోగించినచో, సభాపర్వమునఁ జెప్పబడిన మంత్రి, పురోహిత లక్షణములలో నే లక్షణములు మనసున నుంచుకొని "తనకులబ్రాహ్మణు" అను పద్యము నాతఁడు వ్రాసియుండెను ? (ఈ పద్య మాకవిచారిత్రాది యందీయఁబడినది) ఈసందర్భమున, పురోహితలక్షణముకంటె మంత్రిలక్షణములనే మనసునందుంచుకొని నన్నయ వ్రాసియుండునని తలంచిన సూర్యనారాయణగారి యభిప్రాయ మంగీకరింపఁ దగినదిగాఁ గన్పట్టుచున్నది. నన్నయభట్టు, రాజునొద్ద తానె వృత్తి నవలంబించియుండెనో స్పష్టముగాఁ దెలుప

కొనక యిట్టిశంకలేల పడవలయును? అని కొందఱు అడుగవచ్చును.
ఆ మహాకవి కట్టిశంక లేమియుఁబడలేదు. బాధపడుచున్నది మనమే.
ఆతఁ డుపయోగపరచినశబ్దమును బట్టి శాఖానిర్ణయము చేయఁ బూను
టలో మనమే తికమకపడుచున్నాము. ఆ కాలమునాఁటి కవులు తమను
గూర్చి విశేషముగాఁ జెప్పుకొనువారు కారని మొదటనే వ్రాసియుం
టిని. తనతండ్రి పేరయినఁ జెప్పుకొనని నన్నయ, తనశాఖను వృత్తిని,
స్పష్టముగా నెలతెలుపలేదని ప్రశ్నించిన లాభమేమి?

“కులబ్రాహ్మణు” అనుశబ్దమునకు శబ్దార్థమును మాత్రమే తీసి
కొనినచో నందు మంత్రి యనునర్థమును లేదు. పురోహితుఁ డనునర్థ
మును లేదు. కులక్రమానుగతముగా వచ్చుబ్రాహ్మణుఁ డనుటయే యర్థము.
శబ్దార్థమును మాత్రమే మనసునందుంచుకొని యాపదమును నన్నయ
ప్రయోగించెనని వాదించుట కవకాశము లేకపోలేదు. అందువలననే,
ఈవిషయ మింకను సందిగ్ధముగానే యున్నదని వ్రాసియుంటిని.

నన్నయ, శబ్దార్థమును మాత్రమే మనసునందుంచుకొని వ్రాసి
నను, వాచ్యార్థమునకంటె లక్ష్యార్థము ప్రధానము కావున నిచ్చటలక్ష్యా
ర్థమును నన్నయవాక్యములలో నున్నరీతిగనే గ్రహించి, యాతనిని
మంత్రిగా నిర్ణయింపుఁడని శ్రీ సూర్యనారాయణగా రడుగుచున్నారు.
నన్నయభట్టు మంత్రియని తెలుపుటకు, శ్రీ సూర్యనారాయణగారు
మరికొన్ని యుక్తులను చెప్పిరి. “కులబ్రాహ్మణు” “అనురక్తు” అను
పదములవలన నన్నయ మంత్రిత్వము స్థిరపడినప్పుడు, ఆపద్యములోని
తక్కినపదము లాపదవిని నన్నయభట్టునుండి తొలగించుటకు సమర్థములు
కావని మాపుట కాయుక్తులు పనికివచ్చును. కాని, యాపదములను
వానిమీఁద నాధారపడిన యుక్తులును, వైశబ్దముల సాహాయ్యము
లేకుండ స్వతంత్రముగా నన్నయకు మంత్రిత్వము నీయఁజాలవు. కావున
వానినిగూర్చిన చర్చనిందు వదలివైచితిని.

ఈ రెండు శబ్దములనుబట్టి నన్నయభట్టు మంత్రియనిన ననవ
చ్చును. కాని పురోహితుఁడని నిర్బాధకముగా నిర్ణయించుటకు వీలు

లేదు. మంత్రియుఁ బురోహితుఁడును గాని, సామాన్య బ్రాహ్మణుఁ డనిన ననుట కవకాశమున్నది.

సభాపర్వమున మంత్రిలక్షణములను వర్ణించుపద్యమున "మంత్రులు" అని బహువచనము నుపయోగించెననియు, పురోహితు వివర్ణించిన పద్యములో పురోహితుఁడని యేకవచన ప్రయోగము చేసెననియు, నందుచే రాజునొద్ద, మంత్రులు పలువురుందురనియుఁ, బురోహితుఁ డొక్కఁడే యుండుననియు నిర్ధారణము సేయవలసియుండెననియు, రాజరాజుసభను వర్ణించు నప్పుడు, "మంత్రి పురోహితదౌవారిక" ఇత్యాదిగా నన్నయ చెప్పియున్నాఁ డనియు, మంత్రులు పలువురుం దురు. కావున నందుఁ దానొకఁడయ్యు నన్యుల నుద్దేశించి మంత్రిశబ్ద ముపయోగించెననియు, నన్నయ, పురోహితుఁ డయ్యెనేని, యన్యుఁడు పురోహితుఁడుండఁడు కావున, నావాక్యములోఁ బురోహితశబ్దముం డుట తగదనియు నందుచే నన్నయ, బురోహితుఁడు కాఁడని నిర్ణయింపవలయునని శ్రీ సూర్యనారాయణగారి యభిప్రాయము. నన్నయ పురోహితుఁడుకాఁడని నిర్ణయించుట కీవాదమునకు బలము చాలదని నాయభిప్రాయము రాజునకుఁ బురోహితుఁ డొక్కఁడే యుండునని యంగీకరింతము. నన్నయభట్టు, ఆసభలో నున్నాఁడు. అతఁడు పురోహితుఁడే. అయిన నా వాక్యములోఁ బురోహితశబ్దమును దొలగించి "మంత్రిసేనాపతి దండనాయక దౌవారికాదులును, పురోహితుఁడనైన నేనును" అని వ్రాసికొనవలయునా? ఇది సమంజసము కాదు. నందంపూడి శాసనములోఁ గూడ, "మంత్రిపురోహిత, సేనాపతి యువరాజ దౌవారిక ప్రధానసమక్షమ్" అని వ్రాయఁబడియున్నది. నన్నయ, తాను పురోహితుఁడై నప్పుడు, తానుకూడ నాసభయందుండెనని తెలుపుకొనుటకు, "పురోహిత" అని ప్రథమపురుషమునే యుపయోగించును. ఇందులకు "తనకులబ్రాహ్మణు" అను సీసపద్యమే తార్కాణము.

వివాదవిషయ నిర్ధారణమునకు, శ్రీ సూర్యనారాయణ గారు చూపిననన్నెచోడుని ప్రయోగములుకూడ తోడుపడఁ జాలవని నా తలంపు.

ఇంతతో నీచర్చను విడచి, నన్నయనుగురించి తరువాతి కవు లేమయినఁ జెప్పియుండిరేమో చూతము.

గోపాలుని రామకవి చిత్రాంగదా పరిణయ విమర్శ.

నన్నయభట్టు నియోగిబ్రాహ్మణశాఖకుఁ జెందినవాఁడని వాదించు వారు, నియోగి బ్రాహ్మణుఁడగు గోపాలుని రామకవి తాను రచించిన చిత్రాంగదాపరిణయమునందు నన్నయభట్టు తనవంశములోని పూర్వుఁడని జెప్పియుండుట నొక ప్రధానకారణముగాఁ గైకొనియున్నారు. రామ కవి యెప్పటివాఁడో తెలియదు. కాని యీక్రిందిపద్యములోఁ బోతనను బూర్వకవినిగా వర్ణించి యుండుటచే, పదునాఱవ శతాబ్దివాఁడో, అంతకంటెను దరువాతివాఁడో యై యుండునని చెప్పవచ్చును.

సీ. రామాయణార్థపూర్ణవివేకి వాల్మీకి
  విశ్రుతాశుకవిప్రవీణు బాణు
విమలసాలంకార విఖ్యాతి భవభూతి
  మానితశబ్దసమాజు భోజు
మూర్ఖవిచ్ఛిన్నతమోరవి భారవి
  కవితాచణోల్లాసుఁ గాళిదాసు
సహజోపమానవిస్తందుఁ జోరకవీంద్రుఁ
  నుత్ప్రేక్ష్య కవితామయూఖుమాఘు
నామనంబుఁ దలపోసి నన్నపార్య
సోమ భాస్కర భీమాది సుకవిజనులఁ
బ్రణుతి గావించి శ్రీనాథు రంగనాథుఁ
బోతనార్యుల స్మరియించు పూజఁజేతు.

ఈ పద్యములో "నన్నపార్య" అని మాత్రమే నన్నయభట్టును స్మరించినాఁడుకాని యాతఁడు తనపూర్వుఁడని చెప్పియుండలేదు.

అయినను దనవంశమును వర్ణించునప్పుడు సంశయమునకుఁ జోటీయకుండ నన్నయభట్టు తనవంశములోఁ బూర్వులెవరని యీక్రింది పద్యములలో స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.

"వ. మద్వంశక్రమం బభివర్ణించెద.

మ. వివిధామ్నాయ పురాణశాస్త్ర పటిమా విర్భూతుఁడధ్యాత్మమా
ర్గవిశేషప్రతిపాద మానసుఁడు సాంఖ్యస్థైర్య నిష్ఠానుయో
గవినోదానుభవప్రమోదుఁడు తపోగ్రజ్వాలి మౌద్గల్యమా
నివరేణ్యుండు ప్రకాశ మందె ధరణిన్ విజ్ఞానపారీణుఁడై.

క. ఆ మౌద్గల్యస గోత్రల
లాముఁ డను పొగడ్త గని యిలశబ్దపటి
ష్టామేయదక్షశిక్షా
కాముఁడు నన్నయ జనించె గణనాగణుఁడై.

సీ. తగ నంధ్రశబ్దచింతామణి పంచప
రిచ్ఛేదనియతి విరచించె మొదల
గణవర్ణకూటలక్షణ శుభాశుభఫల
శిక్షాప్రబంధముల్ చేసె నాది
కవిజనాళికిఁ జమత్కారకల్పనలను
మించి జాడల నేర్పరించెఁ దొలుత
సంస్కృతం బంధ్రభాషాయుక్తి సాధించి
నిర్దుష్టనామముల్ నిలిపె రూఢి
భారతామ్నాయపాథోధి పటిమఁ దెలిసి
వేడ్కనీఁద నపేక్షించి విబుధు లెల్ల
నౌర! నన్నయభట్టు విద్యలకు రట్టు
సుకవివాక్కట్టు సత్కవికోటగట్టు

* * *

క. ఆనన్న పార్వ్యవంశాం
 బోనిధి సంపూర్ణ చంద్రు పోలికను జయా
 నూనగుణాలంకారుఁడు
 ధీనిధి గోపాలుఁ డమితతేజుఁడు ఘనుఁడై న్

ఈగోపాలునిబట్టి రామకవియింటి పేరు గోపాలునివారని వచ్చి నది. ఈరామకవి చిత్రాంగదాపరిణయాశ్వాసాంతమునఁ దనను గూర్చి గద్యయందిట్లు వ్రాసికొనియున్నాఁడు.

"గద్య:— ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహ కరుణాకటాక్షవీక్ష ణవిచక్షణాక్షీణ మహిమా కలిత లలిత కవితావిలాస మృదుమధురవచన రచనావిలాస గోపాలన్వయాంబోనిధి సంపూర్ణరోహిణీశ శ్రీ హారిద్గల్వ సగోత్రపవిత్ర ఆపస్తంబసూత్ర యోగానందయామాత్యపుత్ర సరస సన్నా సరామాభిధానప్రణీతం బైన చిత్రాంగదాపరిణయంబను శృంగార కావ్యం బునందు.—"

నన్నయమహాకవి, రామలింగకవి వంశములోనిపూర్వుఁ డనుట నిశ్చయమయ్యె నేని, యాతఁడు నియోగిబ్రాహ్మణుఁ డగుట నిశ్చ యము. కాని యీవిషయమున కీ. శే. కా. బ్రహ్మయ్యశాస్త్రి గారు, సంశయము చూపుచున్నారు సంశయము చూపుటే కాదు. రామకవి కిని నన్నయకును సంబంధము లేదని ఘంటాపథముగాఁ జెప్పియున్నారు. నన్నయ తనపూర్వుఁడని, రామకవి స్పష్టముగాఁ జెప్పుచుండ, నతఁ డసత్యమాడెనని తలంపరాదనియు, ఎంతగొప్పపండితుఁడైనను, ఎంతటి పూజనీయుఁడైనను, ఒక వైదిక బ్రాహ్మణునిఁ దన వంశకర్తయని యంతటి యవివేకియైనను నియోగిబ్రాహ్మణుఁడు జెప్పుకొనఁ డనియు నట్లే వైదిక కవి యొక నియోగినితనవంశకర్తగాఁ జెప్పుకొనఁ డనియుఁ గావున, రామకవి వాక్యములను శిరసావహించి, నన్నయను నియోగి బ్రాహ్మణునిగా నిర్ణయింపవలయు ననియు, శ్రీ సూర్యనారాయణ ప్రభృతులవాదము ఈవాదమునందు బలము లేకపోలేదు. రామకవి, మహాపండితుఁడని, మహాకవియని, యన్యాయముగా, తన కుటుంబము

నకు ప్రసక్తిలేని నన్నయను తనవంశకర్తగాఁ దెచ్చిపెట్టుకొనె నని,
చెప్పుట సాహసమే యగును. కాని, కర్ణాకర్ణికగా వినిన యంశములను
సత్యములని భ్రమ చెంది రామకవి పొరపాటు పడియుండవచ్చునని
తలంచుట కవకాశము లేకపోలేదు. రామకవికి దురుద్దేశ మారోపింపఁ
జాలము. కాని, యతఁడు పొరపాటుపడి యుండునని తలంచుట తప్పు
కాఁజాలదు. ఐతే, పొరపాటుపడినాఁడని ఋజువుచేయు భార మట్లు
వాదించువారిపై నుండును.

నన్నయభట్టు పదునొకొండవ శతాబ్దివాఁడు. రామకవి పదునా
ఱవశతాబ్ది వాఁడు. వీరిరువురి నడుమ నైదునందల సంవత్సరములు
వ్యవధి యున్నది. ఇరువురి నడుమ దాదాపుగా నిరువది తరములు గడ
చినవి. ఇట్టి వివాదము పిల్లలమఱ్ఱి పినవీరనను గూర్చికూడ కలదు.
పినవీరన తన పూర్వుఁడని పెనుమళ్ళ సోమయామాత్యుఁడు వ్రాసికొని
నాఁడు. అచ్చట గోత్రభేదమున్నది. అయినను వారిరువురినడుమ
నింత కాలవ్యవధి లేదు. దాదాపు పదితరములు మాత్రమే గడచినవి.
ఆతరములవారి పేరులు, పిల్లలమఱ్ఱివారు పెనుమళ్ళ వారగుటకుఁ గార
ణము, మొదలగు నంశములను సోమయామాత్యుఁడు తన గ్రంథములోఁ
దెలిపియున్నాఁడు. పినవీరన శాఖానిర్ణయమునకు మఱికొన్ని యాధార
ములు కూడ లభించినవి ఆ విషయము నాతని చారిత్రమున వ్రాసె
దను. నన్నయ విషయమున రామకవి యట్టి సాక్ష్యమును చూపలేదు.
రామకవి, తన గ్రంథమున నన్నయ మొదలుగా గోపాలునివరకు, నా
వంశములోని వారల నామములను దెలుపలేదు. నన్నయను జెప్పి
పిమ్మట గోపాలునిమాత్రమే నుడివియున్నాఁడు. అందుచే నన్నయ
భట్టు తనవంశములోనివాఁడని తెల్పుటకు కర్ణాకర్ణికగా వినినయంశము
లైనను సంపూర్ణముగా లేవని ధ్రువపడుచున్నవి. కొలఁది కాలము
క్రిందట న్యాయస్థానము నందొక వ్యాజ్యములో నన్నయభట్టు మొదలు
గా రామకవి వఱకును దానితరువాతను గల వంశవృక్షమొకటి సాక్ష్య
ముగా ప్రదర్శింపఁబడెనని వినియుంటిని. కాని, యది నాకు లభింప

లేదు. అందుచే నావిషయమున నిక నేమియు వ్రాయజాలను. వరుసగా వంశవృక్షము నీయఁబోయినంతమాత్రమున నన్నయభట్టు గోపాలుని వారి వంశీయుఁడు గాఁడని చెప్పజాలము కాని, యితర కారణములచే నాసంబంధ మనుమానింపఁ బడుచున్నపుడిది కూడ నా యనుమానమును వదలింత బలము చేయును కదా? రామకవి చెప్పినమాట యనుమానింపఁబడుటకుఁ బ్రబలమైన కారణ మొకటి కలదు. అది గోత్రభేదము.

## ముద్గల, మౌద్గల్య గోత్రము లొకటియా?

నన్నయభట్టు ముద్గలగోత్రుఁడనని తన "కులబ్రాహ్మణు" అను పద్యమునందుఁ జెప్పుకొనియున్నాఁడు, గోపాలుని రామకవి మౌద్గల్య సగోత్రుఁడు. ముద్గల, మౌద్గల్య గోత్రములు భిన్నములని కీ శే. బ్రహ్మయజ్ఞశాస్త్రిలగారి వాదము ఇవి రెండును నామభేదముగల యేకగోత్రమే యని శ్రీ సూర్యనారాయణగారను చున్నారు. మౌద్గల్యుఁడు, ముద్గలుని కుమారుఁడని యుభయపక్షముల వారును నంగీకరించుచున్నారు. తండ్రికొడుకుల కేక గోత్రముండును గాని, భిన్నగోత్ర మెట్లుండునని సామాన్యముగాఁ బ్రశ్నింపకమానరు. ఈప్రశ్నకు శ్రీ బ్రహ్మయజ్ఞశాస్త్రిలుగారు రీవిదముగా సమాధానమిచ్చియున్నారు. వసిష్ఠుఁడు గోత్రకారకుఁడైన మహర్షి. ఆతని కుమారుఁడు వాసిష్ఠుఁడు. మనుమఁడు పరాశరుఁడు వసిష్ఠ, వాసిష్ఠ, పరాశరగోత్రములు మూఁడును ఇప్పుడు వాడుకలో నున్నవి. ఈమూఁడు గోత్రములకును బ్రవరలు వేఱు. కావున ముద్గల మౌద్గల్యులు తండ్రికొడుకులైనను, వారిరువురును గోత్రకారకులైనప్పుడు, భిన్నగోత్రములుగనే భావింపబడవలయునని శాస్త్రిలుగారు వ్రాసి యందులకు ధర్మప్రవృత్తి, నిర్ణయసింధువు మొదలగు గ్రంథములనుండి యుదాహరణముల నిచ్చియున్నారు.

ముద్గల, మౌద్గల్య గోత్రములు రెండును బూర్వమును నిప్పుడును గూడ నున్నవి. ముద్గలసంబంధమైన మౌద్గల్యగోత్రమును సభిప్రాయముతో మౌద్గల్యగోత్రమని కొందఱును, మొదట ముద్గలగోత్రము

కావున ముద్గగోత్రునని కొందఱును, జెప్పుకొనుచున్నారని శ్రీసూర్య
నారాయణగారి వాదము— గోత్రమెప్పుడును తమయిష్టము వచ్చినట్లు
చెప్పుకొనునదికాదు రామకవి ముద్గగోత్రజాతుఁడయ్యెను, దానినే
చెప్పుకొనక తత్సంబద్ధమైనదని యూహించు 'మౌద్గల్య' గోత్రమని ఏల
చెప్పుకొనవలయును? రామకవి వంశములో (వివాదాస్పదుఁడయిన
నన్నయను విడచి) పూర్వముగాని, తరువాతఁ గాని, ముద్గలగోత్రజుఁ
డనని చెప్పుకొనువారున్నారని చూపఁ గలిగినప్పుడు, ఈ రెండు నేక
గోత్రికులుగా భావింపనవకాశ ముండును లేదా యట్టిదృష్టాంతముల
నైనఁ జూపవలయును. కృత్యాదిపద్యములలో ముద్గలగోత్రజుఁడ నని
చెప్పుకొని, గ్రంథాంతగద్యయందు మౌద్గల్యసగోత్రజుఁడ నని వ్రాసి
కొనిన శతావధానికవి యొకరున్నారు. కాని వారివ్రాతను బట్టి యీ
రెండుగోత్రము లొకటియే యని నిర్ధారణము సేయరాదు. రామకవి
తనగోత్రకర్త మౌద్గల్యుఁడని చెప్పెనేగాని ముద్గలుఁడని చెప్పలేదు.
ఋషులలోగాని, గోత్రములందుగాని యుచ్చారణభేదమువలననొక్కిం
త భేదమున్నప్పుడు, దానినిగూర్చి విశేషచర్చ చేయవలసిన యావసర
ముండదుగాని, రెండును వేఱువేఱుగోత్రములుగా వ్యవహరింపఁబడు
చున్నప్పుడు వాని నొకేగోత్రమని నిర్ణయింపవలనుపడదు. నన్నయ
నాఁటికి, ముద్గలగోత్రమని వ్యవహరింపబడుచున్నను, పిదప మౌద్గల్య
గోత్రముగా మారెనని కొందఱనుచున్నారు. ఆమార్పుగోపాలునివారి
విషయము నందేయైనదని చెప్పుచో, నది యెప్పుడు మారెనో
చూపినఁగాని దానినంగీకరింపరాదు. ఒక్కగోపాలుని వారి విషయము
లోఁ గాక సర్వత్ర, అట్టిమార్పువచ్చినని యందురేని, యందు సత్యము
లేదు. నన్నయభట్టునకుఁ బూర్వుఁడైన మురారి కవి యనర్ఘరాఘవ
మునఁ, దాను మౌద్గల్యగోత్రజుఁడ నని యీ క్రింది వాక్యములలోఁ
జెప్పుకొనియున్నాఁడు.

'అస్తి మౌద్గల్యగోత్రసంభవస్య మహాకవేఃభట్ట శ్రీ వర్ధమానతను
జన్మనః తంతుమతీనందనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవనా
మనాటకం॥"

ఒక్క ఋషినామములో నేకవర్ణోచ్చారణభేద మాత్రము దక్క ప్రవరయందీ రెండు గోత్రములకును భేదము లేపోవుటచే నిరెండునునొక్క గోత్రమని తలంప నవకాశము గలుగుచున్నమాట నిశ్చయమే యైనను నంతమాత్రమున నది యేకగోత్రమని చెప్పుటకు వీలు లేదు. శాస్త్ర గ్రంథములయందును వ్యవహారములోను భిన్నగోత్రములుగా నున్న వీనిని, రామకవి గ్రంథమునుబట్టి యేకగోత్రముగా నిర్ణయించుట సాహసమగును.

ముద్గలగోత్రమనునది లేదేలేదనియు మౌద్గల్యగోత్ర మొక్కటియే యున్నదనియు నన్నయ రచించిన పద్యమునందలి 'ముద్గల' ను 'మౌద్గల'గా సవరింపవలయుననియుఁ గొందఱను చున్నారు ఈమార్పు 'మౌద్గల్య'యని యుండవలయును. 'మౌద్గల'యనుట కూడదు. 'మౌద్గల్య' యనుటకు లక్షణ మంగీకరింపదు. ముద్గలగోత్రు లిప్పుడున్నారని వారి పేరుల నుదాహరించి చూపుటకు నే నిప్పుడు సిద్ధముగా లేను. కాని యిటా విశాలాంధ్రదేశమున ముద్గలగోత్రు లుండఁబోరని నా విశ్వాసము. కాలేరు శాసనమందలి ప్రతిగృహీత ముద్గలగోత్ర జాతుఁడగు మేడమార్యుఁడని చెప్పఁబడియున్నది. ముద్గలగోత్రము లేదని చెప్పు టెట్లు? "మౌద్గల్య ముద్గలాభ్యాంచ న వివాహో పరస్పరమ్" అని రెండును వేఱువేఱు గోత్రములుగాఁ జెప్పి వారికి వివాహమును నిషేధించి యుండఁగా ముద్గలగోత్రము లేదని యెట్లు చెప్పఁగలము? ఈ గోత్రభేదమును తెలియకుండఁగనే నన్నయభట్టు తత్పూర్వుఁడని రామకవి వ్రాసికొనియెనా? యను ప్రశ్నకుసమాధాన మీయవలసియున్నది. నన్నయభట్టు ముద్గల గోత్రుజాతుఁడనని స్పష్టముగాఁ జెప్పుకొనుచుండఁగా దాన మౌద్గల్యగోత్రమువాఁడనని చెప్పుకొనుచు, నన్నయ తన వంశములోనివాఁడని చెప్పుటకు, రామకవి, అత యవివేకి యని చెప్పు సాహసింపను. పైని జెప్పిన మూఁడు పద్యములును బ్రక్షిప్తములనియు,

రామకవి వానిని రచింపలేదనియు, ముద్దల మౌద్గల్యము లోకే గోత్రములయి యుండునని భావించిన ప్రతిలేఖకుఁ డెవరో యీ పద్యములను రచించి గ్రంథములోఁ జేర్చెననియు, నాకుఁ దోఁచుచున్నది. లేదా, గోపాలుని వంశములో నన్నయ నామధారి పూర్వుఁ డొకఁడు వ్యాకరణ శాస్త్రజ్ఞుఁ డుండియుండును. వానిని నన్నయభట్టుగాభావించి రెండుకందముల నడిమి సీసమును బ్రతిలేఖకుఁడు రచించి యందుఁ జేర్చియుండును సీసపద్యములోని రెండవపాదమునుబట్టి నన్నయ, లక్షణగ్రంథమును రచించినట్లు గన్పడుచున్నది. కస్తూరి రంగకవి తక్కువతి సూర్యుడు నన్నయభట్టులక్షణగ్రంథమును రచించెనని చెప్పలేదు. అందుచే నిది ప్రక్షిప్తమని తలఁచుచున్నాఁడను. ప్రతివివాదవిషయము లోను గొన్నిపద్యములను బ్రక్షిప్తములుగాఁ దీసివేసినచో, వివాద పరిహారమునులభమగునను నాక్షేపణము రాఁగలదని నే నెఱుంగకపోలేదు. పూర్వకవి స్తుతిలో "నన్నపార్యు" అని మాత్రమే, వ్రాసియున్నదు దనవంశకర్తయని చెప్పలేదు. కావునను సౌగంధికాపహరణాది గ్రంథకర్తయగు గోపాలుని సింగయకవి నన్నయభట్టును దన పూర్వుఁడని చెప్పియుండక పోవుటచేతను, నే నట్లభిప్రాయపడితిని.

## మా నన్నయభట్టు.

పిల్లలమఱ్ఱి పినవీరన, శకుంతలా పరిణయమునందు, పూర్వకవులను స్తుతించుచు:—

మ. కవులం బంకజగర్భ సన్నిభుల వక్త్రాంశింతు వల్మీక సం
భవునిన్ వ్యాసునిఁ గాళిదాసు బిలహణున్ బాణుణ మయూరుణ
శూద్రుకుణ
భవభూతిణ శివభద్ర మల్లణుని, ఘంటామాఘునిం జోరు భా
రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడణ సోమునిణ.

అను పద్యములో "మా నన్నయభట్టు" అని చెప్పియుండుటచేత నన్నయభట్టును బినవీరన నియోగిబ్రాహ్మణునిగా వర్ణించెనని కొందఱభిప్రాయపడియున్నారు.

ఇందుఁ జెప్పఁబడిన తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోముఁడును, నియోగులగుటచేతను 'మా' అనునక్షర మీనల్గురకును గూడ నన్వయిం చు ననియు నందువలన నన్నయభట్టుకూడ నియోగిబ్రాహ్మణుఁ డని తలంపవలయుననియు వారి యభిప్రాయము. లోకములో మాటల సం దర్భమున "అతఁడు మనవాఁడే"—"వాఁడు మావాఁడే నండి" అనుచుం డుటయు, సామాన్యముగా నేకకులమునో, ఏకశాఖనో తెలుపుసందర్భ మున నట్లుపయోగించుచుండుటయు, మనము చూచుచునే యుందుము. అట్టి యభిప్రాయముతోనే పినవీరన నన్నయభట్టునుగూర్చి యుపయో గించెనని వారియుద్దేశము. వారట్లు తలఁచుటలో తప్పులేదు. చింతల పూడి యెల్లయకవికూడ శ్రీనాథుని నుతించుచు నీ క్రిందిపద్యములో 'మా' యుపయోగించియున్నాఁడు.

శా. సూనాస్త్ర ప్రమదానుద స్ఫురితవక్షోజాత శాతిక్ష్ణముకా
బూనంజాలు వచోవిలాసముల నేర్పుల్ చూపి శృఙ్గాటక
క్ష్మానాథేంద్రసభా గళత్ప్రవియోత్సాహంబుఁ గైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్.

ఆదిలక్ష్మీవిలాసమున "ఆక్కెనపల్లి నృసింహకవియు మా నన్న యభట్టు" అని యీక్రింది పద్యములో వ్రాసికొని యున్నాఁడు. నృసిం హకవి నియోగిబ్రాహ్మణుఁడు.

ఉ. ఎన్నిక భారతంబుమొద మేర్పడ నేర్చిన నంధ్రభాష సం
పన్నతచే రచించి మహిమాగమశాసన సోమయాజికా
ఖ్యన్నతిఁ గాంచి లోకముల భూరియశోధను లైనయట్టి మా
నన్నయభట్ట తిక్కకవినాథుల సాధుమతి న్నుతించెదన్.

* * *

అయినను నీయక్షరప్రయోగమునుబట్టి నన్నయ నియోగిబ్రాహ్మ ణుడని నిర్ణయింపఁ జాలము. భక్తిపురస్సరమగు ప్రేమయే యీ ప్రయోగమునకుఁ గారణమని నాయభిప్రాయము. ఈవిషయమును

గూర్చి పినవీరనచారిత్రమునఁ గొంత వ్రాసి యున్నాఁడను పినవీరన వైదికబ్రాహ్మణుఁడని యొకవాదమున్నది. ఆవాదమును జేయువారు, నన్నయభట్టు వైదికబ్రాహ్మణుఁడు కావున, నీ "మా" నుబట్టి పినవీరనను వైదికునిగాఁ జేయఁ గోరుచున్నారు. ఈ ప్రయోగము వారి వాదమునకును బలమీయదు.

ఇంతవఱకుఁ గవిచారిత్రమును దెలిపియుంటిని. కృతిపతి చారిత్రముగూడఁ దెలిపినఁగాని, కవిచారిత్రము సంపూర్ణముకాదని నాయభిప్రాయము. సామాన్యముగా నీరెంటికి నవినాభావసంబంధముండును. అందుచే నిట—

భారత కృతిపతియగు రాజరాజనరేంద్రుని వంశ చారిత్రమును గొంత వ్రాయ సంకల్పించితిని. ఇట్టి కథలను దీర్ఘముగా వ్రాసి పాఠకుల హృదయమున విసువుజనింపకుండఁ జేయవలయుననియే నా యుద్దేశము.

## చాళుక్యవంశ వర్ణనము.

నన్నయభట్టమహాకవికిఁ బోషకుఁడై భారతరచనకుఁ బ్రోత్సాహమొసంగి, యా మహాకావ్యమును గృతినందినవాఁడు రాజరాజనరేంద్రుఁడు. ఆంధ్రభాషకు, నాంధ్రలోకమునకు మహోపకారమును గావించిన యీ యుత్తమశ్లోకుని వంశమునుగూర్చి యిట ప్రస్తావించుట యప్రస్తుత ప్రశంస కానేరదు. భారతములో నీతఁడు చాళుక్యవంశమువాఁడని చెప్పఁబడియున్నది. చాళుక్యవంశోత్పత్తినిగూర్చి కొన్నిగాథలు కలవు. అందు ముఖ్యమైనవి రెండు.

## చాళుక్యవంశోత్పత్తిగాథ — మొదటిది.

బిల్హణపండితుఁడు సంస్కృతమున రచించిన విక్రమాంక దేవచారిత్రమున నిట్లు చెప్పఁబడినది. పూర్వమొకప్పుడు బ్రహ్మ సంధ్యావందనము చేసికొనుచున్నసమయమున దేవేంద్రుఁ డచ్చటకు వచ్చి భూలోకంబున దానవాంశచే జనించిన కొండఱి మూలమున ధర్మహాని

వాటిల్లుచున్నదనియు, నందువలన దేవతలకేక హవిర్భాగములు లభింపవనియుఁ గావున ధర్మరక్షణము సేయఁ బ్రయత్నింపుమనియు విన్నపము సేసిరఁట. అంతట బ్రహ్మ దుష్టసంహారమొనర్చి ధర్మసంరక్షణము సేయ శక్తుఁడగు నొకపురుషుని నిర్మింపఁ దలంపు గలవాఁడై తనచులుకము (ఆచమనము చేయుటకై రెండవ్రేలు మడిచిపట్టిన చేర) వంక దృష్టి పారించెనఁట. అందుండి తేజశ్శాలియగు పురుషు డొకఁడు జన్మించెనఁట. ఆతనివంశమున హారీతి, మానవ్యుఁ డనుపరాక్రమశాలులు జన్మించిరఁట. వారివలన వంశాభివృద్ధి యయ్యెనఁట. చుళుకము నుండి పుట్టినవాఁడు కావుని వాతఁడు చళుక్యుఁ డయ్యెననియు నాతని వంశీయులు చాళుక్యులని పిలువఁ బడుచుండిరనియు నొక గాథ చెప్పఁబడినది.

## చాళుక్యవంశోత్పత్తిగాథ — రెండవది.

చంద్రవంశపురాజులలో విజయాదిత్యుఁ డనురాజు, అయోధ్య నుండి దక్షిణదేశమును జయింపఁగోరి యచ్చటకువచ్చి త్రిలోచనపల్లవునితో రణమొనర్చుచు నందు నిహతుఁ డయ్యెననియు, నాతనితోఁ గూడ వచ్చిన యాతనిభార్య, గర్భవతి, యొట్లో తప్పించుకొని ముడివేము అగ్రహారమునకుఁ జేరి విష్ణుభట్టను బ్రాహ్మణునియింట దాఁగెననియు నతఁడామెను పుత్రికవలె సంరక్షించి యామెకుఁ గల్గిన మగశిశువునకు జాతకర్మాది సంస్కారము లొనర్చి రాజునకుఁ గావలసిన విద్యాబుద్ధులు చెప్పించెననియు, వయసువచ్చిన పిమ్మటఁ దల్లివలన నాతఁడు యావద్వృత్తాంతమును దెలిసికొని చళుక్యపర్వతమునకుఁబోయి గౌరీదేవినిగూర్చి తప మాచరించి, కుమారమాతృగణములను దృప్తిపరచి తదనుగ్రహమునఁ దనకులక్రమాగతములగు శ్వేతాతపత్ర, వరాహలాంఛనాదులను బడసి పరాక్రమముచే నప్పుడు రాజ్యముసేయుచున్నకదంబులను, గాంగులను, రాష్ట్రకూటులనుజయించి బాదామి (వాతాపినగరము) నగరము రాజధానిగా రాజ్యము చేసెననియు, విష్ణుభట్టసోమయాజిచేఁ బెంపఁబడినవాఁడు కావున నాతనికి విష్ణువర్ధనుఁ డను

నామము కలిగెననియు, చళుక్యపర్వతముపైఁ దపమాచరించి రాజ్యలాభమును బడయుటచే నప్పటినుండియు నాతని వంశమువారు చాళుక్యులనిపిలువఁబడుచుండిరనియు, రెండవగాథ. ఇది నందమపూఁడి శాసనములోను, అంతకుఁ బూర్వ ముండిన శాసనములలోను గూడఁ జెప్పఁబడినది. ఈ గాథలు సత్యములు కావనియు, నీచాళుక్యులు సూర్యవంశమువారు గాని, చంద్రవంశమువారుగాని, కారనియు, వీరు దాక్షిణాత్యులును ద్విజేతరులునై యుండి తమవంశమునకు గౌరవము నాపాదించుటకై నీగాథలను కల్పించుకొని వానిని శాసనములలోని కెక్కించుకొనిరనియు నవీనచరిత్రకారులనుచున్నారు. అది సత్యమే కావచ్చును. దానినిగూర్చి చర్చించుట కిట తావు చాలదు.

## విష్ణువర్ధనుఁడు.

ఈ విష్ణువర్ధనుఁడు దక్షిణహిందూదేశమునంతను జయించెను. ఈతఁడు పొందిన విజయములనుబట్టి ప్రజలీతనిని జయసింహు డని పిలువఁజొచ్చిరి. ఏడులక్షల డెబ్బదివేలుసంఖ్య గల దక్షిణాపథము నీతఁడు పరిపాలించెనని నందమపూఁడి శాసనమునఁ గలదు. ఈ సంఖ్య గ్రామములని కొందఱును, రాజునకు వచ్చునాదాయమని కొందఱును, జనసంఖ్యయని కొందఱును, రాజుకడనున్న సైనికసంఖ్య యని కొందఱు నూహించుచువచ్చిరి. నందమపూఁడి శాసనము పుట్టి యిప్పటికి దాదాపు తొమ్మిదివందల సంవత్సరము లైనది. అప్పటికంటె నిప్పు డెన్నియో రెట్లు గ్రామములు క్రొత్తగా గట్టఁబడియున్నవి. అయినను మొత్తము హిందూదేశమునం దంతట నిప్పు డేడులక్షల గ్రామము లున్నట్లు దొరతనము వారిలెక్కల వలన స్పష్టమగుచున్నది. తొమ్మిదివందల సంవత్సరములకుఁ బూర్వ మొక్క దక్షిణాపథమున నేడులక్షల డెబ్బదివేలు గ్రామము లుండెనని తలంచుట కవకాశము లేదు. అందుచే నది

గ్రామసంఖ్య కానేరదు. రాజునకు వచ్చు నాదాయమును గాదు. అది యాకాలపుజనసంఖ్యయై యుండవలయును, నవీనచరిత్రకారులు కొందఱీయభిప్రాయమునే వెలిబుచ్చియున్నారు. ఈ విష్ణువర్ధనుఁడు క్రీ. శ. ౬౦౦ సంవత్సర ప్రాంతమువాఁడని చెప్పవచ్చును ఇతఁడు పల్లవరాజు కుమార్తెయైన మహాదేవిని పెండ్లియాడి యామెవలన విజయాదిత్యుఁడను కుమారునిఁ గనియెను.

విజయాదిత్యుఁడు:— ఈ విజయాదిత్య మహారాజు మిక్కిలి పౌరుషశాలి. అనేక యుద్ధములలోఁ బాల్గొని రణరాగుఁడను బిరుదు వహించి ప్రఖ్యాతిఁ గాంచెను. ఇతనికుమారుఁడు పులకేశి:— ఇతఁడు చాళుక్యవంశమున మిక్కిలి యశస్సు నార్జించిన మహాపురుషుఁడు. రాజధానీనగరమైన వాతాపి నభివృద్ధి గావించి సత్యాశ్రయ శ్రీ పృథివీవల్లభరణ విక్రమాంక మహారాజను బిరుదునామమును వైకొని రాజ్యపరిపాలనము చేసెను. ఇతని కుమారుఁడు కీర్తివల్లభ మహారాజు:— ఈ రాజచంద్రుఁడు మౌర్యులను, కదంబులను జయించి రాజ్యమును పెంపొందించినవాఁడు. ఇతనికి "పులకేశి, జయసింహుఁడు, విష్ణువర్ధనుఁడు" అను ముగ్గురు కుమారులు. తండ్రి చనిపోవునప్పటికి వీరు పసివారుగనుండుటవలనఁ గీర్తివర్మకు సవతి సోదరుఁడైన మంగళేశుఁడు రాజై చేది దేశమును బాలించుచుండిన కాలచుర్యులను చాళుక్యస్వామిరాజును నింకను మఱికొందఱు రాజులను జయించెను. ఇతఁడు గొప్ప పరాక్రమవంతుఁడనియు, ధర్మాత్ముఁడనియు పేరు గాంచినవాఁడు. ఇతఁడు తన కుమారుని రాజ్యమున నిలుపవలయునని యనేక ప్రయత్నములు గావించెను గాని, కీర్తివర్మ జ్యేష్ఠపుత్రుఁడైన రెండవ పులకేశి శక్తిసామర్థ్యములవలన నాప్రయత్నము కొనసాగలేదు. ఆప్రయత్నము

లలో మంగళేశుఁడు తన ప్రాణములను రాజ్యమునుగూడఁ బోఁగొట్టు కొనియెను.

మంగళేశుని యనంతరమునఁ జాళుక్య రాజ్యభారమును వహించినవాఁడు కీర్తివర్మ పెద్దకుమారుఁడగు పులకేశి. ఇతనిని రెండవ పులకేశి యందురు. ఇతఁడు వేఁగిదేశమును జయించి పిమ్మట కళింగదేశమునకుఁ బ్రధాననగరమైన పిఠాపుర దుర్గమును సాధించి యాదేశమును స్వాధీనము చేసికొనియెను. రాష్ట్రకూటులను, కదంబులను, గాంగులను, మౌర్యులనుగూడ జయించి వారిని సామంతులనుగాఁ జేసి వారిఁ గప్పములను గైకొనియెను చాళుక్యులలో నింత పరాక్రమవంతుఁడగు రాజింకొకఁడు లేడు. ఇతనికి రాజపరమేశ్వరుఁ డనియు, సత్యాశ్రయ పృథ్వీవల్లభ మహారాజనియు బిరుదములు గలవు. ఉత్తరహిందూస్థానమున సార్వభౌముఁడై కన్యాకుబ్జమును రాజధానిగ జేసికొని పరిపాలించుచున్న హర్షవర్ధనుఁడు దక్షిణదేశమును జయింపవలయునని వచ్చినప్పుడడ్డు తగిలి, యాతనిని దక్షిణమునకు రాకుండఁ జేసినదీ పృథ్వీవల్లభ మహారాజే. ఈతఁడు వేఁగి కళింగదేశములను జయించుటకు వెడలినప్పు డీతనితో నీతని తమ్ముఁడైన విష్ణువర్ధనుఁడు కూడనుండి యాతనికి సాహాయ్యమొనర్చుచుఁ దా నీదేశమునకు రాజుగా నుండవలయునని తలంచుచుండెను. వేఁగి కళింగదేశములను జయించి తనదేశమునకు మరలిపోవునప్పుడీ రెండవ పులకేశి, తనతమ్ముఁడైన విష్ణువర్ధనుని వేఁగి కళింగదేశములను బరిపాలనము చేయుటకై నియమించెను. ఈవిష్ణువర్ధనుఁడు మిక్కిలి పొట్టివాఁడుగ నుండుటచే నీతనికి కుబ్జవిష్ణువర్ధనుఁడని పేరువచ్చినది. ఈతఁడు క్రమముగా స్వతంత్రుఁడై వేఁగి కళింగదేశముల రాజయ్యెను. విష్ణుభట్టారకునిచే సంరక్షింపఁ బడిన విష్ణువర్ధనుఁడు మొదలుగా నీ కుబ్జ విష్ణువర్ధనుని వఱకునుగల వంశవృక్ష మీక్రింద చూపఁబడుచున్నది.




పృథ్వీవల్లభ మహారాజని నామాంతరముగల రెండవ పులకేశి పశ్చిమమున బాదామినగరము (దీనికి వాతాపినగరమని నామాంతరము) రాజధానిగా రాజ్యము చేయుచుండుటచే నాతనికిఁ బశ్చిమచాళుక్యరాజనియు, నాతని వంశమువారికిఁ బశ్చిమ చాళుక్యులనియు పేరు వచ్చినది. అట్లే తూర్పున వేఁగిరాజధానిగా వేఁగి కళింగదేశములను బరిపాలించిన కుబ్జవిష్ణువర్ధనునకు తూర్పుచాళుక్యరాజనియు నాతని వంశము వారికిఁ దూర్పుచాళుక్యులనియు నామ మేర్పడినది. భారత కృతిపతియైన రాజరాజు తూర్పు చాళుక్య వంశములోనివాఁడు. కుబ్జవిష్ణువర్ధనుఁ డీ వంశమునకు మూలపురుషుఁడు. కుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలుగా రాజరాజువఱకుఁగల వంశవృక్షము నీదిగువ నిచ్చుచున్నాఁడను. పశ్చిమచాళుక్య వంశముకూడఁ జాలగ నభివృద్ధిచెంది రెండుశాఖలుగఁజీలి బాదామిని రాజధానిగాఁ జేసికొని పరిపాలించినవారు బాదామి చాళుక్య

లనియు, కల్యాణపురమును రాజధానిగా జేసికొని పరిపాలించినవారు కల్యాణపుర చాళుక్యులనియుఁ బిలువఁ బడుచుండిరి. కాని వారికీ చరిత్రముతో సంబంధము లేనందున నావంశములిందుఁ జూపఁబడలేదు.

౧. కుబ్జ విష్ణువర్ధనుఁడు (౬౧౬-౬౩౩)

- ౨. జయసింహుఁడు I (౬౩౪-౬౬౬)
- ౩. ఇంద్రభట్టారకుఁడు (౬౬౬)
  - ౪. విష్ణువర్ధనుఁడు (రెండవ) (౬౬౭-౬౭౫)
    - ౫. మంగి యువరాజు (౬౭౬-౭౦౦)
      - ౬. జయసింహుఁడు II (౭౦౧-౭౧౩)
      - ౮. విష్ణువర్ధనుఁడు (మూఁడవ) (౭౧౪-౭౫౦)
        - ౯. విజయాదిత్యుఁడు (నరేంద్ర మృగరాజు) (౭౫౧-౭౬౮)
          - ౧౦. విష్ణువర్ధనుఁడు (నాల్గవ) (౭౬౮-౮౦౩)
            - ౧౧. విజయాదిత్యుఁడు (౮౦౪-౭౪౮)
              - ౧౨. విష్ణువర్ధనుఁడ (కలివిష్ణువర్ధనుఁడు) (అయిదవ) (౮౪౯)
            - నృపరుద్రుఁడు
      - ౭. కొక్కిలి (౭౧౪)


౧౩ గుణగ విజయాదిత్యుఁడు (౮౫౦–౮౯౨
విక్రమాదిత్యుఁడు
యుద్ధమల్లుఁడు
౧౪. చాళుక్య భీముఁడు (మొదటి) ౮౯౨–౯౧౮
౧౭. తాళరాజు (౯౨౫)
౨౧. యుద్ధమల్లుఁడు (౯౨౭–౯౩౩)
౧౫. విజయాదిత్యుఁడు (కొల్లభిగండ) (౯౧౯)
౧౮. విక్రమాదిత్యుఁడు ౯౨౫–౯౨౬)
బాదపరాజను నామాంతరముగల విజయాదిత్యుఁడు.
౧౬. అమ్మరాజ విష్ణువర్ధనుఁడు (ఆఱవ) (౯౧౯–౯౨౫)
౨౨. చాళుక్య భీముఁడు (రెండవ) (౯౩౪–౯౪౫)
౧౭ బేట విజయాదిత్యుఁడు
౨౦. భీముఁడు (౯౨౬)
౨౪. దానార్ణవుఁడు (౯౭౦ | ౯౭౩)
౨౩. అమ్మరాజ విజయాదిత్యుఁడు (౯౪౫–౯౭౦)
౨౫. శక్తివర్మ ౧౦౦౦–౧౦౧౧
౨౬. విమలాదిత్యుఁడు భార్య కుందవదేవి (౧౦౧౧–౧౦౨౨)
27. రాజరాజు: (భారత కృతిపతి) భార్య అమ్మంగదేవి (1022-1063)
విజయాదిత్యుఁడు (విన్నకోట పెద్దన చారిత్రమునుజూడుఁడు.)
రాజేంద్రచోడుఁడు (కులోత్తుంగ చోడదేవుఁడు)
రాజరాజు అనే చోడగంగు
ముమ్మడి రాజేంద్ర చోడుఁడు
వీర చోడుఁడు
విక్రమ చోడుఁడు

దీని తరువాఁతగూడ నీవంశమభివృద్ధి చెందినది. కాని దానిలో మనకిటఁ బ్రసక్తిలేదు.

చాళుక్యులకు రణాధిదేవతయు షాణ్మాతురుఁడునగు కార్తికేయుఁడును, ఆదిశక్తులైన బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ, యను సప్తమాతృకలును గులదైవతము లైనట్లు కుబ్జవిష్ణువర్ధనుని సతారాశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. నందంపూఁడి శాసనమందుఁగూడ "మాతృగణ పరిపాలితానాం, స్వామిమహాసేన పాదానుధ్యాతానాం" అని యుదాహరింపఁబడియున్నది. ఈ చాళుక్యవంశపు రాజు లాంధ్రదేశములోఁ జాలభాగమును దాదాపుగ నైదువందల సంవత్సరములు బరిపాలించియుండుటచే వారిచారిత్రము సంక్షిప్తముగ నీదిగువ వ్రాయుచున్నాఁడను. నన్నయభట్టారకకవి చారిత్రముతో నీరాజవంశవర్ణనమున కంతగా సంబంధము లేకపోయినను, ఆంధ్రదేశ పరిపాలనముతో సంబంధించినదగుటచేతను, వారు భారతకృతిపతికిఁ బూర్వులగుటవలనను వారిచారిత్రమును గొంచెమిటఁ జెప్పఁదలచితిని. ఆరాజుల చారిత్రముల నిందుఁ బూర్తిగఁ దెలుపు టనావశ్యకము కావున, లోపవ్యత్యాసములను బాటింపక దిఙ్మాత్రసూచకముగ వాని నిటఁ వ్రాయుచున్నాఁడను. ఆయానృపాలురు వ్రాయించిన శిలాతామ్రశాసనములనుగూర్చి కూడ యెక్కించుక సూచించితి నేని జిజ్ఞాసువు లాశాసనములను జదువుకొని యా కాలమునాఁటి పరిస్థితులను దెలిసికొనవీలగునని తలంచి యతిక్లుప్తముగ నాశాసన విషయములను గూడ నుదాహరించుచున్నాఁడను.

౧. కుబ్జ విష్ణువర్ధనుఁడు:—ఇతనికిఁ విషమసిద్ధి యనియు, మకరధ్వజుఁ డనియు బిరుదములు కలవు. విషమదుర్గములను సాధించుటచే విషమసిద్ధి యనియు, అనేకాగ్రహారముల నొసంగిన మహాదాత యగు

టచేగాము ధేనువనియుఁ, బొట్టిపాఁడైనను రూపవంతుఁ డగుట మకరధ్వజుఁడనియు నీతనికి బిరుదములు వచ్చినట్లూహింపఁదగియున్నది. ఈతఁడు వేఁగి కళింగరాజ్య పరిపాలనమున నియుక్తుఁడు కాకముందు యువరాజుగా నున్నకాలమున భీమరథీనదీతీరమున నొకగ్రామమును విప్రుల కిచ్చినట్లొక శాసనము కలదు. (ఇం. ఆ. సం॥ ౯ పుట ౨౪౫) పిష్టపురము (ప్రస్తుత పిఠాపురము) రాజధానిగా విశాఖపట్టణము మండలములోని సర్వసిద్ధి తాలూకాయండలి తిమ్మాపుర శాసన మొకటియు (A.R. ౧౯౦౯ పుట ౬౦ అదియేమండలములోని చీపురుపల్లి శాసన మొకటియు (ఇం. ఆం. సం॥ ౨౦. పుట ౨౮; ౬౯.) నీతనివి గాన్పించుచున్నవి. చీపురుపల్లిశాసన మీతని పదునెనిమిదవ రాజ్యసంవత్సరమున ననఁగా శా. వ. ౫౫౫ సం॥ శ్రావణ పూర్ణిమనాటి చంద్రగ్రహణకాలమున (మాఘాణశకము ౬౩౨వ సం॥ జూలయి నెల ౭వ తేదీ)దిమిలసీమలోని కలవకొండ గ్రామమును విష్ణుశర్మ మాధవశర్మ యను బ్రాహ్మణులకు దానమొసంగినట్లు చెప్పఁబడియున్నది. ఈరాజు రాజ్యముచేసిన కాలము పదునెనిమిది సంవత్సరములు. ఈ దిమిలయను గ్రామము విశాఖపట్టణ మండలమున సర్వసిద్ధితాలూకాలో యెలమంచిలికిఁ గ్రోసుదూరమున నున్నది. కుబ్జవిష్ణువర్ధనుని కాలమున నాప్రాంతమంతయు దిమిలవిషయమని పిలువఁబడుచున్నట్లిందువలనఁ దెలియుచున్నది. ఇదిగాక యీతని వేఱొకశాసనము గుంటూరు మండలములోని బెజ్జరాల యను గ్రామమున లభించినది. (A.R. ౧౯౯౯ సంఖ్య ౧౫౪) కుబ్జవిష్ణువర్ధనుని రాజ్యము కళింగదేశమునందు మాత్రమే వ్యాపించెననియు, వేఁగిదేశము నందంతగా నెలకొనలేదనియు, వేఁగిదేశమున నంతకుఁ బూర్వము పాలకులుగానున్న విష్ణుకుండినులే కుబ్జవిష్ణువర్ధనునకు వేఁగిదేశము ను స్వాధీనము గాకుండఁ జేయుచుండిరనియుఁ గొందఱు చరిత్రకారులభిప్రాయపడియున్నారు. కాని బెజ్జరాలశాసనము మొదలగు శాసనమువలన నీతనిరాజ్యము గంజాముమండలము మొదలు నెల్లూరు వఱకును వ్యాపించి నట్లుగన్పట్టుచున్నది.

ఈ కుబ్జవిష్ణువర్ధనుఁడు యువరాజుగ నుండినప్పుడు సంస్కృతమున కిరాతార్జునీయ మను కావ్యమును రచించిన భారవిమహాకవియాతనికి మిత్రుఁడుగా నుండెనఁట. ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౬౧౫ మొదలు ౬౩౩ వఱకు నైయున్నది.

౨. జయసింహుఁడు — ఇతఁడు కుబ్జవిష్ణువర్ధనుని కొడుకు. ఇతని యొక్క పూర్తినామము పృథ్వీజయసింహవల్లభుఁడు. జయసింహులలో మొదటివాఁ డగుటచే నీతనిని మొదటిజయసింహుఁ డందురు. ఇతఁడు ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసెనని కొన్నిశాసనములలోను ౩౩ సంవత్సరములని కొన్నిటియందును కలదు. విశేషశాసనములలో ౩౩ అనియుండుటచే నీతనిరాజ్యకాలము ౩౩ అనియే చరిత్రకారులు నిశ్చయించియున్నారు. కావున నీతనిరాజ్యకాలము ౬౩౪ మొదలు ౬౬౬ వఱకు నైయున్నది. ఇతఁడు మిగుల పరాక్రమవంతుఁడై వేఁగిదేశమునఁ జాళుక్యరాజ్యమును స్థిరముగాఁ బాదుకొలిపి పిఠాపురమునకు దక్షిణమున నున్నప్రదేశమును కృష్ణానదికి దక్షిణముననున్న పల్లవరాజ్యమును జయించి వేఁగిరాజ్యములోఁ జేర్చెను. ఇతనికి సర్వసిద్ధి, కామధేను వను బిరుదులున్నవి. విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధియను పట్టణ మీతనిపేరుతోనే కట్టఁబడెనని చెప్పుదురు. కళింగగాంగులతో జరిగిన యుద్ధములలో పిఠాపురదుర్గమును, దక్షిణకళింగదేశమును ఈతని పరిపాలనమునుండి తొలఁగిపోయినను, దక్షిణప్రదేశము లీతనియధికారమునకు లోఁబడియుండెను. ఇతని శాసనములనుబట్టి మొత్తముమీఁద నిప్పటి యుభయగోదావరిమండలములును, కృష్ణాగుంటూరు మండలములును ఈతని పరిపాలనముక్రింద నుండెడివని చెప్పవచ్చును. అదివఱకు వేఁగిప్రభువులుగా నుండెడి విష్ణుకుండినుల నీతఁడు జయించెను. ఇతఁడు బహుశాస్త్రజ్ఞానపారీణుఁడు విద్వత్ప్రభువు. ఇతఁ డాంధ్రదేశమున అసనపుఘటికాస్థానమును స్థాపించి పేరుగాంచెను. ఘటికాస్థాన మనఁగా నిప్పటి విశ్వవిద్యాలయము వంటిదని చెప్పవచ్చును. శాస్త్రవిజ్ఞానమును నేర్పెడి విద్యాపీఠము లాకాలమున ఘటికాశాసన

ములని పిలువఁబడుచున్నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఈ ఘటికాస్థాన సభ్యుఁడగు కాటిశర్మకు గండేఱు వాటివిషయములోని సిడుంబఱ్ఱు అను గ్రామమును దానము చేసినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. గండేరువాడి విషయమని గుంటూరు మండలములో నింకొక భాగము పిలువఁబడుచుండెడిదనియు, గుంటూరు తాలూకాలో సిడవఱ్ఱు అనుగ్రామమే సిడుంబఱ్ఱు అనియుఁ జరిత్రకారులు నిర్ణయించియున్నారు (భారతిపత్రిక క్రోధన వైశాఖమాసము పుట ౯౦) అసనపుర వాస్తవ్యుఁడగు రుద్రశర్మకు పులింబూరు అను గ్రామమును దానమిచ్చియుండెను. ఈ పులింబూరు గోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకాలో 'పాలమూరు' అని యిప్పుడు పిలువఁబడుచున్నది ఇది గుద్దవాడి విషయములోనిది. (తామ్రశాసనములు ౭-౧౯ ౧౩ ౧౪) గుద్రహార విషయములోని వెణకపఱ్ఱు అను గ్రామమును బ్రాహ్మణుల కొసంగియుండెను. ఇది క్రీ శ. ౬౫౧వ సంవత్సరము నాటిది. మఱియు నీ రాజచంద్రుఁడు కొంబఱ్ఱు గ్రామదాన మొసంగినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. గుంటూరు మండలములోని నరసారావుపేట తాలూకా విప్పర్ల గ్రామమున నీతని శాసనమొకటి యాంధ్రభాషలో క్రీ॥ శ॥ ౬౪౧వ సంవత్సరమునాఁటిది గన్పట్టుచున్నది. ఆంధ్రభాషయందున్న శాసనములలో నిది మొదటిదనుచున్నారు విద్యాపీఠమును స్థాపించిన అసనగ్రామ మేదియో, ఏమండలములోనిదో యిప్పటివఱకును గుర్తింపఁబడలేదు. ఈ గ్రామము పేరి తని తమ్ముని కుమారుఁడైన రెండవ విష్ణువర్ధనుని శాసనములోఁగూడఁ జేర్పఁబడినది. ఈయసనపురము గోదావరిమండలములోని ద్రాక్షారామమునకు సమీపముననుండెడిదని కొన్నియాధారములనుబట్టి నాకుఁ బొడఁగట్టినది. కాని యిందు విషయమైన పరిశోధన మింకను గావలసియుండుటచే నిం దిప్పుడా విషయమునుగూర్చి యేమియు వ్రాయలేదు. గండేఱు విషయముకూడ గోదావరి మండలమందున్నదనియే తోఁచుచున్నది.

౩. ఇంద్రభట్టారకుఁడు:—జయసింహ మహారాజునకుఁ బుత్రసంతతి లేకపోవుటచే నీతని తరువాత నీతని సోదరుఁడయిన ఇంద్రభట్టారకుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతనికి ఇంద్రవర్మ మహారాజని పేరు. ఇతఁడేడు దినములు మాత్రమే రాజ్యముచేసెను. ఇతని తండ్రికాలములో శత్రువులుగానుండి యోడిపోయిన కళింగగాంగులు మొదలగువారేకమై యీతనిని సంహరించిరి. ఇతనికి త్యాగధేనువని బిరుదమున్నది. కాని యీతఁడు చేసిన ధర్మము లేవియుఁ గానుపింపవు. సోదరుని కాలములో నితఁడు ద్రవ్యమును విశేషముగా దానమొసంగి యుండుటచే నీతనికీ బిరుదము వచ్చియుండును. తండ్రి కామధేను బిరుదాంచితుఁడగుటచే నీతఁడు త్యాగధనుఁడను బిరుదమును దాల్చినైన నుండును. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడును, ఇజ్జలూరు బోయయను నామాంతరముగల దుర్గశర్మ పౌత్రుఁడునగు చెండిశర్మకు కొండనాగూరను గ్రామమును దానమిచ్చినట్లొక తామ్రశాసనమున్నది. (౧౮౧౧—౧౨ సం॥ రి. ౨) బోయశబ్దము భోగికశబ్దమునుండి వచ్చినది. ఇజ్జలూరు గ్రామము నగ్రహారముగాఁ గల్గియున్నవాఁడని యర్థమైయుండును. బోయ, బోయలు, అని యాకాలమున బ్రాహ్మణులు పిలువఁబడుచున్నట్లు శాసనములున్నవి. ఈ శాసనమునఁ గాల మీయఁబడలేదు. ఈ కొండనాగూరు కృష్ణా మండలములోని నూజివీడు తాలూకాలో నున్న ముసునూరు ప్రాంతమున నున్నట్లు తలఁపఁబడుచున్నది.

౪. రెండవ విష్ణువర్ధనుఁడు:— ఇతఁ డింద్రభట్టారకుని కుమారుఁడు. ఇతనికి విష్ణురాజని నామాంతరము కలదు. శాసనములను బట్టి యితనికి విషమసిద్ధి, ప్రళయాదిత్యుఁడు, మకరధ్వజుఁడు, సర్వలోకాశ్రయుఁ డనుబిరుదములు కలవనియుఁ దనపెదతండ్రియైన జయసింహవల్లభుఁడు సంపాదించిన రాజ్యమును నిలుపుటయే గాక కమ్మనాఁడు గుద్రహారవిషయములను సంపాదించి క్రీ. శ. ౬౬౩ మొదలు ౬౭౨ వఱకును తొమ్మిదివత్సరములవఱకు దక్షతతో రాజ్యపరిపాలనము చేసెననియుఁ దెలియుచున్నది. ఇతఁడు గొప్ప వితరణబుద్ధికలవాఁడు. ధర్మశాస్త్రపరి

జ్ఞాతి. ఇతఁడు రాజ్యమునకు రాకపూర్వమే పినతండ్రితోఁ గూడనుండి యుద్ధములలోఁ బాల్గొని మంచి పేరుగాంచి యుండెను. ఇతని కుమారుఁడైన మంగి యువరాజు శాసనములలో నితఁడు 'బహుసమరసంఘట్టోపలబ్ధ విజయయశః ప్రసూనామోద గంధాధివాసిత సకలదిఙ్మండలుఁ డనియు. నానాశాస్త్రాభ్యాసోప బృంహితవిమల విశాల బుద్ధియనియు, త్యాగౌదార్యధైర్యశౌర్యాది గుణాలంకృతుఁ డనియు వర్ణింపఁబడి యున్నాఁడు.

ఇతఁడు "అసనపుర వాస్తవ్యుఁడును తైత్తిరీయ సబ్రహ్మచారియుఁ గశ్యపగోత్రుఁడును, వేదవేదాంగేతిహాస పురాణన్యాయానేక ధర్మశాస్త్ర విదుఁడును, అగ్నిష్టోమాది పౌండరీక పర్యంతానేక క్రతుయష్టృవునైన ధృవశర్మ పౌత్రుఁడును దోచిశర్మ పుత్రుఁడును, నధీత వేదద్వయుండునగు ధృవశర్మకు గుద్రహార విషయములోని పట్టివాడలోఁ గొంతభూమిని దానము చేసి యుండెను." ఇతఁడు పరమమాహేశ్వరుఁ డని యొక శాసనములో వర్ణింపఁ బడియుండుటచే నీతఁడు శైవుఁడని యూహింపఁ దగియున్నది. పరమ మాహేశ్వర బిరుదమును వహించిన వారు తూర్పు చాళుక్యులలో మఱికొంద రున్నారు. ఇతని శాసనములు గుంటూరు నెల్లూరు మండలములలో గాన్పించుచున్నవి. ఇతఁడు కర్మరాష్ట్రమునందలి రేయూరు గ్రామమును దానము చేసియుండెను.

౫. మంగియువరాజు:— రెండవ విష్ణువర్ధనుని కుమారుఁ డగు నితనికి మంగివర్మ, మంగిమహారాజు, మంగియువరాజు, విజయాదిత్యుఁడు అని నామాంతరములును విజయసిద్ధి సర్వలోకాశ్రయుఁడు, సమస్తభువనాశ్రయుఁడు నను బిరుదములును కలవు. తండ్రికంటె నధికముగ సకలగుణశక్తిసంపన్నుఁడై విశాఖపట్టణమండలము మొదలు నెల్లూరు వఱకును గల దేశమునకు ప్రభువై పరిపాలన మొనర్చినట్లు క్రిందిశాసనముల వలనఁ దెలియవచ్చుచున్నది.

(క) నూతులపల్లి శాసనము (ఇండియను ఆంటిక్వెరీ ౨౦ వ సంపుటము ౧౦౫ పుట)

(చ) చెండలూరు శాసనము (ఎపిగ్రాపియా యిండికా 8వ సంపుటము)

(ట) విశాఖపట్టణ మండలములోని తిమ్మాపుర శాసనము (A.R. 1907-1908)

(త) ఏడవాడలపాలెము శాసనము : (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 4వ సంపుటము) ఇది బెజవాడనుండి పుట్టబడినది. వాగురాష్ట్రవిషయములోని బొండాడవర్తి యను గ్రామములోని రెండు నివర్తనల భూమిని అథర్వశాఖాధ్యాయులును కౌశికగోత్రులును జీవశర్మపౌత్రులును దాచశర్మపుత్రులునగు ముగ్గురు బ్రాహ్మణులకు దానమిచ్చినట్లిందు చెప్పబడినది నూతులపల్లి, చెండలూరు గ్రామములు రెండును కమ్మనాటిలోనివి. ఇవి యిప్పటికి గుంటూరు మండలములోనివై యున్నవి

(ప) లక్ష్మీపుర శాసనము (భారతి, విభవ సం॥ర పుష్యమాసము సం ౫ భా ౧ పుట ౯౩౫.) ఇందు మంగియువరాజు పేరుదాహరింపబడినది. దానకర్త విక్రమాజు. మంగియువరాజుయొక్క శాసనములు మఱికొన్ని గలవు. ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౬౭౬ మొదలు ౭౦౦ వఱకు నిరువదియైదు సంవత్సరములు.

౬. రెండవ విజయసింహుడు:— ఇతడు మంగియువరాజునకు మొదటిభార్య కుమారుడు. ౧౩ సంవత్సరములు సింహాసనమునందున్నవాడు. ఇతనికి సర్వసిద్ధి సర్వలోకాశ్రయ బిరుదములు కలవు ఇతని కాలమున బాదామి చాళుక్యులకును కాంచీపుర పల్లవులకును పోరాటములు సాగుచున్నను నవి వేంగిదేశమునకు వ్యాపింపలేదు. ఇతని కాలమునందే మహామ్మదీయులు ప్రథమమున హిందూదేశముపై దండెత్తివచ్చిరని యందురు. ఇతని రాజ్యకాలము క్రీ శ. ౭౦౧ మొదలు ౭౧౩ వఱకునైయున్నది. పెనుకపల్లి శాసనము, విప్పర్ల చెరువు శాసనమునను రెండు శాసనము లీతనివి కన్పట్టుచున్నవి.

౭. కొక్కిలి:—ఇతనికి కోకిలవర్మయనియు, విక్రమాదిత్యభట్టారకుఁ డనియు, నామాంతరములు. మంగియువరాజునకు రెండవభార్య వలన కలిగిన కుమారుఁడు. మంగియువరాజునకుఁ బైఁ జెప్పిన రెండవ జయసింహుఁడు గాక విష్ణువర్ధనుఁడను మఱియొక కుమారుఁడున్నాఁడు. రెండవ జయసింహునకుఁ బుత్రసంతానము లేకపోవుటచే నాతని తరువాత నాతని సోదరుఁడైన విష్ణువర్ధనునకు రాజ్యము రావలసి యుండఁగా నీ కొక్కిలి కాంచీపుర పల్లవరాజులైన రెండవ నరసింహవర్మ యొక్కయు, నీతని తనయుఁడైన పరమేశ్వరవర్మ యొక్కయు సాహాయ్యమున నక్రమముగా వేఁగిసింహాసనము నాక్రమించుకొని ౬ మాసములు క్రీ. శ. ౭౦౯వ సంవత్సరములో రాజ్యపాలనము చేసెను. ఇంతలో పల్లవులలో నంతఃకలహములు వచ్చుటచే వారిసాహాయ్యము కొక్కిలికిలభింపదయ్యెను. ఆసమయమును గనిపెట్టి బలవంతుఁడైన విష్ణువర్ధనుఁ డీతనిని జయించి సింహాసనము నధిష్ఠించెను.

౮. మూఁడవ విష్ణువర్ధఁడు:— ఇతఁడు మంగి యువ రాజు యొక్క రెండవ కుమారుఁడు. రెండవ జయసింహుని తమ్ముఁడు. అక్రమముగా రాజ్యమాక్రమించుకొనిన కొక్కిలిని జయించి రాజ్యమును స్వాధీనము చేసికొని యితఁడు వేఁగిరాజ్యమును నిష్కంటకముగాఁ బరిపాలించి యనేక ధర్మకార్యములు గావించెను. ఇతని కాలములో నాంధ్రదేశమున జైనమతము వ్యాపించియుండెను. ఈ రాజచంద్రుఁ డుభయమతముల యందును సమబుద్ధి కలవాఁడై జైనుల యాలయములను బ్రాహ్మణాలయములను గూడ బోషించెను. ఈతని శాసనములు పెక్కులు కలవు.

1 పసపుంబఱ్ఱు శాసనము C. P 9 of 1913–14 A. R.
2 మావిండిపల్లి శాసనము C. P 3 of 1914–15 A. R.
3 చుసినికుండ శాసనము C. P 9 of 1916–17 A. R.
4 జలమూరు శాసనము C. P 10 of 1919–20 A. R.

ఎ ఇం. సం. ౧౮ పుట ౫౮.

5 పెద్దమంచిలి శాసనము C. P 6 of 1913-14
6 రెండుబళ్ళిశాసనము C. P 2 of 1914-15
7 C. P 4 of 1924-25 భారతి రక్తాక్షి
సం॥ మార్గశిర మాసము.

ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౭౧౪ మొదలు ౭౫౦ వఱకు ముప్పదియేడు సంవత్సరములని చెప్పవచ్చును. పండితులదృష్టి నాకర్షించిన అహదనకర శాసన మీతనిదని కొందఱును, ఐదవవిష్ణువర్ధనునిదని కొందఱు నభిప్రాయము నొసంగియున్నారు.

౯. మొదటి విజయాదిత్యుఁడు:— ఇతఁడు మూఁడవ విష్ణువర్ధనుని కుమారుఁడు ఈతఁడు మొదలుగా విజయాదిత్యనామమును ధరించిన వారింకను గొంద ఱుండుటచే నీతనిని చరిత్రకారులు మొదటి విజయాదిత్యుఁడని పిలుచుచున్నారు. ఇతఁడు క్రీ. శ. ౭౫౧ మొదలు ౭౬౮ వఱకు ౧౮ సంవత్సరములు రాజ్యము చేసెను. ఇతని పరిపాలనము క్రీ. శ ౭౪౬ మొదలు ౭౬౮ వఱకునని కొందఱును ౭౫౧ మొదలు ౭౭౦ వఱకునని కొందఱును చరిత్రకారు లనుచున్నారు. ఎట్లయినను నితఁడు రాజ్యముచేసిన కాలము ౧౮ సంవత్సరములు. ఇతనికి విజయాదిత్య భట్టారకుఁడని నామాంతర మున్నది. మఱియు త్రిభువనాంకుశ, విక్రమరామ, విజయసిద్ధి బిరుదములుకూడ కలవు. త్రిభువనాంకుశ బిరుదనామమును దాల్చుట కీతఁడే మొదటివాఁడు. ఈతని తరువాతివారీ బిరుదమును వంశపరంపరగా వహించుచు వచ్చిరి. ఇతని కాలములో రాష్ట్రకూటులు వేఁగిదేశమును జయింపవలయునని ప్రయత్నించిరి. కాని యది సాధ్యముకాలేదు.

౧౦. నాల్గవ విష్ణువర్ధనుఁడు:— ఇతఁడు మొదటి విజయాదిత్యుని కుమారుఁడు. వేఁగిదేశమున కుబ్జవిష్ణువర్ధను నాఁటి నుండియు చాళుక్యులక్రింద నున్నను, విష్ణుకుండినులు మొదలగువారిచే నడుమ నడుమ నాటంకములు గల్పింపఁ బడుచుండెను. ఈ నాల్గవ విష్ణువర్ధనుని

కాలమునాఁటికి వేఁగిరాజ్యమునఁ దూర్పుచాళుక్యులు స్థిరముగఁ బొందు కొనిరి. గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనము (భారతి సం ౧ సం ౧ పుట ౭౦)లో నీ నాల్గవ విష్ణువర్ధనుఁడు వేఁగి పండ్రెండువేల దేశమును బరిపాలించినట్లు "తస్యతనయః విష్ణువర్ధనః పంచత్రింశ ద్వర్షాణి ద్వాదశసహస్ర వేంగిమండల మన్వపాలయత్" అని చెప్పఁబడినది.

ఈతని కాలములో రాష్ట్రకూట రాజులలో నంతఃకలహములు సంభవించెననియు నందు గోవిందరాజును నతఁడు వేఁగిదేశాధిపతి సాయము నభిలషించెననియు నొకశాసనమునఁ జెప్పఁబడినది. (ఎపిగ్రాఫియా యిండికా సం ౫ పుట ౧౦౪.)

ఇతనికి విజయాదిత్యుఁడును భీమసల్కియను నామాంతరము గల చాళుక్యభీముఁడు నను నిరువురు కుమారులు కలరు. ఈ నాల్గవ విష్ణువర్ధనుఁడు కాలచుర్య వంశములోని త్రిపురాధీశ్వరుని కుమార్తెను బరిణయ మాడెననియు నామెకు నృపరుద్రుఁడను మఱియొక కుమారుఁడు జన్మించెననియుఁ జెప్పుచున్నారు.

ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౭౬౮ మొదలు ౮౦౩ వఱకు ముప్పదియైదు సంవత్సరములు.

౧౧. రెండవ విజయాదిత్యుఁడు:— ఇతఁడు నాల్గవ విష్ణువర్ధనుని కుమారుఁడు. ఇతనికిఁ గల బిరుదములలో నరేంద్రమృగరాజను నది ప్రధానమయినది. ఇతని తరువాతి వారిశాసనములలో నీతనిని నరేంద్రమృగరాజనియే వ్రాయుచువచ్చిరి. ఈతనికి మహారాజాధిరాజు, సమస్తభువనాశ్రయుఁడు, చాళుక్యార్జున భూపాలుఁడు, త్రిభువనాంకుశుఁడు, రాజపరమేశ్వరుఁడు, విక్రమధవళుఁడు నను బిరుదములు కలవు. ఈతని తండ్రియనంతరము, వేంగీచాళుక్య సింహాసనమునకై యీతని సోదరుఁడైనభీమసల్కి యనునాతనితో పోరాడెను. రాష్ట్రకూట రాజగు గోవిందుఁడును, ఆతనిసామంతులగు మైసూరు దక్షిణగాంగులును భీమసల్కికి సాహాయ్యము చేసిరి. హైహయవంశజుఁడును, పినతల్లి

కుమారుఁడు నైన నృపరుద్రుఁడు విజయాదిత్యుని పక్షమున నుండెను. ఈ యుద్ధము ఒకటి రెండు కాదు పండ్రెండేండ్లు జరిగినది. ఒకప్పుడు భీమసలికి జయించి వేఁగిసి పోసనమును నాక్రమించుకొనినను, ఈ రెండవ విజయాదిత్యుఁడు తనపట్టుదలను వీడక ద్విగుణీకృతోత్సాహముతో రణమొనర్చి పండ్రెండేండ్లలోను ౧౦౮ యుద్ధములుచేసి, సోదరుని రాష్ట్రకూటులను గాంగులను జయించి నిష్కంటకముగా రాజ్యమేలెను. పండ్రెండేండ్లు యుద్ధములతో గడచినను మిగిలిన కాలములోఁ బ్రజానురంజకముగా ధర్మమూర్తియై రాజ్యపాలన మొనర్చెను. ఈతఁ డొనర్చిన ౧౦౮ యుద్ధములలోను జరిగిన ప్రజాసంహారాదిపాపనాశనమునకై ౧౦౮ శివాలయములను నిర్మించి, అనేకాగ్రహారముల నొసంగి యనేకతటాకారామాదులను బ్రతిష్ఠించెను. పెక్కుసారులు తులాభారమును దూగి యా వెండిబంగారములను పేదల కొసంగి కీర్తి వడసెను. ఈ విజయాదిత్యుఁడు రాజనీతివిద్యావిశారదుఁడు. యుద్ధవిద్యానిపుణుఁడు చతురుపాయరహస్యవేది. ధర్మాధర్మవిజ్ఞాని. పాపభీతి కలవాఁడు. ఈతని కీర్తి నీతనితరువాతిరాజులు తమశాసనములలోఁ మిక్కిలిగాఁ గొనియాడియున్నారు. మచ్చునకు గుణగ విజయాదిత్యుని యురుటూరి శాసనములోని వాక్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. "తస్యప్రియతనయః విజయాదిత్యః అష్టోత్తరంయుద్ధశతం జిత్వా లబ్ధయశోజయః చాళుక్యార్జునభూపాలో రాజాచాళుక్యవంశజః నరేంద్రమృగరాజ శ్రీ విజయాదిత్యభూపతిః త్యాగీ భోగీ యోగీ నిత్యం సత్యాశ్రయాన్వయః అష్టోత్తర యుద్ధశతంయుద్ధ్వా తత్పాపనుత్తయేతత్ యుద్ధప్రదేశేషు వేంగీదేశే సమస్తతః అగ్రహార ప్రపారామ తటాకోపవనానిచ నరేంద్రేశ్వర నామాని సేశ్వరాయతనానిచ సనృత్తగీతసత్రాణి చాష్టోత్తర శతానియః కృతవాన్సదా భాతిభూతలేఖ్యాతసాహసః॥"

ఈ రాజసింహుఁడు వేదవేదాంగపారగు లయినయిరువది నలుగురు బ్రాహ్మణులకు 'కొట్టుపట్టు' అనుగ్రామమును చంద్రగ్రహణనిమిత్తమున దానమిచ్చినట్లు వ్రాయించిన యొక శిలాశాసనము (ద.

హి. శా. స॥ ౧ పుట ౩౧'లోఁ బైని జెప్పిన యీతని సుగుణము లన్నియు వర్ణింపఁబడియున్నవి. గ్రంథవిస్తరభయమున నాశ్లోకముల నిట వ్రాయలేదు.

ఈతని రాజ్యకాలము క్రీ. శ ౮౦౪ మొదలు ౮౪౮ వఱకును నలువదినాల్గు సంవత్సరములు.

౧౨. కలివిష్ణువర్ధనుఁడు:— ఇతఁడు నరేంద్రమృగరాజని బిరుదమును వహించిన రెండవ విజయాదిత్యుని కుమారుఁడు. తూర్పు చాళుక్యరాజులలో విష్ణువర్ధననామమును వహించినవారియం దీతఁ డైదవవాఁ డగుటచే నితని కైదవవిష్ణువర్ధనుఁ డనియు, సమస్తాయుధముల చేతను యుద్ధమొనర్పు నేర్పు కలవాఁ డగుటచేఁ గలివిష్ణువర్ధనుఁ డనియు నీతనికి నామాంతరములు. ఇతనికిఁ సర్వలోకాశ్రయుఁడు, విషమసిద్ధి, పరమమాహేశ్వరుఁ డను బిరుదములు కలవు. ఇతఁడు తండ్రితోఁ గూడ నుండి యాతఁడొనర్చిన యుద్ధములలోఁ బాల్గొని యుండెను. ఈతనిభార్య రాష్ట్రకూటాన్వయసంజాత యగు శీలాదేవి. ఈమె గోవిందరాజుయొక్కగాని, అమోఘవర్షుని యొక్కగాని కుమార్తె యైయుండ వచ్చునని చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని యీమె, ఇంద్రభట్టారకుని కుమార్తె యైనట్లు గుణగవిజయాదిత్యుని యరుటూరి శాసనమును బట్టి తెలియుచున్నది. రాష్ట్రకూటులలో యింద్రభట్టారకులు ముగ్గురున్నారు. మూఁడవ యింద్రభట్టారకుఁడు శా. శ. ౮౪౨ ప్రాంతము వాఁడు. కావున నాతఁ డీశీలమ తండ్రి కాఁడు. మొదటి యింద్రభట్టారకుఁడో రెండవవాఁడో యై యుండును. శీలాదేవిభట్టారిక యను పేరుగలయొక సంస్కృతకవయిత్రి కలదు. ఆమె యీమే యేమో యని సంశయము కలుగుచున్నది. భావిపరిశోధనమువలనఁ గాని సత్య మెఱుంగరాదు.

ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౮౪౮వ సంవత్సర మొక్కటియే.

౧౩. గుణగవిజయాదిత్యుఁడు:— ఇతఁడు కలివిష్ణువర్ధనుని కుమారుఁడు. విజయాదిత్యులలో మూఁడవవాఁ డగుటచే నీతనిని

మూఁడవ విజయాదిత్యుఁ డందురు. ఇతనికి గుణాంక విజయాదిత్యుఁ డనియు, గుణగాంకవిజయాదిత్యుఁ డనియు నామాంతరములు. గణకా దిత్యుఁ డని యాంధ్రకవులచరిత్రము నందున్నది. గణక శబ్దమునుబట్టి కాఁబోలు నీతఁడు గణితశాస్త్రమునఁ బండితుఁ డని వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. కాని యందులకాధారము నాకుఁ గనపడలేదు. ఇతనికి సమస్తభువనాశ్రయుఁడు, రణరంగశూద్రకుఁడు, విక్రమధవళుఁడు, పరచక్రరాముఁడు త్రిభువనాంకుశుఁడు, నృపతి మార్తాండుఁడు, బిరుదాంకభీముఁడు మొదలగు నెన్నియో బిరుదములు కలవు. ఇతఁడు మిగుల పరాక్రమవంతుఁడై యనేకదేశములను జయించి నలువదినాల్గు సంవత్సరములు లేకచ్ఛత్రముగా క్రీ శ. ౮౫౫ వ సం॥ వఱకు వేఁగిదేశమును బరిపాలించెను.

ఇతఁడు రాష్ట్రకూటాధిపతి యగు రెండవకృష్ణునితో యుద్ధము చేసి యాతని నోడించి యాతని రాజధానీనగర మగు మాల్యఖేతము (నిజామురాష్ట్రములోని మాలెఖేడ్)ను దగ్ధముగావించి కృష్ణపురదహన విఖ్యాతకీర్తివంతుఁడని యతని వారిచే శ్లాఘింపఁ బడియెను.

ఉప్పుటూరు వాస్తవ్యుఁడును, ఆపస్తంబసూత్రుఁడును కౌశిక గోత్రుఁడును, దామోదరశర్మ పుత్రుఁడు నగు వినయశర్మ యొసంగిన యద్భుతాదేశము ననుసరించి నోడంబరాష్ట్రాధిపతిని జయించి నోడం బుల నోడించి యాసంతోషముచే నావినయశర్మకు గుద్రహారవిషయము (కృష్ణామండలములోని గుడివాడ ప్రాంతము) లోని ట్రంగపట్టు అను గ్రామమును దాన మొసంగెను.

మఱియు నీతఁడు గుద్రహార విషయమందలి 'ఉరువుటూరు' అనుగ్రామమును (కృష్ణామండలములో గుడివాడ తాలూకా యందు పామఱ్ఱు గ్రామముయొక్క ప్రక్కనున్న ఉరుటూరు) పదునలుగురు బ్రాహ్మణులకు దానము చేసినట్లొక శాసనము (ఆంధ్రసాహిత్యపరిషత్ప త్రిక సం॥ ౧ పుట ౧౮౦) వలనఁ దెలియుచున్నది. ఈ శాసనము

లోని "యస్యచ మాతా రాష్ట్రకూటాధిప స్యేన్ద్ర భట్టారకస్యహిమవతో భవా నీవ పితుః భూదరమాన్యతాం జనయన్తీ జలధేర్లక్ష్మీరివ జనకా త్సీతేవ గుణాన్వితత్వా చ్ఛీలకే త్యన్వర్థిక ద్యజని "అను వాక్యములవలన రాష్ట్రకూట రాజయిన, యింద్రభట్టారకునికుమార్తెయగు 'శీలమ' యీ గుణగ విజయాదిత్యుని తల్లియైనట్లు తెలియుచున్నది. ఈతని తండ్రి కాలమునాఁటికి రాష్ట్రకూటులతోఁ దూర్పు చాళుక్యులకు వైరము మాసిపోయియుండునని యూహింపఁ దగియున్నది. ఈశాసనమున పాండురంగడు. ఆజ్ఞప్తియని యుదాహరింపఁ బడియున్నది. ఈపాండు రంగనితండ్రి కడియరాజు, ఈతనిని సాహాయ్యముగాఁ గొని గుణకవిజ యాదిత్యుఁడు బోయరాజుల యెల్లగుల నణఁచి వేసెను. వారితో జరి గిన యుద్ధమున నీకడియరాజు నిహతుఁ డయ్యెను. ఆతనియందుఁ గల యనురాగమునుబట్టి యాతని కుమారుఁ డైన పాండురంగని సైన్యాధిపతిగ నియమించెను. పాండురంగఁడును తండ్రిని మించిన పరాక్రమవంతుఁడును, స్వామిభక్తి పరాయణుఁడు నై యనేక యుద్ధ ములలో గుణగ విజయాదిత్యునకు జయము గల్గించెను. ఈ విషయ ములు పాండురంగని శాసనములయందుఁ జెప్పఁబడి యున్నది.

కడియరాజు కుమారుఁ డైన పాండురంగనిశాసనములు నెల్లూరు మండలమున అడ్డంకియం దొకటియు, కందుకూరు నందొకటియు నున్నవి. (నె, శా. సం. పుటలు ౯౮౬—౫౭౭) ఇవి పద్యాత్మకములని సుప్రసిద్ధ చరిత్రకారులగు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు గుర్తించియున్నారు. దీనినిబట్టి నన్నయకు దాదాపు ౨౦౦ సంవత్సర ములకుఁ బూర్వమే ఆంధ్రమునఁ బద్యకవిత్వ మున్నదని తేటపడుచున్నది. నన్నయకుఁ బూర్వమొక యాంధ్ర ఛందస్సుకూడ కలదని పండిత రాఘ వయ్యంగారనుచున్నారు. కడియరాజు శాసనమొకటి కలదు. (భారతి సం. ౫ భా. ౧ పు. ౬౧౮) దీనిని ధర్మవరశాసనమందురు. ఇం దీతఁడు విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమాణుఁ డని వర్ణింపఁబడినది.

ఈ మూఁడవ విజయాదిత్యుఁడు రాజాదిత్యాది బ్రాహ్మణు లయిదుగురికి సీసలి (పశ్చిమ గోదావరి మండలములోని భీమవరం తాలూకాయందున్నది.) గ్రామమును దానముగా నిచ్చి యుండెను. (వ్యయ సం॥ వైశాఖము. భారతి)

మొదటి చాళుక్య భీముఁడు.— ఈతని తరువాత నింక నొక భీముఁ డుండుటచే నీతనిని మొదటి చాళుక్య భీముఁ డందురు. ఇతఁడు గుణగ విజయాదిత్యుని తమ్ముఁడైన విక్రమాదిత్యుని కుమారుఁడు. ఇతని తల్లి వెంగాంబ. ఇతని తండ్రి రాజ్యము చేయలేదు. పెదతండ్రి యనంతర మీతఁడు వేఁగి సింహాసన మధిరోహించి ముప్పది సంవత్సరములు రాజ్య మేలెను. కొందఱితని రాజ్యకాల మిరువదియాఱేండ్లందురు. ఈతని పెదతండ్రియైన గుణగ విజయాదిత్యుఁడు, రాష్ట్రకూట రాజయిన కృష్ణభూపతిని జయించి యాతని పురమును దగులఁబెట్టి కృష్ణపురదహన విఖ్యాతినిబొంది యుండెనని పైని వ్రాయఁబడినది. ఆ పూర్వవైరమును మనసునం దుంచుకొని యా కృష్ణభూపతి గుణగ విజయాదిత్యుని యనంతరము వేఁగి దేశముపై దండెత్తిరాఁగా పరాక్రమవంతుఁడైన భీమ భూపతి యాతనితో ఘోరయుద్ధ మొనర్చి రాష్ట్రకూటులను వేఁగిదేశమునుండి వెడలఁద్రోలి నిష్కంటకముగా రాజ్య మేలెను. అంతకుఁ బూర్వమే తనకు విరోధులైన దాయాదుల నందఱిని జయించి యుండెను. రాష్ట్రకూటులతోఁ జేసిన యుద్ధములలో నీతని సవతి తోబుట్టువయిన గామకాంబ కుమారుఁడగు మహా కాలుఁ డనువాఁడు సైన్యాధిపతియై సేనలను నడిపించి జయముగాంచె నఁట! గామకాంబ సవతి తోబుట్టువు కాదనియు, చాళుక్యభీముని పెంపుడు తల్లియైన నాగిపోతి కుమార్తె యనియు, నొకశాసనమునం దున్నది. (ఎపి ఇం. సం॥ ౫ పు. ౧౩౭) ౧౬ ఏండ్లు వయసుగల నీతని తనయుఁడు నిరవద్యపురము కడను పెదవంగూరు గ్రామమువొద్దను జరిగిన యుద్ధములలో పాల్గొని రాష్ట్రకూట సేనాపతి దండెనగుండయను జంపి తాను గూడ నచటనే నిహతుండయ్యెను. ఈతని కశింకోట శాసనమునుబట్టి

వేఁగిదేశమే కాకుండ ఎలమంచిలి రాజధానిగాగల కళింగమును దేవ రాష్ట్రమును (విశాఖపట్టణ మండలము లోనిది) నీతని స్వాధీనమునం దున్నట్లు గన్పట్టుచున్నది.

ఈ చాళుక్య భీముఁడు కౌండిన్య గోత్రుఁడును ద్రోణ భట్టు పుత్రుఁడును దేవమయ్య పౌత్రుఁడును, నగు పోతమయ్యకు ఉత్తర కండేరువాడి విషయములోని సూకిపఱ్ఱును తన పట్టాభిషేక కాలమున నగ్రహారముగా నిచ్చి శాసనము వ్రాయించెను. (ఎపిగ్రాఫియాఇండికా సం ౫ పేజి ౧౨౭) మొట్టమొదట చాళుక్యరాజుల పరిపాలనా కాలమును దెలిసిన దీశాసనమే. ఈతనికి విష్ణువర్ధనుఁ డని నామాంతర మున్నట్లీ శాసనము చెప్పుచున్నది. ద్రోహార్జునుఁ డను బిరుదమున్నది. ఈతనికి విష్ణువర్ధనుఁడని నామాంత్రమున్నను విష్ణువర్ధనులను లెక్కించుటలో కొందఱు చరిత్రకారు లీతనినిఁ జేర్చుకొనలేదు. కొందఱితనిని నాలవవిష్ణువర్ధనుఁ డని చేర్చుకొన్నారు. నేనిం దీతనిని విష్ణువర్ధనునిగా లెక్కింపలేదు. ఇంతటనుండి విష్ణువర్ధన సంఖ్యలోఁ గొందఱితో భేదము గన్పడుచుండును. ఈతని అత్తిలితామ్ర శాసనము (ఆ. సా. ప. సం. ౧౧ సం ఉపుట ౩౨౧)ను బట్టి యీతని పట్టాభిషేకము శాలివాహనశకము ౮౧౪ సం॥ ఏప్రియులు ౧౬వ తేదీ యని తెలియుచున్నది. కుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలుగా రాజ్యమేలిన రాజుల రాజ్య సంవత్సరములనుబట్టి చూడఁగా నీ పట్టాభిషేక కాలమును ఆయా రాజుల పరిపాలనా కాలములును ఒక నెల యిరువది దినములు తక్కువగా సరిపోయినవి.

ఈ చాళుక్య భీముని కాలములో పాండురంగని శాసన మొకటి (ధర్మవరము శాసనము) కనఁబడుచున్నది. ఇతఁడు, గుణగ విజయాదిత్యుని కాలములో నున్న పాండురంగుఁడై యుండునని తోఁచుచున్నది. ఈ చాళుక్యభీముని బెజవాడ తామ్ర శాసనములో పాండురంగుని మనుమఁడైన కాడెయరాజు ఆజ్ఞప్తిగాఁ గనుబడుచున్నాఁడు. ఈయిరువురు పాండురంగులు నొక్కరగుదురో కాదో తెలియదు. తాతయు మనుమఁడు నొక్క రాజు కాలములో నుండుట సంభవమేనా! యని యనుమానము కలుగుచున్నది.

(౧౫) నాల్గవ విజయాదిత్యుఁడు:— ఇతఁడు మొదటిచాళుక్య భీముని పెద్ద కుమారుఁడు. ఇతనికి కొల్లభిగండ భాస్కర విజయాదిత్యుఁడని బిరుద మున్నది. ఇతఁ డాఱుమాసములు మాత్రమే రాజ్యము చేసెను. కళింగమును గూడ జయించి కళింగవేఁగి మండలములను బరిపాలించెను. ఇతని దానశాసనము లేవియుఁ గాన్పించుట లేదు.

(౧౬) అమ్మరాజ విష్ణువర్ధనుఁడు:— ఇతనికిఁ బిమ్మట నింక నొక యమ్మరాజుండుటచే నీతనిని మొదటి యమ్మరాజనియు, విష్ణువర్ధన నామధారులలో నీతఁ డాఱవవాఁ డగుటచే నాఱవ విష్ణువర్ధనుఁ డనియు చరిత్రకారు లనియెదరు. కొందఱీతని నేడవ విష్ణువర్ధనుఁ డనెదరు. ఇతనికి సర్వలోకాశ్రయుఁ డనియు, రాజమహేంద్రుఁ డనియు బిరుదులు కలవు. వేఁగిదేశమునకు మొట్టమొదట రాజమహేంద్రవరమును రాజధానిగాఁ జేసి పరిపాలించిన వాఁ డీతఁడే యగుటచే నీతనికి రాజమహేంద్రుఁ డని బిరుదము వచ్చె నందురు. ఇతని రాజ్యప్రారంభకాలమున దాయాదులు కొందఱు రాష్ట్రకూటరాజులతోఁ జేరి కుట్రపన్ని యీతనిని పదభ్రష్టునిఁ జేయఁజూచిరి. కాని వివేకవంతుఁడును బరాక్రమశాలియు నగు నీయమ్మరాజు సమయమున మేల్కాంచి శత్రువుల నణఁచివేసి రాజ్యమును నిష్కంటకముగాఁ జేసికొనియెను. తండ్రి కాలమునుండియు సైన్యాధిపతిగా నుండి విశ్వాసపాత్రుఁడైన భండరాదిత్యునకుఁ గాండేరువాడి విషయములోని గొంటూరు గ్రామమును దాన మొసంగెను. ఇతని రాజ్యకాలము క్రీ. శ. ౯౧౮ మొదలు ౯౨౫ వఱకు నేడుసంవత్సరములు.

(౧౭) అయిదవ విజయాదిత్యుఁడు:— ఇతఁడు మొదటిఅమ్మరాజవిష్ణువర్ధనుని కొడుకు. అమ్మరాజుకాలములోనే దాయాదులలో నంతఃకలహములు బయలుదేరి రాజ్యమునకై పోరాడ నారంభించిరి, కాని యాతఁడు బలవంతుఁడును, ఉపాయశాలియు నగుటచే వారి యాటలు కొనసాగినవి కావు. ఆతఁడు చనిపోయిన పిమ్మట నాకల

హములు మరల తలచూపినవి. ఈ విజయాదిత్యుఁ డసమర్థుఁ డగుటచే నా కలహముల నడఁపలేకపోయెను. ఈతని పరిపాలనము పదునైదు దినములు మాత్రమే జరిగెను. ఇంతలో గుణగ విజయాదిత్యుని కనిష్ఠసోదరుఁ డైన యుద్ధమల్లుని కొడుకగు తాళపరాజనువాఁ డీతనిని బదభ్రష్టుని గావించి చెఱలో నుంచి తాను సింహాసన మెక్కెను. అటుపిమ్మట మరల నాసింహాసన మీవిజయాదిత్యుని వంశములోనికి రాలేదు. ఇతనికి బేటరాజని నామాంతరము కలదు. అందుచే నితనిని బేట విజయాదిత్యుఁ డందురు. ఈ బేటవిజయాదిత్యుని వంశములోఁ గొందఱు పిఠాపురము రాజధానిగా గొంత దేశమును బరిపాలించి నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. (ఎపిగ్రాఫియా ఇండికా సం. ౪ పుట ౨౨౭)

ఆ రాజులను గూర్చి వ్రాయుట కిట తావు చాలదు. వారి వంశవృక్షమును మాత్రము మీక్రింద నిచ్చుచున్నాడను.



(౧౮) తాలపదేవుఁడు:— ఇతనికి తాడప రాజని, తాలరాజని నామాంతరములు. గుణగవిజయాదిత్యుఁ డీతనికి పెదతండ్రి. మొదటి అమ్మరాజుకుమారుఁ డైన విజయాదిత్యుని చెఱయందుంచి యీతఁడు వేఁగిరాజ్యము నాక్రమించెనని పైని వ్రాసియుంటిమి. ఈతఁడొక నెలదినములు మాత్రమే రాజ్యము చేసెను. ఇంతలో నీతని పెదతండ్రి మనుమఁడును, మొదటి చాళుక్యభీముని రెండవ కుమారుఁడును, కొల్లభిగండ విజయాదిత్యుని సోదరుఁడు నగు విక్రమాదిత్యుఁ డీ తాళరాజును జంపి చాళుక్యసింహాసన మాక్రమించుకొనియెను. కొన్నిదినములు మాత్రమే రాజ్యభారమును వహించినవాఁ డగుటచే నీ తాలపరాజునుగూర్చి వ్రాయఁదగిన విశేషములు లేవు.

(౧౯) విక్రమాదిత్యుఁడు:—ఇతఁడు మొదటి చాళుక్యభీముని కుమారుఁడు. కొల్లభిగండ విజయాదిత్యుని సోదరుఁడు. ఇతఁడు పైని జెప్పిన తాళరాజును సంహరించి, వేఁగిరాజ్యమును గ్రహించి పదకొండు నెలలు మాత్రమే రాజ్యమేలెను. స్వల్పకాలము మాత్రమే సింహాసనమునందున్న యీతనిని గుఱించి చెప్పఁదగిన వృత్తాంత మేదియుఁ గానిపింపదు.

(౨౦) భీముఁడు:— ఇతఁడు మొదటి అమ్మరాజు యొక్క రెండవ కుమారుఁడు. బేట విజయాదిత్యుని తమ్ముఁడు. ఇతఁడు తన పినతాత యైన విక్రమాదిత్యుని జయించి, రాజ్యమును గైకొనెను. ఇతఁడు రెండు నెలలు మాత్రమే రాజ్యముచేయుటచే నీతనిని గూర్చి కూడఁ జెప్పవలసిన విశేషాంశములులేవు అన్యోన్యకలహములచే వేఁగిరాజ్యమున రెండు సంవత్సరములలో పలుగురు రాజులు రాజ్యము చేసిరి

(౨౧) రెండవ యుద్ధమల్లుఁడు:— ఇతనితండ్రి తాళరాజు. తాత యుద్ధమల్లుఁడు ఈ తాతనైన వల్లని మొదటి యుద్ధమల్లుఁ డనియు, నతని మనుమఁడగు నీతనిని రెండవ యుద్ధమల్లుఁ డనియు నందురు. మొదటి యుద్ధమల్లుఁడు రాజ్యము చేయలేదు. కాని తన

యగ్రసోదరుఁడైన గుణగవిజయాదిత్యుని కాలమున నాతనితోఁ గూడ నుండి యుద్ధములలోను, రాజకార్యములలోను సాయహస్యము సేయుచుండెను. ఈ మొదటి యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ గుమారస్వామికొక యాలయమును దానిని జేర్చి యొకమఠమును గట్టించి యొకశాసనమును వ్రాసెను. దీనికే యుద్ధమల్లుని బెజవాడ శాసనమని పేరు. ఇది మధ్యాక్కరలతో వ్రాయబడినది. నన్నయభట్టునకుఁ బూర్వము పద్య కవిత్వ మున్నదనుట కిది యొక నిదర్శనము. ఈ రెండవయుద్ధమల్లుఁడు, ఆ యాలయమునకే ముఖమంటపమో గోపురమో కట్టించి, శాసనము వ్రాయించెను. (ఆం. సా. పత్రిక పింగళ పుట ౪౯—౬౮)

ఈ రెండవ యుద్ధమల్లుఁడు పైని జెప్పిన మొదటి అమ్మరాజు కొడుకయిన భీముని జయించి, రాజ్యమును గైకొని క్రీ శ. ౯౨౭ మొదలు ౯౩౩ వఱకు నేడుసంవత్సరములు పరిపాలించెను.

ఈ రెండవ యుద్ధమల్లునకు బాదపరాజను నామాంతరముగల విజయాదిత్యుఁ డనునొక కుమారుఁడు కలఁడు. ఈతఁడు వేఁగిసింహాసనము నధిష్ఠించినవాఁడు కాఁడు. ఈతని శాసనములు కొన్నికాన వచ్చుచున్నవి.

(౨౨) రెండవ చాళుక్యభీముఁడు:—ఇతఁడు కొల్లభిగండ విజయాదిత్యుని రెండవకుమారుఁడు. అమ్మరాజ విష్ణువర్ధనునకు సవతి తమ్ముఁడు. రెండవయుద్ధమల్లునకుఁ దరువాత రాజ్యమునకు వచ్చిన వాఁడు. ఇతఁడీ రెండవయుద్ధమల్లునిఁ జోళరాజయిన లోవబిక్కినిఁ రాష్ట్రకూట రాజయిన గోవిందరాజును, గాంగరాజగు నెట్టపరాజును గూడ జయించి వేఁగిదేశము నిష్కంటకముగాఁ జేసి పరిపాలించెను. ఇతనికి రాజమార్తాండుఁడు, గండమహేంద్రుఁడు ననుబిరుదములుగలవు. ఇతని కేడవ విష్ణువర్ధనుఁ డని నామాంతరము కలదు. గోదావరిమండలములోని సామర్లకోటకుఁ జేరియుండిన భీమవర మీతనిపేరిటఁ గట్టబ

డుటచే దానికి చాళుక్యక్రమవర మని పేరువచ్చినదని కొందఱును, మొదటి చాళుక్య భీమునిబట్టి యీపేరు వచ్చినదని కొందఱును దలంచుచున్నారు.

ఇతఁడు ఆపస్తంబసూత్రుఁడును దేవశర్మకంద మవ్వలకు బుత్రుఁడును క్రమపాఠియునగు కొమ్మనకు కండేరు వాడి విషయములోని కోడతల్లియను గ్రామమును దాన మొసంగి శాసనమును (ఎపిగ్రాఫియా ఇండికా సం ౧ పు ౪౩) వ్రాయించెను. ఈ దానము పానారవంశ ప్రభువును, వేఁగిదేశ రాజ్యరక్షకుఁడు నగు వ జ్జి య యను నాతని కోర్కెపై సేయఁబడినది.

ఈ చాళుక్యభీముని రెండవశాసనము (ఎపిగ్రాఫియా ఇండికా సం ౫ పుట ౧౩౪) నందు గౌతమగోత్రుఁడగు మాధవ సోమయాజి పుత్రుఁడైన విద్దమయ్యాయను బ్రాహ్మణునకు గుదహార విషయము లోని "ఆకులమన్నాడు" అను గ్రామమును ఉత్తరాయణ సంక్రాంతి నాఁ డగ్రహారముగా నిచ్చినట్లు వ్రాయఁబడి యున్నది. ఇతని రాజ్య కాలము పండ్రెండు సంవత్సరములు. క్రీ. శ. ౯౩౪ మొదలు ౯౪౫ వఱకునని తెలంపవలసియున్నది. ఇతనికిఁ బిమ్మట రాజ్యమునకు వచ్చిన రెండవ అమ్మరాజ విజయాదిత్యుని పట్టాభిషేక కాలము ౫ డిశంబరు ౯౪౫ తేదీ యని ప డ క లూ రు శాసనమువలనఁ దెలియుచున్నది. దీనికిని మొదటి చాళుక్యభీముని పట్టాభిషేకకాల మయిన ౧౭ ఏప్రి యలు ౮౯౨ వ సంవత్సరమునకును నడుమ ౫౩ సం॥ ౭ మా ౧౮ దిన ములున్నది. ఈ మధ్యకాలమున రాజ్యము చేసిన రాజులు తొమ్మండు గురు. వారి రాజ్యకాలము నందంపూఁడి శాసనమునుబట్టి లెక్కించిన చో ౫౭ సం॥౮ం ౮ మా ౧౫ దినములని తేలుచున్నది. ఈ రెంటికిని భేదము దాదాపు నాల్గువత్సరములు. ఈ భేదకాలము మొదటి చాళుక్య భీమునికాలములో తగ్గింపవలసియుండునని నాయభిప్రాయము.

౨౩. రెండవ అమ్మరాజ విజయాదిత్యుఁడు:— ఇతఁడు రెండవ చాళుక్యభీముని కనిష్ఠపుత్రుఁడు. ఇతని సవతియన్న దానార్ణవుఁడు. ఇతఁడు దానార్ణవుఁడుండఁగనే తన పండ్రెండవయేట వేఁగి సింహాసన మధిష్ఠించి, ౨౫ సంవత్సరములు రాజ్యము చేసెను. ఇతని తల్లి లోక మహాదేవి. చాళుక్య రాజ్యభారమును వహించిన విజయాదిత్యులలో నీతఁ డాఱవవాఁడు. ఇతనికి సమస్తభువనాశ్రయుఁడు, మహారాజాధి రాజు, రాజమహేంద్రుఁడు, పరమ భట్టారకుఁడు అను బిరుద నామ ములు కలవు ఇతఁడు మిగుల పరాక్రమవంతుఁడును దానశీలుఁడునై యున్నాఁడు. ఇతని కాలమున చాళుక్య రాజులలో నంతఃకలహములు లేవు.

౧. ఇతఁడు తనకులబ్రాహ్మణుఁ (Family priest) డయిన కౌండిన్య గోత్రుఁడగు నొక బ్రాహ్మణునకు విలుప్తమై పోయిన ప్రాక్తనక్షేత్రమును తిరిగి యిచ్చి దానశాసనము వ్రాయించెను. (ద. హిం. శా. సం ౧ పుట ౪౭)

౨. చంద్రగ్రహణకాలమున పెన్నతవాడి విషయములోని పడక లూరు గ్రామమునందలి కొంతభూమి నొక బ్రాహ్మణున కిచ్చి వ్రాయించిన దానశాసనము (ఇండియన్ ఆంటిక్వేరీ సం ౭ పుట ౧౫.) లో నీరాజు శా. శ. ౮౬౭ సంవత్సరము మార్గశిర ౧౩ శుక్రవారము నాఁడు (౫ డిశంబరు ౯౪౫ వ సంవత్సరము) పట్టాభిషిక్తుఁడైనట్లు చెప్పఁబడియున్నది.

౩. గుద్రహారవిషయమందలి పాంబఱ్ఱు (పామఱ్ఱు) అను గ్రామములోని కొన్ని భూములను పట్టవర్ధని వంశములోఁ జేరి యుండి బొద్దియయను నామాంతరముగల యువరాజ బల్లాల దేవవేలాభటునకు దానము చేసెను. ఇందుఁ జేర్కొనఁబడిన పట్టవర్ధనుని వంశజులు కుబ్జవిష్ణు వర్ధనుని కాలమునుండియు చాళుక్యులకడ మంత్రిత్వాది పదవుల వహించి శోభిల్లుచుండిరి. (ఇం. ఆం. సం. ౮ పుట ౭౩)

౪. వెలనాండు విషయములోని (వెలనాంటిసీమ అనగా ప్రస్తుతము గుంటూరుమండలములోని చందవోలు ప్రాంతదేశము) నెలవట్టు గ్రామము నుత్తరాయణ సంకాంతి కాలమున ధారవోసెను." (ఇం. ఆ. సం. ౧౭ పుట ౯౧.)

౫. "ఉత్తరాయణ సంకాంతి కాలమున వేంగినాడు విషయము లోని గుంటుగొలను (గుండుగొలను) గ్రామములోఁ గొంతభూదానము చేసియుండెను. ఇతఁడు తనమామయగు నృపకాముని యొక్కయు అత్తయగు నయమాంబయొక్కయు కోరికమీఁద నీ దానముచేసినట్లు జెప్పఁబడినది." (ఇం ఆ. సం ౧౩ పుట ౨౪౮)

(౬) అద్దకాలిగచ్ఛకు సంబంధించి వలహారిగణములోఁ జేరిన జైన శ్రావకి యగు చామెకాంబ గురువయిన అర్హనందియను జైనాచార్యునకు సర్వలోకాశ్రయ జైన భవనముయొక్క భోజనశాల కొఱకు అత్తిలినాఁడు విషయములోని కంచుంబఱ్ఱు (కంచుమఱ్ఱు) గ్రామమును దానము చేసెను. ఇందుదాహరింపఁ బడిన చామెకాంబ పట్టవర్ధని కుటుంబములోనిదని తెలుపఁ బడినది. ఈమె రాజున కుంపుడుకత్తెగాఁ బేర్కొనఁ బడియెను. ఈశాసనము భట్టుదేవునిచే రచింపఁబడినది. ఇప్పటి పశ్చిమ గోదావరి మండలములోని తణుకు తాలూకాలోఁ దణుకు గ్రామమున కేడుమైళ్లదూరమున అత్తిలిగ్రామము కలదు. ఇది పూర్వము త్తిలినాఁడు విషయమునకు ముఖ్య పట్టణముగ నుండెను. (ఎపిగ్రాఫియా ఇండికా సం॥ 7 పు ౧౭౭-౧౯౨)

(౭) గుణగవిజయాదిత్యునికడ నుద్యోగిగా నున్న పాండురంగని వంశములోని వాఁడును తనకడ నుద్యోగిగా నున్నవాఁడు నగు దుర్గరాజుచే విజయవాటిక (బెజవాడ)లో నిర్మింపఁబడిన జైనాలయమునకుఁ గూడ అత్తిలినాఁడు విషయములోని మల్లిపూఁడి గ్రామమునుదానము చేసినట్లుగ మల్లిపూఁడి శాసనమువలన ద్యోతక మగుచున్నది."
(ఎ. ఇం. సం ౯౮ పుట ౪౭-౫౬)

(౮) తనభృత్యవర్గములోఁ జేరి తనయెడఁ గడుభక్తిం గూర్చు డు కుప్పనామాత్యుం డనువానిని సన్మానించి దానధర్మములఁ దనిపెనని యమ్మరాజ విష్ణువర్ధనుని వాండ్రము శాసనము తెలుపుచున్నది. (ఎ.ఇం. సం. ౯ పుట ౧౩౨)

(౯) ఈతఁడు తన గురువైన విద్యేశ్వరపండితుని కుమారుఁడైన మమ్మడి ప్రభాతరాశి పండితునకు అమ్మలపూఁడి మొదలగు గ్రామము లను దానమిచ్చి వ్రాయించిన తాండికొండశాసనమును బట్టి శైవుఁడై నట్లు (భారతి–బహుధాన్య–ఆషాఢము) తెలియుచున్నది.

ఈ శాసనములనుబట్టి చూడఁగా నీ మహారాజు శైవుఁడైన ను, జైనులను, బ్రాహ్మణులను సమానముగా నాదరించి వారి వారి యాలయములను బోషించినట్లు గన్పట్టుచున్నది.

(౨౮) దానార్ణవుఁడు:— ఇతఁడు రెండవఅమ్మరాజుయొక్క సవతి సోదరుఁడు. రెండవచాళుక్యభీముని కుమారుఁడు. రెండవఅమ్మ రాజునకుఁ బిమ్మట నీతఁడు వేఁగిసింహాసనము నధిష్ఠించి మూఁడుసంవ త్సరములు మాత్రమే రాజ్యముచేసెను. ఈతని పేరుతో నున్నశాసన ము లేమియుఁ గన్పట్టుట లేదు. ఈతని పరిపాలనము మూఁడుసంవత్స రములతో నంతమొందుటకు కారణ మీతని మరణమై యుండును. అది స్వాభావికముగ సంభవించెనో, శత్రువులవలనఁ గలిగెనో తెలియదు. ఈతనితరువాత ౨౭ సంవత్సములు వేంగిదేశ మరాజకముగ నుండెనని యీతని తరువాతి శాసనములవలనఁ దెలియుచున్నది. ఈతని కిరువురు కుమారులు కలరు. ౧ శక్తివర్మ ౨ విమలాదిత్యుఁడు. దానార్ణవుఁడు మరణించునాఁటి కీ యిరువురు పుత్రులును బసివారై యుండుటచే దేశ మరాజకమై చాళుక్యదాయాదులో, మఱియెవ్వరో బహునాయకులు బయలువెడలి రాజ్యమును బరిపాలించి యుందురు. ఈ కాలములో వేఁగి దేశమున శాసనములు గన్పడవు. ఈకాలమునఁ జోళులీ దేశము మీఁదికి దండెత్తి వచ్చి దానార్ణవుని జయించి యీ దేశమును పాలిం

చిరని కొందఱనుచున్నారు. కాని యీ యూహ నిరాధారమైనది. ఈయరాజక కాలము శా. శ. ౮౯౫ మొదలు ౯౨౨ వఱకు (అనఁగా క్రీ. శ. ౯౭౩ మొదలు ౧౦౦౦ వఱకు) నైయున్నది.

౨౫. శక్తివర్మ:— ఇతఁడు దానార్ణవునకు, ఆర్యామహాదేవి వలన జన్మించిన యిరువురుకుమారులలో నగ్రజుఁడు. ఈతఁడు పసివాఁడుగా నున్నప్పుడు తండ్రి చనిపోవుటవలననో మఱియే కారణముననో, యితనికిఁ బూర్వము దాదాపిరువదియేడు సంవత్సరములు వేఁగిదేశ మరాజకముగ నుండి యల్లరులతో మునిఁగియున్నది. ఇతఁడు చోడరాజరాజు సాహాయ్యమున నల్లరుల నణఁచివైచి శత్రువులను జయించి, రాజ్యభారమును వహించెనని చరిత్రకారులనుచున్నారు. ఈతనిప్రభుభట్టు శాసనము (ఆం. సా. ప. సం ౨ పుట ౩౯౯) లో నితఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడనియు, బాల్యముననే ద్రవిడయుద్ధమునందనేక శత్రుగజములను దనఖడ్గముచే ఖండించెననియు, చోడభీమునిచేఁ బ్రేరేపింపఁబడిన యొకమహావీరుని స్వబాహుబలముచే సంహరించెననియుఁ జటాచోడమహావృక్షమును వ్రేళ్ళతోఁ బెరికి వేసెననియుఁ జెప్పఁబడియున్నది. వేఁగిదేశ మరాజకముగా నున్నప్పుడు చోడు లీదేశమును బరిపాలించిరని కొందఱు చరిత్రకారు లనుచున్నారు. కొందఱది సత్యముకాదనుచున్నారు. ఈశాసనములోఁ జెప్పఁబడిన చోడభీముఁడును జటాచోడుఁడు నెవ్వరో తెలియుట లేదు. వేఁగిదేశమే, యరాజకముగా నున్నప్పుడీ శక్తివర్మ ద్రవిడయుద్ధములలో నెట్లు పాల్గొనెనో తెలియదు. ఈతఁడు వేఁగిదేశమునఁ బట్టాభిషిక్తుఁడైనపిమ్మట ద్రవిడదేశముపైకి దండువెడలెననుటకు వీలులేదు. తన రాజ్యమును సంరక్షించుకొనుటయే కష్టతర మగుసమయములో నీతఁడు ద్రవిడదేశముపైకిఁ బోయెనని విశ్వసింపఁజాలము. వేఁగిదేశ మరాజకముగా నుండుటచే నితఁడు బాల్యముననే ద్రవిడదేశమున కేగి తనధైర్యశౌర్య పరాక్రమములచేఁ జోడరాజరాజును మెప్పించి, యాతనిసాహాయ్యమున వేఁగిదేశమును జయించి, పట్టాభిషిక్తుఁడై, తనతమ్ముఁడైనవిమలా

దిత్యునకు రాజరాజు కుమార్తెను బరిణయము చేయించి, సూర్యవంశపు రాజులతోఁ దూర్పుచాళుక్యులకు సంబంధబాంధవ్యములను గలిపినట్లు తోఁచుచున్నది. పైని జెప్పిన చోడభీముఁడును జటాచోడుఁడును, చోడరాజరాజునకు శత్రువులై, యాతనిపక్షమున యుద్ధములు చేయు చున్నప్పుడు శక్తివర్మచే జయింపఁ బడియుందురు.

౨౬. విమలాదిత్యుఁడు:— ఇతఁడు దానార్ణవుని కుమారుఁడు చాళుక్యచంద్రుఁ డని నామాంతరముగల శక్తివర్మకుఁ దమ్ముఁడు. శక్తి వర్మకుఁ బిమ్మట రాజ్యభారమును వహించినవాఁడు. ఆంధ్రమహాభారత కృతిపతియైన రాజరాజునకుఁ దండ్రి. ఇతఁడు సూర్యవంశపుచోడరాజ యిన రాజరాజునకుఁ గుమార్తెయు రాజేంద్రచోడునకు సోదరియు నైన కుందవదేవిని పెండ్లియాడి యామెవలనఁ దనకుఁ గలిగిన కుమా రునకు దనమామగారగు రాజరాజు నామ ముంచెను. చాళుక్యులకును చోళులకును వివాహసంబంధముల కిదియే మొదలు. ఇతనికి "బిరుదాంక భీముఁడు ముమ్మడిభీముఁడు, త్రిభువనాంకుశుఁడు భూపమహేంద్రుఁడు" అను బిరుదములు కలవు. ఈతని మామయైన రాజరాజచోడుఁడు క్రీ. శ. ౯౮౫ వ సంవత్సరమున చోళసింహాసనము నధిష్ఠించి తనపదు నాల్గవ రాజ్యసంవత్సరమున ననఁగా క్రీ. శ. ౯౯౯ వ సంవత్సరమున వేంగిదేశముపై దండెత్తివచ్చి జయించిన ట్లాతని శాసనములు చెప్పు చున్నవి.

అప్పటికి దాదాపు ముప్పదిసంవత్సరములు వేంగిదేశమునఁ బ్రభువు లేక యరాజకముగ నున్నది. ఈ కాలములో చోడరాజరా జీదేశమును జయించి, తూర్పుచాళుక్యవంశములో దానార్ణవునికొడు కయిన శక్తివర్మను వేంగిసింహాసనమున నిలిపియుండును. శక్తివర్మ క్రీ. శ. ౯౯౯ వ సంవత్సరమున చాళుక్యరాజ్యమునకు పట్టభద్రుఁడైనట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇతఁడు క్రీ. శ. ౧౦౧౧ వఱకు రాజ్యము చేసియుండెను. ఈతని వివాహ మెప్పుడు జరిగెనో తెలి యదు. చోడరాజరాజు, తనకుమార్తెను విమలాదిత్యున కిచ్చినపిమ్మట

వేఁగిదేశమును జయించి, యా సింహాసనమును శక్తివర్మ కిచ్చియుండిన నుండవచ్చును. లేదా, వేఁగిదేశమును జయించినపిమ్మట వేఁగిసింహాసనమును శక్తివర్మకును, తనకుమారుఁడైన విమలాదిత్యునకును నిచ్చియుండును. ఈ రెండవసూచనయే సత్యమై యుండునని నిశ్చయింపఁదగి యున్నది.

ఈ విమలాదిత్యుఁడు తనమంత్రి యగు వజ్జియప్రెగ్గడకు గుద్రవాడివిషయములోని రణాస్థిపూఁడి గ్రామమును నగ్రహారముగా నిచ్చి వ్రాయించిన శాసనమును బట్టి శా. శ. ౯౩౩ సంవత్సరము జ్యేష్ఠశుద్ధ పంచమీ గురువారమున పుష్యమీ నక్షత్ర సింహలగ్నమున (అనఁగా క్రీ. శ. ౧౦౧౧ వ సంవత్సరమున మెయినెల ౧౦ వ దినమున) నతఁడు పట్టాభిషిక్తుఁడైనట్లు తెలియుచున్నది. ఇతని కుమారుఁడైనరాజరాజు క్రీ శ. ౧౦౨౨ వ సంవత్సరము జూలయి నెల ౧౯ వ తేదీని సింహాసన మెక్కినట్లు నందంపూడి శాసనమువలన స్పష్టమగుచున్నది. కావున నీ విమలాదిత్యుఁడు ౧౧ సంవత్సరముల ౨ మాసములు రాజ్యమేలినట్లు తేలుచున్నది కాని కొన్నిశాసనములలో నీతఁడేడు సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసెనని చెప్పఁబడియున్నది. ఇందులకు విమలాదిత్యుని జీవితకాలములోనే కుమారుఁడైన రాజరాజు రాజ్యభారమును వహించి నాల్గు సంవత్సరములైన పిమ్మట తండ్రియనంతరమున పట్టాభిషిక్తుఁడైనట్లూహింపవచ్చునని కొందఱును తండ్రియనంతరమున రాజ్యమును వహించినను, నాల్గుసంవత్సరము లైనపిదప పట్టాభిషిక్తుఁడై, యుండునని కొందఱును సమాధానమిచ్చుచున్నారు. ఈ విషయమును రాజరాజును గూర్చి వ్రాయునప్పుడు వ్రాసెదను.

ఈ విమలాదిత్యుఁడు కళింగదేశమునుగూడ జయించెనని చెప్పుచుఁ గొందఱందులకు, విశాఖపట్టణమండలి విజయనగరమునకు సమీపమున నున్నరామతీర్థము కడనుండిన యొక శాసనము నాధారముగాఁ జూపుచున్నారు (A. R. No 372 of 1905) ఈ శాసనము చాలగా శిథిలమై పోయినది. కాలము తెలియుటలేదు. ముమ్మడి

భీముఁ డనుపేరు మాత్రము కనఁబడుచున్నది. విమలాదిత్యునకు ముమ్మడిభీముఁ డనుబిరుద ముండుటచే నాశాసన మీతనిదే యనుచు న్నారు. బలవత్తర మైనసాక్ష్యము లభించిన నే గాని యీ విమలాది త్యుఁడు కళింగదేశమును జయించెననిగాని, యీ శాసన మీతనిదే యని గాని విశ్వసించుటకు వీలులేదు. విజయాదిత్యునిచేఁ జంపఁబడిన సంకియదేవుని కొడుకగు ముమ్మడి దేవుఁడొకఁడున్నాఁడు. ఈ శాస న మాతనిది కావచ్చును.

చోడరాజరాజు కుమారుఁడైనరాజేంద్రచోళుఁడు (విమలాది త్యునిభార్యయైన కుందవకు అన్నగారు) కళింగదేశమును జయించి మహేంద్రగిరి పైని రెండుశాసనములను వ్రాయించి జయస్తంభమును నాటించె ననియు, నప్పుడీవిమలాదిత్యుని జయించి చెఱ గొనిపోయె ననియు, తండ్రి యాతనిని జెఱనుండివిడిపించి తనకుమార్తెయైనకుందవ నిచ్చి వివాహము చేసెననియు, విమలాదిత్యుఁ డక్కడ వివాహమైన పిదప తనమామగారి ౨౯ వ రాజ్యసంవత్సరమున తిరువైయూరు గ్రామము నందలి పంచనాధేశ్వరస్వామికి దాన మిచ్చి వ్రాయించినయొక శాసనము కలదనియు, నక్కడనున్న కాలము తీసివేసి మరల వచ్చిన కాలము మొదలు పెట్టి నీతని రాజ్యకాల మేడుసంవత్సరములని తరు వాతి శాసనములలోఁ జెప్పఁబడియె ననియు నొక కథ చెప్పఁబడు చున్నది. కాని యీకథ విశ్వాసార్హమైనది కాదు.

మహేంద్రగిరిపై నున్న రెండు శాసనములలోనొకటి సంస్కృ తమునను నొకటి యరవమునను నున్నవి. (ద. హిం. శా. సం. ౫ సంఖ్య ౧౩౫౧–౧౩౫౨). అందు ౧౩౫౧ వ సంఖ్యగల శాసన మిది:—

శ్లో. జయతి నిజభుజాలీ నిర్జితోర్వీపమాలీ
పరిణతి గళితమాల్యాలంకృత స్థానభూమిః
విమలయతి యదీయం ధామలోకం సమస్తం
కలిమలినిముఖైర్భ్రాజి రాజేంద్రచోళః

నిర్జి త్యన్నిజవిక్రమేణ విమలాదిత్యం కులూతేశ్వరం
సంగృహ్యాద్రినిభాః కలింగపతినా న్దత్తాకరో వాహినీ
న్హిత్వా దండపతి ర్జగద్విజయినో రాజేంద్రచోళస్య
సద్వ్యాళి ప్రాప్తే శిఖరే వ్యధత్తవిజయ స్తంభ న్మహేంద్రాచలే

ఈ శాసనములో కాలము లేదు. రాజేంద్రచోళులు పెక్కురున్నారు. అం దీరాజేంద్రచోళుఁ డెవ్వఁడో తెలియదు. ఈతనిచే జయింపఁబడినవాఁడు తూర్పుచాళుక్యవిమలాదిత్యుఁ డనుట కాధారములు లేవు. శాసనవిమలాదిత్యుఁడు కులూతేశ్వరుఁ డని యున్నది. తూర్పుచాళుక్యుల విశేషణము లేవియు లేవు. కావున నీ శాసనమును బట్టి పై కథ నిజమని చెప్పరాదు.

మన విమలాదిత్యుఁడు క్రీ. శ. ౧౦౧౧ లో రాజ్యమునకు వచ్చినవాఁడు తరువాత నాతఁడు కళింగమును జయించిన దెప్పుడు ? రాజేంద్రచోళుఁ డాతనిని జయించిన దెప్పుడు ? రాజేంద్రచోళుఁడు సింహాసన మెక్కినది క్రీ. శ. ౧౦౧౧ వ సంవత్సరము. విమలాదిత్యుని చెలిగొనినాఁ డనునది ౧౦౧౧ కు తరువాతనై యుండవలయును. అప్పటి కాతని తండ్రి రాజరాజు లేఁడుక దా ! అతఁడు తన కుమార్తెనిచ్చి వివాహముచేయుటెట్లు ? ౧౦౧౨ లో వివాహమైన దనుకొందము. ఈతని కుమారుఁడు రాజరాజు సింహాసనము నారోహించినది ౧౦౨౨ వ సంవత్సరము కదా ! అతఁడు ౧౦ యవ సంవత్సరమున బాలుఁడుగా నున్నప్పుడు రాజ్యమును స్వీకరించెనని యెచ్చటను జెప్పియుండలేదు కదా ! ఈ కారణములను బట్టి పైకథ లేశమాత్రమును నమ్మ నర్హమైనది కాదు. వివాహమైన పిదప రాజేంద్రచోళుఁ డాతనిని జయించుటకు విరోధకారణములు గానవచ్చుటలేదు. విమలాదిత్యుని వివాహము రాజరాజు జీవించియుండఁగనే క్రీ. శ. ౧౦౦౦ సంవత్సరప్రాంతమున జరిగి యుండునని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈ విమలాదిత్యుఁడు జైనమతావలంబకుఁ డనియుఁ త్రికాలయోగి సిద్ధాంతదేవుఁడను జైనాచార్యు డీతని గురువనియుఁ దెలియు

చున్నది. ఈతఁడు జైనమతాభిమాని యైనను, నితరమతములయందు ద్వేషము లేనివాఁ డైనట్లితఁడు పంచనాథేశ్వరునకు దాన మొసఁగుటను బట్టి యూహింపవచ్చును (A.R. No 215 of 1894) (పూసపాటి సంస్థానములోని రామతీర్థ క్షేత్రమునందలి పాండవులపంచ యను గుహ యందున్న శాసనము) ఈతని మంత్రి యైన వజ్జియప్రెగ్గడను గూర్చి యాంధ్రుల చరిత్ర మిట్లు చెప్పుచున్నది.

"విమలాదిత్యుని మంత్రి యగు వజ్జియప్రెగ్గడ రణస్థిపూఁడి శాసనమున విశేషముగా నభినందింపఁబడియుండెను. ఇతఁడు కామచేడు గ్రామనివాసియు కౌండిన్యగోత్రుఁడు నైన బ్రాహ్మణుఁడుగా నుండెను. ఇతఁడు పరిశుద్ధమైనవాక్కును పవిత్రమైన వర్తనమును గలిగి బ్రాహ్మణకులమునకు భాస్కరునివలె నున్నవాఁ డని గొనియాడఁబడి యుండెను. ఈ వజ్జియప్రెగ్గడ అమాత్య శిఖామణి యనియు బుధ వజ్రప్రాకారుఁ డనియు, సౌజన్య రత్నాకరుఁ డనియు బిరుదునామములను వహించియాంధ్రదేశమునందంతటఁ బ్రఖ్యాతివహించెను. ఈ బ్రాహ్మణప్రభువు మనోవాక్కాయకర్మంబులఁ బరిశుద్ధుఁడైన తుండిన ఋమేంద్రునివంటివాఁ డట. మఱియు శివభక్తుఁడు. యజ్ఞయాగాది క్రతువుల నాచరించిన కర్మిష్ఠి. ఉదారచిత్తము గలవాఁడు ఇతఁడు తన ప్రజ్ఞావిశేషములచేత విమలాదిత్యుని పరిపాలనము జయప్రదమైనదిగాఁ జేయుటకు చాల కష్టపడినందున విమలాదిత్యుఁడు సంతోషించి వాని ప్రభుభక్తికి మెచ్చుకొని గుద్రవాడివిషయములోని పాలువళ్ళమను గ్రామముతోఁ గూడ రణస్థిపూఁడి గ్రామము నగ్రహారముగా నేర్పాటుచేసి దానముచేసెను. ఈ రణస్థిపూఁడి గ్రామముచుట్టును మొంతకఱ్ఱు (మోడేకఱ్ఱు), లుల్ల (లొల్ల), సిరిపాడపూఁడి (పెదపూడి) చింతగుంట, పెంజెఱువు మొదలగు గ్రామములు పేర్కొనఁబడి యుండుట ఈ రెండుగ్రామములు గోదావరిమండలములోని అమలాపురము తాలూకాలోనివిగాఁ గన్పట్టుచున్నవి. పాలువళ్ళగ్రామ మమలాపురము కాలువయొద్దనున్న పలివెలగ్రామముగా నున్నది. యీ శాసనము వ్రాసినవాఁడు భీమనభట్టు."

రాజరాజు:— ఇతఁడే మహాభారత కృతిపతి. ఇతఁడు పైని జెప్పిన విమలాదిత్యునికుమారుఁడు. విమలాదిత్యునకుఁ గుందవదేవి, మేడవదేవి యనువిరువురు భార్యలనియుఁ గుందవయందు రాజరాజును మేడవయందు విజయాదిత్యుఁడును జన్మించినట్లును శాసనములను బట్టి తెలియుచున్నది. భారతమునందలి యీక్రింది పద్యమువలన నీతఁడు విమలాదిత్యున కగ్రతనూజుఁ డని యెఱుంగ నగుచున్నది.

క. సత్యాశ్రయకులశేఖర!
నిత్యోదయ! రాజరాజనృప! సుకవిజన
స్తుత్య! మహాగుణవిమలా
దిత్యాగ్రతనూజ! విమలధీరమణీయా!

రాజరాజజననము, వివాహము.

ఇతని తండ్రియైన విమలాదిత్యునకుఁ గుందవతో నైన పరిణయము క్రీ. శ. ౧౦౦౦ సంవత్సరప్రాంతమని పైని వ్రాసియుంటిని. ఇతని పట్టాభిషేకము క్రీ. శ. ౧౦౨౨ వ సంవత్సరమున నని నందంపూఁడిశాసనము చెప్పుచున్నది. అప్పటి కితని కిరువది యేండ్లుండునని తలంచితిమేని, ఈతని జననము క్రీ. శ. ౧౦౦౨ వ సంవత్సరప్రాంతమని నిశ్చయింపవచ్చును. ఇతఁడు తనమేనమామకుమార్తెయైన "అమ్మాంగదేవిని బరిణయమాడెను. ఈ వివాహ మెప్పుడైనదియుఁ దెలియదు. బహుశః శా. శ. ౯౩౦ ప్రాంతమున నీతనికి వివాహమై యుండును. ఇతని కుమారుఁడైన కులోత్తుంగచోడుని జననము శా. శ. ౯౬౦ప్రాంతము గావచ్చును.

ఇతని రాజ్యారంభము.

ఇతఁడు తండ్రిజీవితకాలములోనే రాజ్యముచేయ నారంభించెనని పైని వ్రాసియుంటిని. శా. శ. ౯౪౦ సంవత్సరప్రాంతమున నీతఁడు రాజ్యపాలనము స్వీకరించినను ౯౪౪ వఱకు పట్టాభిషిక్తుఁడు కాలేదు. ఇందులకుఁ గారణము స్పష్టముగాఁ దెలియదు. చరిత్రకా

రులిందులకు వేఱువేఱు కారణములను జెప్పుచున్నారు. తండ్రి శ. ౯౪౪ వఱకు జీవించియుండెననియు నాతని యనంతరమున పట్టాభిషిక్తుఁడయ్యెననియుఁ గొందఱి మతము. తండ్రి ౯౪౦ ప్రాంతముననే చనిపోవుటయో, జైన మతమును స్వీకరించి కుమారునకు రాజ్యమిచ్చి సన్యసించుటయో జరిగినదనియు, రాజరాజునకు సవతిసోదరుఁడైన విజయాదిత్యుఁడు పశ్చిమచాళుక్యుల సాహాయ్యముతో రాజరాజును పట్టాభిషిక్తుఁడు గాకుండ నిరోధించెననియు రాజరాజు వారిని జయించి, పట్టాభిషిక్తుఁడగుటకు నాల్గుసంవత్సరములు పట్టెననియుఁ గొందఱి యభిప్రాయము.

శాసనములలో నీయఁబడిన విజయరాజ్యసంవత్సర సంఖ్యనుబట్టి లెక్కించినచో నీతనిరాజ్యారంభ కాలము శా. శ. ౯౪౩ అగుచున్నది. ఈ విధముగా నీతనిరాజ్యారంభము మూఁడు తెఱఁగులుగా నున్నది. (శా. శ. ౯౪౦, ౯౪౩, ౯౪౪). ఇతఁడు ౪౧ సంవత్సరములు రాజ్యముచేసెనని యీతని తరువాతివారు వ్రాయించిన శాసనములయందున్నది. ఇతఁడు శా. శ. ౯౪౪ వ సంవత్సరమున సూర్యుఁడు సింహరాశియందుండఁగా కృష్ణపక్ష ద్వితీయా గురువాసరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెనని నందంపూఁడి శాసనమునఁ దెలుపఁబడినది. ఆనాఁడు క్రీ. శ. ౧౦౨౨ వ సంవత్సరము ఆగష్టునెల ౧౬ వ తేదీ యగునని చరిత్రకారులు తెలిపియున్నారు.

## శత్రు బాధలు.

రాజరాజు రాజ్యపరిపాలనము ౪౧ సంవత్సరము లవిచ్ఛిన్నముగాను, సుఖముగాను, గడచెనని చరిత్రకారులు తలంచుచున్నారు. కాని యీతఁడుకూడ శత్రువులవలన బాధలనుభవింపకపోలేదు. ఈతని శత్రువులలో ముఖ్యుఁడీతని సవతిసోదరుఁడైన విజయాదిత్యుఁడు. ఇతఁడు మొదటినుండియు రాజరాజునకు గర్భశత్రువై సమయముకొఱకు వేచియుండి యీతనిని బాధ పెట్టుచుండెను.

ఈ విజయాదిత్యుఁడు రాజరాజును వెడలఁగొట్టి యాతని సింహాసన మాక్రమించి వేఁగిరాజ్యమును గొంతకాలము బరిపాలించిన ట్లీతని పాములవాక శాసనమునందలి యీ క్రిందిశ్లోకముల వలనఁ దెలియుచున్నది.

"తస్య మునన్దిడిభీమస్య సుతః కృత
మతి ర్మహారాజరాజాహ్వయో
రాజా ద్వాదశాబ్దాన్ ధరా మపాలయత్
తం రాజరాజనృపతిం నిర్ఘాట్య
భువంప్రసహ్య విజయాదిత్యభూపః
విమలాదిత్యతనూజస్య ద్వైమాతురో గృహీ ద్రాజ్యమ్.

శ్లో॥ శ్రీమాన్నా కే సమాఘే స్వగిషు నిధిమితే కర్కి-గేకర్క-శాంశౌ
శుద్ధాత్మా శుద్ధపంచ వ్యాదితిదినే సూర్యభే శౌర్యశాలీ
కన్యాలగ్నేతి ధన్యో శశికులతిలకో రాజమార్తాండసూను
ర్వేంగీ సామ్రాజ్య పట్టం స్మవహతి విజయాదిత్యభూపః ప్రతాపీ

విజయాదిత్యుఁడు తనసవతి సోదరుఁడైన రాజరాజును వెడల గొట్టి శా. శ. ౯౫౨ సూర్యుఁడు కర్కాటకమునందుండఁగా శుద్ధపంచమీ సోమవారమున (క్రీ. శ. ౧౦౩౦) పట్టాభిషిక్తుఁడైనట్లీ శ్లోకమునఁ జెప్పఁబడినది. అప్పటికి రాజరాజు పట్టాభిషిక్తుఁడై యెనిమిదిసంవత్సరము లేయైనది. పైని వ్రాసిన మొదటి శ్లోకమున పండ్రెండేండ్లని చెప్పఁబడినది. రాజరాజు తండ్రియైన విమలాదిత్యుని గూర్చి వ్రాసినప్పుడు రాజరాజు పట్టాభిషేకకాలమునకు, పూర్వము నాలుగేండ్లు రాజ్యభారము వహించి యుండెనని వ్రాసియుంటిని. ఆ నాలుగేండ్లు కలిపినచోఁ బండ్రెండు సంవత్సరములు సరిపోవుచున్నది. ఇతఁడు శా. శ. ౯౪౦ సంవత్సర ప్రాంతమున రాజ్యభారమును వహించినట్లు విమలాదిత్యుఁడు ఏడు సంవత్సరములు మాత్రమే రాజ్యముచేసెనని, రంగంపూఁడి శాసనము మొదలగు కొన్ని శాసనములు చెప్పుటను బట్టియు, విజయాదిత్యుని పాములవాక శాసనములోని "ద్వాదశాబ్దాన్" అను మాటను

బట్టియు స్పష్టమగుచున్నది కదా! రాజరాజు నామ ముదాహరింపఁ బడిన శాసనములనుబట్టి శా. శ. ౯౪౧ వ సంవత్సర మీతని రాజ్యారంభ కాలమని తెలియుచున్నది. (నందమపూడి శాసనము; వలివేరు శాసనము = ౧౯౨౦ – సంఖ్య ౬౭౨), ద. హిం. శా. సం. సంఖ్య ౧౦౦౬) ఈ శాసనములలో రాజరాజు విజయరాజ్య సంవత్సరములును శాలివాహన శకాబ్దములుగూడ నీయఁబడినవి వానినిబట్టి లెక్కించి చూడఁగా నీతని రాజ్యారంభకాలము శా. శ. ౯౪౧ అని ధ్రువపడు చున్నది. ఇంక నీతని పట్టాభిషేక కాలము శా. శ. ౯౪౪ అని నందం పూఁడి శాసనమే స్పష్టముగా జెప్పుచున్నది కదా! రాజరాజు ౪౧ సంవత్సరములు రాజ్యముచేసెనని యీతని తరువాతివారు వ్రాయించిన శాసనములలో నున్నది. యీ లెక్క శా. శ. ౯౪౧వ సంవత్సరము నుండి లెక్కింపఁబడినట్లు, రాజరాజు సవతి తమ్ముఁడైన విజయాదిత్యుని శాసనములవలనఁ దెలియుచున్నది ఈ విజయాదిత్యుని విజయరాజ్య సంవత్సరములు శా. శ. ౯౮౩ నుండి ప్రారంభమైన ట్లాతని శాసనములవలన స్పష్టమగుచున్నది.

రాజరాజును శా. శ ౯౪౩లో సింహాసనమునుండి తొలఁగించినను, విజయాదిత్యుఁడు విశేషకాలము వేఁగి సింహాసనమునం దున్నట్లు కన్పట్టదు. రాజరాజనతికాలములోనే, యాతనిని జయించి, రాజ్యమును గైకొని యుండును. అందుచేతనే యాతని రాజ్యకాలము ౪౧ యని యవిచ్ఛిన్నముగా తరువాతి వారి శాసనములలో నుదాహరింపఁ బడినది. ఆ కాలములో విజయాదిత్యుని శాసనములు కనుపట్టుటలేదు.

రాజరాజు రాజ్యకాలము శా. శ ౯౮౩ తో నంతమొందినట్లు తెలిసికొంటిమి. అప్పు డాతఁడు చనిపోయెనో, ఏదియేని కారణము చేతనైన, రాజ్యము విజయాదిత్యునకు సంక్రమించెనో తెలియుటలేదు. శా. శ. ౯౪౩ లో నొకసారి విజయాదిత్యుఁడు పట్టాభిషిక్తుఁ డయ్యె ననియు, నతికాలములోనే రాజరాజుచేఁ బదభ్రష్టుఁ డయ్యెననియు పైని జెప్పియుంటిమి. ఆ పిమ్మట నా విజయాదిత్యుఁడు కళింగదేశ

మున వేఁగి యచ్చట నొక చిన్న సంస్థానమునకుఁ బ్రభువై కాలము
గడపిన ట్లాతని తరువాతివారు వ్రాయించిన శాసనములవలనఁ దెలియు
చున్నది. కొంతకాల మీ విజయాదిత్యుఁడు, పశ్చిమ చాళుక్యులకడ
సేనానిగా నుండెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. విజయాదిత్యు
ని కుమారుఁడైన శక్తివర్మ శాసనములోని

"విమలాదిత్యాచ్చోడాన్వయకలశాబ్ధేశ్చ మేకవమహాదేవ్యాః
అజని జయశ్రీ ర్నిత్యో విజయాదిత్యో నరేశ్వరస్తుత్యః
పరోక్షే రాజరాజస్య భ్రాతు ర్వైమాతురస్య యః
ప్రత్యగ్రహీ న్మహీరాజ్యం వీర శ్రీయాయుతః

అను శ్లోకములవలన రాజరాజు, ఏ కారణమువలననో, తనరాజ్య
మును వీడి, యున్నప్పు డాతని పరోక్షమున విజయాదిత్యుఁ డాతని
రాజ్యము నపహరించి యుండెనని తెలియుచున్నది. ఇది శా. శ.
౯౮౨ లో జరిగియుండును. దక్షిణమున చోళులకును పశ్చిమ చాళు
క్యులకును జరుగుచున్న యుద్ధములోఁ జోళులపక్షమునఁ బాల్గొనుటకో,
కాక, తనమామగారైన రాజేంద్రచోళుని రాజ్యమాతని దౌహిత్రుఁ
డును తనకుమారుఁడునైన రాజేంద్రచోళునకు (కులోత్తుంగచోడుఁడు)
రాఁబట్టవలయునను ప్రయత్నముననో దక్షిణ దేశమునకు రాజరాజు
పోయియుండును. ఆకాలములో వేఁగి సింహాసనమును, విజయాదిత్యుఁ
డు, పశ్చిమ చాళుక్యుల సాహాయ్యమున నాక్రమించికొని యుండును.
కాని, రాజరాజు మరల విజయాదిత్యునినుండి రాజ్యమును దీసికొన
లేదు. తరువాత కొలఁదికాలములోనె రాజరాజు చనిపోయి యుండును.

శా. శ. ౯౮౪ ప్రాంతమున వేఁగిదేశము నాక్రమించుకొనవల
యునని, కల్యాణిచాళుక్యులు ప్రయత్నించి రనియు, నాసమయమున
రాజరాజు మేనమామ యగుమధురాంతకచోళరాజేంద్రభూపాలుని పను
పున రాజరాజబ్రహ్మమహారాజును వఱి యిరువురు దండాధిపతులును
బ్రచండ సైన్యముతో వచ్చి కల్యాణిచాళుక్యుల నెదుర్కొనిరనియు,

కలిదిండికడ జరిగినయుద్ధములో నాముగ్గురు సైన్యాధిపతులు చనిపోయిరనియుఁ, దరువాత నా చోళరాజేంద్రుని కుమారుఁడు గొప్ప సైన్యము తో వచ్చి కళ్యాణి చాళుక్యులను దరిమివేసి వేఁగిని నిష్కంటకము గాఁ జేసెననియు శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్యగారు కలిదిండి శాసనపరిష్కరణసందర్భమున భారతిలో (సంపుటము ౩౦ భాగము ౧) వ్రాసియున్నారు. పై విషయములనుబట్టి రాజరాజు పరిపాలనము పువ్వుపాన్పుగ్గాను లేదనియు, నప్పుడప్పుడు శత్రువులదాడులును యుద్ధములును సంప్రాప్తములగుచునే యుండెననియుఁ దెలియుచున్నది.

## రాజరాజు కళ్యాణి చాళుక్యుల సామంతుఁడా ?

రాజరాజు వ్రాయించిన మండకొల్లు శాసనమును విమర్శించుచు రాజరాజు కళ్యాణి చాళుక్యుల సామంతుఁడుగా నుండెనని శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్యగారు భారతీపత్రికలో (స్వభాను-శ్రావణము) వ్రాసియున్నారు. ఈ విషయమున నాకొక్కింత యనుమానము కలుగుచున్నది. రాజరాజు శాసనములలో నెచ్చటను, కళ్యాణిచాళుక్యరాజు యొక్క పేరుగాని, ఆతని విజయరాజ్య సంవత్సర సంఖ్యగాని, చాళుక్య విక్రమ సంవత్సర సంఖ్యగాని యుదాహరింపఁబడలేదు. రాజరాజు పరిపాలనా కాలములో, కళ్యాణి చాళుక్యప్రభుల శాసనములు వేఁగిదేశములో గన్పట్టుటలేదు. ఈ కారణముచే రాజరాజు కళ్యాణి చాళుక్యుల సామంతుఁడని యంగీకరించుటకు మన కొప్పుకున్నయది. కళ్యాణిచాళుక్యప్రభువుల శాసనములలోఁ దాము వేఁగీపురాధీశ్వరులమని చెప్పుకొనియున్నను, వారలకుఁ గల్గిన తాత్కాలికవిజయముల వలన నట్లు వ్రాసికొనిరని యూహింపవలయునే కాని, రాజరాజు వారి యేలుబడి నంగీకరించి వారికి సామంతుఁడుగా నుండెనని తలంచుటకు వీలులేదని నా యూహ. కళ్యాణి చాళుక్యులకు, "సమస్తభువనాశ్రయ, సత్యాశ్రయకుల తిలక" బిరుదము లుండెననియు ఆ బిరుదములను నన్నయభట్టు భారతమున రాజరాజున కుపయోగించె ననియుఁ, దమప్రభువుల బిరుదములను సామంతులు ధరించుట కల

దనియు. దీనినిబట్టి రాజరాజు కళ్యాణి చాళుక్యుల సామంతుఁడని తలంపవలయుననియు శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము. ఈబిరుదములు రాజరాజు శాసనములలో లేవు. భారతమున రాజరాజును సంబోధించు పద్యములలో నన్నయ యుపయోగించినాఁడు. దీనినిబట్టి రాజరాజీ బిరుదములను దన యేలికయొక్క బిరుదములనుగా ధరించినట్లు తలంపరాదని నా యభిప్రాయము. ఇందులో సమస్తభువనాశ్రయ బిరుదమును తూర్పుచాళుక్యులలో రాజరాజు పూర్వులు కొందఱు తమ శాసనములలో వేసికొనియున్నారు. అందుచే నీ బిరుదము ప్రత్యేకము కళ్యాణి చాళుక్యులది యని తలంపరాదు. సత్యాశ్రయుఁడుభయచాళుక్యులకును వంశకర్త. అందుచే నన్నయ భారతమున నాశ్వాసాంతపద్యమున 'సత్యాశ్రయ కులశేఖర' యని రాజరాజును సంబోధించినాఁడు. కళ్యాణిచాళుక్యుల "సత్యాశ్రయ కులతిక" బిరుదమును సామంతుఁడు కావున, రాజరాజునకు వేయవలయు ననునుద్దేశముతో నీశబ్దమును నన్నయ యుపయోగింపలేదని నాతలంపు. ఏలిక బిరుదములను సామంతున కుపయోగింపవలయునని యుద్దేశమున్నచో నా బిరుదములను రాజరాజు శాసనమునందే నన్నయ వేసియుండును.

### రాజరాజు గుణసంపద.

నిత్యసత్యవచనుఁడైన నన్నయమహాకవి, యీ రాజేంద్రుని గూర్చి రచించిన యీక్రిందిపద్యములలోని ప్రతివాక్యమును సత్యమే యని యాతఁ డొనర్చిన ఘనకార్యము లిప్పుడును చాటుచున్నవి.

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే<br>
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా<br>
రాజితసర్వలోకుఁ డపరాజిత భూరిభుజాకృపాణధా<br>
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు గుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిజితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.

చ. ఘనదురితానుబంధకలికాలజదోషతమఃసమూహసంహతిం
దనయుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానుగం
జన మగురాజ్యసంతతవసంతనితాంతవిహారి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై.

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషి వి
ద్యాశ్రితతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ వహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

సీ. నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచు
బరమండలంబుల ధరణిపతుల
నదిమి కప్పంబుల మానముతోఁ గొనుచును
బలిమి నీయనిభూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
వెలిఁగించుచును విప్రకులము నెల్లఁ
బ్రోచుచుం శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ. చారుతరమహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁ జేయు బెల్లు మనుమార్గుఁ డగువిష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

భారతమందలి యాశ్వాసాద్యంతపద్యములను విమర్శన పూర్వకముగఁ జదివితిమేని రాజరాజు బిరుదములును నాతని మతము, సామర్థ్యము, భాషానురక్తి, ప్రజాపరిపాలనా సౌష్ఠవము మొదలగు సుగుణములు దెలియఁగలవు.

### రాజరాజు శాసనములు.

రాజరాజు వ్రాయించిన వానిలో కోరుమిల్లి, కలిదిండి, మండ, నందంపూడి శాసనములు వ్యాఖ్యానములతోఁగూడఁ బ్రకటింపఁబడినవి.

కోరుమిల్లియను గ్రామమును, ఆపస్తంబసూత్రుఁడును, భారద్వాజగోత్రుఁడును నైన చీదమార్యుఁడను బ్రాహ్మణునకు దానముచేసెను. ఈ గ్రామము గోదావరిమండలమున రామచంద్రపురము తాలూకా మానివాసగ్రామమగు కపిలేశ్వరపురమునకు తూర్పుదిక్కున నున్నది. నందంపూడి శాసనమును గూర్చి నారాయణభట్టుచారిత్రమున వ్రాయనున్నాఁడను.

వేఁగిదేశముపై దండెత్తి వచ్చుచున్న శత్రువుల నెదుర్కొనుటకై తనకు సాహాయ్యముగాఁ దనమామగా రయిన రాజేంద్రచోళుఁడు దక్షిణదేశమునుండి రాజరాజబ్రహ్మమహారాజను బ్రాహ్మణదండనాయకుని యొక్కయు మఱి యిరువురు దక్షిణదేశ దండనాయకుల యొక్కయు నాధిపత్యమున నొకప్రచండ వాహినిని బంపఁగా కలిదిండికడ జరిగిన ఘోరయుద్ధమున నా దండనాయకులు మువ్వురును స్వర్గమలంకరించినందున వారికిఁ బుణ్యలోకావాప్తికొఱకు శివాలయాదులు నిర్మించి వానిసంరక్షణకై కలిదిండి మొదలుగా మూఁడు గ్రామముల నిచ్చి రాజరాజు వ్రాయించినశాసనము కలిదిండి శాసనమని పిలువఁబడును. కలిదిండి కృష్ణామండలములోని కైకలూరుతాలూకాయం దున్నది. ఈ గ్రామములు మూఁడిటికిఁ గలిపి మధురాంతకవల్లూరని శాసనమున నామకరణము చేసినను నవి యిప్పుడా నూతననామమునఁ బిలువఁబడక పూర్వనామముననే వ్యవహరింపఁబడుచున్నవి. శాసనకాలము శా. శ. ౯౬౨ ప్రాంతమైయుండునని శ్రీ నేలటూరి వెంకటర

మణయ్యగా రూహించియున్నారు. (భారతి సం. ౨౦ భా. ౧. ఈ శాసనకావ్యకర్త చేతనభట్టు ఈకాలము సత్యమయ్యెనేని, చేతనభట్టు క్రీ. శ. ౧౦౪౨ వఱకును జీవించియున్నాఁడని తలంపవచ్చును నందంపూఁడిశాసన కాలము రాజరాజురాజ్యవర్షములు ౩౨ వ సంవత్సరమున వ్రాయఁబడినది. రాజరాజు రాజ్యప్రారంభకాలము శా. శ. ౯౪౨ అని యొకలెక్కవలన తేలినది. దానినిబట్టి నందంపూఁడి శాసనకాలము శ. ౯౭౪ (క్రీ. శ. ౧౦౫౨) అగును. నందంపూఁడి శాసనమున రాజరాజు పట్టాభిషేక కాలము శ. ౯౪౪ అని చెప్పఁబడినందున నా లెక్కలనుబట్టి గణనము చేసినచో నా శాసనకాలము శ ౯౭౬ (క్రీ.శ. ౧౦౫౪) అగును. చేతనభట్టునకుఁ బిమ్మట ననఁగా క్రీ. శ. ౧౦౪౨–౧౦౫౨ నడుమ శాసన రచనాధికారము నన్నయభట్టునకు వచ్చియుండునని తలంపవలసి యున్నది.

మండశాసనమున మండయను గ్రామమును భారద్వాజగోత్రుఁడును, నాపస్తంబసూత్రుఁడును, శివకుమార భట్టుని పౌత్త్రుఁడును, రామదేవుని తనయుఁడునగు "అంకయ్య"యను బ్రాహ్మణునకు దానమిచ్చినట్లు వ్రాయఁబడినది. ఇతఁడు సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజ బిరుదముచేఁ బ్రసిద్ధుఁడఁట. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారీశాసనము, నందంపూఁడి శాసనముకంటె సంగ్రహముగా నున్నందున దాని తరువాత వ్రాయఁబడినదని సిద్ధాంతము మొనర్చుచు, నందంపూఁడి శాసన కాలమునకును రాజరాజు మరణకాలమునకును నడుమ సూర్యగ్రహణములు వచ్చినదినముల నీవిధముగా నిచ్చియున్నారు. రాజరాజు క్రీ. శ. ౧౦౬౧ లోనో ౧౦౬౨లోనో చనిపోయినాఁడు.

| | | | |
|---|---|---|---|
| (౧) | ౨౩ | నవంబరు | ౧౦౫౨ |
| (౨) | | ,, | ౧౦౫౩ |
| (౩) | ౧౦ | మే | ౧౦౫౪ |
| (౪) | ౨ | నవంబరు | ౧౦౫౪ |
| (౫) | ౨౨ | అక్టోబరు | ౧౦౫౫ |

| | | | |
|---|---|---|---|
| (౬) | ౧౨ | సెప్టెంబరు | ౧౦౫౬ |
| (౭) | ౨౨ | ఆగస్టు | ౧౦౫౮ |
| (౮) | ౧౫ | ఫిబ్రవరి | ౧౦౫౮ |
| (౯) | ౧౦ | ఆగస్టు | ౧౦౫౯ |
| (౧౦) | ౨౦ | జూన్ | ౧౦౬౦ |

నందివెలుగు వెలివేరు శాసనముల (A. R. 1920 నె 668-671) లో రాజరాజు నామ మువాహరింపఁబడి యుండుటచేతను, నందు రాజరాజు విజయరాజ్య సంవత్సరములు 32-41 అని యువాహరింపఁబడి యుండుటవలనను, రాజరాజు క్రీ శ ౧౦౬౧ వఱకు జీవించి యున్నాఁడనునది స్పష్టవిషయము అటు పిమ్మట నీతని పేరు వినఁబడ లేదు మండశాసనము, పైని గనుపఱచిన తేదీలలో నేదియో యొక సూర్యగ్రహణమునాఁడు వ్రాయించిన దని చెప్పఁదగియున్నది. ఈశాసన కావ్యకర్త నన్నయభట్టే కావున నాతఁ డప్పటికిని జీవించి యున్నాఁడు. ఈ మండగ్రామ మిప్పుడు తూర్పుగోదావరిమండలములో రామచంద్రపురము తాలూకాయందు మాడవాపగ్రామమగు కపిలేశ్వరపురము గ్రామమున కుత్తరమునఁ బదిమైళ్లలో మండపేట యను పేరున వ్యవహరింపఁబడుచున్నది.

రాజరాజు గణితశాస్త్రము నాంధ్రమున రచించిన పావులూరి మల్లనకుఁ బితామహుఁడైన మల్లనకు గోదావరి మండలములోని నవఖండవాడ యను గ్రామము నగ్రహారముగా నిచ్చియుండెను.

రాజరాజునకు రేవలదేవి యను భార్యయుండిన ట్లామె కుమార్తె సోమలదేవి వ్రాయించిన యొక శాసనము (ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౦౭) వలనఁ దెలియుచున్నదని కొందఱు పండితులు వ్రాసియున్నారు. ఆ శాసనమును జదివిచూడఁగా నీ విషయము సంశయాస్పదముగాఁ గనుపట్టినది ఆ సోమలదేవి రాజరాజు కుమార్తె కాదనియు నాతని సవతిసోదరుఁడైన విజయాదిత్యుని కుమార్తె యనియు నా యభిప్రాయము. ఆచర్చ యిట నప్రస్తుతమని విడచితిని. రాజ

రాజనరేంద్రుఁడు నన్నయభట్టున కగ్రహారాదికము నిచ్చి యేల గౌర
వింప లేదని కొందఱడుగుచున్నారు. అగ్రహారముల నిచ్చెనో లేదో
మనకుఁ దెలియదు. భారతరచనము పూర్తియైన పిమ్మట నీయవచ్చు
నని తలంచినాఁడేమో! కాక యిచ్చియున్నను నా శాసనములు
బయలుపడలేదో చెప్పఁజాలము.

ఈ రాజరాజనరేంద్రునిపైఁ జిత్రాంగి మోహమున సారంగధరు
ని చేతులను పాదములను నరికించి పాపకార్యమొనర్చెనని యొక యప
వాద మాంధ్రదేశమునఁ బ్రచారములో నున్నది. కాని యందణుమా
త్రమును సత్యము లేదు. ఇతనికి రత్నాంగి చిత్రాంగి యను భార్యలును
లేరు. సారంగధరుఁ డను కుమారుఁడును లేఁడు. ఇందును గూర్చి
చేమకూర వెంకటకవి చారిత్రమున విపులముగా వ్రాసెను. నిర్మల
వర్తనుఁ డగు నీమహారాజా యపకీర్తినుండి విముక్తి నందెడుగాత!

సప్తమవిజయాదిత్యుఁడు:— రెండవ యుద్ధమల్లునికొడుకగు బాడ
పరాజను నామాంతరముగల విజయాదిత్యునిఁ గూడ లెక్కించుకొని
కొందఱు చరిత్రకారులీతనిని నెనిమిదవ విజయాదిత్యుఁ డనుచున్నారు.
ఇతఁడు రాజరాజునకు సవతిసోదరుఁడు. ఈతనిని గూర్చి కొన్ని వాక్య
ములు పైని వ్రాసియుంటిమి. రాజరాజునకు దరువాత, వేఁగిసింహాసన
మాతనికుమారుఁడైన రాజేంద్రచోళునకు (ఇతనినే మొదటి కుళోత్తుం
గచోడుఁ డందురు.) గావలసియుండఁగా, నీవిజయాదిత్యుఁ డాక్రమిం
చుకొనియెను. కులోత్తుంగ చోడుఁడు చోళసింహాసనసంపాదనార్థము
దక్షిణమునకుఁ బోయి యుండుటచే నీ వేఁగిసింహాసన మీవిజయాదిత్యు
నిపాలఁ బడియెను. కులోత్తుంగున కటు చోళసింహాసనమునుగూడ
లేకుండఁబోయి, యెనిమిదిసంవత్సరము లుభయభ్రష్టుఁడై యున్నట్లు
కన్పట్టుచున్నది.

ఈ విజయాదిత్యుఁడు వేఁగిరాజ్యమున విశేషకాలముండ లేదు. ఆ సింహాసనమునఁ దనకుమారుఁ డైన ఇమ్మడిశక్తివర్మను బట్టాభిషిక్తుఁ జేసినట్లు శక్తివర్మ శాసనములోని యీక్రింది శ్లోకములవలనఁ దెలియుచున్నది.

యోరుహ్యాస్వకమాదరా దతితరా ముత్తుంగసింహాసనం
పిత్రా నిర్జితశాత్రవేణ విజయాదిత్యేన నిత్యోజసా,
పుత్రప్రేమహా ప్రియప్రణమనసా సామ్రాజ్యపట్టం భువో
యస్మిన్నస్య ప్యతి మాయుగం సమవతి వ్యాయేన సర్వాప్రజాః.

తనతండ్రి శత్రువులను జయించి సంపాదించిన రాజ్యమును పుత్రప్రేమచేఁ దన కిచ్చె నని శక్తివర్మ చెప్పుకొనినాఁడు కాని తండ్రిచే జయింపఁబడిన శత్రువు లెవ్వరో తెలియ లేదు. బహుశః రాజరాజు తనయుఁ డగు కులోత్తుంగుఁడో, కాక యాతనిపక్షము వహించిన సామంతరాజులో అయియుందురు. ఈ యిమ్మడి శక్తివర్మ యొక్క పట్టాభిషేకకాల మీక్రింది శ్లోకమువలన స్పష్టపడు చున్నది.

గుణవసునిధి సంఖ్యాం యాతి శాకాబ్దవర్గే
దివసకృతితులాస్థే యోధవా ద్రాజ్యలక్ష్మీం,
స్థిరతర మసుధా శుక్లపక్ష ద్వితీయా
యుజిసుర గురువారే కుంభలగ్నే ఒభిషిక్తః

శకాబ్దములు ౯౮౩ గతించఁగా, సూర్యుఁడు తులారాశియం దుండ శుక్లపక్షవిదియా గురువారమునాఁ డనూరాధా నక్షత్ర కుంభలగ్నమున నిపట్టాభిషేకము జరిగినది. ఇమ్మడిశక్తివర్మ ఒకసంవత్సరము కంటె నెక్కువకాలము సింహాసనమునం దున్నట్లు కన్పట్టదు. చేదిదేశాధీశుఁ డగుయశః కర్ణదేవుఁ డీయిమ్మడిశక్తివర్మను జంపి, దేశమును కొల్లగొట్టి పోయెనని తెలియుచున్నది పిమ్మట విజయాదిత్యుఁడే వఱల రాజ్యభారమును వహించి పరిపాలించెను. శక్తివర్మను జంపినవాఁడు చోడరాజగు వీరరాజేంద్ర చోడుఁ డని కొందఱి మతము.

చోళసింహాసనమున, కులోత్తుంగచోడుని మేనమామలగు గడపటి యాతఁడు శా. శ ౯౯౧ వఱకును నుండెను. ఈ కాలమున వారు బలహీనులుగా నుండుటచే, వారికి శత్రువులగు పశ్చిమ చాళుక్యులవలన యొత్తిడి యధికముగా నున్నందున నత్యంతపరాక్రమశాలి యగు కులోత్తుంగచోళుఁడు సర్వదా దక్షిణముననె యుండి చోళసింహాసనమును గాపాడుచుండుటకు శా. శ. ౯౯౧ వ సంవత్సరమునందు చోళసింహాసనమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. (ఇతని మాతామహుని వంశీయులే అప్పటివఱకు నీతని కారాజ్యమును స్వాధీనము కానీయ లేదని కొందఱ నుచున్నారు.) తత్కారణమే వేఁగిసింహాసనమునుగూడ తానవతిపినతండ్రియైన సప్తమవిజయాదిత్యుని నుండి తీసికొని తా నధిపతియయ్యెను, పినతండ్రిపై ద్వేషము వహింపక యాతనినే, వేఁగిదేశమునఁ దనకుఁ బ్రతినిధిగా నియమించి తాను చోళదేశమునకుఁ బోయియుండెను.

ద. హిం. శా. సం ౪ సంఖ్య ౧౨౪౩ గలయొక శాసనములో "సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజుల విజయరాజ్య సంవత్సరములు ౨. చక్రవర్తి శ్రీ విజయాదిత్యదేవర నిరవద్య ప్రవర్ధమానవచ్చి వేంగి మండలమున ప్రజలకు రాజరాజ మర్యాదనిచ్చి" అని యుండుటచే పై యంశములు ధ్రువపడుచున్నవి. గుంటూరుమండలమందలి మల్లేశ్వరస్వామికి ధర్మమొసంగి శా. శ. ౯౯౬ వ సంవత్సరమున నీ విజయాదిత్యుఁడు వ్రాయించిన శాసనము (ద. హిం. శా. సం. ౬ సంఖ్య ౨౮౬) కూడ పై యంశములను ఋజువు చేయుచున్నది. విజయాదిత్యుని ర్యాలి శాసన మీతని మొదటియేడు సంవత్సరములలోని దగుటచే నీ కులోత్తుంగుని నామ మందులేదు. తాను స్వతంత్రుఁడుగా నైననేమి, కులోత్తుంగచోడుని ప్రతినిధిగా నైననేమి, యీవిజయాదిత్యుఁడు పదునైదు సంవత్సరములు వేఁగిదేశమును పరిపాలించి శా. శ. ౯౯౮ ప్రాంతమున నిహలోకమును వీడిపోయెను.

ఈ సందర్భమున శాసనములను బరిశోధించుటలో గమనింపవలసిన విషయమును గూర్చి యొకింత చెప్పవలసియున్నది. రాజరాజు

యొక్కయు, విజయాదిత్యుని యొక్కయు, మొదటికులోత్తుంగచోడుని యొక్కయు శాసనములలో సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుని విజయరాజ్య సంవత్సరములసంఖ్య యుదాహరింపఁబడుచున్నది. ఈ మువ్వురకును గూడ సర్వలోకాశ్రయవిష్ణువర్ధన బిరుదమున్నది. ఈ బిరుదము వంశ పరంపరగా వచ్చుచున్నది. ఈ బిరుదమును వీరి వంశీయులు పదునే డవ శతాబ్దిమువఱకును వేసికొనుచు వచ్చిరి.

పై మువ్వురిశాసనములలోను, ఉదాహరింపబడిన సంఖ్యను బట్టి యొకవత్సరము మించుమించుగా శా. శ ౯౪౨ వ సంవత్సరము రాజ్య ప్రారంభకాలముగా నేర్పడినచో నది భారతకృతిపతియైన రాజరాజు శాసనమనియు, శా. శ. ౯౮౩ వ సంవత్సరముగా నేర్పడినచో నది విజయాదిత్యుని శాసనమనియు, శా. శ. ౯౯౧ వ సంవత్సరముగా నేర్పడినచో నది మొదటికులోత్తుంగుని శాసనమనియు గ్రహింపఁదగి యున్నది. విజయాదిత్యుని శాసనములలో మాత్ర మింకొక భేద మున్నది. విజయాదిత్యుఁడు శా. శ. ౯౮౩ మొదలు స్వతంత్రము గాను, ౯౯౧ మొదలు కులోత్తుంగునిపక్షమునఁ బ్రతినిధిగాను వేఁగి దేశమును బరిపాలించి యుండుటచే, నాతని శాసనములలో కొన్నిటిలో సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుని రాజ్యసంవత్సరములని శా. శ. ౯౯౧ మొ దలుగా లెక్కించి కులోత్తుంగునిరాజ్యసంఖ్య నుదాహరించియున్నారు. అట్టిశాసనములను రెండిటిని పైని నుదాహరించి యున్నాఁడను. కొన్ని శాసనములలో నాతని ప్రతినిధిత్వమును లెక్కలోనికిఁ దీసికొనక యా తని విజయరాజ్యసంవత్సరములు ౯౮౩ మొదలు లెక్కించి, కులోత్తుంగ చోడుఁడు పట్టాభిషిక్తుఁడైనపిమ్మటకూడ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల రాజ్యసంవత్సరములని విజయాదిత్యుని రాజ్యసంఖ్యయే యుదాహరింపఁబడినది. ఉదాహరణమున కట్టివి రెండు శాసనముల నుదాహరించెదను. (౧) గణపేశ్వరము కుమారస్వామి శాసనము శా. శ. ౯౯౮ సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుని రాజ్యసంవత్సరములును ౧౧ (౨) శేకిదేవి శాసనము శా. శ. ౯౯౫ స॥ వి॥ రాజ్యసం॥ ౧౩ (ద.

హిం. శా. సం॥ ౪ సంఖ్య ౧౦౧౧) సామాన్యముగా నిట్టిశాసనములు విజయాదిత్యుఁడు స్వయముగా వ్రాయించినవిగాక అతనిపేర నుదాహరించి యితరులచే వ్రాయింపఁబడినవిగా నుండును.

విజయాదిత్యుఁడు శా. శ. ౯౯౮ లో కాలధర్మము నొందిన పిదప వేఁగిదేశపరిపాలనమునకై కులోత్తుంగ చక్రవర్తి తనపెద్దకుమారుఁడైన రాజరాజును పంపించెను. అతనిపట్టాభిషేకము శా. శ. ౯౯౮ కర్కాటకమాసమున బహుళదశమీ బుధవారమునాఁడు తులాలగ్నమున (౨౭ జూలయి ౧౦౭౭ వ సం॥) జరిగినది. ఈతనిని పంపించునప్పుడు కులోత్తుంగచోడుఁడు పలికిన మాటలుగా నీక్రిందివాక్యములు కాలేరు శాసనమున (ద. హిం. శా. సం॥ ౧ సంఖ్య ౩౮) నుదాహరింపఁబడినవి.

"మయా వేంగీమహారాజ్యం చోడరాజ్యాభిలాషిణా మత్పితృవ్యే పురా న్యస్తం విజయాదిత్యభూభుజి సచ పంచదశాబ్దాని పంచాననపరాక్రమః మహీం రక్షన్మహీనాథో దివం దేవోపమో గతః"

దీనినిబట్టి శా. శ. ౯౮౨ లోనో ౯౮౩ లోనో రాజరాజు గతించియుండుననియు, తాను చోడరాజ్యాభిలాషియై వేంగీ రాజ్యమును తనపినతండ్రియైన విజయాదిత్యునిపైఁ దానే యుంచితిననియు, పదునైదుసంవత్సరము లాతఁడు వేఁగీరాజ్యమును సంరక్షించి దివంగతుఁడయ్యె ననియు కులోత్తుంగుఁడే చెప్పియున్నట్లు తెలియుచున్నది. కులోత్తుంగుఁడు గౌరవముకొఱకట్లు చెప్పెనేకాని, యది యంతయు సత్యమైనట్లు కన్పట్టదు. ఇది నిజమయ్యెనేని విజయాదిత్యుఁడు ర్యాలి శాసనాదులయందు తాను మహారాజునని ప్రకటించుకొనుటయు, తన కుమారుఁడైన శక్తివర్మను పట్టాభిషిక్తునిజేయుటయు, శక్తివర్మశాసనములలో "పరోక్షే రాజరాజస్య" "సజ్జితశాత్రవేణ" అనియుండుటయు, శా. శ. ౯౯౧ వ సంవత్సరమునకుఁ బిమ్మట శాసనములలో కులోత్తుంగుని రాజ్యసంవత్సరములసంఖ్య విచ్చుటయు సంభవింపదు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు కాకతీయాంధ్రరాజ యుగచరిత్రమున నీవిషయమునం దొకింత భిన్నాభిప్రాయమును గనుపఱచుచు శక్తిశర్మ శాసనాంశ

ము లందలి సత్యాసత్యములను శంకించియున్నారు. ఆ వివాదాంశములను చర్చించుట కిట తావుచాలదు. విజయాదిత్యుఁడు పశ్చిమ చాళుక్యుల కడ సేనాధిపతిగను నొలంబవాడివిషయపరిపాలకుఁడై వారి సామంతుఁడుగను నుండియుండెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. అదికూడ వివాదాంశమై యున్నది. విజయాదిత్యుఁడు తనకుమారుఁడైన శక్తివర్మ మరణానంతరము అనఁగా శా. శ. ౯౭౨ మొదలు వేఁగిదేశమునందే యుండెనుకదా! రాజరాజు జీవితకాలములోను, శక్తివర్మ మరణము వఱకును విజయాదిత్యుఁడు పశ్చిమచాళుక్యులతో నుండెనని చెప్పవలసి యున్నది. ఈ విషయమై చరిత్రకారులలో భిన్నాభిప్రాయములున్నవి. వానినన్నిటిని చర్చించి సత్యాన్వేషణముచేయుట యప్రస్తుతప్రసక్తి యగునని విడచితిమి. ఈ విషయములను వ్రాసి యిదివరకే యతివిస్తృతము లయిన యీ రాజుల కథలచే నన్నయచారిత్రము నింకఁ బొడిగింపఁజాలను.

రాజేంద్రచోళుఁడు:— ఇతఁడు భారత కృతిపతియైన రాజరాజు కుమారుఁడు. ఇతనికి మొదటి కులోత్తుంగచోడుఁడని నామాంతరము కలదు. ఇతఁడు శా. శ. ౯౯౧ లో పట్టాభిషిక్తుఁడయ్యెనని పైని వ్రాసియుంటిని. ఇతఁడు ౪౯ సంవత్సరములవిచ్ఛిన్నముగా రాజ్యము చేసెను. వేఁగిచోళదేశములు రెండిటికిఁ గూడ నితఁడు పరిపాలకుఁడుగా నుండెను. ఇతఁడు మిగుల పరాక్రమశాలి. కళింగ, కుంతల, కేరళ, పాండ్యదేశములను గూడ జయించి యా దేశాధిపతులను సామంతులనుగాఁ జేసికొనియెను. ఇతఁడు తన మేనమామయైన రాజేంద్రదేవుని కుమార్తెయగు మధురాంతకదేవిని బరిణయమై యామెయం దేడుగురు తనయులను బడసెను. అందు మొదటివాఁడగు రాజరాజచోడగంగు వేఁగిదేశమున రాజప్రతినిధిగాఁ దండ్రిచే నియమింపఁబడి యొక సంవత్సరముండి పిదప తండ్రికడకుఁ బోయెను. గోదావరిమండలములోని రామచంద్రపురము తాలూకాయందలి చేకి గ్రామమున లభించిన శాసనమువలన నీ సంగతి తెలియుచున్నది.

చోడగంగునకుఁ బిమ్మట, కులోత్తుంగచోళుని మూఁడవ కుమారుఁడైన వీరచోడుఁడు వేఁగిదేశమునకు రాజప్రతినిధిగా శా. శ. ౧౦౦౧ సింహ మాస శుక్లత్రయోదశి గురువారమున పట్టాభిషిక్తుఁడై, క్రీ. శ ౧౦౯౩ వ సంవత్సరము వఱకును పాలించెను. చేకి, కాలేరు, పిఠాపుర శాసనము లీతనివే. ఇతని తరువాత కులోత్తుంగచోడుని నాల్గవకుమారుఁడైన విక్రమచోడుఁడు రాజప్రతినిధిగా నియమింపబడి తండ్రి చనిపోవువఱకును అనఁగా క్రీ. శ. ౧౧౧౮ వఱకును, వేగిదేశమును బరిపాలించెను. కులోత్తుంగునినామ ముదాహరింపబడిన శాసనము లనేకములున్నవి. గ్రంథవిస్తరభీతిచేఁ బ్రఖ్యాతచారిత్రుఁడగు నీతనిఁగూర్చి యధికముగ వ్రాయఁజాలను. కులోత్తుంగునకుఁ బిమ్మట వేఁగిదేశపరిపాలకుల చరిత్రము వారితో సంబంధముగల కవుల చారిత్రమునఁ జెప్పఁబడును.

రాజరాజచోడగంగు యొక్కయు, వీరచోడుని యొక్కయు శాసనములలో వారి రాజధాని జననాథనగరమని యున్నది. జననాథనగరము రాజమహేంద్రవరమునకు నామాంతరమని కొందఱనుచున్నారు. ప్యూరెల్ పండితుఁడు కాకినాడను జేరియున్న జగన్నాథపురమని వ్రాసియున్నాఁడు. కాని, కొన్ని శాసనములలో దాక్షారామము జననాథనగరమని వ్రాసియున్నారు. ఈ యిరువురు రాజులును, ఆ కాలమున దాక్షారామమును రాజధానిగఁ జేసికొని యుండురని యూహింపఁదగియున్నది.



# ౨. నారాయణభట్టు

ఆంధ్రభాషలో, నేకవి రచించిన కావ్యము యొక్క పేరయినను మనకుఁ దెలియదో, ఆకవి చారిత్రము నీ గ్రంథమున వ్రాయుట యనగత్యమని మా నిశ్చయము కాని యీ ప్రతిజ్ఞ కపవాదము లేకపోలేదు. గ్రంథనామములు తెలియకపోయినను, ఏ వయిన గ్రంథములను రచించి యుండుననియు, రచియింప సమర్థుఁడనియు, కవులలోఁ జేర్పఁ బడఁదగినవాఁ డనియుఁ దోఁచిన వారి చారిత్రములను గూడ నిందు జేర్చుటవలన, వారి వృత్తాంతము కొంత లోకమెఱింగి వారి గ్రంథములను సంపాదింపఁ బాటుపడునని తలంచి, యట్టివారిఁ గొందఱి నిందుఁ జేర్పఁదలపెట్టితిమి. నారాయణభట్టీ తరగతికిఁ జెందినవాఁడు.

## భారతరచనసాహాయ్యము.

ఇతఁడు మహాభారతనిర్మాత యగు నన్నయభట్టునకు సహాధ్యాయుఁడు భారతరచనమునం దాతనికిఁ దోడుపడినవాఁడు. సంస్కృతాంధ్ర కర్ణాటాది భాషలలోఁ గవిత్వము చెప్పఁగల పండితుఁడు. ఇట్టి వారిచారిత్రము లిందుఁ జేర్పకుండ నెట్లుండఁగలము ?

ఈతనినిగూర్చి భారతకృత్యాదియందు నన్నయభట్టు క్రింది పద్యమును జెప్పియున్నాఁడు.

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
  రాయణునట్లు దానును ధరామరవంశవిభూషణుండు నా
  రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడుం సహా
  ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.

భారతయుద్ధములో, నర్జునునకు శ్రీకృష్ణునివలె భారతరచనమునం దనకు నారాయణభట్టు దోడయినట్లిందు నన్నయ చెప్పియున్నాఁడు. ఈ యుపమానమునుబట్టి నారాయణభట్టునందు నన్నయ కెంతగౌరవమున్నదియు స్పష్టమగుచున్నది. అర్జునునివలెనే యసాధ్యఘట్టము

లలో నారాయణభట్టు సాహాయ్యమువలన నన్నయ, యీ ఘనకార్యమును నిర్వహించి సఫలీకృతమనోరథుఁడై కీర్తికాయుఁ డయ్యెనని తలంపవలసియున్నది.

## వంశవర్ణనము

నారాయణభట్టు గృహనామము "వానస" వారు. నన్నయ రచించిన పై పద్యములోని "వానను" అనుశబ్దమునకు బదులుగా దక్షిణదేశమునుండి సంపాదింపఁబడి యాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున నుంచఁబడిన యొకప్రతిలో "మానస" అనియున్నది. "వానస" యనుటకు బదులుగా విలేఖకుఁడు పొరబాటున "మానస" అని వ్రాసియుండును. "దానును" అను పాఠముకంటె "వానస" పాఠమే సమంజసమని తోఁచుచున్నది.

మడికిసింగనకవికృత పద్మపురాణమును గృతినందిన కంచనమంత్రి యింటిపేరుకూడ "వానస" వారే. కాని యాతఁడు కాశ్యపగోత్రుఁడు. ద్రాక్షారామమందున్న యొకశాసనములో (ద. హిం. శా. సం. ౬. సంఖ్య ౧౦౪౨) "దాక్షారామ నివాసః కాశ్యపగోత్రో...గామచమూపః నాగనశర్మపుత్రో వానసభూదేవవంశవారిజమిత్రః అల్లనశౌరిః" అనియున్నది. కాని నారాయణభట్టు హరితసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. వానసవారిలో రెండు మూఁడు గోత్రముల వారుండియుందురు. హైదరాబాదు గవర్నమెంటువారు ప్రకటించిన నాగాయి శాసనములలో దాతలయిన గోవిందరాజు మొదలయినవారు కూడ వానసవంశీయులే. వారు పశ్చిమచాళుక్యులకడ మంత్రులుగను దండనాయకులుగ నుండిరి. కాని వారు వసిష్ఠగోత్రులయినట్లు కన్పట్టుచున్నది. నారాయణభట్టుతండ్రి కోచాంజనేయుఁ డనునామాంతరముగల శంకనామాత్యుఁడు. తల్లి సామెకాంబ. పితామహుఁడు కంచెనార్యుఁడు. ప్రపితామహుఁడు కంచెన సోమయాజి. తండ్రికమాత్యశబ్దము నుపయోగించుటచే నారాయణభట్టు నియోగిశాఖాబ్రాహ్మణుడని చెప్పవలసియున్నది.

## నందంపూండి శాసనము.

మహాభారతకృతిపతియైన రాజరాజనరేంద్రుఁడు నారాయణ భట్టునకు నందంపూండియను గ్రామము నగ్రహారముగా నొసంగి యొక తామ్రశాసనమును వ్రాయించినాఁడు. ఆశాసనమందలి గద్యపద్యము లను రచియించినవాఁడు నన్నయభట్టు. ఆశాసనమువలన నారాయణభట్టు వృత్తాంతమును, రాజరాజ నరేంద్రుని వంశావళియుఁ దెలియుచుండు టచే గ్రంథవిస్తరభీతి యున్నను, నా శాసనము నిట వ్రాయుచు న్నాఁడను.

శ్రీ ధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో
ర్నాభీపంకరుహా ద్బభూవ జగతస్స్రష్టా స్వయంభూ స్తతః॥
జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మునే రత్రిత
స్సోమో వంశకర స్సుధాంశు రుదిత శ్శ్రీకంఠచూడామణిః॥
తస్మా దాసీ త్సుధాసూతే ర్బుధో బుధనుత స్తతః
జాతః పురూరవానామ చక్రవర్తీ సవిక్రమః॥
తస్మాదాయు రాయుషో నహుషః నహుషా ద్యయాతిః
చక్రవర్తీ వంశకర్తా తతః ప్రాచీశః ప్రాచీశా త్సైన్యయాతిః
సైన్యయాతే ర్హయపతిః హయపతే స్సార్వభౌమః
సార్వభౌమా జ్జయసేనః జయసేనా న్మహాభౌమః
మహాభౌమా దైశానకః ఐశానకా త్క్రోధానసః
క్రోధానసా ద్దేవకిః దేవకే ర్రిభుకః రిభుకా ద్రిక్షకః
ఋక్షకా న్మతివరః వర స్సత్రయాగయాజీ సరస్వతీ నదీనాథః
తతః కాత్యాయనః కాత్యాయనా న్నీలః నీలా ద్దుష్యంతః
తత్సుతః ఆర్యా గంగాయమునాతీరే యదవచ్ఛిన్నమ్
నిఖాయ యూపా న్క్రమశః కృత్వా తథా శ్వమేధా న్నామ
మహాకర్మ భరత ఇతి యో లభత। తతో భరతా ద్భూమన్యుః।
భూమన్యో స్సుహోత్రః సుహోత్రా ద్ధస్తీ। హస్తినో విరోచనః
విరోచనా దజమీలః। అజమీలా త్సంవరణః సంవరణస్య

తపనసుతా యాస్తపత్యాశ్చ సుధన్వా। సుధన్వనః పరిక్షిత్
పరిక్షితో భీమసేనః భీమసేనా త్ప్రదీపనః ప్రదీపనా చ్ఛంతనుః
శంతనోర్విచిత్రవీర్యః విచిత్రవీర్యా త్పాండురాజః పుత్రా స్తస్యచ
ధర్మజ భీమార్జున నకులసహదేవాః పంచేంద్రియవత్ పంచస్వ
ర్విషయగ్రాహిన స్తత్రం.

వృత్తం॥ యే నాదాహి విజిత్య ఖాండవమథో గాండీవినా వజ్రిణం
యుద్ధే పాశుపతాస్త్ర మంధకరిపో శ్చాప్తలాభి ర్దైత్యాః బహవః॥
ఇంద్రార్ధాసనమధ్యరోహిజయినా యత్కాలి కేయాదికా
స్హా త్వా స్వైర మకారివంశవిపినచ్ఛేదః కురూణాం విభోః॥

తతోర్జునా దభిమన్యుః। అభిమన్యోః పరిక్షిత్। పరిక్షితో
జనమేజయః జనమేజయాత్ క్షేముకః। క్షేముకా న్నరవాహనః।
నరవాహనా చ్ఛతానీకః। శతానీకా దుదయనః। తతః పరం తత్ప్ర
భృతి ష్వవచ్ఛిన్నసంతానే ష్వయోధ్యాసింహాసనాసీనే ష్వేకోన
షష్టి చక్రవర్తిషు గతేషు.

తద్వంశ్యో విజయాదిత్యో నామరాజా విజిగీషయా। దక్షిణా
పథం గత్వా త్రిలోచనపల్లవ మధిక్షిప్య దైవదుర్విహాయా లో
కాంతర మగమత్। తస్మిన్సంకులే పురోహితేన సార్ధమంతర్వత్నీ
తస్యమహాదేవీ ముడివేమునామాగ్రహార ముపగమ్య। త
ద్వాస్తవ్యేన విష్ణుభట్టసోమయాజినా। దుహితృనిర్విశేష మభి
రక్షితాసతీ। విష్ణువర్ధనన్నామ ప్రసూయ। తస్యచ। కుమారకస్య।
మానవ్యసగోత్ర హారీతీపుత్ర ద్విపక్షగోత్రక్రమోచితాని।
కర్మాణికారయిత్వాత మవర్ధయత్. సచ మాత్రావిదితవృత్తాం
తస్స న్నిర్గత్య చలుక్యగిరౌ నందాం భగవతీం గౌరీ మారాధ్య
కుమారనారాయణ మాతృగణాన్ సంతర్ప్య శ్వేతాతపత్త్రైక
శంఖపంచమహాశబ్ద పాలికేతన ప్రతిఢక్కావరాహలాంఛన
పింఛకుంతసింహాసన మకరతోరణ కనకదండ గంగాయము

నాదీని స్వకులక్రమాగతాని నిక్షిప్తా నీవ తత్సామ్రాజ్యచిహ్నాని
సమాదాయ కదంబగంగాదిభూమిపాన్నిర్జిత్య సేతునర్మదామధ్యం
సార్ధసప్తలక్షం దక్షిణాపథం పాలయామాస.

శ్లోకః॥ తస్యాసీద్విజయాదిత్యో విష్ణువర్ధనభూపతేః,
పల్లవాన్వయజాతాయాం మహాదేవ్యాశ్చ నందనః.

తత్సుతః పొలకేశివల్లభః తత్పుత్రః కీర్తివర్మా తస్యతనయః
స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యస గో
త్రాణాం హారీతీపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం
మాతృగణ పరిపాలితానాం స్వామిమహాసేన పాదానుధ్యాతానాం
భగవన్నారాయణ ప్రసాదసమాసాదిత వరవరాహలాంఛనేక్షణ
క్షణవశీకృతారాతి మండలానా మశ్వమేధావభృథస్నాన ప
విత్రీకృత వపుషాం చాళుక్యానాం కులమలంకరిష్ణో స్సత్యాశ్ర
యవల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనోష్టాదశ వర్షాణి। వేంగీదేశ
మపాలయత్. తదాత్మజో। జయసింహవల్లభ స్త్రయస్త్రింశతం
తదనుజేంద్రరాజ స్సప్తదినాని తత్సుతో విష్ణువర్ధనో నవః
తత్సూను ర్మంగియువరాజః పంచవింశతిం। తత్పుత్రో జయ
సింహవల్లభ స్త్రయోదశ తదవరజః కొక్కులి షణ్మాసాన్
తస్యజ్యేష్ఠభ్రాతా విష్ణువర్ధన స్తముచ్చాట్య సప్తత్రింశతం
తత్పుత్రో విజయాదిత్యభట్టారకోష్టాదశ తత్తనుజో
విష్ణువర్ధన షట్త్రింశతం తత్సూను ర్విజయాదిత్య నరేంద్ర
మృగరాజ శ్చాష్టాచత్వారింశతం। తత్సుతః। కలివిష్ణువర్ధనోద్వ్యర్ధ
వర్షం తత్సుతో గుణగవిజయాదిత్య శ్చతుశ్చత్వారింశతం తద్భ్రా
తుర్విక్రమాదిత్యభూపతే స్తనయ శ్చాళుక్యభీమస్త్రింశతంతత్సుతః
కొల్లభిగండవిజయాదిత్యః షణ్మాసాన్ తత్సూను రమ్మరాజ స్సప్త
వర్షాణి తత్సుతం విజయాదిత్యం బాల ముచ్చాట్య తాడపోమాస మేకం
తం జిత్వా యుధి చాళుక్యభీమతనయో విక్రమాదిత్య ఏకాదశ
మాసాన్ తత స్తాడపరాజసుతో యుద్ధమల్లః సప్తవర్షాణి.

శ్లో॥ తం యుద్ధమల్లంపరిహృత్య దేశా త్ప్రష్ఠేత రేషా మపి శాత్ర
వాణాం। తస్మిమమ్మరాజానుజరాజభీమో భీమస్సమో ద్వాదశ
రక్షతిస్మ॥

తత్సూను ర్ద్విసతారాతి గమ్మరాజో నృపాగ్రణీః
పంచవింశతివర్షాణి వేంగీభువ మపాలయత్
ద్వైమాతు రోమ్మన్నృపతే ర్దానన్నృపో రాజ భీమనృపతనయః।
విద్యాకలాపచతురః చతుర శ్చతురంతధరామశాత్సమా స్త్రిస్రః।
అనుదానార్ణవా దాసీ ద్దైవదుశ్చేష్టయాతతః।
స ప్తవింశతివర్షాణి వేంగీమహీ రనాయకా॥
అతొంత రేదాసన రేంద్రసూను శ్శ్రీశ క్తివర్మాసురరాట్సధర్మా।
యశ్శౌర్యశక్త్యావినిహత్య శత్రూన్స ద్వాదశాబ్దాన్సమరక్షదుర్వీః
తత స్తదనుజో వీరో విమలాదిత్యభూపతిః,
మహీమండల సామ్రాజ్య ప్రాజ్యలక్ష్మీ స్తమ్మదాంధాత్.
తేజోయదీయమఖిలక్షితిపాలమాళి
మాలాస్వభా దమలరత్నరుచి చ్ఛలేన
పాతిస్మ స ప్తసమా స్సకలా న్ధరిత్రీం
భీమప్రతాపమహితో బిరుదాంకభీమః।
తస్మా ద్విమలాదిత్యా ద్రవికులత స్మైత్యశ్చముందవా దేవ్యాః
నిజగుణవశీకృతాఖిలరాజ్యనో రాజరాజవిభు ఽజని॥
య స్సోమవంశతిలకః శకవత్సరేషు
వేదాంబురాశినిధి వ ర్తిషు సింహ గేర్కే।
కృష్ణద్వితీయదివసో త్తరభాద్రికాయాం
వారే గురో ర్వణిజిలగ్నవ రేభిషి క్తః॥
ఇంద్రో యథా దివ ముదారయశా స్తథోర్వీం
శౌర్యేణ శశ్వ దఖిలా మభిరక్షితుం యః।
శ్రీవిష్ణువరననృపో మకుటం పదార్ఘ్యం
మూర్ధ్నా దధా న్మణిమయూఖ విభాసితాశమ్॥

సంకుచతి క్షితితలం కుపితా రివర్గే
మార్గేణ యేన నయశాలినిమానవేన
ప్రీతాః ప్రజానిజపవిత్రచరిత్రతోయైః
ప్రక్షాలయంతి కలికాలకలంకపంకమ్॥

సహస్రార్కేణ కులం కలాగమపరిజ్ఞానేన కుర్వన్ దివ్యం
దీనానాథజనార్థిరక్షణనివహత్యాగేన లక్ష్మీం స్థిరాం,
సంపూర్ణామలచంద్రికా విశదయా కీర్త్యా జగద్గీతయా
యో దిక్చక్రమలంకరోతి సుతరాం చాళుక్యచూడామణిః.
యస్య స్ఫారభుజాకృపాణ దళితారాతిభకుంభస్థల
ప్రోన్ముక్తామలవృత్తమౌక్తికచయః స్సంగ్రామరంగాంతరే
ధత్తే వీరరసక్రియాభి నయనప్రస్తావనాలక్షితాం
వీరశ్రీరచితాంజలి ప్రవికర త్పుష్పోపహారశ్రియమ్.
పిత్రో ర్వ్యంశగురూ బభూవతు రలం యస్య స్ఫురత్తేజసౌ
సూర్యాచంద్రమసౌ నిరస్తతమసౌ దేవౌ జగచ్చక్షుషీ
దంష్ట్రాగ్రకోటిసముద్ధృతాఖిల మహీచక్రం మహత్క్రీడయా
విష్ణో రాదివరాహరూప మ ఏవ స్వ్యచ్ఛాసనే లాంఛనమ్.
స సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరాజో రాజ
పరమేశ్వరః। పరమభట్టారకః। పరమమాహేశ్వరః। పరమ
బ్రహ్మణ్యః। శ్రీరాజరాజదేవో। రేండేఱుల నడిమివిషయని
వాసినో। రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః। సమాహూయ
మంత్రిపురోహిత సేనాపతియువరాజదౌవారిక ప్రధానసమక్ష।
మిత్థ। మాజ్ఞాపయతి। యథా।
హరీతగోత్రే హరిమూర్తి రాపస్తంబద్విజశ్రేష్ఠ విభుర్వినీతః
సదా పురోడాశపవిత్రవక్త్రో విద్వా నభూ త్కంచెనసోమయాజీ.

తస్య శ్రీమాన్ హిమకరకరప్రస్ఫురత్కీర్తిరాశే
రాసీత్సూనుః సకలవిదుషా మంచితః కంచెనార్యః
యం మన్యంతే యమి మునిగణాః కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమసుహృదో జీవితం బంధువర్గాః॥

తస్మాదాత్మజో మహాత్మా సమజని శౌచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజితవాచస్పతి రకలంకో శంకనామాత్యః॥

తస్య చ సుధర్మపత్న్యాం గుణశాలిన్యాశ్చ సామెకాంబాయాః
అభవ దనుష్ఠితజగదుపకరణో నారాయణ స్తనయః॥

యః సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు।
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన॥

కవీన్ స్మనీషా లవదుర్విదగ్ధాన్ మనోహరాభి ర్నిజసూక్తిభిర్యః
కుర్వన్నగర్వాన్పటుభిర్బిభర్తి కవీభవజ్రాంకుశనామసార్థమ్॥

తస్మై సకలజగదభి గుణశాలినే। సరస్వతీకర్ణావతంసా యష్టా
దశావధాన చక్రవర్తినే। నన్ని నారాయణాయ। భవద్విషయే। నంద
నపుణ్డినామగ్రామః। సోమగ్రహణనిమిత్తే। ధారాపూ
ర్వక। మస్మాభిః। స్సర్వకరపరిహారేణ। దత్తః। ఇతి విదిత మస్తు వః। అస్యసీ
మానః। పూర్వతః। ఇయ్యూరియుం। బిల్లెమ పెద్దపూడియు నెరపుల
యుం। బొలగరుసున। పల్లమున। కొండియగుంట నడుమసీమా ఆగ్నేయ
తః। ఇయ్యూరియుం। బిల్లెమ పెద్దపూడియు। నెరపులయుం బొలగ
రుసున। ముయ్యలికుట్రుసీమా దక్షిణతః। ఇయ్యూరియు। నెరపులయుం
బొలగరుసున తాడ్లకొవసీమా। నైరృత్యతః। ఇయ్యూరియు నెరపులయు
ముందరమునయుం। బొలగరుసున। ముయ్యలికుట్రుసీమా। పశ్చిమతః।
ఇయ్యూరియు। ముందరిమునయు। తుడకుటితియుం బొలగరుసున ము
య్యలికుట్రుసీమా। వాయవ్యతః। ఇయ్యూరియు దుడకుటితియుం బిల్లె

ను పెద్దపూండ్డియుం బొలగరుసుం। ముయ్యాలికుటుగిన గొల్లతేవసీమా। ఉత్తరతః। ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూండ్డియుం బొలగరుసుల। రేటుకగడ్డయసీమా। ఐశాన్యతః। ఇయ్యూరియు బిల్లెమ పెద్దపూండ్డి యుం బొలగరుసుల। మజ్జితోడితాటియొద్ద చింతయసీమా।

అస్యోపరి। న। కేనచి ద్బాధాకరణీయా। యః। కరోతి। స। పంచమహాపాతకయుక్తోభవతి॥ తథాచోక్తం। భగవతా। వ్యాసేన। స్వదత్తం పరదత్తం వా యో హరేత వసుంధరాం। షష్టింవర్ష సహస్రాణి। విష్ఠాయాం జాయతే క్రిమిః।

బహుభి ర్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా।
యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలమ్।
ఇతి ఆజ్ఞప్తి రస్య కటకాధిరాజః।

కావ్యానాం కర్తా నన్నియభట్టో లేఖకో గండాచార్యః। ద్వాత్రింశత్తమే విజయరాజ్యవర్షే వర్ధమానే కృతమిదంశాసనం.

ఈ శాసనమునుబట్టి, నారాయణభట్టు సంస్కృత, ప్రాకృత, కర్ణాట, పైశాచికాంధ్ర భాషలయందు, చక్కని కవిత్వము చెప్పఁగల వాఁడై కవిరాజశేఖరబిరుదమును, మనోహరములైన తనవాక్యములచే సామాన్య కవుల గర్వమునడంచువాఁడై కవీభవజ్రాంకుశబిరుదమును గాంచియుండెననియు, సరస్వతి కర్ణావతంసుఁడని, అష్టాదశావధారణ చక్రవర్తియని, పేరుగాంచి యుండెననియుఁ దెలియుచున్నది. ఇతఁడు కర్ణాటభాషయందు భారతమును రచియించియుండెననియు, ఆభారతమునందలి పద్యములకును, నన్నయభారతమునందలిపద్యములకును పలుతావులఁ బోలికయున్నదనియుఁ జెప్పుచున్నారు. కాని కన్నడభారతము నాకు లభింపనందున నావిషయమును గూర్చి విశేషముగ వ్రాయఁజాలను. నన్నయ రచింపగా మిగిలిన భారతమును నారాయణభ

ష్ఠేలపూరింపలేదను ప్రశ్నమునకు సమాధాన మీయలేము. శ్రీకృష్ణ నిర్వాణపర్వమునకుఁ బూర్వమైనట్టే నన్నయ కొక్కించుకపూర్వమే నారాయణభట్టిహలోకమును వీడిపోయెనేమో! లేదా నన్నయకుఁ గలిగిన నిరుత్సాహమే యాతనికిఁ గలిగియుండును. ఈవిషయమున నిదమిత్థమని నిర్ణయించుట కిప్పటివఱకు దొరకినయాధారములేమియుఁ దోడుపడుటలేదు. ఇతఁడాంధ్రభాషలోఁ బ్రత్యేకముగ నేమేనిగ్రంథములను రచియించెనో లేదో తెలియదు. కర్ణాటభాషలోఁ గొన్ని పుస్తకములను రచియించెనని కర్ణాటకవిచారిత్రమున వ్రాయఁబడియెనని వినియున్నాఁడను. ఆచారిత్రమును నేనుజూచుట తటస్థింపలేదు.

## ఇతనికాలము

నందంపూఁడి శాసనమునందు రాజరాజనరేంద్రుని ౩౨ రాజ్య సంవత్సరమున నాదానమీయఁబడినట్లు వ్రాయఁబడి యున్నది. రాజరాజు పట్టాభిషేకకాలము శా. శ. ౯౪౪ అని యీ శాసనమునందే యుండుటచే నీశాసనము శా. శ. ౯౭౬ వ సంవత్సరమున చంద్రగ్రహణమునాఁడు క్రీ. శ. ౧౦౫౩ సం॥ నవంబరు ౩ వ తేదీని వ్రాయఁబడినట్లు తేలుచున్నది. ఈ శాసనమునకుఁ దరువాత దాదా ఎనిమిదిసంవత్సరములు రాజరాజు జీవించియున్నట్లు కనుపట్టుచున్నది. నారాయణభట్టుకాలము క్రీ. శ. ౧౦౨౦–౧౦౬౦ అని చెప్పవచ్చును. దానమొసంగిన నందంపూఁడి గ్రామము కృష్ణామండలములోని తణుకుతాలూకా యందు సెట్టిపేటకు సమీపమున నెత్తుకాలువయొడ్డుననున్నదని, యాంధ్రులచరిత్రమున శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులు గారును, గోదావరిమండలమున నమలాపురముతాలూకాలో నున్నదని జయంతి రామయ్యపంతులుగారును వ్రాసియున్నారు. రామయ్యపంతులుగారి యూహయే సరియైనది.

## ఇతఁడు త్రైలోక్యమల్లుని ప్రధానియా ?

గోదావరి మండలమునందలి ద్రాక్షారామ భీమేశ్వరస్వామి యాలయములో స్వామికి దీపారాధనమునకై యేర్పాటును గావించి కుప్పమ యనునామె యొక శిలాశాసనము (ద. హిం. శా. సం. ర సంఖ్య ౧౦౧౦) వ్రాయించినది. అందు "చక్రవర్తి త్రైలోక్యమల్లదేవర ప్రధాని నారాయణభట్లుకుంతుఱుకుప్పమ పెట్టిన అఖండవర్తి లోహపుదివియ" అని వ్రాయఁబడియున్నది. దీపదానము గావించిన కుప్పమ నారాయణభట్టుని తనయ యనియు, ఆనారాయణభట్టు త్రైలోక్యమల్లుని మంత్రియనియు నీశాసనమునుబట్టి తెలియుచున్నది. ఈ దీపదానకాలము శా. శ. ౯౭౭ అని శాసనమునం దుదాహరింపఁబడినది. ఆ కాలమున "త్రైలోక్యమల్లబిరుదాంచితుఁ" డగు సోమేశ్వరుఁడు, కళ్యాణినగరము రాజధానిగా రాజ్యము చేయుచున్నమాట నిజము. అతఁడు పశ్చిమచాళుక్యవంశజుఁడు. కుప్పమతండ్రియైన నారాయణభట్టా సోమేశ్వరునియొద్ద మంత్రిగానున్న మాటకూడ వాస్తవము కావచ్చును. కాని, యాతఁడు నన్నయభట్టునకు భారతరచనాకావ్యమునఁ దోడయిన నారాయణభట్టే యనుటకు నిర్బాధకమైన యాధారములు నాకు లభింపలేదు. సుప్రసిద్ధచరిత్రకారులగు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారీ యిరువురు నొక్కరే యని యభిప్రాయపడి యున్నారు. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారుకూడ నది సత్యమైయుండునని యూహించి, యాకాలమున భారతకృతిపతియైన రాజరాజనరేంద్రుఁడు పశ్చిమ చాళుక్యరాజయిన త్రైలోక్యమల్లసోమేశ్వరునకు సామంతుఁడుఁగా నుండి యాతని సకలభువనాశ్రయ, సత్యాశ్రయకులశేఖర బిరుదములను దానుగూడ వహించెనని చెప్పుచు భారతిపత్రికలో "ఇది సంగతమేని ప్రధాని నారాయణభట్టు నిజప్రభువగు త్రైలోక్యమల్లసోమేశ్వర

చక్రవర్తియొక్క స్థానాపతియై యతనికగిగాపైన రాజరాజనరేంద్రుని
సంస్థానమునకు వచ్చెననియు, నన్నయభట్టారకునికి భారతరచనయందు
దోడ్పడెననియు, దానికి ప్రతిఫలముగ రాజరాజనరేంద్రు డతనికి నం
దంపూడిగ్రామము నగ్రహారముజేసి యిచ్చెననియు దలంచవలసియున్న
ది." అని వ్రాసియున్నారు.

త్రైలోక్యమల్లుని ప్రధానియైన నారాయణభట్టును, నన్నయ
స్నేహితుఁడైననారాయణభట్టును, నొక్కరుగారని నాయుద్దేశము.
పశ్చిమచాళుక్యుఁడైన త్రైలోక్యమల్లుఁడు వేఁగిదేశమును జయించి
నాఁడనియు, రాజరాజాతనిక్రిందఁ సామంతుఁడుగా నుండెననియుఁ
దలంచుటకుఁ బ్రబలములైనయాధారములు లేవు. నందంపూఁడిశాసన
ములో నారాయణభట్టు కవియుఁ బండితుఁడు ననియే చెప్పఁబడినది.
కాని, యొకరాజుకడఁ బ్రధానిగా నుండెననుసూచనయైన లేదు. నిజ
ముగా నీతఁడు త్రైలోక్యమల్లుని ప్రధానియే యైనయెడల, నావిషయ
మా శాసనమున సూచింపఁబడకుండ నుండదు. క్రీ. శ. ౧౦౪౮ వ
సంవత్సరప్రాంతమున వేఁగిదేశమును కళ్యాణిచాళుక్యు లాక్రమించు
కొనిరని శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము. అది సత్యమయి
నచో నటుపిమ్మటనే, నారాయణభట్టునకు వేఁగిదేశముతో సంబంధము
ప్రారంభమై యుండవలయును. అంతకుఁ బూర్వమీతనికి వేఁగిదేశ
ముతో సంబంధముండవలసినపనిలేదు. కాని నన్నయభట్టీతనిగూర్చి
భారతమున వ్రాసినపద్యములో నితఁడు తనకు సహాధ్యాయుఁడనియు,
నిష్టుఁడనియు వ్రాసియున్నాఁడు. క్రీ. శ. ౧౦౪౮ వ సంవత్సరము
లోఁ దనకుఁ బరిచయుఁడైన వానిని సహాధ్యాయుఁడని చెప్పుట పొసఁ
గదు. నారాయణభట్టు వేఁగిదేశమువాఁడేయై నన్నయభట్టుతో సహాధ్యా
యిగానుండి పిదపఁ గళ్యాణికిఁ బోయి త్రైలోక్యమల్లునివద్ద ప్రధానియై,

తరువాత, వేఁగిదేశ పరిపాలనమున త్రైలోక్యమల్లునిచే నియుక్తుఁడై యిచ్చటకువచ్చి భారతరచనలోఁ దోడ్పడి, నందంపూఁడి నగ్రహారము గాఁ బడసెనని చెప్పవలసియుండును. ఇదియంతయు నూహ యే కాని యొక యాధారముమీఁద నాధారపడినదికాదు. మంచియాధారము లభించువఱకు నీ నారాయణభట్టు లిరువురు భిన్నవ్యక్తులనియు, గుప్పమ్మ తీర్థయాత్రకై ద్రాక్షారామమునకు వచ్చి యీ శాసనము వేయించినదని తలంచుట సమంజసమనియు నా యభిప్రాయము. శాసనకాల మత్యంత సన్నిహితముగా నుండుటవలనను, నందంపూఁడి ద్రాక్షారామము లేక మండలమున నాతి దూరములో నుండుటచేతను, మన నారాయణభట్టు తండ్రి యమాత్యుఁడగుటను, బితామహుఁడగు కంచెనను "యంమన్యంతేయమరిగణాః" శత్రువులు యమునిగాఁ బరిగణింతురని చెప్పుటచే నాతఁడు కేవలముఁ బండితుఁడే కాకుండ నే రాజనో ద్దనో మంత్రిగనో సేనాధిపతిగనో యున్నాఁడని తలంపవలసియుండుట వలనను జరిత్రకారు లిదివఱకట్లే తలంచియుండుటచేతను, నీ యిరువురు నారాయణభట్టులు నొక్కరేయని నిర్ణయించుట న్యాయమగునేమోయని శంకకలుగుచున్నను, పైనివ్రాసిన కారణములచే నట్లు చేయఁజాలక పోయితిని.

కర్ణాటక భాషలో రెట్టమతమును రచించిన రెట్టఁడను కవి, తన గ్రంథమునకు నారాయణభట్టు రచించిన శాస్త్ర మాధారమని చెప్పియున్నట్లు, అయ్యల భాస్కరకవి కృతమగు రెట్టమత శాస్త్రమందలి "నుదితకీర్త్యాఖ్యాచే నొనరు నారాయణభట్ట మతంబును" అను వాక్యమువలనఁ దెలియుచున్నది. ఇతఁడు మన నారాయణభట్టయి యుండునేమో! ఇది యూహయే కాని సత్యమనుట కాధారము దొరకలేదు.



# ౩. భోజమహారాజు

జగద్విదితయశుఁడైన యీ మహారాజు, భారతకృతిపతియైన రాజరాజనరేంద్రునితో సమకాలికుఁడు. మహాపండితుఁడు. కవిపండితపోషకుఁడు. ఈ యిరువురను పోల్చుచు, శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగా రాంధ్రుల చారిత్రమున నిట్లు వ్రాసియున్నారు.

ఇతఁడును రాజరాజనరేంద్రుఁడును సమకాలికులు.

"రాజమహేంద్రవరము రాజధానిగా నాంధ్రదేశమేలిన రాజరాజనరేంద్రుఁడును ధారాపురము రాజధానిగా మాళవదేశము నేలిన భోజమహారాజును సమకాలీను లగుటమాత్రమే కాక సమానలక్షణములనుగూడఁ గొన్నిటిని గలిగియుండిరని తెలిసికొనినప్పు డెంతయో యానందము కలుగుచున్నది. భోజరాజు ౧౦౧౮ వ సంవత్సరము మొదలుకొని ౧౦౬౦ వ సంవత్సరము వఱకును నలుబదిసంవత్సరములకుఁ బైగా రాజ్యపాలనము చేసియుండెను. భోజమహారాజు సంస్కృతపండితులను సంస్కృతకవుల నాదరించి సంస్కృతభాష నుద్ధరించెను. మన యీరాజరాజనరేంద్రుఁడు సంస్కృతభాషాకవులను మాత్రమేకాక దేశభాషాకవుల కగ్రహారములు మొదలగునవి యిచ్చి పోషించి, దేశభాషలనుద్ధరించెను. భోజమహారాజు సరిహద్దులనుండు రాజులతోడను గజనీమామూదు సైన్యములతోడను బోరాడవలసివచ్చి యతని మన స్స్వాస్థ్యమునకుఁ గొంత భంగము కలుగుచువచ్చెను. కాని మన యీ రాజరాజనరేంద్రున కట్లు చేయఁదగినయుద్ధములేవియు లేకమనంబు నిశ్శంకముగ నుండెను. అయిన నిరువురకును విద్యావ్యాసంగముల నభిరుచిమెండుగ నుండెను. భోజరాజు సంస్కృత పండితులచే సంస్కృతభాషలోనే బహుగ్రంథములను రచింపించియు, సంస్కృతకళాశాలలను స్థాపించినవాఁ డగుటచేత భరతఖండము నందంతటఁ బ్రఖ్యాతిఁ గాంచుటకు

గారణమయ్యెను రాజనరేంద్రుఁడు తనదేశభాష నుద్ధరించి తరింపఁ జేయుకొఱకే విశేషకృషి సల్పినవాఁడగుటచేత నొక్కయాంధ్రదేశముననే ప్రసిద్ధి కెక్కి యాంధ్రమహాజనులకృతజ్ఞతకుమాత్రమే పాత్రుఁడయ్యెను. భోజమహారాజు వీరమరణమైనను శత్రుజన మధ్యమునఁ బ్రాణములు విడవవలసినవాఁడయ్యెను. రాజనరేంద్రునికట్టిది సంభవింపలేదు. రాజనరేంద్రునికాలము సుఖతరంబుగ నడిచెను. రాజనరేంద్రుఁడు భోజరాజుకంటె నదృష్టవంతుఁడని చెప్పవలయును.”

### ఇతఁ డాంధ్రకవియా?

ఈ మహారాజుచారిత్రమును వ్రాయునవసరము నాకుఁ గల్గునని నే ననుకొనలేదు. కాని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు బద్దెనరచించిన నీతిశాస్త్రముక్తావలిపీఠికలో భోజరాజవిభూషణమను నీతిభూషణము పేరుదాహరించి “భోజరా జాంధ్రద్రవిడకర్ణాటములఁ గవిత్వము చెప్పఁజాలెననుట మనకు హృదయానందముగా నున్నది” అని వ్రాసియున్నారు. దీనినిబట్టి భోజరాజీగ్రంథమును రచియించెనని తెలియుచున్నది. అందుమూలమున నీమహారాజు నిందుఁ జేర్పుభాగ్యమలవడినది. నీతిభూషణములోని పద్యములు మడికిసింగన సకలనీతిసమ్మతమున నుదాహరింపఁబడినవి. మడికిసింగన తనగ్రంథమున నుదాహరించిన పద్యముల నేగ్రంథములనుండి గైకొనినదియు న వ తా రి క లోఁ జెప్పియున్నాఁడు. భో జ రా జాంధ్రకవియగునా యను విషయమును జర్చింపఁగోరువారి కనువుగా నుండునని సింగనకవి య వ తా రి క లో వ్రాసినవాక్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

“అట్లు గావున సకలశాస్త్రంబులందును న య శా స్త్రం బు ముఖ్యంబని తలంచి చెప్పంబూనితి. నారద వసిష్ఠ పరాశర బాదరాయణభృగ్వాంగిరస గురు శుక్ర మతానుసారం బై దేవమానవరాక్షసంబులైన సాత్త్వికరాజసతామసప్రకారంబు లగునయశాస్త్రంబులు పరి

క్షించి యాంధ్రభాషాకోవిదుల లగుసుకవీంద్ర విరచితంబైన ముద్రామాత్య పంచతంత్రి బద్దెభూపాల చాణక్యధౌమ్య విదుర ధృతరాష్ట్ర బలభద్ర కామందక గజాంకుశ నీతిసార నీతిభూషణ క్షేమేంద్ర భోజ రాజవిభూషణ పురుషార్థసార భారత రామాయణాదిమహాకావ్యంబులు పురాణేతిహాసంబులు కందనామాత్యనీతితారావళి లోకోక్తి చాటుప్రబంధంబులయందును గలనీతివిశేషంబు లూహించి తత్సత్సారాంశంబు లయ్యైవిధంబుల వర్గసంగతంబుగా సకలనీతిసమ్మతం బనుపేర నొక్క ప్రబంధంబు రచియింపుదునని ప్రబంధసారంబునకు ననుగుణంబుగా నే పురుషునిం బ్రార్థింతునో యని వితర్కించితి."

ఈ వాక్యములను శ్రీ రామకృష్ణకవిగారు ప్రచురించిన సకలనీతి సమ్మతమునుండి గ్రహించితిని. సకల నీతిసమ్మతమున నన్నియు నాంధ్రపద్యములే గాని, సంస్కృతశ్లోకము లుదాహరింపఁ బడలేదు, ముద్రామాత్యము, క్షేమేంద్రకవికృతమనియు నది భోజరాజున కంకిత మీయఁబడియెననియు శ్రీ రామకృష్ణకవిగారు వ్రాయుచున్నారు. సింగనవ్రాసిన పైవాక్యములలో ముద్రామాత్యనామ మొకచోటను క్షేమేంద్రనామ మొకచోటను వ్రాయబడుటచే ముద్రామాత్యము క్షేమేంద్రకృతమగునో కాదోయని యనుమానము కలుగుచున్నది. "క్షేమేంద్రభోజరాజవిభూషణ" యని యుండుటచే భోజరాజవిభూషణ మనుపేర క్షేమేంద్రుఁ డొక కావ్యమును రచించెనా యని సంశయము వొడముచున్నది. "నీతిభూషణ" శబ్దము "క్షేమేంద్ర భోజరాజ విభూషణ" శబ్దములకు పూర్వమునందుండుటచే, నీతిభూషణము వేఱనియు భోజరాజవిభూషణము వేఱనియు స్ఫురించుచున్నది. కాని గ్రంథము లోపల భోజరాజవిభూషణమునుండి పద్యము లుదాహరింపఁబడలేదు. నీతిభూషణములోని పద్యములుమాత్రమే యుదాహరింపఁబడినవి. ఈ

పద్యములలో భోజరాజును సంబోధించుపదము లేమియు లేవు. నీతిభూషణ భోజరాజవిభూషణము లొకటియే గ్రంథమగునెడల, సింగన రెండుపేరు లును వేఱు వేఱుగా నేల చెప్పెను? అవి రెండును వేఱు వేఱు గ్రంథము లగునెడల, భోజరాజవిభూషణమునందలి పద్యముల నేల యుదాహరింప లేదు? అందలిపద్యముల నుదాహరింపనప్పుడు సింగన యాగ్రంథనామము నుదాహరింప నేల? ఈ ప్రశ్నలకు సమాధానములు గన్పడుటలేదు. పైని వ్రాసిన సింగనవాక్యములలో విలేఖకులకృత్యము లేమయిన నున్న వేమో తెలియదు. సింగనకవికృత సకల నీతి సమ్మతము పూర్తిగ లభింప లేదు. భోజరాజ విభూషణమందలి పద్యము లా లభింపని భాగమునం దుదాహరింపఁబడి యుండెనేమో తెలియదు. అందలి పద్యములు ప్రత్యేకముగ నాభాగమునందే యుండునని తలంచుటకును వీలులేదు. నీతిభూషణమును భోజరాజ విభూషణమును, ఒకటియే గ్రంథమని రామ కృష్ణకవిగారనుట కాధారమేదియో తెలియదు.

భోజరాజును సుప్రసిద్ధాంధ్రకవులు తమ గ్రంథములలోఁ బూర్వ కవినిగా స్తుతించునట్లు గన్పట్టదు. నడిమింటి వెంకటపతికవి యభిషిక్త రాఘవమునందును, మొల్ల తన రామాయణము నందును, పైఁడిపాటి వెంకటనృసింహకవి, లక్ష్మీనృసింహ విలాసము నందును, భోజు నిఁ బూర్వకవినిగా స్మరించి యున్నారు. కాని యంతమాత్రమున నాతఁ డాంధ్రమున గ్రంథములను రచియించెనని నిశ్చయింపరాదు.

సకలనీతిసమ్మతపీఠికలో శ్రీరామకృష్ణకవిగారు "నీతిభూషణమును నాంధ్రభోజుఁ డను కవి రచించినట్లొక లక్షణ గ్రంథమునఁ గలదు. కాని యతఁ డెవ్వఁడని గుర్తింప వీలుకాదు. బాలబోధలక్షణమున వీనిలోనుండి పెక్కుపద్యము లుదాహృతము లయ్యె. .అందు,

మ. సకలస్థాణుశిరః ప్రవర్తి నురుపక్షద్వంద్వశుక్లాభిరం
జకుఁడన్ సర్వదిగంతగామి నసకృత్సంసేవ్యమానుండ నై

షికుఁడం గావున మత్సమానుఁ డగుసే శీతాంశుఁ డం చెప్పుడుం
బకమింద్రుం బ్రహసించునట్లు సుజనుం బల్కుం దురాత్ముం డిలన్.

చ. వలసినవంకలం గురియు వర్షసమాగమమేఘ మేగి త
న్మలినత వాతయం దవగుణంబును సహ్యామె వృష్టి లేక ని
ర్మలమగుచోఁ దలంపఁగ శరద్ఘన మేటికి నట్లు యీఁగి నై
నెలయనివాని వెళ్లఁదనమేమి ప్రయోజన మర్థికోటికిన్,

అని మొదలగు పద్యములు గలవు. నీతిభూషణమునకు సంస్కృతమున మూలమేదో యిప్పటికిఁ దెలియరాదు."

అని వ్రాసియున్నారు. దీనినిబట్టి నీ తి భూ ష ణ ము వ్రాసినది భోజమహారాజు గాక, అభినవభోజ బిరుదాంకితుఁడగు మఱియొక కవి యని తెలియుచున్నది. బద్దెన నీతిపీఠికలో భోజమహారాజు నీతిభూషణమును రచియించెనని వ్రాయుటకు శ్రీ రామకృష్ణ కవిగారి కేమి యాధారములు క్రొత్తగా లభించెనో తెలియలేదు. బలవత్తరమైయి సాక్ష్యము లభించువఱకును భోజమహారాజాంధ్రమున గ్రంథములను రచియించెనని తలంచుట కవకాశము లేకున్నను, రామకృష్ణకవిగారి వాక్యములయందలి గౌరవముచే నీ మహారాజు నిందుఁ జేర్చి భావిపరిశోధకుల కనుకూలముగ నుండునని యాతని దని చెప్పఁబడిన నీతిభూషణమునందలి పద్యములను సకలనీతిసమ్మతమునం దుదాహరింపఁ బడిన వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

క. జను లిది యల్పగ్రంథం
బనవలదు దీనఁ దోఁచు నన్నియుఁ జెక్కుల్
గనుపట్టఁ జేయు వాతా
యనవివరము పిన్న గాదె యారసిచూడన్.

క. భువి సధికుఁడు దెలుపని యు
క్తివిశేషము చిఱుతవాఁడు దెలుపెడు నొకచో

రవికి వఱుఁ గైనఁగొంగిని
దివియ ప్రకాశింపఁ జేయఁడే యొకొక్కచోన్.

క. సరసకవితరుచి యెఱుఁగని
పురుషులఁ బశువు లని నిక్కముగ నెఱుఁగుఁడు వా
రరువడిఁ దృణంబు మేయమి
పరికింపఁగ ధరణిఁ బసులభాగ్యం బెందున్.

క. తననగరిలోన నించుక
యును భాండాగార మనుచు నునికి తగదు రా
జునకుఁ బ్రజలె భండారం
బని యేమఱ కరయవలయు ననిశము వారిన్.

క. న్యాయపుటరి తలపూవులు
గోయుట నట లెస్స తగదు కువలయపతి క
న్యాయ మది మ్రాను వాడిచినఁ
గాయలు వెసఁ గోయునట్టికరణి దలంపన్.

క. భూరమణుఁడు పే దైనను
ధారుణి నెచ్చోటఁ దగదు ద్రవ్యము వెదకన్-
వారాశి వట్టిపోయిన
నీ రొక దెస ఘటింపనేరఁగ నగునే.

క. సమయములరంతు పరివా
రముమత్తు నియోగిజనులరాయిడి నగ్రము
చ్చుమి గ్రేణి కార యన్యా
యము లేకుండంగఁ బ్రజల నరయఁగవలయున్.

క. స్థిరమతి నెప్పుడు నిజమం
దిరమున దౌవారమునను దెల్లమిగా సం

గరిమునసుం గ్రమ్మైన నే
నరుఁ డుండు నతండు ప్రియుఁడు నరనాథునకున్.

క. కానలు దరికొను పావకుఁ
డైన ప్రభంజనుఁడు మిత్రుఁ డల్పత దీపం
బైన శిఖి నార్పుఁ గావున
హీనుం డగువాని కెందు నెక్కడిమిత్రుల్.

క. డెందమునఁ దెలిసియును జే
యం దెంపరి గాక యుండునాతని తలపో
తం దీరునె యవకార్యము
మం దెఱిఁగినమాత్ర తెవులు మానుట గలదే.

ఉ. సుందరసర్గలక్షణవిశుద్ధకవిత్వముఁ గన్నచో రస
స్యంది నిజస్వభావుఁ డనఁ జాలినయట్లు నిజస్వభావుఁ డా
నందముఁ బొందు నట్లు కుజనప్రకరంబు లెఱుఁగనేర్చునే
చందురుఁ జూచి మోదమున సాగర మబ్బిన నూతులుబ్బునే

ఉ. ఆకులవృత్తి రాఘవుశరాగ్రమునందుఁ దృణాగ్రలగ్నవీ
రాకృతి వారిబిందువట దశాస్యునిఁ జంపుట మిథ్య గాదె వా
ల్మీకులు సెప్పుచున్న కృతిలేనినరేశ్వరువర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినం బడ దాతఁడు మేరు వెత్తినన్.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరిక్షీణసం
ధిత్వావ్యగ్రుఁడు గాక విగ్రహముచే దేశంబు గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూచి కార్యము దెసన్ బ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైనపతి శశ్వచ్ఛ్రీసమేతుం డగున్.

క. మతి శస్త్రము ప్రకృతులు మే
నతిశయధర్మంబు ప్రాణ మతిదృఢతరసం

కృతి జోడు చరులు కన్నులు
చతురుండగుదూత మోము జననాథునకున్.

క. స్వామియు మంత్రియు దుర్గ
స్తోమము రాష్ట్రంబు ధనము సుహృదులు బలమున్
గా మహి సప్తాంగంబుల
నేమఱక యొనర్పవలయు నిందులరక్షల్.

క. ఎందును నాయాసమునకుఁ
బందయయినవాఁడు సిరికిఁ బాత్రుం డగు నే
మందరగిరి మోవఁడె గో
విందుఁడు మను లచ్చికొాఱకు విబుధు లెఱుంగన్.

క. దూరమున వెరవు గదిసిన,
దారు నిలుచువారి నృపతి దగు మన్నింపన్
దూరమున బిరుదు గదిసిన
దారచ్పట లేనివారిఁ దగు వర్జింపన్.

క. తక్కినయాత్మ్కుఁడు గలఁడే
యెక్కుడుగా నెత్తిపలికి హితమెఱిఁగింపన్
జెక్కిలి మీటుట కూరిమి
తక్కటయే పాలుపోయుతఱి బాలునకున్.

క. అనురాగియు సద్వృత్తుఁడు
ఘనశక్తిత్రయము దైవికముఁ బౌరుషమున్
ధనమును దనకబ్బిన పతి
సనునది యివి లేనియట్టి జనపాలునిపయిన్.

క. తనచేతఁగాని కాదను
పనికిం బ్రతినిధిగ నన్యుఁ బనిచినసుం దీ

రునె యౌషధంబు మా ౨ది
యని మూల్యం బిడిన రోగ మడుగుట గలదే.

క. ఏ జనులకాజ్ఞసాలని
రాజును రాజేంద్రుసాజ్ఞ ప్రకటింపని యా
రాజునకు గోడవ్రాసిన
రాజునకుఁ భేదమేమి ప్రాజ్ఞున కరయన్.

క. ఏవితనికి మాన్యుఁడగని
భూనాథునికరుణ నమ్మి పొంగి భటుఁడు సే
వానియతి వదలు టొప్పదు
నానాఁటికిఁ గ్రొత్తమన్ననలు నృపతులకున్.

క. ప్రవిమలవిక్రమ పరుఁడగు
నవనీశ్వరు నంకతలమునందు రిపు శ్రీ
యవిలి కుటుంబిని పోలిక
నవిరళమై యుండు నెపుడు నంచితమహిమన్.

క. అరివధకుం దగునంతకు
ధరణీశుం డోర్వవలయుఁ దక్కువయైనన్
నరుఁడాటదయ్యె నుండఁడె
హరి గొల్లండనఁగఁబడఁడె యనువగుదాకన్.

ఇతని సంస్కృత గ్రంథములు.

ఈ మహారాజకవిచంద్రుఁడు మాలవదేశమును ధారానగరము రాజధానిగా రాజ్యము చేసినట్లు శాసనములనుబట్టి తెలియవచ్చుచున్నది. ఇతఁడు చంపూరామాయణము (దీనినే భోజచంపు వందురు) పాతంజలసూత్రవృత్తి, సరస్వతీ కంఠాభరణమను గ్రంథములను రచి

యించెను. మఱియు నితఁడు సమరాంగణ సూత్రధారమను పేరి అధ్యా
యములు గల వాస్తుశాస్త్రమును, శృంగార ప్రకాశమను నలంకార
లక్షణగ్రంథమును, శబ్దానుశాసన మను వ్యాకరణశాస్త్రమును, యోగ
సూత్రములకు రాజమార్తాండ మను వ్యాఖ్యానమును నింక ననేకములు
సంస్కృత గ్రంథములను రచియించి యున్నవాఁడు. చారుచర్య యను
వైద్యగ్రంథ మీతనిదే యనుచున్నారు. అమర మని పిలువఁబడియెడి
నామలింగానుశాసనమున కీతఁడు వ్యాఖ్య రచించెను. ధనపాలుఁడను
జైనపండితుఁ డీతనియాస్థానమున నుండి మహారాజు వినోదముకొఱకు
తిలకమంజరి యను గద్యకావ్యమును రచియించెను. ఇఁక ననేక
సంస్కృత గ్రంథములను రచియించిన పండితు లనేకు లీతనిచేఁ బోషింపఁ
బడినవారు కలరు. ఈ మహారాజు చరిత్ర మొక గ్రంథముగా వ్రాయఁ
దగినది కాని నాల్గయిదు పుటలలో వ్రాయఁదగినది కాదు.

## ముంజుని కథ

ఈ భోజమహారాజు తాత సీయకదేవరాజను నామాంతరము
గల శ్రీహర్షుఁడు. తండ్రి సింధురాజు. ముంజుఁడను నామాంతరముగల
వాక్పతిరాజీతనికిఁ బెదతండ్రి. అతనికిఁ బుత్రసంతానము లేకపోవు
టచేఁ దనరాజ్యమును భోజున కిచ్చివేసెను. ఈసందర్భమున నొకకథ
యాంధ్రదేశమునఁ బ్రచారములో నున్నది. వాక్పతిరాజు తాతయని
యు నాతనికి సింధురాజు ముంజుఁడు నను నిరువురు తనయులనియు,
భోజరాజు పిన్నవయసులో నుండఁగాఁ దండ్రియైన సింధురాజు చని
పోయె ననియు, నారాజ్యమున కుత్తరాధికారియైన భోజునిఁ జంపిన
చో నది తనకే లభించునని ముంజుఁడు తలంచి భోజునిఁ జంపఁ బంపె
ననియు, నాతఁడు తనతొడను చీఱి యారక్తముతో నొకయాకుమీఁద
నీక్రిందిశ్లోకమును వ్రాసి తనను జంపవచ్చినవారి కిచ్చెననియు, భోజు
నిఁ జంపివచ్చితిమని వారు ముంజునితోఁ జెప్పఁగా, హత్యాసమయ

మున భోజుఁడేమనియో నని యాతఁడడుగ వా రాయాకు నాతనికిచ్చి
రనియు నాశ్లోకమును జదువుకొని తానొనర్చిన పాపకృత్యమునకుఁ
బశ్చాత్తాపపడి, దుఃఖము నొందుచుండ మంత్రి నిజము తెలిసికొని
భోజుని రప్పించి ముంజునకుఁ జూపెననియు ముంజుఁడు స్వయముగా
నాతనిని రాజ్యమునఁ బట్టాభిషిక్తునిఁ జేసి తాను దపమును జేసికొనఁ
బోయె ననియుఁ జెప్పుదురు.

శ్లో॥ మాంధాతా స మహీపతిః కృతయుగాలంకారభూతో గతః
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః
అన్యేచాపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే
నైకే నాపి సమంగతా వసుమతీ ముంజ త్వయా యాస్యతి.

ఈదిగువ వ్రాయఁబడుచున్న భోజరాజు శాసనమును, భోజ
రాజు నాస్థానమున నున్న ధనపాలుఁడను కవి రచించిన శ్లోకములను
జూచినచోఁ బైకథయందు సత్యము లేదని తోఁచుచున్నది.

"మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీ సీయకదేవ పాదా
నుధ్యాత పరమభట్టారక...శ్రీవాక్పతి రాజదేవపాదా
నుధ్యాత పరమభట్టారక... శ్రీసింధురాజదేవ పాదా
నుధ్యాత పరమభట్టారక...మహారాజాధిరాజ పరమే
శ్వర శ్రీభోజనరేంద్రః కుశలీ...యథా అతీతాష్టసప్త
త్యధిక సాహస్రికసంవత్సరే మాఘాసిత తృతీయాం
రవావుదగయనపర్వణి శ్రీమద్ధారాయా నుపస్థితై రస్మాభి
స్స్నాత్వా భవానీమతి మభ్యర్చ్య-ఉపరిలిఖి తోయం
గ్రామః బ్రాహ్మణధనపతిభట్టాయభక్త్యాశాసనే నోదక
పూర్వకం ప్రతిపాదితః ఇతి సంవత్ ౧౦౭౮ చైత్రి
సుధి ౧౫ స్వయ మాజ్ఞా మంగలం మహాశ్రీ స్వహ
స్తోయం శ్రీభోజదేవస్య"

శ్లో. తత్రాభూ ద్వసతిశ్శ్రియా పరమయా శ్రీహర్ష ఇత్యాఖ్యయా
విఖ్యాత శ్చతురంబురాశిరశనాదామ్నః ప్రశస్తా భువః
భూపః ఖర్వితవైరిగర్వగరిమా శ్రీసీయక స్తాన్వయకాః
పంచే షోరివ యస్య పౌరుషగుణాః కేషాం న లగ్నాహృది॥

శ్లో. త స్యోదగ్రయశా స్సమ స్తసుభటగ్రామాగ్రగామీ సుతః
సింహో దుర్ధరశక్రసింధురతతే శ్శ్రీసింధురాజో భవత్
ఏకాధిజ్య ధనుర్జితాబ్ధివలయా వచ్ఛిన్నభూ ర్యస్య సః
శ్రీమ ద్వాక్పతిరాజదేవ నృపతి ర్వీరాగ్రణీ రగ్రజః.

శ్లో. ఆక్రీర్ణాంఘ్రితల స్సరోజకలశచ్ఛత్రాదిభి ర్లాంఛనై
స్తస్యాజాయత మాంసలాయతభుజ శ్శ్రీభోజ ఇత్యాత్మజః
ప్రీత్యా యోగ్య ఇతి ప్రతాపవసతిః ఖ్యాతేన ముంజాఖ్యయా
య స్స్వేవాక్పతిరాజభూమిపతినా రాజ్యేఒభిషి క్తస్స్వయమ్.

వల్లభుఁడను పండితుఁడు సంస్కృతమున భోజరాజచరిత్రమును వ్రాసియుండెను. అందు సుప్రసిద్ధ కవిశేఖరులైన కాళిదాసు, భవభూతి మొదలగువారీ భోజమహారాజు నాస్థానమునందుండి రని వ్రాసియున్నాఁడు. కాని యందు సత్యము లేదు. రఘువంశ కుమారసంభవాది మహాకావ్యములను రచించిన కాళిదాస మహాకవి క్రీస్తుశకుఁ బూర్వుఁడని కొందఱును, క్రీస్తునకుఁ దరువాత నైదవ శతాబ్దివాఁడని కొందఱు ననుచున్నారు. భవభూతికూడ, భోజరాజుకంటెఁ జాలపూర్వుఁడు. ఆంధ్రమునఁగూడ భోజరాజునుగూర్చి యిట్టికథ లనేకములు ప్రచారములో నున్నవి. కాని యవియన్నియు నిజములుకావు.

భోజరాజు కవియుఁ బండితుఁడును, గవిపండిత పోషకుఁడు నే గాక మిగులఁ బరాక్రమవంతుఁడై మహమ్మదీయులు మన దేశముపైకి దండెత్తివచ్చినపుడు వారినోడించి వెనుకకుఁ దఱుమగొట్టి యుండెను. ధనుర్విద్యయందు మిగులఁ బరిశ్రమచేసి ప్రఖ్యాతి గాంచినవాఁడు. ఈ

మహారాజునుగూర్చి వ్రాయవలసిన యంశము లనేకములున్నను, ఇతఁడు సంస్కృత కవితరంగిణియందుఁ జేర్పవలసినవాఁడగుటను, నాంధ్రగ్రంథ కర్త యగునో కాదో యను సంశయము గలిగియుండుటవలనను, నీతని చరిత్రము నింతటితో ముగించుచున్నాఁడను.

"వాక్పతిరాజు" అను నామముగల యొక సంస్కృత కవి యున్నాఁడు. కానియతఁడు భోజరాజునకుఁ బినతండ్రి యైన వాక్పతి రాజు కాఁడు. అతఁడు యశోవర్మ యాస్థానమునం దున్న పండితకవి. ఏడవనిమిది శతాబ్దులయం దున్నవాఁడు.

---

## ౪ క్షేమేంద్రుఁడు

ఇతఁడు శూద్రకరాజ చరిత్రమను గ్రంథమును వ్రాసెననియు భోజమహారాజుతో సమకాలికుఁడనియు, నాంధ్రమున ముద్రామాత్య మను గ్రంథమును రచించెననియు శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు వ్రాసి, కాశ్మీరదేశస్థుఁడగు క్షేమేంద్రుఁడును, నీతఁడు నొక్కరే యగుదు రేమో యని సంశయమును జూపిరి. ముద్రామాత్యము నాకు లభింపలేదు. అది భోజరాజున కంకితమీయఁబడిన దఁట. అందలి పద్యములను మడికి సింగన సకల నీతిసమ్మతమునం దుదాహరించియున్నాఁడు. ఇతని నాంధ్రకవు లెవ్వరు నుతించియుండలేదు. మడికి సింగనామాత్యుఁడును ముద్రామాత్యమని చెప్పెనేగాని దానిని రచించిన వాని పేరును జెప్పలేదు. భోజమహారాజు భారత కృతిపతియగు రాజరాజ నరేంద్రునితో సమకాలికుఁడు. కావున క్షేమేంద్రుఁడు నన్నయభట్టుతో సమకాలికుఁడగుచున్నాఁడు భావిపరిశోధకుల కెక్కువ యుపయోగముగా నుండునను నుద్దేశముతో మడికి సింగన ముద్రామాత్యము లోనివని యుదాహరించిన పద్యములలోఁ గొన్ని యీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. జనపతి యాత్మాయత్తుఁడు
నానరఁ బరాయత్తపతియు నుభయాయత్తుం
డును గలరు వీరిలోపలఁ
దనరు పరాయత్తుఁ డధముఁ డాతనుఁ డరయన్.

క. ఎవ్వని ప్రసాదమున సుఖ
మెవ్వరికిం గలిగియుండు నెల్లప్పుడుఁ దా
నవ్విభునికొలుతు న్సృతుఁడగు
నివ్విధమునఁ బుణ్యలోకహితము దలంపన్.

గీ. దండనీతి లేక తక్కిన విద్యలు
గలిగెనేని లేనిగతిని బొందు
రాజు దండనీతిరతుఁడైనఁ దక్కిన
విద్యలెల్ల నతని వెదకిపొందు.

గీ. ఆప్తసమ్మతముగ నఖిలకార్యంబులు
సేయువారి కెపుడు చేటులేదు
ఆప్తుగా నెఱుంగ కాడినమాత్రఁ జే
జనము నొంద కేల తక్కనేర్చు.

చ. కినుకను దుష్టవేదన మొగిం గొను టెంతయు దుష్కరంబుగా
కనుపమ నీతికోవిదుల కారయ నెందు నసాధ్య మొందునే
యినుమును నీరుగా గరుగరే మదకుంజర మస్తకంబునం
దొనరు మదంబు వెట్టరె సమున్నతవృత్తి నుపాయసంపదన్.

గీ. పెద్దయైన యినుపముద్దఁ దానొక లేఁత
తీవ్రనైన యొట్లు తెంపనేర్చు
నల్పమైన నదియు నతిశితధారచేఁ
ద్రెంప నోపు నెంత పృథమునైన.

క. సన్నపువాని విచారము
సన్నపుఁ బనులందుఁ గాక చతురం బగునే

మఱెన్నన్నఁడైన విందుమె
చెన్నుగఁ జలమూఁది రణము సేసినవారిన్.

చ. మునుకొని దేశకాలబలముం దగ దైవబలంబు గల్గఁగా
మొనసి విశేషమూలబలమున్ నిజబాహుబలంబు నచ్చి పై
చని రిపులన్ జయింతురని శత్రుల కిన్నియుఁ గల్గియున్నచో
జెనయక దానమానములఁ జేసి జయింతురు నీతికోవిదుల్.

మ. స్థవిరుండైనను బాలిశాత్ముఁ డయినన్ స్వర్గస్థుఁడైనన్ మహీ
ధవుఁ డాత్మేక్షవిహీనుఁడైన స్మృతిమాంద్యంబుఁ బొందినన్ [ భూమికిన్
ధవుఁడై యుండి తనర్చుచుం జెడు సముద్యద్రాజ్యసంపత్తి వై
భవ మేకక్షణమాత్ర మంద సచివ ప్రాధాన్యశూన్యస్థితిన్.

క. ఏలిక చెప్పినమాటలె
పోలఁగఁ జెప్పుచును బనియుఁ బొందఁగఁ జేయం
జాలుట యుత్తమదూత్యము
పాలింపఁగవలయు నిదియుఁ బతిహితతతికిన్.

క. మతిమంతుల యంత్రంబులు
ప్రతియంత్రక్రియ నె గాని పాయవు దృఢకీ
లితఘనఘటితకవాటము
ధృతిఁ దాళముచేతఁ గాక తెఱవఁగ నగునే.

క. తా నరులు వచ్చు తెరువున
మానుగఁ గల చెఱువులందు మడువులయందున్
బూని ఘనగళతరళము
గా నొనరింపంగ వలయుఁ గడువేగమునన్.

గీ. వేఱొకచోట వలయొగ్గి వేఁటకాఁడు
తొలగియుండి మృగంబులఁ ద్రుంచుపగిది

కూపు సూపక శతుప్రవు రూపుఁ గూల్చు
టిదియె నయమార్గ మిట్లు జయింపవలయు.

క్షేమేంద్రుఁడు శతపక్షిసంవాద మనునొక గ్రంథము నాంధ్ర మున రచియించినట్లు తిక్కనసోమయాజి కృతమని చెప్పెడు కవి వాగ్బంధనమను లక్షణగ్రంథమున వృద్ధియతికి లక్ష్యముగా నీయఁబడిన యీక్రింది పద్యమువలన దెలియుచున్నది. ఈ కవి వాగ్బంధనప్రతి తంజావూరునం దున్నది.

"వ. ఇందులో వృద్ధియతికి క్షేమేంద్రులు చెప్పిన శతపక్షి సంవాదములోఁ బద్యము

సీ. అమలినాక్షరరూపి యాజ్యాంత సకల లో
కైక సంస్తుత్యా సురౌఘవంద్య
కమలాసనార్చిత కాంతార్థవర దేహ
కౌశికప్రియ రవికైరవాప్త."

ఈ గ్రంథ మిప్పుడెచ్చటను గనుపట్టుట లేదు.

కాశ్మీర దేశీయుఁడగు క్షేమేంద్రుఁడు క్రీ.శ. ౧౦౩౦- ౧౦౮౦ సంత్సరముల నడుమ నున్నవాఁడని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. అతఁడు దాదాపుగ నిరువది కావ్యములు సంస్కృతమున రచియించిన ప్రతిభాశాలి. కాశ్మీర దేశపు రాజగు ననంతవర్మ యాస్థానమునందున్నవాఁడు. ఇతఁడు మాళవ దేశాధిపతి యగు భోజరాజుతో సమకాలికుఁడే. కాని యాతనికిని నీతనికిని గృతికర్తృ గృతిపతి సంబంధ ముండెనని తెలుపు నాధారములు నాకు లభింపలేదు. ఆతఁ డాంధ్ర గ్రంథములను రచియించినట్లు జూపుటకుఁగూడ నాధారములు లేవు. కాని క్షేమేంద్రనామధారి యగు నాంధ్రకవి యొకఁడుండెననుట నిశ్చయము. శ్రీ రామకృష్ణకవిగారు సకలనీతిసమ్మతి పీఠికలో "ముద్రామాత్యము క్షేమేంద్రుఁడను బిరుదము వహించిన లక్కాభట్టను కవి రచించినట్లు తోచుచున్నది. క్షేమేంద్రకవి క్రీ. శ. ౧౧౫౦

ప్రాంతములనుండెఁగావున దడ్డిరుసవహనముచే నితఁడు తత్పూర్వుఁ డగుటకు సాధ్యుఁడు కాఁడు. ఇతఁడు శూద్రకరాజచరిత్రమును శతపత్ర సంవాదమును రచించినట్లు లక్షణగ్రంథోదాహృత పద్యముల వలనఁ దెలియుచున్నది. బాలబోధమనియుఁ గవి సంజీవనిదనియు సందిగ్ధ నామములు గల యొక ఛందోగ్రంథమున ముద్రామాత్య నీతిభూషణ పురుషార్థ సారములనుండి పద్యము లుదాహృతము లయ్యె. అందు ముద్రామాత్యములోనిదని క్రిందిపద్యము గానఁబడుచున్నది.

మ. మనుజాధీశ్వరుకంటె మంత్రిబలశౌర్యంబు వర్ధంబు రా
జ్య నియోగంబును నగ్గలం బగు మ నాజ్ఞాలంఘనోద్యుక్తుఁడై
మనుదుష్టవ్యవసాయుఁడే మఱి మదోన్మత్తాత్ముఁడై కూలుఁ గ్ర
క్కున మున్నాతనిచేఁ దదీశుఁడు నదీకూలావనీజాకృతిన్.

ముద్రామాత్యము కేవలము నీతిగ్రంథముకాక ముద్రారాక్షసమువలె నొకరాజప్రాభవమును సంపాదించు మంత్రిశిఖామణి నీతిధౌరంధర్యమును వర్ణించు కావ్యమో యను సందియము గలిగించుచున్నది. ఇందు రాజరాజ వంశజులగు చోళభూపతుల జయించిన చాళుక్య రాజులయో లేక చాళుక్యుల జయించిన కాకతీయులయో పరాక్రమము ప్రశంసింపఁబడిన ట్లుదాహృత పద్యముల వలన నూహింపఁదగియున్నది.

గీ. రాజరాజవంశభూజనపతు లీల్గి
రకట మంత్రి దోలంగి యలికినాఁడు
ఏది పసుపుసేయు నిట నిల్వఁబోలదు
రాజు లేసి కన్యక మోజపడునె.

ఉ. కొన్నిదినంబు లిక్కడ నకుంఠితలీలఁ బథశ్రమార్తియై
యున్నబలంబు గెల్చుకొను టొప్పగు నంతియకాదు శత్రుభూ
మి న్నిజమార్గ మారయక మిన్నకయేఁగుట యేది బుద్ధి యా
యున్నెడఁజూచి వెళ్ళుజను లున్నది(?) చెప్పఁడుగూఢచారతన్.

ఇవి కథాభాగములోని పద్యములట్లుగాన్పించును గాని కేవలము నీతివిచారములు గావు" అని వ్రాసియున్నారు. ఈవాక్యములను బట్టి

కాశ్మీర దేశపు క్షేమేంద్రుఁడు వేఱియు, లక్ష్మీభట్టను నామాంతర ముగల యీక్షేమేంద్రుఁడు వేఱియు స్ఫురించుచున్నది. బద్దెన నీతిశీతికలో శ్రీ రామకృష్ణకవిగారే, క్షేమేంద్రుఁడు ముద్రామాత్యము ను రచించి భోజరాజున కంకితముచేసెనని వ్రాయుట కెట్టియాధారము లు వారికి లభించెనో తెలియ లేదు. పైపద్యములోని రాజరాజవంశజు లయిన భూపతులు చనిపోయిరనిన వాక్యములనుబట్టి యీ ముద్రా మాత్యకావ్యము రామకృష్ణకవిగా రూహించినట్లు చాళుక్యులో, కాక తీయులో యింనువర్ణింపఁబడిరని తలంచితిమేని, యీకావ్యము భోజ రాజు కాలములో రచింపఁబడ లేదని విశ్వసించుటకుఁ దగిన కారణము లున్నవి. భోజరాజుకాలము క్రీ.శ. ౧౦౧౮-౧౦౬౦ అయి యున్నది. ఆకాలమున రెండవ పరాంతకుని కుమారుఁడైన మొదటి రాజరాజు క్రీ.శ. ౯౮౫ మొదలు ౧౦౧౩ వఱకు రాజ్యముచేసినవాఁడు. ఇతని కుమారుఁడైన రాజేంద్రచోడుఁడు క్రీ. శ. ౧౦౧౩ మొదలు ౧౦౪౫ వఱకును, ఇతనికుమారుఁడైన రెండవ రాజేంద్రచోడుఁడు క్రీ. శ ౧౦౬౩ వఱకును, ఇతనిసోదరుఁడైన వీరరాజేంద్రచోడుఁడు ౧౦౭౦ వఱకును చోడసింహాసనము నధిష్ఠించియుండిరి. వీరందఱును బరాక్రమవంతులై చోడరాజ్యమును బరిపాలించినవారు వీరిని రణమున నితరరాజులు జయించినట్లు గన్పట్టదు. రాజరాజవంశజులు వీరుతప్ప మఱియొకరు లేరు.

ఇఁకను భారత కృతిపతియైన రాజరాజవంశజులని తలంచితిమేని రాజరాజు క్రీ. శ. ౧౦౬౧ వఱకును సింహాసనమునం దుండెను. ఆ తరువాత భోజరాజు లేనేలేడు కావున నీ ముద్రామాత్యము భోజ రాజున కంకిత మీయఁబడ లేదని చెప్పవలసి యున్నది. అయిన నీవిషయములన్నియు నూహలపై నాధారపడి యున్నవియే కాని వాస్తవములని చెప్పఁదగినవి కావు. ముద్రామాత్యములోని దని చెప్పఁ

బడిన యొకపద్యము నాధారము చేసికొని చెప్పెను సాగించినందు వలనఁ బ్రయోజనము లేదు.

ఈక్షేమేంద్రుఁడు కాశ్మీరదేశపు క్షేమేంద్రుఁడు కాఁడను నభిప్రాయముతో నాతఁడు సంస్కృతమున రచించినకవి కంఠాభరణాది కావ్యములఁ గూర్చి యించేమియు వ్రాయలేదు.

## ౫౫ అమృతనాథుఁడు

ఈతనిఁగూర్చి శ్రీ నిడదవోలు వెంకటరావు పంతులుగారు భారతి సం. ౧౩ భా ౧ పుట ౪౩ లో నిట్లు వ్రాసియున్నారు. "ఈ తెలుఁగుకవి రచియించిన గ్రంథములు చిక్కుటలేదు. ఈతఁడు మైలము భీమనఁగూర్చి చెప్పినపద్య మొకటి కాచన బసవన తనకవి సర్ప గారుడమున నుదాహరించినాఁడు. పేరునుబట్టిచూడ నీతఁడు జైనుఁడనియు, మైలము భీమన సమకాలికుఁడగుటచే క్రీ. శ. ౧౦౫౦ సంవత్సర ప్రాంతమువాఁ డనియు నూహించుట కవకాశము కలుగు చున్నది."

కవిసర్పగారుడము నాకు లభింపలేదు. అందుచే నం దుదాహరింపఁబడిన యమృతనాథుని పద్యమునిందు వ్రాయఁజాల నైతిని. దీనికి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నసంపూర్ణమైన ప్రతియొకటి యున్నది. అందీ యమృతనాథుని పద్యము గన్పడ లేదు. కవిసర్పగారుడము నెల్లూరిప్రగ్గడ రచియించెనని, యానందరంగ రాట్ఛందమునఁ జెప్పఁబడినది. కాని యది సత్యమైనట్లు కన్పట్టదు. అప్పకవి తన గ్రంథమున కాచరాజు బసవనను, కవిసర్పగారుడమును వేఱు వేఱు తావుల స్మరించి యున్నాఁడు. కాని కవిసర్పగారుడకర్త బసవన యని చెప్పలేదు. అమృతనాథునిఁగూర్చి యింక నేమియుఁ దెలియ రాలేదు.

# ౭. నన్నిచోడుఁడు

ఈ కవిరాజ శిఖామణి కుమారసంభవమును పండ్రెండాశ్వాసముల యుత్తమ ప్రబంధమును రచించి, తనగురువగు జంగమ మల్లికార్జునకుఁ గృతి యొసంగెను. ఈకవి తననుగూర్చి కృత్యాదిఁ వ్రాసికొనిన నాల్గుపద్యముల నీక్రిందఁ నుదాహరించుచున్నాఁడను.

## కవి వంశ వర్ణనము

సీ. కుతలంబు నడుకొనఁ గోలకొండగా నిల్పి
శరనిధిఁ ద్రొచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱుచున్నయే టిలఁదెచ్చి
వారాశి నించె భగీరథుఁడు
గోత్రాచలము లెత్తికొనివచ్చి కడచన్న
రత్నాకరము గట్టె రాఘవుండు
జలధి మహీసతి మొలనూలుగాఁ జుట్టి
పాలించెఁ గలిగరికాలచోడు
వరుసనిట్లు సూర్యవంశాధిపతులంబు
నిధియ మేరగాఁగ నిఖిలజగము
నేలి చనినవారి కెనవచ్చు సుశ్లాఘు
ధనుఁడ నన్నెచోడ జనవిభుండ.

చ. అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి పాకనాఁటియం
దిరువదియొక్క వేయిఁటి కధీశుఁడు నాఁజనుచోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీ తిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్.

క. కలుపొన్న విరులఁ బెరుగం
గలుకోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొఱయూరి కధిపతి
నలఘు పరాక్రముఁడఁ జెంకణాదిత్యుండన్.

క. పాత్రుఁడ నసదృశ కాశ్యప
గోత్రుఁడ సచ్చరిత నుభయకుల శుద్ధుండ౯
మిత్రాన్వయ శేఖరుఁడఁ బ
విత్రీకృత దేహుఁడను వివిధయజ్ఞములన్.

ఈపద్యములనుబట్టి నన్నిచోడకవి కాశ్యపగోత్రుఁడైన సూర్య వంశపు క్షత్రియుఁడనియుఁ గరికాలచోడుని వంశము లోని వాడనియు పాకనాటిలో నిరువదియొక్క వేయిటికిఁ బ్రభువైన చోడబల్లికిని, నాతని పెద్దభార్యయైన హైహయాన్వయసంజాత యగు శ్రీసతికిని, దనూజుఁడనియు నొఱయూరి కధిపతి యనియుఁ దెంకణాదిత్యుఁ డనియు దెలియుచున్నది. ఇందు జెప్పబడిన యిరువదియొక్క వేయి యనునది నన్నయభట్టు చరిత్రమున వ్రాసినట్లు గ్రామసంఖ్యకాదని యు బహుశః జనసంఖ్యయేయైయుండుననియు నూహింపదగియున్నది. ఈపాకనాఁడనునది ప్రస్తుతము నెల్లూరు మండలమును గడపమండల ము లోని కొంతభాగము నై యున్నదని చరిత్రకారులు నిర్ధారణ మొనర్చియున్నారు. ఈకవితనకు రాజధానియని చెప్పుకొనిన ఒఱ యూరు పాకనాటిలోనిదికాదు. కావేరీ నదీతీరమునఁ దిరుచునాపల్లికి సమీపముననున్నది.

నన్నెచోడుఁ డొఱయూరున కధిపతియా ?

నన్నెచోడుఁడు "ఒఱయూరున" కధిపతి ననియు, తెంకణా దిత్యుఁడ ననియు వ్రాసికొనియున్నాఁడు. కాని యివి వంశపరంపరగా వచ్చు బిరుదులవంటివిగాని, వాస్తవములు కావని చరిత్రకారు లభి ప్రాయ పడియున్నారు. కుమారసంభవ ప్రకాశకులగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఈతఁ డొఱయూరున కధిపతియనియు, తెంకణా దిత్యుఁడనగా దక్షిణదేశపు సూర్యుఁడనియు వ్రాసియున్నారు. ఒఱ యూ రనునది చోడులకు రాజధాని. "ఈపురమునకు కోటియను

నామాంతరము గలదు. చోడరాజులలోఁ బూర్వుఁడొకఁడు గజారూ
ఢుఁడై సేనలతోఁ బోవుచుండఁగా నొకచోటఁ గోళ్లు పోరాడుచుఁ
దప్పుకొనలేదు. రాజాయేనుఁగును వానిపైఁకి ద్రోలఁగా నవి గజము
నెదిరించి గోళ్లతోను ముక్కుతోను చీల్చి పొడిచి యాగజమును బడఁ
గొట్టినవి. ఆ వింత చూచి యాకోళ్ల కట్టిశక్తి గలుగుటకుఁగారణ మా
స్థలమహాత్త్వమే యని యారాజు నిశ్చయించి యచటఁదాను పురమును
నిర్మించెను. ఆపురమునకు నివసింపఁదగిన యూరను భావము గలుగునట్లు
తమిళమున "ఉఱైయూరు" అను పేరు పెట్టెనని కొందఱందురు. కోడి
యసాధారణబలము చూపిన ప్రదేశము గాన నాపురమునకుఁ గోఱి
అనియుఁ బేరు పెట్టెనని కొందఱు, కోడియాకారము గలుగునట్లు
పురము నిర్మించెఁ గావున గోఱియనుపేరా యూరికిఁ బ్రసిద్ధమయ్యె
ననియు మఱికొందఱుఁ జెప్పుదురు"

## కుమారసంభవ విమర్శనము

"ఒఱయూరు పురవరాధీశ్వర" యనునది యొక బిరుదముగాఁ
జోళవంశీయులలో ననేకులు వాడుచు వచ్చిరి. ఈ యొఱయూరు
క్రీ. శ. రెండవ శతాబ్ది మొదలు ఏడవశతాబ్దివఱకు చోడులకు రాజధాని
గా నుండెననియు నటుపిమ్మట వారిరాజధాని కుంభకోణమునకు మారి
పోయె ననియు, డాక్టరు బర్నెలు పండితుఁడు వ్రాసి యున్నాఁడు.
ఒఱయూరు పురవరాధీశ్వర బిరుదమును వేసికొనిన రాజులశాసనములు
పెక్కులు గానవచ్చుచున్నవి. కాని వారెవ్వరును ఒఱయూరి పాల
కులు కారు. నన్నెచోడుని తండ్రియైన చోడబల్లిచేఁ బరిపాలింపఁ
బడిన పాకనాఁటికిని, నొఱయూరునకును విశేషదూర మున్నది.
పాకనాఁటినుండి తానొఱయూరునకుఁ బోయి యారాజును జయించి
యొఱయూరును స్వాధీనము చేసికొంటినని కవి యెచ్చటను జెప్పి
యుండలేదు. ఒఱయూర కధిపతి నని వ్రాసికొనిన యొకమాట దక్షా

నితఁడొఱయూరును బరిపాలించెనని చెప్పుట కాధారములు లేవు. కావున "ఒఱయూరు పురవరాధీశ్వర" యను బిరుదమునే "ఒఱయూరి కధిపతి" నని తనను గూర్చి చెప్పుకొనిన పద్యములో వేసికొని యాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. వెంకణాదిత్యుఁడనుట కూడ నట్టి బిరుదములలో నొకటియే. తండ్రియైన చోడబల్లికిఁ బిమ్మట పాకనాఁటిలోనే యిరువదియొకవేయిఁటి కధీశుఁడుగా నీ కవిరాజశిఖామణి యుండినట్లు నిశ్చయముగాను నుడువవచ్చును. పదియవ పదునొకొండవ శతాబ్దములలోఁ దంజావూరు తిరుచునాపల్లి ప్రాంతములు ప్రాచీన ప్రధాన చోడవంశమునకుఁ జెందిన రాజుల పరిపాలనములో నున్నట్లు శాసనములు పెక్కులు వరుసగాఁ గాన్పించుచున్నవి. అందు నన్నెచోడుని శాసన మొకటియును లేదు. దీనినిబట్టి నన్నెచోడునకు నొఱయూరునకు సంబంధమేమియు లేదని స్పష్టమగుచున్నది.

ఈ కవి, తాను కరికాలచోడుని వంశములోనివాఁడనని చెప్పుకొని యున్నాఁడు. దక్షిణదేశమును బాలించిన చోడులలో నన్నెచోడుఁడు లేఁడు. ఈ విషయ నిర్ధారణమునకై ద్రావిడచోళవంశమును బరిశీలింతము. కరికాలచోడుని వంశమున 'జరిత్రకందిన ప్రథమపురుషుఁడు విజయాలయుఁడు. నన్నెచోడునికి విజయాలయుని వంశముతో సంబంధము లేకపోయినను శుద్ధ ద్రావిడ మండలములోని యొఱయూరున కధిపతినని కవి చెప్పుకొని యుండుటచే. నన్నెచోడ నామధారుఁ డెవ్వఁడు నీ చోడరాజ సంతతిలో లేఁడని చూపుటకై విజయాలయుఁడు మొదలు చోళరాజ్యమును బరిపాలించిన రాజుల నామములును వారికాలము నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

| పేరు | కాలము, మొదలు. | క్రీస్తుశకము. వఱకు. |
|---|---|---|
| ౧. విజయాలయుఁడు | ౮౮౦ | — |
| ౨. మొదటియాదిత్యుఁడు | — | ౯౦౭ |

| | | | |
|---|---|---|---|
| ౩ | మొదటి పరాంతకుఁడు | ౯౦౭ | ౯౫౩ |
| ౪. | రాజాదిత్యుఁడు | ౯౫౩ | — |
| ౫. | గండరాదిత్యుఁడు | ౯౫౭ | — |
| ౬. | రెండవపరాంతకుఁడు | ౯౪౫ | ౯౭౦ |
| ౭. | మధురాంతక యుత్తమచోళుఁడు | ౯౬౯ | ౯౮౬ |
| ౮ | రెండవ యాదిత్యుఁడు | ౯౭౦ | ౯౮౦ |
| ౯. | మొదటి రాజరాజు | ౯౮౫ | ౧౦౧౩ |
| ౧౦. | మొదటి రాజేంద్రచోళుఁడు | ౧౦౧౧ | ౧౦౪౩ |
| ౧౧. | మొదటి రాజాధిరాజు | ౧౦౧౮ | ౧౦౫౨ |
| ౧౨. | రెండవ రాజేంద్రచోళుఁడు | ౧౦౫౦ | ౧౦౬౩ |
| ౧౩ | వీరరాజేంద్రచోళుఁడు | ౧౦౬౨ | ౧౦౭౦ |
| ౧౪. | మొదటి కులోత్తుంగచోళుఁడు | ౧౦౭౦ | ౧౧౨౨ |
| ౧౫. | విక్రమచోళుఁడు | ౧౧౧౮ | ౧౧౩౩ |
| ౧౬. | రెండవ కులోత్తుంగచోళుఁడు | ౧౧౨౩ | ౧౧౪౬ |
| ౧౭. | రెండవ రాజరాజు | ౧౧౮౬ | ౧౧౮౮ |
| ౧౮. | రెండవ రాజాధిరాజు | ౧౧౭౧ | ౧౧౮౬ |
| ౧౯. | మూఁడవ కులోత్తుంగుఁడు | ౧౧౭౮ | ౧౨౧౬ |
| ౨౦. | మూఁడవ రాజరాజు | ౧౨౧౬ | ౧౨౪౮ |
| ౨౧. | మూఁడవ రాజేంద్రచోళుఁడు | ౧౨౪౫ | ౧౨౬౭ |
| ౨౨. | త్రిభువన వీరచోడుఁడు | — | — |

ఈ పట్టిక ౨ వ సంఖ్యగా చూపఁబడిన మొదటి యాదిత్యుఁడే నన్నెచోడుఁడనియు, నతనికి టెంకణాదిత్యుఁడను బిరుదమున్నది కావున నాతఁడీతఁడేయగుననియుఁ గొందఱనుచున్నారు. తన తండ్రి పాకనాఁటి ప్రభువైన చోడబల్లియని యతఁడు చెప్పుకొని యున్నందున, నా రెండులక్షణములను జూపినఁగాని వీరివాదము నంగీకరింప వీలులేదు. దీనినిబట్టి, టెంకణాదిత్య, ఒఱయూరు పురవరాధీశ్వర బిరుదములు వంశానుగతములు గాని, వాస్తవములు గావని నిశ్చయింపవచ్చును.

## పూర్వకవిస్తుతి

ఇతఁడు తన గ్రంథమున నాంధ్రకవుల నెవ్వరిని స్మరించియుండ లేదు. వ్యాస వాల్మీకులకుఁ బిమ్మటఁ గాళిదాసుని భారవిని, ఉద్భటుని, బాణుని నుతించెను. ఇందులోఁ గాళిదాసును ఉద్భటుఁడును సంస్కృతమునఁ గుమారసంభవ కావ్యములను రచియించినవారు. నన్నెచోడుఁడు రచించిన కుమారసంభవము కాళిదాసుని కుమారసంభవమున కాంధ్రీకరణము కాదు. ఉద్భటుని కావ్యమునకును భాషాంతరీకరణము కాదని గ్రంథప్రకాశకులగు మానవల్లి రామకృష్ణకవిగారు పీఠికలో వ్రాసియున్నారు. ఈ రెండుకావ్యములను జూచి కవి స్వతంత్రముగా నీగ్రంథమును రచియించియుండునని బ్ర. శ్రీపాద లక్ష్మీపతిపండితులు తమ కుమారసంభవ విమర్శనమునఁ జెప్పియున్నారు.

ఇతఁ డాంధ్రకవులను పేరుపెట్టి స్తుతింపకపోయినను, నీక్రింది రెండు పద్యములలో నాంధ్రకవితను, నాంధ్రకవులను దలపెట్టియుండెను

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ, దేశకవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బున జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్.*

చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి మ
ద్గురు చరణారవిందములకుం దగ సమ్మతిఁ జేసి కొల్చి వి
స్తరమతుల బురాణకవిసంఘము నుత్తమమార్గ సత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతి చేసి మనోముదంబునన్.

ఇందుఁ జెప్పఁబడిన మార్గకవిత యనఁగా సంస్కృతకవిత. దేశికవిత యనఁగా నాంధ్రకవిత. ఈ రెండవపద్యములో సురవరులను, గురువును, పురాణకవిసంఘమును, నుత్తమమార్గ సత్కవీశ్వరులను,

---

*. సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్. పాఠాంతరము

దేశి సత్కవులను సంస్తుతిచేసిన ట్లున్నది. గ్రంథములో దేవతాస్తుతి యును, గురునుతియును, బురాణకవులగు వాల్మీకి వ్యాసులను, నుత్తమసంస్కృత కవులగు కాళిదాసాదులును స్తుతించిన పద్యములును కలవు. కాని దేశిసత్కవులను సంస్తుతిచేసిన పద్యము లేదు. పై రెండు పద్యములకు నడుమ దేశికవులను స్మరించిన పద్యమొకటి యుండి యుండవలయుననియు, నది మాతృకను లిఖించిన వాని లోపమువల ననో, మాతృకనుజూచి పుత్రికను వ్రాసినలేఖకుని ప్రమాదమువలననో విడిచిపెట్టఁబడి యుండుననియు, నాపద్యమే యున్నచోఁ గవికాలనిర్ణ యమునకుఁ దోడుపడియుండు ననియు, బ్ర. శ్రీ. వీరేశలింగ ము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. ఈ పద్య మునకు ముందున్న కందపద్యమే దేశికవుల సంస్తుతిగా భావింపవలయు నని కొందఱు సూచించినారు. అం దాంధ్రకవితను బోషించిన ప్రభు వులు స్మరింపఁబడిరే కాని సత్కవులు స్తుతింపఁబడలేదు. అయినను లభింపనిపద్యమునుగూర్చి యాలోచించినఁ బ్రయోజనము లేదు. అట్టి పద్యమొకటి యుండితీరవలయునని నిశ్చయముగాఁ జెప్పుటకుఁ దగిన యాధారములు లేవు.

## కవిత్వరీతి

కుకవినిందయు సత్కావ్యలక్షణవర్ణనమును గవి యిరువది పద్యము లలోఁ జేసియున్నాఁడు. అందు రెండుపద్యముల నిట నుదాహరించు చున్నాఁడను.

చ. సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపు పెంపుతో
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధురప్రౌఢత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాఁ,

సీ. మృదురీతి సూక్తు లింపొదవింప మేలిట్లు
భావమ్ము నెలవి క్రీడావహాముగ
మెఱుగులఁగన్నులు మిఱుమిట్లు వోవంగఁ
గాంతి సుధాసూతికాంతిఁ జెనయ
వర్ణనలెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దలుకొత్త రాలుపాఱ
దేశిమార్గంబుల దేశీయులుగా న
లంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయముల
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే రచింప వరకవీశ్వరునకు
నూత్నరుచిరకావ్య రత్నవీథి.

ఈ లక్షణములను మనసునం దుంచుకొని కవి కుమారసంభవమును రచించినాఁడు. ఇతని కవిత్వమునందు మొత్తముమీఁద మూఁడు వంతులు తెలుఁగు పదములును, నొకవంతు సంస్కృతపదములు నుండును. వ్యర్థపదప్రయోగములు లేవు. ఈతఁడిందుఁ బ్రయోగించిన పదములలోఁ గొన్ని యిప్పుడు ప్రచారములో లేక, ద్రావిడ కర్నాటక సంప్రదాయమును గలిగి యున్నవి. ఇతని పదములకూర్పును భావప్రక టనమును, వస్తువర్ణనమును మనోహరములై సహృదయులకు హృద యానంద మొనరించుచుండును.

### ఇతని గురువే కృతిపతి.

ఈ కవి యీకావ్యమును దనకుఁ బరమార్థ గురువైన మల్లి కార్జున దేవరకుఁ గృతియిచ్చి గురువుఁ కును, నీశ్వరునకు నభేదమును సూచించుచు ననేక పద్యములలో స్తుతిచేయుచున్నాఁడు ఈ మల్లి కార్జునుఁడు కాలాముఖము మతమునకుఁజెందిన శైవుఁడు. బ్రహ్మ చారి. గొప్ప విద్వాంసుడు. ఆకాలమున శైవమతము లీదేశమున

బయలు వెడలి జనులకు మతబోధ చేయుచుండెడివి. ఈ మఠముల కిట్టి యోగపురుషులే యధికారులుగ నుండెడివారు. నన్నెచోడుని గురువుకూడ నొక మఠాధికారివలెఁ గన్పట్టు చున్నాఁడు. కొందఱీత విని, సుప్రసిద్ధుఁడైన మల్లికార్జున పండితారాధ్యుఁడని గుర్తించిరి. కాని యనేక కారణములచే నాతఁడీతఁడు కాఁడని చరిత్రకారులు నిర్ణయించి యున్నారు

ఈ కవి రచించిన కృత్యాదియందలి గురుస్తుతి పద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

మ అమలజ్ఞానసుదీపవర్తిఁ గొని వృద్ధాచారుఁడై వేదశా
స్త్రములందున్న సదర్థమెల్లఁ గొని విద్వత్ప్రీతి గావించు వా
ని మహాత్మ్యండనఁ బొల్చుపుణ్యనిధి వాణీముఖ్యు సర్వజ్ఞు జం
గమ లింగంబగు మల్లికార్జునుఁ సదా కల్యాణుఁ గీర్తించెదన్.

జంగమ మల్లికార్జునుఁడని చెప్పఁబడినను, ఇతఁ డిప్పుడు జంగము లని పిలువఁబడుచున్న జంగమ జాతివాఁడు కాఁడనియు, వేదశాస్త్రముల నభ్యసించిన బ్రాహ్మణుఁ డనియు, నాశ్వాసాంత పద్యముల లోని "భూసురవంశాద్య" "భూసురకులాగ్రణి" యను వాక్యములవలన దెలియుచున్నది. ఈమల్లికార్జునుఁడు కేవలము పరమార్థగురువే కాకుండ తనకుఁ గవిత్వము ననుగ్రహించిన వాఁడని యీక్రింది సీస పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. శరధినీరులు పయోధరములు కొనివచ్చి
 కురిసి వారిధియందుఁ గూర్చునట్లు,
చేనఁ బండినవిత్తు చేనికి ఫలకాంక్షఁ
 జేర్చిఁ గ్రమ్మఱ వెద వెట్టునట్లు,
రోహిణాచలపతి రూపించి నవరత్న
 సంచయంబున విభూషించినట్లు,

తీర్థాళి శక్రిఁ చ తీర్థోదకంబుల
　　　నెసకంబుగా నర్ఘ్యమిచ్చినట్లు,
నింగి ముట్టియున్న జంగమ మల్లయ
వరమునందుఁ గలినవస్తుకవిత
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చుపగిది పోలె.

### కుమారసంభవ కథ

ఇతఁడు వైష్ణవద్వేషము కలవాఁడు కాకపోయినను, శివుని యందెక్కువ భక్తికలవాఁడు. దక్షప్రజాపతి తనయయైన సతి నీశ్వరుఁడు పెండ్లియాడుటయు, దక్షునియెడ నీశ్వరుఁడు నిర్లక్ష్యభావము చూపుటయు నందుపై దక్షుఁ డీర్ష్యవహించి కుమార్తెను నల్లునిఁ బిలువకుండ యాజ్ఞముచేయుచుండ, సతీదేవి పిలువకపోయినను తండ్రిచేయుచున్న జన్నమునకుఁబోయి యటతండ్రిచే నవమానింపఁబడి తనయెడల జనించిన కోపాగ్నిచే దగ్ధమైపోవుటయు, శివగణములచే దక్షాధ్వరము ధ్వంసమగుటయు, సతీదేవి హిమవంతునకుఁ జన్మించుటయు, మన్మథ దహనంబును, పార్వతీపరమేశ్వరుల కల్యాణమును, కుమారసంభవ మును దారకాసుర వధయును గల కథను సందర్భోచితముగాఁ బ్రబంధ మున నుండవలసిన పదునెనిమిది వర్ణనములను చేసి చక్కని ప్రబంధ ముగాఁ నీతఁడు నిర్మించినాఁడు. విఘ్నేశ్వరుఁడు పార్వతిచేఁ బ్రాణప్రతిష్ఠ చేయఁబడిన నలుగుఁబిండి బొమ్మగా నీతఁడు చెప్పలేదు. పార్వతీపరమేశ్వరులు వినోదార్థమై గజరూపములను దాల్చి క్రీడింపగా గజాననుఁ డుదయించెనని చెప్పియున్నాఁడు.

### ఈతని కవిత్వ గుణము

ఈతని కవిత్వ మత్యుత్తమ మయినది. ఇతఁడు తిక్కన సోమయాజి వలెనే చిన్నమాటలలో నర్థగాంభీర్యమును గనపరుచుఁ బద్య రచనముఁ గావించినాఁడు. ప్రబంధమున నుండవలసిన పదునెన్మిది

వర్ణనములను సమయోచితముగా నిందుఁ జొప్పించియున్నాఁడు. ఇతఁడు కృత్యాదియందుఁ దనది వస్తుకవిత యనియుఁ, గవితలో వస్తుకవితయే శ్రేష్ఠమైనదనియుఁ జెప్పి యాంధ్రుల కనుగుణముగఁ బదునెనిమిది వర్ణనములను మనోహరముగఁ జిత్రించియుండెను. ప్రకృతిరామణీయకమును పాఠకుల కన్నులకుఁ గట్టినట్లు జూపుటలో నీతని నైపుణ్యమపారము. ఈతని కావ్యమును జదువుటలో నిప్పటి పాఠకులకుఁ గొంత కష్టముకలదు. ఈ కవి యుపయోగించినపదములలో గొన్ని యిప్పుడు వాడుకలో లేకపోవుటవలనను, సంస్కృత మిళితముగాక కేవల దేశీయపదప్రయోగమే తఱచుగా నుండుటచేతను, ఆచిన్న పదములయం దున్నగాంభీర్యమును గ్రహించుటలో క్లిష్ట ముండుట మూలమునను వర్ణనములు బహువిధాలంకార సంయుక్తములై యున్న కారణమునను, నీతని కవిత్వ మిప్పటివారికి సులభగ్రాహ్యము కాదని తోఁపవచ్చును. కాని కొంచెమోర్పు వహించి యీతని పదప్రయోగ ధోరణిఁ దెలిసికొని చదివిరేని, యందున్న మాధుర్యరసము లభించి మహానందమున నోలలాడఁగలరు. పూర్వకాల పదప్రయోగవిజ్ఞానమే పరమార్థమనినచో నీగ్రంథము మనకక్కఱలేదు కాని యిందు భావగాంభీర్య మున్నది. మాధుర్య మున్నది. హృదయోల్లాసకరమగు కవితాపద్ధతియున్నది. జీవకళ యున్నది. అందుచే నిది సర్వాదరణీయ మగుచున్నది. ఈగ్రంథమునఁగల చమత్కార విశేషములను పండితులు గ్రంథరూపమునను పీఠికల మూలమునను, వ్యాసరూపమునను లోకమునకు వెల్లడించి యున్నారు. వెల్లడించుచున్నారు. కవులనుగూర్చియు వారి గ్రంథములను గూర్చియు దిఙ్మాత్రప్రదర్శనము చేయఁబూనుకొనిన నే నింతకంటె నీగ్రంథమునుగూర్చి యధికముగ వ్రాయఁజాలను. కవితాశైలి చూపుటకై కుమారసంభవమునుండి యాశ్వాసమున కొకపద్యము నిట నుదాహరించు చున్నాఁడను.

చ. ఉడుగని నీరసంబునఁ బడియుండఁగ నోపక బాడబాగ్ని పె
ల్లడి వనతీరభూరుహకులంబులకై మిగులఁ గప్పినట్లు దం
దడి నసూనప్రవాళతతి దరుసంహతిమీఁదఁ బర్వెఁ బె
ల్లడరి తటాటవుల్ దనరు నబ్ధిబహిర్గత రత్నదీప్తులన్.

ఉ. పిండె ఖలుండు దక్షుఁ డన పిండికిఁ బోలుఁడు పిండు సర్వ వ
ధ్యుం డెడ సేయకుండు శివదూషకు నాలుక గోసి యుప్పునిం
పుండుఁ బ్రద్రువ మ్మెసలఁ బూయుఁడు లోపము గాఁ గనోఁ బో
యుండును రాత్మ చెప్పవట మొల్వఁడు గన్నులు మీటుఁడు కక్కుఱున్

చ. తరుణులు చిల్కబొమ్మలును దంతపుబొమ్మలు మేలి గాజు బ
స్నరులును మ్రానిచొప్పికలు సంగడి నోలిన పేర్చి లీల జో
కుఁ బొమరిండ్ల జేయు నగుగూళ్లను వండుచు బొమ్మపెండ్లి మా
సముగఁ జేసి యాడ నగజాత శివార్చన సేయు నయ్యెడన్.

ఉ. పొన్నలు పూచెఁ బొన్నలొగిఁ బూవకముందఱఁ బూచెఁ గోగులా
పొన్నలుఁ గొండగోగులును బూవకముందఱఁ బూచె బూరువుల్
పొన్నలుఁ గొండగోఁగులును బూరువులున్ విరిగి బూపకుండఁగా
మున్నె వనంబు వంగలయి మోదుగలొప్పఁగఁ బూచె చెవా మునిన్

మ. తగదే పోలదె చాలదే యమరదే త్రైలోక్య పూజ్యంబు నే
తగులం బీశ్వరు మీఁద నట్టి యది యేతన్మాత్రమే కన్యకా
సుగుణం బెమ్మెయి దూషితం బగునె సంశుద్ధాత్మసర్వోత్తమ స
ర్వగతుం జిత్తమునందుఁ గోరుఁ డిది సర్వంసహ్యం బనాద్యంబిలన్

శా. శీతాత్యంతసపీడనం బడి జగజ్జీవాము లత్యార్తులై
పాతాళంబులు సొచ్చునట్టిరవు లొప్పన్ భూగృహావాసులై
భీతి న్నెల్లడ కుండ నహ్నిమెయిఁ గంపింపం బ్రచండాగ్నికిం
జేతుల్ గ్రొవ్వెర వోవుచుండ శశిరోచ్ఛేదంబు వర్తిల్లె నహీన్

చ. సురసతు లర్థిఁ దత్పురము సూడ మనంబునఁ గోరి కోటపై
వరుస విమానముల్ నిలిపి వచ్చిరొ నా మణిహేమభాతి న
ట్టిరవులు వొల్చు నింద్రపురి కిప్పుడు మేలని యాసురాంగనల్
మరిగి రమించుచున్నటులు మానిను లొప్పిరి తత్పురంబునన్.

ఉ. భాసుర శైలి నచ్చుపడి పైఁబడి తద్విటు లిచ్చఁ గూడి రాఁ
గా వివిధోపచారములఁ గామసుఖంబులు సల్పి పుచ్చి తా
రో వెలనీఁగి తత్తఱని రోయుదు రక్క వెలయాలి కూటముం
బూవుల మేలికంపుఁ దమపొందున కాఁకల నిల్చునే.

చ. వెలువలు మాత్రమాసిపయిఁ జేకలు మూఁకిమింప వాని ము
క్కలుగని వాత్రపండులని కోయఁగఁ బోయిన వానిహస్తముల్
దలిరులు సావి కీరములు దండడి మట్టిన మగ్గలండఱన్
గలకొనఁ బాఱిరో యిదియ గాటుల ద్రమ్మనుచున్ భయంబునన్.

శా. సారాచారవిచార దక్షులవలజ్ఞాన క్షణోద్దీక్షణ
ప్రారంభాన్మకు లాత్మ నిన్ను నెనయన్ భావించి దుర్వారసం
సారాంభోనిధి వీఁద మెద్దు సుమహాత్త్వైశ్వర్యాత్ములై మర్త్యులా
ధారాధేశువిముక్తి యుక్తులగుదుర్ దారిద్ర్యవిద్రావణా.

క. ముక్తాముక్తాయుధములు
ముక్తాముక్తాయఘోషములుఁ దగు సుభటు
లుక్తాముక్తాసులుఁ బర
ముక్తాముక్తాసుబంధములు నగుచునలిన్.

మ. ధర గంపింపఁ బయోనిధుల్ గలఁగ దిగ్దంతుల్ భయంబంద భూ
ధరముల్ డొల్ల వియత్తలం బద్రవ దైత్యశ్రేణి భీతిల్లి భా
స్కర, రథ్యంబులు ద్రిమ్మిగ్గి నర్గఁబడ నాశాచక్రముల్ ద్రమ్మఁ భీ
కరమై దారుణమై గుణధ్వని మహోగ్రంబై చెలంగెన్ వడిన్.

## ఇతని యితర రచనములు

ఈ మహాకవి కళావిలాస మను నింకొక కావ్యమును రచియించి యున్నట్లును నందలి పద్యములు లక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడెననియు వ్రాయుచు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు కుమారసంభవ పీఠికలో నీక్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. కళావిలాస మిప్పు డెచ్చటను గానవచ్చుట లేదు.

సీ. పృథుల విశ్వంభరారథమున కెదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు
కాంచనాచల కార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు
నఖిలపాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
నతులితామర దానవాదిబలముల
గెలిపించె నెవ్వఁడయ్యళిబలంబు
నట్టి జగజెట్టి మన్మథుం డఖిలలోక
ములకు వెఱఁగొంగ శివుఁ మూలకంద
యాతని యిలుఁ జొచ్చి వెసలనియతఁడు గలఁడె
యాతని యమ్ములఁ బడకున్నయదియుఁ గలదె.

క. తలపోయఁగ రుచులాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫముం జెడు నా
కలిపుట్టు దగయుఁ జెడుఁ ద
మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్.

చ. తొడవులు పెట్టి సంభ్రమముతోఁ దిలకించు మటుంగు గట్టుపైఁ
బడఁ దడవోపదం జెఱఁగి పట్టుచు నెమ్ములు గట్టిపెట్టుఁ బ

లెక్కడు నెడఁ దొట్రుపా టొదవఁ గింకకుఁ జేగిలు మఱ సమర్పఁగా
బిడుముడిఁ బొందుఁ గాంత పతి చేరినఁ గూరిమిఁ గ్గలై చేసియు౯.

చ. లలనలు కొంద ఱాత్మపతులం దగఁ గూడిన చెయ్వు లన్నియుం
దలఁచి సఖీజనంబులకుఁ దప్పక జెప్పెడువారు వ్యాజీ
వులు చెలి యామినీశుని కవుంగిలి డాయుదె కాక తాల్మికి
ద్రోలఁగిన తీరు గీరు నటదోపవు నాకు రతిప్రయోగముల్.

క్షేమేంద్రుఁడు కళావిలాస మను పదిసర్గల కావ్యమును సంస్కృతమున రచించియున్నాఁడు కాని యిది యాగ్రంథమున కాంధ్రీకరణ మైనట్లు గన్పట్టదు. క్షేమేంద్రుఁడు క్రీ. శ. ౧౦౩౧-౧౦౬౦ కాలము వాఁడు

## షణ్ముఖుఁ డీతని యాస్థానకవియా?

ఇతని యాస్థానమున షణ్ముఖుఁడను పండితకవి యొకఁడుండె నని చెప్పుదురు. యశోధర చరితాది కావ్యములను సంస్కృతమున రచించిన షణ్ముఖుఁడీతఁ డగునో కాదో తెలియదు. నన్నెచోడుని కాలమున "తారుఁ"డను నొకకవియు షణ్ముఖుఁ డను నొక కవియు నుండిరనియు, వీరిరువు రన్యోన్యము స్పర్థతోఁ జరియించెడి వారనియు నన్నెచోడుఁడు షణ్ముఖుని శిష్యుఁడగుటయే గాక నాతనియం దెక్కువ గౌరవము గలవాఁడనియు, తారకవిని తారకాసురునితోను, షణ్ముఖుని కుమారస్వామితోడను బోల్చుచు శ్లేషగాఁ గొన్ని పద్యములను నన్నెచోడుఁడు కుమారసంభవమున రచియించెననియు నొకకథ ప్రచారములో నున్నది. అందులకీ దిగువపద్యముల నుదాహరణముగాఁ జూపుచున్నారు.

క. తనజనకుఁ డురుస్థాణువు
జనని యపర్ణాఖ్యదా విశాఖుం డనగాఁ

దనరియు నభిమతఫలముల
జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖుఁ గొలుతున్.

గీ. అన్యతారక కవిగతుల నాదరించి
వెలయ సత్కవి బుధగురుబలము వడసి
యొనర దైవజ్ఞ నల్లశుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించుఁ దిరము గాఁగ

క. తారకవి రచితకృతియుం
దారక విరచిత సుకృతియుఁ దానడఁగు నదో
చారక విబుధాలికి సువి
చారక విబుధాధినాథు షణ్ముఖుఁ గవివన్.

క. ఇనుఁ డుదయింపక మున్నటి
ఘనముగ వర్తించుఁ దారక ప్రభ మాక
యినుఁ డుదయించినపిమ్మటఁ
గనుఁగొన లోకమునఁ దారకప్రభ గలదే?

ఈపద్యములనుబట్టి పైకథయందు సత్యమున్న దనియే తోఁచుచున్నది.

## రామేశ్వరకవి

కుమారసంభవ దశమాశ్వాసమునందలి దారిద్ర్యవిద్రావణ దశకములోని

శా. శ్రీరామేశకవీశ్వరాదు లెవ రీ శ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోకసముదాయాధీశులై రన్న సం
సారుల్ దుఃఖనివారణాక్షమభవుల్ సర్వేశ లోకత్రయా
ధారుణ్ నిన్ మదిఁ గొల్వ కుక్కయు నవే దారిద్ర్యవిద్రావణా

అను పద్యమునం దుదాహరింపఁబడిన రామేశ్వరకవి "కవి కాలము నాఁటికిఁ బ్రసిద్ధుఁడైయుండి శివభక్తుఁడైన యాంధ్రకవియై యుండును"

అని శ్రీ వీరేశలింగముపంతులు గారు వ్రాసియున్నారు. ఇతఁ డాంధ్రకవి యనుట కాధారములు లేవు. ఏ భాషాకవియో చెప్పఁజాలము. కుమార సంభవ కావ్యమునకు విమర్శనము వ్రాసిన శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగా రీపద్యమున రామేశ్వరకవి ప్రశంసయే లేదని యభిప్రాయపడి యున్నారు. శ్రీ ముట్నూరు వెంకటరామయ్యగారు భారతి (వృష-శ్రావణము) లో కాకతీయ రెండవ బేతరాజునకును నాతని కుమారుఁడును దారిద్ర్యవిద్రావణ బిరుదాంకితుఁడు నైన త్రిభువనమల్ల దుర్గరాజునకును గురువై వారిచే నగ్రహారములను గైకొని, కాలాముఖశైవపరంపరకు సంబంధించిన శ్రీశైల మల్లికార్జున మఠాచార్యుఁడుగ నుండిన రామేశ్వర పండితుఁడే, పై పద్యములోఁ జెప్పిన రామేశ్వరకవియై యుండుననియు, నన్నెచోడకవి దారిద్ర్యవిద్రావణాంకితముతో రచించిన దశకమునకును త్రిభువనమల్లుని దారిద్ర్యవిద్రావణ బిరుదమునకును నేదియో సంబంధ ముండియుండు ననియు వ్రాసియున్నారు. రెండవ బేతరాజువలన రామేశ్వరపండితుఁడు దానమును బరిగ్రహించిన కాలము చాళుక్య విక్రమశకము ౨౩ (శా. శ ౧౦౧౯ క్రీ. శ. ౧౦౯౭-౯౮)

ఈ రామేశ్వరపండితుఁడు పండితుఁడే కాని కవియైన ట్లాధారములు లేవు. పైపద్యములో నీరామేశ్వరుఁడే చెప్పఁబడె ననుటకును నాధారములు గనబడవు. ఈయూహలనుబట్టియే విషయమును నిర్బాధకముగా నిర్ణయింప వలనుపడదు.

## నన్నెచోడుని కాలనిర్ణయము

ఈకవికాలమును గూర్చి పండితులును జరిత్రకారులును, భిన్నాభిప్రాయులై, యందునుగూర్చి వాదోపవాదములు పెక్కులు చేసియుండిరి. కుమారసంభవ గ్రంథప్రకాశకులగు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు, నన్నెచోడుఁడు క్రీ. శ. ౯౪౦ ప్రాంతమువాఁడని వ్రాసియుండిరి. విమర్శనకర్తలగు శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు

రామకృష్ణకవిగారితో నేకీభవించిరి. కవిచరిత్రకారులగు బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు "ఇతఁడు ౧౧౫౦ వ సంవత్సర ప్రాంతమునుండి దాదాపుగా ౧౧౬౦-౧౧౭౦ సంవత్సర ప్రాంతములవఱకు నుండి యుండును" అని నిర్ధారణ మొనర్చినారు. శ్రీ బుర్రా శేషగిరిరావు పంతులుగారు వీరేశలింగము పంతులుగారితో నేకీభవించిరి. బ్ర. శ్రీ. జయంతి రామయ్యపంతులుగారును వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారును నన్నెచోడుఁడు క్రీ. శ. ౧౧౨౦ ప్రాంతమువాఁడని నిర్ణయించిరి. ఆంధ్రుల చరిత్రమును రచించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు "అయిన ననేక హేతువులచేత నితఁడు క్రీ. శ. ౧౧౨౦-౪౦ సంవత్సరముల మధ్యనున్న వాఁడని చెప్పవచ్చును. ఈ కుమారసంభవ కావ్యమును బఠించితిమేని, తప్పక యిది నన్నయభట్టారకునకుఁ బూర్వమున రచింప బడిన కావ్యమని బోధపడఁగలదు. ఇతరములైన ప్రమాణములు గాన్పించువఱకు నన్నెచోడకవి నన్నయభట్టునకు నలువది డెబ్బది సంవత్సరములకుఁ దరువాత నున్నవాఁడననియే నిశ్చయింతము అని వ్రాసియున్నారు. ఈ వాదోపవాదములలోఁ బాల్గొన్న పండితులలో యథార్థనిర్ణయమునే మనసునం దుంచుకొని కొందఱును; నన్నెచోడు నెల్లయినను నన్నయభట్టునకుఁ బూర్వపువానినిగా జేయవలయునని కొందఱును; నన్నయకు కొంచెము కాలము తర్వాత వానినిగాఁ జేయవలయునని కొందఱును తమ వాదోపవాదములను సాగించినట్లు గన్పట్టుచున్నది. బ్ర. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారు తమ కుమారసంభవ పీఠికలోఁ నన్నెచోడుఁడు "తిక్కన కనంతర మఱువది డెబ్బదిసంవత్సరములవఱకుఁ జోడరాజుల శాసనములు గన్పట్టుచున్నవి గానఁ దత్ప్రాంతకాలమున నన్నిచోడ కవి వెలసియుండును. చతుర్దశశతాబ్దిప్రథమపాదమో త్రయోదశశతాబ్ది చతుర్థపాదమో నన్నెచోడునిచే వెలసి

యుండును" అని వ్రాసియున్నారు. ఈకవికాల నిర్ణయమునకు గ్రంథమున మనకు లభించిన యాధారములు నాలుగు.

౧. ఇతఁడు కరికాలచోడుని వంశము లోనివాఁడనుట.

౨. తండ్రి పాకనాఁటిలోని ఇరువదియొక్క వేయిఁటి కధిపుఁడైన చోడబల్లి యని చెప్పుట.

3. తల్లి హైహయాన్వయసంజాత యైన శ్రీదేవి యనివ్రాయుట

౪ జంగమ మల్లికార్జున దేవుని శిష్యుఁడ నని చెప్పుకొని గ్రంథము నాతనికే కృతియిచ్చుట.

## చోడవంశములు

కవి చోడవంశములోని వాఁడనని చెప్పుకొని యున్నాఁడు. కాని వాఙ్మయమునందును, శాసనములలోను చోడవంశములు పెక్కులు చెప్పఁబడి యున్నవి. అందీకవి యేవంశములోనివాఁడో తెలిసికొనినఁ గాని యీతనికాలమును నిర్ణయింపలేము. బల్లిచోడ నన్నిచోడ నామధాములు పెక్కురు గానవచ్చు చుండుటచేఁ గవి నన్నెచోడు నానవాలుపట్టుట సులభసాధ్యము కాదు.

ప్రస్తుతపుఁ దంజావూరుమండలమును తత్ప్రాంత ప్రదేశమును బూర్వము చోళదేశమని పిలువఁబడుచుండెడివి చోళదేశమును బరిపాలించెడివారు చోళులు. ఈచోళులు కొంతకాలమునకు ద్రావిడ చోళులుఁ దెలుఁగుచోళులు, నని రెండుతెగలుగా విడిపోయిరి. అరవము దేశభాషగాఁగల తంజావూరు, తిరుచునాపల్లి, ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు, చెంగల్పట్టు మండలములలో నివసించి యాదేశములను బరిపాలించుచు వచ్చినచోడులు ద్రావిడచోడులనియు, నాంధ్రము దేశభాషగాఁ గల కడపమండలము మొదలు ఉత్తర మండలములను బరిపాలించు చోడు లాంధ్రచోడులనియు పిలువఁబడుచు వచ్చిరి.

ఈ రెండు తెగల చోడులునుగూడ, తాము సూర్యవంశమువారమనియు నందు మిగులఁ బ్రఖ్యాతి వహించిన కరికాలచోడుఁడు తమకువంశకర్త యనియుఁ జెప్పుకొనుచుందురు. ఈకరికాలచోడుఁ డొనర్చిన మహత్కార్యములు రెండు. కావేరీనదిపొంగి గ్రామములపైఁ బడకుండ నెత్తైనకట్టలు పోయించుట, పల్లవులను జయించి చోళరాజ్యమును వర్ధిల్లఁజేయుట. తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణమునం దీకరికాలచోళుని గూర్చి యిట్లు నుడివి యున్నాఁడు.

క. పిదపఁ గరికాలచోళుం
డుదయంబై జలధిపరిమితోర్వీవలయం
బు దనకు బంట పొలముగ
నెదు రెండును లేక పేర్మి నొసకం బెసఁగన్.

శా. చేసేఁతం బృథివీశు లందుకొనఁ గాశీసింధుతోయంబులం
జేసెన్ మజ్జన మంగుటంబున; హరించెం బల్లవోర్వీశు ను
ల్లాసం బొందఁగ ఫాలలోచనము; లీలం గట్టెఁ గావేరి; హే
లాసాద్యాఖిల దిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుం డల్పుఁడే.

ఈ కరికాలచోడుఁడు క్రీస్తుశకమున నాఱవ శతాబ్దివాఁడని కొందఱు చరిత్రకారులు తలంచుచున్నారు. ఇదిసరియైనదని చెప్పుటకుఁ దగినయాధారములు నాకు లంభింపలేదు. ఇతఁడు త్రిలోచనపల్లవుని జయించినట్లు పైపద్యములో నున్నది. కాని త్రిలోచనపల్లవులు పెక్కురున్నారు. చాళుక్యవంశీయుఁడగు విజయాదిత్యునితో యుద్ధమొనర్చినవాఁడొక త్రిలోచనపల్లవుఁడు కలఁడు. ఆయుద్ధములో విజయాదిత్యుఁడు చనిపోయె ననియు, నంతర్వత్ని యగు నాతనిభార్యను విష్ణుభట్టసోమయాజి కాపాడెననియు, నన్నయభట్టు చారిత్రమున వ్రాసియుంటిని. ఆత్రిలోచనపల్లవుని కాల మాఱవశతాబ్ది యని యచ్చటఁ జెప్పఁబడినది. ఆ త్రిలోచనుఁడును, కరికాలచోడునిచే

జయింపఁబడిన త్రిలోచనుడును ఒక్కఁడేయైనయెడల, కరికాలచోడుని కాల మాఱవ శతాబ్ది యనుమాట సత్యమగును. అయినను ప్రమాణాంతరము లభించినఁగాని యిది సత్యమని చెప్పజాలము. కొందఱు చరిత్రకారు లీత్రిలోచన పల్లవుని యునికిని గూర్చియే సంశయము చూపుచున్నారు.

ద్రావిడచోళుల పట్టికను పై నిచ్చియున్నాఁడను. ఆపట్టికలో చోడబల్లి గాని నన్నెచోడుఁడు గాని లేఁడు. పైని జెప్పిన పట్టికలో నున్న మొదటి పరాంతకునకు 'మధిరకొండై' యను బిరుదుకలదు. మధురను జయించిన వాఁడని దానియర్థము. కొన్ని శాసనములలో నీబిరుదము "మధురాంతక" యని యుపయోగింపఁ బడినది. ఆతని తరువాత రాజ్యమునకు వచ్చినవారు మధురను తమయేలుబడిలో నుంచుకొనఁ గలిగినను లేకున్నను నీచోళ ప్రభువు లందఱును తమబిరుదములలో నీ మధురాంతక బిరుదమును తఱచుగాఁ జేర్చుకొనుచు వచ్చిరి. పైనిజూపిన పట్టికలోఁ జెప్పఁబడిన ద్రావిడచోళుల వంశములో నుండి యొకశాఖ చీలిపోయి, కడపమండలము నందున్న "పొత్తపి" యను పట్టణమును రాజధానిగాఁ జేసికొని తత్పరిసర ప్రాంతమునకు, ప్రభువులై రాజ్యము చేయుచు వచ్చిరి. వీరు తమ పూర్వవృత్తాంతమును దెలుపు మధురాంతక శబ్దమును జేర్చికొని మధురాంతకపొత్తపి చోళులని వ్యవహరించుకొనుచు వచ్చిరి. వీరిశాసనములు శాలివాహన శకము ౧౧౦౦ మొదలు ౧౨౫౦ వఱకును గనఁబడుచున్నవి. ఈ శాసనములు కడప నెల్లూరు మండలములలోఁ గానవచ్చుటచే వీరా ప్రాంతములను బరిపాలించిన ట్లూహింపఁ దగియున్నది. లభించినంత వఱకు వీరి వంశావళిని తిక్కనసోమయాజి చారిత్రమున నిచ్చుచున్నాఁడను. ఆవంశములో చోడబల్లి, నన్నెచోడ నామధార్యులెవ

రును లేరు. కావున నన్నెచోడకవికి "ఆ మధురాంతకపొత్తపిచోడ" వంశముతో సంబంధము లేదు.

ఇదిగాక వెలనాఁటి చోడులను మఱియొక శాఖ కలదు. వీరాంధ్రచోళ శాఖకుఁ జెందినవారు. ద్రావిడచోళ శాఖకును, వెల నాఁటి చోడ శాఖకును సంబంధము లేదు. ఈ వెలనాఁటి చోడులు మొదటినుండియు రాజ్యముగల ప్రభువులైనట్లు కన్పట్టదు. ఈ వంశ మునకు మూలపురుషుఁడైన గొంకయ తూర్పుచాళుక్యులలోని సర్వ లోకాశ్రయ విష్ణువర్ధన మహారాజులకడ సేనాధిపతియైనట్లు కన్పట్టు చున్నది. ఈ వెలనాటిచోళుల వంశ వృక్షమును మంచెనకవి చరిత్ర మున నిచ్చుచున్నాఁడను. అందుఁ జోడబల్లిగాని నన్నెచోడుఁడు గాని లేఁడు. ఆ వంశముతో వీరికి సంబంధము లేదు.

రేనాటిచోడులను మఱియొక శాఖ కలదు. రేనాఁడనఁగా నిప్పటి కడపమండల మని చెప్పవచ్చును. ఈ ప్రదేశమును బరిపా లించినవారు రేనాటి చోడులు. వీరు కరికాలచోడునిఁ దమకు వంశ కర్తనుగాఁ జెప్పుకొనిరి. కాని యది వాస్తవమయినట్లు కన్పట్టదని కొందఱు చరిత్రకారు లభిప్రాయ పడియున్నారు. చీనా దేశము నుండి "హౌనుత్సాంగు" అను నొక యాత్రికుఁడు క్రీ. శ. ౬౪౦ సంవత్సరప్రాంతమున హిందూదేశమును జూచుటకు వచ్చి యాంధ్ర దేశమునఁగూడఁ బర్యటన మొనర్చినాఁడు. అతఁడు వేంగిపురమును జూచి తరువాత ధాన్య కటకమును దర్శించి పిదప దానికి నైరుతిమూల నున్న (కడప మండలము) ప్రదేశమునకుఁ బోయి దానిని చుళియ దేశ మని పిలిచియున్నాఁడు. చుళియ దేశమనఁగా చోళదేశము, అచ్చట నాకాలమున నీచోడులు నివసించి యున్నారని దీనినిబట్టి చెప్ప వచ్చును. ఈ రేనాటి చోడుల శాసనములు ఏడెనిమిది శతాబ్దులలో

గన్పడుచున్నవి. దొరకినంతవఱకు వారి వంశవృక్షము నీక్రింద నిచ్చు చున్నాఁడను.




ఈ రేనాటి చోడులాతరువాత పొత్తపిచోడులలోఁ గలిసిపోయి నట్లు కన్పట్టుచున్నది.

వీరిశాసనము లన్నియుఁ గడపమండలములోనే లభించుటచేత వీరాప్రాంతమును బరిపాలించిరని నిశ్చయింపవచ్చును. పదునొకండవ శతాబ్దినుండియు గడపమండలమున మధురాంతక పొత్తపిచోళుల శాసనములు తెఱచుగాఁ గాన్పించుచుండుటచే నీ రేనాటి చోడ వంశమువారి కప్పటినుండియుఁ బరిపాలనలో ప్రసక్తి లేకపోయి యుండును. పైనిజూపిన వంశవృక్షములో మహేంద్రవర్మకు నామాంతరముగా, 'చోళమహారాజు' అనియుండుటచేతను, వీరు శాసనములలో దాము కరికాలచోడుని వంశమువారమని చెప్పుకొని యుండుటచేతను వీరిని చోళు లనుకొనవలసి వచ్చినది. లేనిచో వీ రేపల్లవులలోనో చేరి పోయి యుందురు. ఈ రేనాటి చోడులలోఁ గూడ చోడబల్లినన్నిచోడ నామధారు లెవ్వరును గన్పట్టలేదు.

## కొ ణి దె న చో డ శా ఖ.

ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి ద్రావిడచోళులలోగాని యాంధ్ర చోడులలో వెలనాటి, రేనాటి పొత్తపినాటి చోళశాఖలలోఁగాని నన్నెచోడుఁడు లేఁడని తేలినది. ఇఁకమనకుమిగిలినది కొణిదెనచోడశాఖ ఈశాఖవారు ప్రస్తుతము గుంటూరు మండలములో నరసారావుపేటకు సమీపముగా నున్న కొణిదెనను రాజధానిగా చేసికొనిపాకనాటిలోని కొంతప్రదేశమును కమ్మనాటిని బరిపాలించుచు వచ్చిరి. అందుచే వీరిని, కొణిదెన చోడులని పిలచుచున్నారు. ఈకొణిదెనుబూర్వము కొట్యదోనయని పిలుచుచుండెడివారు. ఈశాఖ ద్రావిడచోడులనుండి విడిపోయవచ్చినదో కాదో విడిపోయినచో నెప్పటినుండి విడిపోయిదో చెప్పఁజాలము. కాని వీరుతమశాసనములలోఁ గరికాలచోడుని సంతతివారమని చెప్పుకొనుచువచ్చిరి. ఈశాఖఆంధ్రచోళుల తెగకు చెందినదే కాని, వెలనాటి రేనాటి శాఖలకంటె భిన్నమయినశాఖ. వీరికి ప్రత్యేక ప్రశస్తికలదు. వీరిలో కొందఱు శాసనములలోఁ దమకు పొత్తపిచోళశబ్దమునుగూడ జేర్చుకొనుచు వచ్చిరి. అందుచే వీరిని పొత్తపిచోళులలోనుండిచీలిన యొక శాఖయని చెప్పవలసియున్నది. ఈ కొట్యదొనచోడుల ప్రశస్తి, యిది:- "స్వస్తిచరణ సరోరుహ విహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల పృధ్వీశ్వర కారిత కావేరీతీరకరికాల కులరత్న ప్రదీపాహితకుమారాంకుశ" ఇత్యాది.

ఈకొణిదెనచోడులలో నాలుగైదంతశ్శాఖలున్నవి. నాకు లభ్యమైనంతవఱకాశాఖల వంశవృక్షముల నీదిగువ నిచ్చుచున్నాఁడను.




ఈ యోపిలిసిద్ధి మహారాజు కమ్మనాఁటిలోని కొట్యదొన యందలి దేవునకుఁ గాకతీయ గణపతి దేవునకు పుణ్యమునకుగాను

---

(1) దక్షిణ హిందూదేశ శాసనములు సం. 6 సంఖ్య 587
(2) డిటో ,, 6 ,, 628

ధర్మమను నొసంగి శాసనము వ్రాయించినాఁడు. ఈవంశములో చోడ బల్లిగాని నన్నెచోడుఁడు గాని లేఁడు. ఇందు మూలపురుషుఁడుగా చూపఁబడిన వల్లిదేవుఁడు దాదాపు శా. శ. ౧౦౨౫ ప్రాంతమువాఁడై యుండును. అనఁగా నీవంశ మించుమించు ౧౨౫ సంవత్సరము పరిమితిగల కాలములో నున్నదని తేలుచున్నది.

(౨) చోడబల్లయ మహారాజు
|  (1)
కామచోడ మహారాజు = శ్రీయాదేవి
|  (2)
త్రిభువనమల్ల దేవచోడ మహారాజు — (3) } = ౧ మాచలదేవి ౨ కామిదేవి. (4)
|
(5) నన్నెచోడుఁడు (శక 1078)

ఈ వంశ మించుమించు శా. శ. ౯౮౦ కును ౧౦౭౫ కును మధ్యకాలమునం దున్నట్లు కన్పట్టుచున్నది. ఇందు చోడఁబల్లియు, నన్నెచోడుఁడును, శ్రీయాదేవియుఁగూడఁగలరు. కాని కుమార సంభవములోఁ జెప్పఁబడిన సంబంధము వీరికిలేదు. కవి నన్నెచోడుని తండ్రి చోడబల్లి, తల్లి శ్రీయాదేవి. ఇందున్న నన్నెచోడునితల్లి మాచలదేవి. తండ్రి త్రిభువనమల్లదేవ చోడమహారాజు. బ్ర. శ్రీ. కందుకూరి వీరేశలింగము పంతులుగారు కవులచారిత్రమున నీ త్రిభువనమల్లదేవచోడుఁడే, బల్లిచోడుఁడనియు, మాచలదేవియే శ్రీయాదేవియనియుఁ ద్రిప్పి త్రిప్పి యుద్ధములను జెప్పి దాని నాధారముచేసి

(1) దక్షిణహిందూదేశ శాసనములు 6 సం॥ నె 606 రు.
(2) ,, ,, 607, 609.
(3) ,, ,, 131, 163, 612, 624, 608, 610, 630, 637,
(4) ,, ,, 647.
(5) ,, ,, 645, 646

కాని నన్నెచోడుని కాలనిర్ణయమును జేసిరి కాని యందు సత్యములేదు. త్రిభువనమల్లదేవచోడమహారాజనియు, మాచలదేవి యనియు ననేక శాసనములలో స్పష్టముగా నుండగా నాతనిని బల్లిచోడుఁడనియు నామములలో నట్టి స్వల్పపుమార్పు లుండుట స్వాభావిక మనియు నట్టి మహాకవి మాచలశబ్దమును బద్యమున నిముడ్పలేక సౌకర్యముకొఱకై శ్రీయాదేవి యని వ్రాసెననియుఁ దలంచుట సమంజసముకాదు. ఈ వంశమునందుఁ గనఁబడుచున్న నన్నెచోడుఁడు తన శాసనములలో స్పష్టముగాఁ దనతండ్రిని తల్లిని త్రిభువనమల్లదేవ చోడమహారాజని యు, మాచలదేవి యనియు వ్రాయించి యున్నాఁడు. కావుననిందు చూపఁబడిన నన్నెచోడుఁడు కవి నన్నిచోడుఁడు కాఁడనుట స్పష్టము.

నెల్లూరు శాసన సంపుటములలో బల్లిచోడ మహారాజులపేరున శాసనములు మఱిరెండున్నవి. (పుటలు ౩౫౪ - ౩౫౬) ఇందలి వంశవృక్షమిది.




ఈ శాసనములు దరిశితాలూకా మన్నేపల్లి గ్రామములోనివి. ఇవి శా. శ. ౧౦౬౭,౧౦౮౫ సంవత్సరములలోనివి. ఇవిగాక శివ రామపురమున (పుట ౩౮౬) నీబల్లిచోడునిదే యిఁకనొక శాసన మున్నది.

ఈ వంశవృక్షమునందు నన్నెచోడబల్లిచోడు లున్నను, వారికి పుత్రపితృ సంబంధము లేకపోవుటచే మన కుపయోగములేదు. ప్రత్యే

కముగా బల్లిచోడుని పేరనో నన్నిచోడుని పేరనో గల శాసనము లింకను గొన్నియున్నవి. కాని వానివలనను ప్రయోజనములేదు. "ఇతనికుమారుఁడు నన్నెచోడుఁడై యుండును. అతనితండ్రి బల్లిచోడుఁడైయుండును." అని యూహించినంతమాత్రమున కవి కాలనిర్ణయము సరిగాఁగాఁజాలదు. అందుచే నా శాసనములనుగూర్చి యేమియు నిట వ్రాయలేదు. ఉదాహరణమున కొకటి రెండు శాసనముల విషయమిట వ్రాసెదను. కన్నరదేవమహారాజునకు చోడబల్లియను తమ్ముఁడున్నట్లు ద. హిం. శా. సం. ౬ నెం౧౩౭౮ వలనఁ దెలియుచున్నది. కాని యితఁడు నన్నెచోడుని తండ్రియనుట కాధారములు లేవు. చోడబల్లి మహారాజుభార్యయైన పొన్నమదేవుల శాసన మొకటి (ద హిం.శా సం|| ౬ నెం ౧౭౦) కలదు. ఈ చోడబల్లినికూడ నన్నెచోడుని తండ్రియని చెప్పఁజాలము. ఇట్టివింకను గొన్ని కలవు గ్రంథవిస్తరభీతిచేతను, వానివలన నెయ్యేదుప్రయోజనము లేకయు, వానినిట నుదాహరింపలేదు.

## (౪) నన్నూరు చోడవంశము



ఇతఁడు శా. శ. ౧౧౧౦ వ సంవత్సరములో నన్నూరు వాలుం కారదేవికి, ధర్మమొసంగుచు వ్రాయించిన శాసనములో నీవంశ వృక్ష ముదాహరింపఁబడియున్నది. ఇందు నన్నెచోడుఁ డుండుటచేత ను, ఈక్రింద నీయబోవు పెదచెఱుకూరు శాసనమునందలి వంశవృక్ష మునకును దీనికిని గొంతపోలిక యుండుటచేతను, ఈవంశ ముదాహ రింపఁబడి యున్న శాసనము నీక్రిందవ్రాయుచున్నాఁడను. (నె.శా.,సం పుట ౧౦౪౨)

"స్వస్తి శ్రీసూర్యవంశంబు నేంటి చాగివెంకన కొడుకు బల్లె రాజు వీరి పుత్రుండు కంట్రువంక్యరాజు వీరి కొడుకు- నన్నెచోడ వీరి పుత్రుండు. రాజమహేంద్రిపొ త్తపిచోడు నన్నూరి వాలుంకారి దేవికి సర్వాకరహారముగా నిచ్చిరి వీరయిచ్చిన కాలసంఖ్యలు శకవర్షం బులు ౧౦౦౦ యగునేంటి మేషమాసమున వుత్తమ దివసమునాండు యిచ్చిరి. చోడేశ్వర లింగానకుం అమృత పడికిందది వెంపడిముం... పగహారితువ...వు...యిచ్చిరికాలము."

ఈవంశము శా. శ. ౮౫౦–౧౧౧౦ నడుమ నున్నది. ఈ నన్నూరువాలుంకారదేవికి దానమొసంగిన శాసనములు మఱి రెండు గలవు.

౧. నెల్లూరు శాసనసంపుటములు పుట ౧౦౩౦. శం. ౧౧౯౦. కామనచోడ మహారాజులు.

౨ పుట ౧౦౭౧. ఉజ్వలచోడ బల్లయచోడ మహారాజులు. శాసనకాలము లేదు.

ఈశాసనములు మనకేమియు నుపయోగింపవు.

# పెదచెఱుకూరు శాసనము

(౫) నన్నెచోడుని కాలనిర్ణయమున కాధారముగాఁ గొని పండితులు చర్చించిన పెదచెఱుకూరు శాసనము నందలి వంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను. (ద హిం. శా. సం. ౬ సంఖ్య ౨౦౬.)




ఈశాసనము నందలి వంశవృక్షమునకును పైని గనుపఱిచిన నన్నూరు శాసనమునందలి వంశవృక్షమునకును గొంతపోలికయున్నది. నన్ని చోడ, సూరభూప, రాజరాజు లందును నిందును నొక్కరీతిగనే యొక్కకాలమునందే యున్నారు. నన్నెచోడునకును, చోడబల్లికిని నడుమ నాశాసనమున వేంట్యవంకయ్యరాజు గనఁబడుచున్నాఁడు. అతనిని దొలగించిచో, నీరెండు శాసనములందలి వంశవృక్షము లొకటియే యని చెప్పవచ్చును. వెంకనకొడుకు వంకయ్యరాజనియు నాతనికొడుకు బల్లైరాజనియు వ్రాయవలసియుండగా శాసనలేఖకుఁడు పొరబడిరా

నేమో యని తోఁచుచున్నది. ఇంతకు నిది యూహయేకాని యా
ధారమున్నది కాదు. ఈ పెదచెఱువుశాసనముపైఁ బండితులు విశే
షచర్చ జరిపియుండుటచే పాఠకుల సౌకర్యముకొఱకు దానినిబూర్తిగ
నిట వ్రాయుచున్నాఁడను.

"స్వస్తి శ్రీ స్సకలి ప్రశీల స్తదియ్యాంభోజ్జాతో
జగతి లతికాబీజం బ్రహ్మ బ్రాహ్మీపతి స్సోభూత్
దానశౌర్యగుణైకస్వం నిరూపయి న్నివాత్మనః
తస్య తాద్రిగ్విధా దంగా ద్ద్వోర్ద్వయాత్త్రియాన్వయః
తత్ర సూర్యాన్వయేసు స్తస్మాదిత్యోవ స్తత్కులేనృపః
అదేవీత్కరికాలాఖ్యచోడ స్తస్యాన్వయేఽభవి
చోడబల్లి నృప స్తస్మాన్నన్నిచోడ స్తదాత్మజః
సూరభూప స్సుత స్తస్య రాజరాజమహీపతిః
తస్యానుజో ఘటంకార నృపోహంకార శంకరః
తస్య చోడమహాదేవీ ప్రియాత త్తలియో నయో
మల్లిదేవ నృపో యత్త్రి జైత్రధర్మా న్యలియ్యతా
తస్యకాంతా మహాదేవీ నన్నిచోడ స్తయోస్సుతః
న్యగ్రహీ దుగ్రవీరారీ న్యగ్రహీ ద్విజయశ్రియం
గంగాదేవీ ప్రియాతస్య యాదేశమతిచక్రివే
తాభ్యాం భూచక్ర శక్రో భూ న్మల్లిదేవమహేశ్వరః
ధర్మసంస్థాపనార్థాయ గాంగేయః కలియుగే పునః

స్వస్తి చరణసరోరుహ విహితవిలోచన త్రిలోచన ప్రముఖాఖిల
పృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్న ప్రదీపాహిత కుమార
గజాంకుశ కంద్దురారి పురవరేశ్వర కాశ్యపగోత్ర పాకనాంటి విషయ

ఏకవింశతి సహస్రగ్రామావనీవల్లభ భయలోభ దుర్లభ సత్యరత్నాకర
నామాది సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహా మండలేశ్వర మల్లిదేవచోడ
మహారాజ్ఞా పురాణ న్యాయ మీమాంసాగమమిశ్రిత వేదధర్మశాస్త్రా
యుర్వేదాద్యష్టాదశ విద్యాస్థాన సప్తశతోత్తర సహస్రభాగ పరిపూర్ణ
సప్తశతాగ్నిహోత్రాలంకారైవమాది గుణగణశోభితేషు, గ్రామాగ్ర
హార శ్రీవర్ధమానాయ శ్రీభీమేశ్వర దేవాయ అంగభోగార్థం దగ్గాంబి
కానందసేన మారాయసేన పూర్వదత్త పరిదపూండి నామగ్రామోష్ట
దిక్సీమాసహిత స్సర్వకర పరిహార మాచంద్రార్కం దత్తః తత్కాలీన
రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సమాహూ యేత్థ మాజ్ఞాపయతి
విదితమస్తు వః శ్రీమద్గణపతిలక్ష్మీశ్వరః పరిదపూండిమిమం పునర్భీమేశ్వరాయ
దేవాయ ప్రాదా దాచంద్రతారకం బహుభి ర్వసుధా దత్తా బహుభి
శ్చానుపాలితా యస్యయస్య యదాభూమి స్తస్య తస్య తదాఫలం ఇతి
సంచిత్య మల్లిదేవచోడ మహారాజ్ఞా సమధిగతపంచమహాశబ్ద మహామండ
లేశ్వర వీర రాజేంద్ర కాకతియ్యగణపతి మహాక్షోణీశస్య ధర్మార్థం
క్రీతం॥ స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం పరదత్తాపహారేణ
స్వదత్తం నిష్ఫలం భవేత్॥ స్వదత్తాం పరదత్తాం వా యో హరేత
వసుంధరాం షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః."

ఇంతవఱకు లభించిన శాసనములన్నిటిలోను బల్లిచోడ నన్నె
చోడులను దండ్రికొడుకులుగాఁ జెప్పిన దీ శాసన మొక్కటియే.
శాసనములను బట్టి కవికాలనిర్ణయము చేయఁదలపెట్టినచో నందుల
కుపయోగించునది యీ శాసనము దక్క మఱియొక్కటి యింతవఱకు
లభ్యముకాలేదు. కావున మనకవి కాలనిర్ణయము చేయుటకీ శాస
నముదక్క గత్యంతరము లేదు. దీనిని విడచి వేఱుమార్గమునఁ గవి
కాలనిర్ణయము చేసితిమేని యీ శాసనమునకు సమాధాన మొసంగు

మసి పండితు లడుగకపోరు. ఈ శాసనకర్త పాకనాఁడిఱువదియొక్క వేయిని బరిపాలించిన వాఁడని చెప్పికొని యున్నాఁడు. కవినన్ని చోడుఁడు కూడఁ దన తండ్రి పాకనాఁ డిరువదియొక్క వేయిని బరిపాలించనవాఁడని చెప్పియున్నాఁడు. కావున నీశాసనమందలి నన్నెచోడుఁడే కవి నన్నెచోడుఁడని చెప్పఁదగియున్నది. ఈ శాసన కర్తయగు మల్లిదేవుఁడు పాకనాఁటిని బరిపాలించినట్లు శాసనమునం దున్నది. కాని, బల్లిచోడుఁడు పరిపాలించినట్లు చెప్పఁబడి యుండ లేదు. ఆ కారణమునుబట్టి యీ నన్నెచోడుఁడు కవి నన్నెచోడుఁ డని చెప్పవలనుపడదని శ్రీ లక్ష్మీపతిశాస్త్రిలుగారు వ్రాసియున్నారు. పాకనాఁటి పరిపాలకత్వ మొక బిరుదువంటిదే గాని యీబిరుదు వహించిన వారందఱును పాకనాఁటినంతను దప్పక పరిపాలించి యుండి రని తలంపరాదు. ఈ బిరుదమునుబట్టి బల్లిచోడుఁడును మల్లి దేవుఁడును ఒకవంశములోని వా రని యూహింపఁదగియున్నది. కావున నిందలి నన్నెచోడుఁడు కవి నన్నెచోడుఁ డనియే నిశ్చయింప వలసియున్నది. శ్రీజయంతి రామయ్యపంతులుగారును నడకుదుటి వీర రాజుపంతులుగారును గూడనట్లే యభిప్రాయపడియుండిరి.

ఈ శాసనమునఁ గాలమిూయఁబడలేదు. కాని కాకతి గణపతి దేవుని పేరిందు వాహరింపఁబడియుండుటచే శా. శ ౧౧౪౦ ప్రాంత మున నీ శాసనము పుట్టియుండునని యూహించి తరమునకు ౨౫ సంవ త్సరములువంతున లెక్కించి నన్నెచోడుని కాలము శా. శ. ౧౦౪౦ ప్రాంత మని రామయ్యపంతులుగారు నిర్ణయించిరి. వీరరాజు పంతులు గారును మల్లిదేవుని శాసనకాలమును ౧౧౪౦ యని యంగీకరించి, తరమునకు ౪౦ సంవత్సరములని లెక్కించి నన్నెచోడుని కాలము శా. శ. ౯౦౦ సంవత్సరప్రాంతమని నిర్ణయించియున్నారు. వీరిరువురు

నవలంభించిన తరముయొక్క యవధి యత్యధికాత్యల్ప సంఖ్యాబోధక మని నా యభిప్రాయము. ఈ గ్రంథమును వ్రాయుసందర్భమున నాకు గలిగిన యనుభవజ్ఞానమునుబట్టి తరమునకు ముప్పది సంవత్సరముల వంతున లెక్కించుట న్యాయముగా నుండునని నే నభిప్రాయపడు చున్నాఁడను. నాయభిప్రాయమునకుఁ దోడుపడుచున్న పాశ్చాత్య పండితుల యభిప్రాయముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"In reckoning historically by generations the word is taken to mean the interval or time between the birth of the parents and that of their children, usually computed at thirty years or three generations to a century"

*James A. H. Murray.*

"Thus the word is also used of the age or person of a generation usually taken as about thirty years or three generations to a century."

*Encyclopedia Britanica.*

మల్లిదేవుని శాసన మాతని ముప్పదియైదేండ్ల వయసున శా. శ. ౧౧౮౦ వ సంవత్సరమున వ్రాయబడినట్లెంచి యాతని జననకాలమును దేల్చితరమునకు ముప్పది సంవత్సరముల వంతున నాయాపురుషుల జనన సంవత్సరములను శా. శ. సంవత్సరములలో పైవంశమునం దిచ్చి యున్నాఁడను ఈ ప్రకారము చూచినచో నన్నిచోడుఁడు. శా. శ. ౯౫౦ ప్రాంతమున జన్మించి ౯౯౦ ప్రాంతమున కుమారసంభవమును రచించి యుండునని తేలినది. అనఁగా నీతఁడు నన్నయభట్టునకుఁ వయసున గొంచెము చిన్నవాఁడును, నీతని కావ్యము మహాభారతము కంటె నాలుగైదేండ్లు తక్కువ వయసుకలదియు నగుచున్నది. శతాబ్దికి మూఁడుతరముల వంతున లెక్కించితిమేని నన్నెచోడుని జననము

శా. శ. ౯౩౦ ప్రాంతమయి యించుమించుగా నన్నయభట్టుతో సమ కాలికుఁడగును. ఈతని కావ్యకన్య భారతముతో సమవయస్కురా లగును.

గణపతిదేవుఁడు వెలనాఁటి నాక్రమించినది శా. శ. ౧౧౮౦ ప్రాంతమగుటయు, నాతత్క్షణమే యీశాసనము వ్రాయఁబడెనని తలంచుట సమంజసము కాదని యొకఁ గొంద ఱనుచున్నారు. కాని యిది యొక లెక్కింపఁదగిన యభ్యంతరము కాదు. గణపతిదేవుని పేరుదాహరింపఁ బడిన శాసనములు వెలనాఁటిలోను గమ్మరాష్ట్రములోను శా. శ. ౧౧౮౦ మొదలుకొని కానవచ్చుచున్నవి. అదిగాక యీశాసనము గణపతి వెలనాఁటియాక్రమణమునకుఁ బిమ్మట ౧౦-౧౫ సంవత్సర ముల కని తలంచినచో మల్లిదేవునివయసు ఆ కాలమునకు ౫౦ ఏండ్లుం డునని తలఁపవచ్చును. ఇవియన్నియు నూహలు యుక్తులునే కాని యాధార సహితములయినవి కావు.

## పండితుల యభిప్రాయములు

బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారిసందర్భమున శా. శ. ౧౨౨౧ సంవత్సరపు శాసన మొకదాని నుదాహరించి (ఓరియంటల్ లైబ్రరిలోని శాసనముల వాల్యూం ౧ పుట ౮౯౨) యిది పెదచెఱు కూరి గ్రామములోనే ఆ గ్రామకరణాలోరి కృష్ణయ్యగారి యింట్లో నున్న తామ్రశాసనమనియు, నాశాసనకర్త మల్లిదేవుఁడనియు, గణ పతిదేవుఁడు చనిపోయిన తరువాత వ్రాయఁబడిన దగుటచే నిం దాతని పేరుదాహరింపఁబడ లేదనియు, గణపతి చనిపోయిన తరువాత నా మల్లిదేవుఁడు స్వతంత్రుఁడై తల యెత్తియుండునవియు, పైనివ్రాసిన

పెదచెఱుకూరునందే యీ రెండుశాసనములును లభించి యుండుట చేతను అందులోను ఇందులోను "న్యగ్రహీ" త్యాది పదములుండుట చేతను నీ రెండుశాసనముల కర్తయు నొక్కఁడే యనియు గుర్తించి, యీతని పెదచెఱుకూరి శాసనము శా. శ. ౧౧౭౦-౧౧౮౦ ప్రాంత మని వ్రాసియున్నారు. (ఆ. సా. ప. సం. ౧౪ సంచిక ౧) దీనికి ఫలితము నన్నెచోడుని కాలము మఱి ముప్పది సంవత్సరములు క్రిందకు దిగుట. ఈ తామ్రశాసనమునందు మల్లిదేవుని తండ్రిపే రుదాహరింపఁబడలేదు. శ్రీ శాస్త్రిలుగారి యూహప్రకారము పెదచెఱుకూరు శాసనము ౧౧౭౦ ప్రాంతమయ్యేనేని అప్పటికి పైనివ్రాసినప్రకారము మల్లిదేవునకు ౩౫ సంవత్సరములవయసు కలదని యనుకొంటిమేని యీతని జననము ౧౧౩౫ ప్రాంతమై తామ్రశాసనకాలము నాటికి౮౫ సంవత్సరములు వయసు కలవాఁడగును. ఇతఁడింతకాలము జీవించి యీవయసున నీ శాసనమును వ్రాయించినాఁడనుటకంటె నీతనికి మల్లిదేవుఁడను మనుమఁ డుండెననియు నాతఁడీశాసనమును వ్రాయించి తాతగారి శాసనమునందలి న్యగ్రహీత్యాదిశ్లోకము నించుకమార్పుతోఁ దనశాసనమున వేయించుకొని యుండెననియుఁ దలంచుట సమంజసముగ నుండుననియు ననుకొనుచున్నాఁడను. శాస్త్రిలుగారియూహ సత్యమయ్యేనేని నన్నిచోడుఁడు భారతరచనాకాలమున జన్మించిన వాఁడగును. ఆతని కావ్యము భారతముకంటె ఇరువది ఇరువదియైదేండ్లు చిన్నదియగును.

ప్రభాకరశాస్త్రిగారు చోడబల్లి పేరుగల మఱి రెండు శాసనముల నుదాహరించి అందొకదానియందు మల్లికార్జుని పేరుదాహరింపఁబడియున్నదనియు, వతఁడే నన్నెచోడకవి గురువనియు, నాబల్లిచోడుఁడే కవినన్నెచోడుని తండ్రియనియు, నీశాసనములనుబట్టి చూచి

నను నన్నెచోడుని కాలము రామయ్యపంతులుగారు చేసిన కాలనిర్ణయ
మునకు సరిపోవుచున్నదనియు వ్రాసియున్నారు. ఈశాసనములు
రెండును చోడబల్లియొక్కయు కన్నరదేవ చోడునియొక్కయు దాన
ములను తెలుపుచున్నవి. ఇందొకటి కొప్పరపు శాసనము (౧౯౧౫ వ
సంవత్సరము గవర్నమెంటు శాసన సంచయమున నున్నది.) ఇందే
పాలూర్పురసముత్పన్నం ధృతకాలాముఖ వ్రతమ్। మల్లికార్జున మభ్య
ర్థ్య తస్మై తత్త్వార్థభావినే సోమేశ్వరవరం స్థానం ప్రాదాదా చంద్రతార
కమ్" అని మల్లికార్జున గురువు ప్రశంసయున్నది. ఇది ౧౦౮౯ సంవ
త్సరము నాఁటిది. ఇది చోడబల్లిది కావున వీని తరువాత నున్న నన్నె
చోడుఁడు ౧౧౦౦ ప్రాంతమువాఁడగును. ఇది రామయ్యపంతులు
గారు చెప్పిన కాలమునకు సరిపోవుట లేదు. దీనినిబట్టి మన నన్నిచో
డుఁడు మఱి ౬౦ సంవత్సరములు క్రిందకు దిగుచున్నాఁడు. రెండవ
శాసనము (ద. హిం. శా. సం ౪౦ పుట ౪౬౭] శా. శ. ౧౦౪౩ వ
సంవత్సరమునాఁటిది.

ఈ రెండు శాసనములందును గూడ నన్నెచోడుని పేరులేదు.
నన్నెచోడ సంబంధము చెప్పఁబడని బల్లెచోడులు పెక్కురున్నారు.
దానిని బట్టి కవి నన్నెచోడుని కాలనిర్ణయము సేయఁజాలము.

శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు ౧౯౪౫ ఫిబ్రవరి భారతి
లో నన్నెచోడకవిరాజు తన కుమారసంభవ పీఠికయందు:

"అరినరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి పాకనాఁటి యం
దిరువదియొక్కవేయిఁటి కధీశుఁడు నాఁ జనుచోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిన్ దనూజుఁడన్.

అని వ్రాసి యున్నాఁడు. కాని నన్నెచోడుఁడుగాని యాతని తండ్రియగు చోడబల్లిగాని పాకనాఁటియందు రాజ్యముచేసినట్లు రుజువు చేయఁగల శాసనమెద్దియు నింకను లభ్యపడలేదు క్రీ శ 1130-1140 ప్రాంతమున పాకనాఁటిసీమలోని పొత్తపియందు బల్లియచోడనామాంకితుఁడగు తెలుఁగుచోళరాజొక్కఁడు రాజ్యము చేయుచుండె నట్లొక ప్రాచీనతామ్రశాసనము వలనఁ దెలియవచ్చుచున్నది. ( C.P. No. 6 of 1935–36) (గుండ్లకమ్మకు దక్షిణమున వెలిగొండలు మొదలు సముద్రతీరమువఱకుఁ గల దేశమునకు బూర్వము పాకనాఁడను పేరు చెల్లుచుండెను. కొంచె మించుమించుగ నిప్పటి నెల్లూరుమండలము కడపమండలములోని తూర్పుభాగమును గలసిన నప్పటి పాకనాఁటికి సరిపోవును.) ఈ యూహ సరియైనదైనప్పటికిని వెలిగొండఁకు తూర్పున నతని యధికారము చెల్లుచుండె ననుట కవకాశము లేదు. మఱియు నితనికి నెల్లూరు శాఖవారితో సంబంధమున్నట్లు తోఁచదు" అని వ్రాసియున్నారు. ఈశాసనమింకను బూర్తిగాఁ బ్రకటింపఁబడ లేదు. ఈ శాసనమందలి బల్లిచోడుఁడు నన్నెచోడుని తండ్రి యగునో కాదో యిప్పుడు చెప్పఁజాలము. ఇతఁడు నన్నెచోడుని తండ్రి యగుట నిశ్చయమైనచోఁ గవికాలము పైనిజెప్పిన దానికంటె ముందునకుఁ బోయి, యాతఁడు నన్నయభట్టుతో సమకాలికుఁడో యించుక పూర్వుఁడో యగును. ఆకాలమునందొక మల్లికార్జునుఁడు గూడఁ గలఁడు. అతఁడు కాలాముఖుఁడే సూర్యరాశి తపోరాశి పండితుల శిష్యుఁడు. శ్రీ రామకృష్ణకవిగారీతని గురించియే కుమార సంభవపీఠికలో వ్రాసియున్నారు శ్రీ శాస్త్రిగారి మల్లికార్జునుని కంటె శ్రీరామకృష్ణకవిగారి మల్లికార్జునుఁడే నన్నెచోడుని గురువనఁదగినవాఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. పెదచెఱుకూరు శాసనమడ్డు తగులకున్నచో, మల్లికార్జునునిబట్టి శ్రీ వెంకటరమణయ్యగారి బల్లిచోఁడుడే కవినన్నిచోడునితండ్రి యని నిశ్చయింపఁదగియున్నది.

నన్నెచోడుని గురువైన మల్లికార్జునునిబట్టి కాలనిర్ణయము చేయుట సాధ్యమైనపని కాదు. మల్లికార్జునులు పెక్కురున్నారు, నన్నెచోడుని కాలనిర్ణయముఁ జేయఁ బ్రయత్నించిన పండితులకు దలకొక మల్లికార్జునుఁడును లభించి వారివారి యూహల కాధారపడుచు వచ్చినాఁడు. నేను నిర్ణయించినకాలమున మల్లికార్జునయోగి యుండవలదా? యని కొందఱడుగవచ్చును. ప్రపంచములోని మల్లికార్జును లందఱును, శాసన వాఙ్మయ ప్రపంచములఁ జేర్పఁబడిరని సిద్ధాంతమగునపుడు నా ప్రశ్న కవకాశము లేదు. ఆకాలమున మల్లికార్జునయోగి లేఁడని యెవరు చెప్పఁగలరు?

కుమారసంభవ పీఠికయందు శ్రీ లక్ష్మీపతి శాస్త్రిలుగారు, తిక్కనసోమయాజి భారతప్రయోగములవంటి ప్రయోగములు కొన్ని యిందుఁ గన్పట్టుచుండుటచే నీతఁడు తిక్కనసోమయాజికిఁ దరువాతి వాఁడని చెప్పిరి. కానియందు సత్యము లేదని నాయభిప్రాయము. కుమారసంభవ కృత్యాదియందు—

చ. రవికులశేఖరుండు కవిరాజశిఖామణి గావ్యకర్తృస
త్కవి భువి నన్నెచోడఁడట కావ్యము దివ్యకథం గుమారసం
భవ మటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁడట్టె వినం గొనియాడఁజాలదే!

అని చెప్పియున్నాఁడు. ఈపద్యము బమ్మెర పోతరాజుని

క. పలికెడిది భాగవతమఁట
పలికించెడువాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా?

అను పద్యమును బోలియున్న దనియు నందుచే నీతఁడు పోతన కుఁ దరువాతివాఁ డనియుఁ జెప్పవచ్చునా? వెదకిచూచినచోఁ బోతన పద్యములవంటి పద్యము లిందును గొన్ని గానరావచ్చును. అనుకరణ సూత్రము ననుసరించి కాలనిర్ణయముసేయుట సరియైన మార్గము కాఁజాలదు.

అథర్వణాచార్యుఁడు, తనఛందస్సులో

క. మగణమ్మునఁ గదియ రగణము
వగవక కృతి మొదట నిలుపువానికి మరణం
బగు విక్రమేంద్రు మడియఁడె
యగు నని యాది తొల్లి వెంకణాదిత్యుఁడనిన్.

అని కృతిప్రారంభమున మగణమునకుఁ బిమ్మట రగణమునుంచి పద్యమును రచించినవాఁడు తప్పక మరణము నొందుననియు, వెంకణా దిత్యుఁడట్లొనర్చుట వలననే యుద్ధములో నిహతుఁడయ్యెననియుఁ జెప్పి యున్నాఁడు. ఈ వెంకణాదిత్యుఁడు నన్నెచోడుఁడే యని యను చున్నారు. ఇతఁడు కుమారసంభవమున మొదటి పద్యమును స్రగ్ధరా వృత్తములో రచియించియున్నాఁడు. ఆవృత్తమునకు మొదట మగ ణమును తరువాతరగణమునువచ్చును. 'శ్రీవాణేంద్రామరేంద్రార్చిత...' అనునది ప్రథమపద్యము దీనినిబట్టి నన్నెచోడుఁడు యుద్ధములో మరణమొందెనని స్పష్టమగుచున్నది. అథర్వణాచార్యుఁడు పండ్రెం డవ శతాబ్ది చివరభాగమునను బదుమూఁడవ శతాబ్ది మొదటిభాగము నను నున్నవాఁడు. నన్నెచోడుఁడు యుద్ధములో మరణించెనని యీ పద్యమువలనఁ దెలియుచున్నది. కాని యెవరితో నెచ్చటజరిగిన రణమున నిహతుఁడయ్యెనో యిందువలనఁ దెలియుటలేదు. నేను జూచినంతవఱకు చరిత్రములలో నన్నెచోడునిఁ జంపినవాని నామము

నాకుఁ గన్పడలేదు. క్రీ. శ. ౧౧౭౦ లో పాశ్చాత్యచాళుక్యరాజులచే నొక నన్నెచోడుఁడు చంపఁబడెనని శ్రీ రామకృష్ణకవిగారు వ్రాసి యున్నారు. కాని యందుల కాధారము నీయలేదు.

అధర్వణాచార్యునికంటె నన్నెచోడుఁడు పూర్వుఁడని చెప్పఁబడుటచే నీతఁడు తిక్కనసోమయాజికిఁ దరువాతివాఁడని చెప్పెడియుక్తి పూర్వపక్షమగుచున్నది.

కవమ్మవారి చరిత్రమును రచించిన కొత్తభావయ్య చౌదరిగారు, ఆచరిత్ర ద్వితీయభాగమున ౧౩౫ వ పేజీలో "చోడబల్లి" ని గూర్చి వ్రాయుచు, "ఈమహారాజునకు పొన్నమదేవి, శ్రీసతి యను నిర్వురు భార్యలు గన్పడుచున్నారు. శ్రీసతివలన నన్నెచోడుఁడను కుమారుఁడు జనించెను" అనియు, ౧౪౦ వ పేజీలో "చోడబల్లికిని శ్రీసతికిని జనించిన నన్నెచోడమహారాజు వంశ మీక్రిందివిధమున నొకశాసనమున వ్రాయఁబడినది" అనియును వ్రాసియున్నారు. చోడబల్లికి శ్రీసతియనుభార్య యున్నట్లును ఆమెవలన నన్నెచోడుఁడు కలిగినట్లును వ్రాయుటకు వీరికి కుమారసంభవము దక్క వేఱు ఆధారము లున్నట్లు గన్పింపదు. వీరివ్రాతలకు పైని వ్రాసిన పెదచెఱుకూరు శాసనమే యాధారమైనట్లు గన్పట్టుచున్నది. కాని యాశాసనమున చోడబల్లి భార్యలనుగూర్చి యేమియుఁ జెప్పఁబడియుండలేదు. చోడబల్లినామ ముదాహరింపఁబడిన యితర శాసనములకును, మల్లిదేవుని శాసనమునకును, కుమారసంభవమందలి పద్యమునకును సంబంధము గల్పించి శ్రీ భావయ్యచౌదరిగారట్లు వ్రాసియుందురు, సరియైన సాక్ష్యము లభించినఁగాని యాసంబంధము సత్యమైనదిగా భావింపనవకాశముండదు

నన్నెచోడకవి, తనగ్రంథరచనాకాలమును కుమారసంభవమునందే గూఢముగాఁ జెప్పియున్నాఁడని భారతిలో దేవరపల్లి వెంకట

కృష్ణారెడ్డిగారు విక్రమసంవత్సర వైశాఖమాసమున నొకవ్యాసమును వ్రాసియున్నారు. పైనివ్రాసిన "అత్యతౌర" అను కృత్యాది ౩౮ వ పద్యములో "దైవజ్ఞునట్లు శుభోదయమున దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించితు" అని చెప్పియున్నాఁడు. కావున దైవజ్ఞునివలెనే దివ్యసుకృతి ప్రతిష్ఠా కాలమును, గవి,

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరునకుఁ జెప్పి హరు మెచ్చించెన్. ౧౮౭౯

అను పద్యములో సూచించినట్లు "గూఢవస్తుమయముగా" ద్వాదశాశ్వాసమందలి ౯౯౩ వ సంఖ్యగానున్న,

గీ. ద్వాదశార్థార్థనయను నాద్వాదశార్థ
వదనుఁడొగిఁ బుట్టి నిజభుజద్వాదశమున
నుదయదశ శతకిరణ కిరణుఁ డయ్యుదయవగముఁ
గిట్టి దశశతకరముల బుట్టినట్లు

అను పద్యములో శకసంవత్సరములను, (దశ + శత + దశశత = ౧౦ + ౧౦౦ + ౧౦౦౦ = ౧౧౧౦) చెప్పినాఁడనియు నిది విక్రమార్క-శకసంఖ్యయనియు, నాయాశ్వాసమునందే ౯౬౧ వ సంఖ్యగానున్న

చ. కరిశిరమూడ షణ్ముఖుఁడు గైపున బ్రేయుఁడు గుంభశాత్రికో
త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దాఁకు భంగము సూచినప్పు సం
గరజయకాంత కాంతరదకాంతియొ కాదని నాఁటుదీఱి వి
స్ఫురదవదాతఖడ్గలత పూచె నొనాజయచైత్రసంపదన్.

అను పద్యమునందు,

వి + జయ = విజయసంవత్సరము
చైత్ర = చైత్రమాసము
అవదాత = శుద్ధపక్షము
జయ = జయాతిధి

జయ = మంగళవారము — అని కవి చెప్పియున్నాఁడనియు సివి "శాసనలిఖితాక్షరంబులయ్యె" నని ఇట్లప్రతిహతశౌర్యుండును, నని వార్యవీర్యుండును, నఖిలభువన భవనాధీశ్వరుండును, సకల జగద్భయదానియు, నామరణాంతాపరిత్యక్తాభిదానియు నగు తారకాసురు నామాక్షరంబులు సకలదిక్తటశిలాపట్టంబుల శక్తిధరుముఖ విజయప్రశస్త శాసనలిఖితాక్షరంబులయ్యె నంత."

అను వచనములోఁ గవి చెప్పియుండెననియు వ్రాసి, వెంకట కృష్ణారెడ్డిగారు కుమారసంభవ కావ్యము విక్రమార్క శక ౧౧౧౦ విజయ సం॥ చైత్రశు ౮ జయవారమునకు సరియైన క్రీ.శ. ౧౦౫౩ సం. మార్చి ౩౦ వ తేదీనాఁడు ముగింపఁబడియెనని తెల్పినారు. పెదచెఱుకూరు శాసనము దీనిని బలపర్చుచున్నదని వారియభిప్రాయము. నన్నెచోడమహాకవి తన కాలమును జెప్పఁదలఁచుకొన్నచో నిన్ని పద్యములలో నింతడొంకతిరుగుడుగాఁ జెప్పియుండఁడనియు, గూఢముగనో, శ్లేషగనో, గ్రంథాంతముననో గ్రంథాదినో, ఒక్కపద్యములోనో, ఒక్కమాటలోనో, చెప్పియుండుననియు నాయభిప్రాయము.

ఈ భాగమును నేను వ్రాయుచుండగాఁ జూచిన నామిత్రులొకరు గ్రంథాంతమందలి,

క. అనితసుగుణమణి రచితా
 ద్యమల విభూషణ విభూషితావయవుడు జం
 గమ మల్లికార్జునుఁడు వా
 గ్రమణీరమణుండు మునిశిఖామణి పేర్మిన్.

అను పద్యములోని 'మునిశిఖామణి' అనువాక్యమును గవి తన కాలమును దెలుపుట కుద్దేశించియుండె ననియు, ముని 7 శిఖ (శిఖావంతుడు = అగ్ని) 3; మణి = 9. "అంకానాం వామతో గతిః అను సూత్రముచే నది 937 అయినదనియు దీనినిబట్టి నన్నెచోడుని కాలము శా॰ శ 937 అనగా క్రీ. శ. 1015 అయినదనియు నన్నారు. పెదచెఱకూరు శాసనమునుబట్టి చూచినను, దాదాపుగా నీకాలము సరిపోవుచున్నదనియు నొక యూహను కలుగఁజేసెను.

ఇట్టి యూహలనుబట్టి కాలనిర్ణయము సేయఁబూనుట వృథాయాసము. వీనివలన సత్యము బయటఁబడదు.

నన్నిచోడుని తల్లి హైహయవంశసంజాత యని చెప్పఁబడినది. హైహయచారిత్రమును దెలుపు గ్రంథములను జదివి చూచితినిగాని నన్నిచోడుని సంబంధమును జెప్పెడి విషయములందుఁ గానరాలేదు.

భాషాపరిశోధనము వలన బలవత్తరమయిన యాధారములభించు వఱకు నన్నిచోడుని కాలము శా. శ. 950—1000 అయి యుండునని భావింపఁదగునని నాయభిప్రాయము.

కుమారసంభవమందలి పదజాలమును బట్టియు, భావార్థక్రియాపద ప్రయోగమునుబట్టియు, నన్నయకంటె నన్నిచోడుఁడు పూర్వునిగా భావింపవలయునని కొందఱు పండితుల యభిప్రాయము. నన్నయకంటె నన్నిచోడుఁడు పూర్వుఁడైనఁ గావచ్చును. నేను కాదనుటలేదు. కాని పూర్వుఁడని నిర్ణయించుటకు వీరు చూపిన కారణములు బలవత్తరములని యంగీకరింపఁజాలకున్నాఁడను. పండితుల యభిప్రాయము ననుసరించి నన్నిచోడుఁడు, నన్నయకంటె నూఱువత్సరముల పూర్వముననో నూఱువర్షముల పరముననో ఉన్నవాఁడు. అంతకంటె వెనుకకును బోవఁడు. ఇవ్వలకును రాఁడు. ఈ మధ్యకాలమున భాషలో విపరీత

మైన మార్పు వచ్చియుండదు. రెండువిధములైన ప్రయోగములును నా కాలమునఁ బ్రచారములో నుండియుండుననియు, పద, ప్రయోగాది భేదము లనుసరింపఁబడిన కాలమును గీటుపెట్టి నిర్ణయించుట సాధ్యము కానిపనియనియు, నందుచే దానినిబట్టి కాలనిర్ణయము చేయుటలోఁ బ్రమాదము వచ్చుననియు నాయభిప్రాయము. ఇంతేకాదు—

నన్నయ నన్నిచోడులు భిన్నమార్గముల ననుసరించిపోయిన కవులు, నన్నయ ధవకవి, నన్నెచోడుఁడు శివకవి. సంస్కృతపద బాహుళ్యముతో దేశీయపదములను సాధ్యమైనంతవఱకు తగ్గించియు సంస్కరించియు నాంధ్రమున భాషాసాంకర్యము లేకుండఁ దెనుఁగునకొక క్రొత్తందనమును దెచ్చిపెట్టుచు రచనముజేయ సంకల్పించుకొనిన వాఁడు నన్నయ. కన్నడమునైననేమి, యాంధ్రముననైననేమి, యప్పటికి వాడుకలోనున్న పదములను విశేషముగాఁ జేర్చి జానుతెనుఁగునఁ గవిత్వమును జెప్పఁ గోర్కెకలవాఁడు నన్నిచోడుఁడు. వీరిరువురు నెవరి మనోరథములను వారీడేర్చుకొనిరి. నన్నయకంటె నన్నిచోడుఁడు పూర్వుఁడేయనుకొందము. నన్నెచోడుని నాఁటి శబ్దజాలమును బ్రయోగసరణులును నన్నయకాలమునాఁటి కంతరించిపోయెననియు, నన్నయపోకడలు క్రొత్తవియనియుఁ జెప్పజాలము. నన్నిచోడుని గ్రంథమును చదివినకవి నన్నయకు జాలకాలము తరువాత నున్నవాఁడుకూడ నట్టి ప్రయోగములు సాధువులని తలంచి తన గ్రంథమునఁ బ్రయోగింపవచ్చును. తిక్కనసోమయాజి, భారతమును చిన్న చిన్న దేశీయపదములతో నింపివేసినాఁడు. ఆతనికవిత్వములోఁ జాల భాగము జానుతెనుఁగనియే చెప్పవచ్చును. నన్నయ కాలమునను, నంతకుఁ బూర్వమును దరువాతఁ గొంతకాలము వఱకును నాంధ్రదేశమునకును నాంధ్రభాషకును గన్నడదేశ, భాషలసంపర్కముతగ్గిపోలేదు. కుమారసంభవమందలి పదప్రయోగాదులనుబట్టి, నన్నిచోడుఁడు ప్రాచీనుఁడనియు, నతనిది ప్రాచీన కవిత్వమనియు మాత్రమే చెప్పఁగలము. కాని వానినిబట్టి యతఁడు నన్నయకుఁ బూర్వుఁడో పరుఁడో నిర్ణయింపఁజాలము.

# ౭. పావులూరి మల్లన

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గార్గ్య గోత్రుఁడు; మల్లనామాత్యుని పౌత్రుఁడు; శివ్వనకును గౌరమకును బుత్త్రుఁడు.

## ఇతని నివాసము

సంస్కృతభాషలో వీరాచార్యులు రచియించిన గణితసారసంగ్రహము నీకవి తెలిఁగించెను. ఈ గ్రంథమునకుఁ బావులూరిగణితమని పేరు. అందితఁడు కమ్మనాఁటిలోని పావులూరి విభుఁడనని యీక్రింది పద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

క. కావున గణితము తెనుఁగున
గావింపఁగఁ గంటిని సుకవిమల్లుఁడ గౌ
రీవల్లభ చరణ సరో
జావాసితచిత్తమధుకరాత్ముఁడ జగతిన్

క. ఇలఁ గమ్మనాఁటిలోపల
విలసిల్లిన పావులూరి విభుఁడను సూత్రా
కలితాపస్తంబద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్య గోత్రోద్భవుఁడన్.

గ్రామకరణములను సామాన్యముగా నధిపతి యనియు విభుఁడనియు, ప్రభుఁడనియుఁ బరిపాలకుఁడనియు గ్రంథములలో వాకొనుచుందురు. ఇప్పుడుకూడ కరణములను గొన్నితావులలో గ్రామాధిపతి యనియు, గ్రామాధికారియనియుఁ బిలుచుచుండుట కలదు. పైపద్యములోని పావులూరి విభుఁడను వాక్యమునకుఁ బావులూరికరణమనియే

యార్థము. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు, ఈ కవి గోదావరీ మండలములోని పావులూరి గ్రామమునకు కరణము" అని వ్రాసి యున్నారు. గోదావరీ మండలములోని బావులూరు లేదు. కమ్మ నాఁటిలోని పావులూరని గ్రంథకర్త చెప్పియున్నాఁడు. గోదావరీ మండలమునకుఁ గమ్మనాఁ డను పేరు లేదు, గుంటూరుమండలము బాపట్ల తాలూకాలోఁ బావులూరున్నది. అదియే మల్లన నుడివిన పావులూరని నా యభిప్రాయము.

## కృతి వివరము

నన్నయభట్టు, తిక్కనసోమయాజులవలెనే గ్రంథాది నీతఁడును క్రిందిశ్లోకమును వ్రాసియున్నాఁడు.

శ్లో॥ శ్రీకంఠం సగుణాం సమస్తజగతాం కర్తార మీశం గురుమ్
భూతో యానలచంద్రసూర్యపవనవ్యోమాత్మమూర్తింవిభుమ్
నిత్యానందమయోప యోగిరిజయాసార్థం ప్రజావృద్ధయే
మాయామోగ ముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

క. ప్రణమిల్లి శివుని కీక్రియ
నణిమాదిగుణాస్పదునకు నభినవసంఖ్యా
మణిదీప్తి సారసంగ్రహ
గణిత సముద్రంబుఁ దఱియఁగడఁగితిఁ బ్రీతన్.

తాను రచింపఁబూనిన గణితశాస్త్ర ప్రాశస్త్యము నీ క్రిందిరీతిగా గవి వ్యక్తీకరించి యున్నాఁడు.

శా. అర్కాదిగ్రహపంచకగ్రహణ కాలాన్వేషణోపాయమున్
దర్కవ్యాకరణాగమాది బహుశాస్త్ర ప్రోక్తనానార్థ సం
పర్కాది వ్యవహారమున్ భువన రూపద్వీప విస్తారముల్
దర్కింపన్ గణితప్రవృత్తి వెలిగాఁ దక్కొండెఱింగించు నే.

## వంశవర్ణనము – నవఖండవాడ అగ్రహారము

ఈ కవి తనవంశము నీక్రింది మూఁడు పద్యములలో వర్ణించి యున్నాఁడు.

ఉ. శ్రీలలనేశుఁ డంధ్ర నృపశేఖరుఁడై చను రాజరాజ భూ
పాలకుచేతఁ బీఠపురపార్శ్వమున న్నవఖండవాడ యన్
బ్రోలు విభూతితోఁ బడసె భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్త్రుఁడు మల్లఁడున్నతిన్.

ఉ. శ్రీనిలయుండు శివ్వనయుఁ జిమ్మనయుం గుణసూర్యదేవుఁడున్
ధీనిధి ప్రోలనార్యుఁడును దేశమున న్రవితుల్యులైన యా
సూనుల నల్వురంబడసె భూరిజనస్తుతులైన సత్య వి
జ్ఞానులు పద్మగర్భువదనంబులు నాలుగుఁ బోలువారలోన్

క. గోత్రపవిత్రుఁడు సద్గుణ
పాత్రుఁడు శివ్వనకు మిగులఁ బతిహితశుభ చా
రిత్రారుంధతి గౌరమ
ధాత్రీపతి యిద్దఱికిని దనయుఁడ జగతిన్.

ఈ పద్యములనుబట్టి శివ్వనపుత్రుఁడు మల్లనయనియు, నామల్లన రాజరాజనరేంద్రునిచేతఁ బిఠాపురప్రాంతమందున్న నవఖండవాడయను గ్రామమును బడసెననియు, నామల్లనకు శివ్వన, చిమ్మన, సూర్య దేవుఁడు, ప్రోలన, యనునలుగురు కుమాళ్ళనియు నందుఁ బెద్దవాఁడైన శివ్వన కీకవి పుత్రుఁడనియు, స్పష్టమగుచున్నది. కొన్ని తాళపత్ర ప్రతులలో "శ్రీనిలయుఁడు" అను పద్యము లేదఁట. ఆపద్యమును దీసివేసినచో రాజరాజనరేంద్రునిచే గ్రామమును బడసినవాఁడు మొదటి

మల్లన గాక కవిమల్లనయే యని యర్థమగును. కాని చాలప్రతులలో మధ్యపద్యముకూడ వ్రాసియుండుటచేతను, అప్పకవి తద్భవ వ్యాజవిశ్రి మమున కీ పద్యములను లక్ష్యముగా గైకొని యుండుటచేతను, పైని వ్రాసిన మూఁడు పద్యములనుగూడ మల్లకవి రచితములేయనియుఁ గొన్నిప్రతులలో నాపద్యము లేక పోవుటకుఁ గారణము లేఖక ప్రమాద మనియుఁ దలంపవలసియున్నది. బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులు గారీ విషయమున సంశయముజూపుచు, "గణితశాస్త్రవేత్తయు లాక్షణిక కవియు నైనమల్లనకే రాజరాజనరేంద్రుఁ డగ్రహారమునిచ్చియుండును. గాని ప్రసిద్ధుఁడుగాని మల్లనకూరక యిచ్చియుండడు. అని తమ యభిప్రాయమును వ్యక్తీకరించియున్నారు. కవికిఁ దాతయైన మల్లనను బ్రసిద్ధుఁడు గానివానినిగాఁ దలంచుట కాధారము లేదు. పైపద్యము లోనె యీమల్లనను "భూరిజనస్తుతుఁడు, సత్కళాశీలుఁడు, రాజపూజితుఁడు" నని వ్రాసియున్నాఁడు. అగ్రహారమును బడయుట కీ మూఁడు విశేషణములును జాలియున్నవి. కావున. తాతమల్లనయే యగ్రహారపరిగ్రహీత యని యంగీకరింతము.

కవిమల్లన తన గృహనామమును గ్రంథమునం దెచ్చటను చెప్పి నట్లగపడదు. పావులూరి విభుఁడనని పైనిజెప్పిన పద్యమునుబట్టి తరువాతివా రీతనిని పావులూరిమల్లన యని వాడియుందురా? లేక యీతనితండ్రి తాతలనుండియుఁ బావులూరే నివాసగ్రామమై యుండుటచే వారి గృహనామము పావులూరయియుండునా? యనిసంశ యము కలుగుచున్నది. మొదటినుండియు వీరిది పావులూరునివాస మై యది పైనిజెప్పినట్లు గుంటూరుమండలములోని దైనయెడల, రాజరాజేంద్రుఁడాతని నివాసమునకు సమీపమునఁ గాక పిఠాపుర ప్రాంతి

చ. హరునివర ప్రసాదమున నశ్వము మూఁడవయేడునిండినన్
ధర నొకపిల్లవైచు మఱిదానికిఁ బుట్టిన పిల్లపిల్లలున్
తరతర మట్లు వైచునఁట తల్లికి ముప్పదియేండ్లు నిండినన్
నిరవుగ నీను గోడిగలు నీవిసగోడిగ లెన్ని చెప్పుమా!

ఈ పావులూరిగణితము నాధునిక గణితసూత్రములతోఁగూడఁ జేర్చి ప్రచురించు టావశ్యకమై యున్నది.

మహా వీరాచార్యుఁడను జైనపండితుఁడు సంస్కృతములో దశవిధ గణితములను జేర్చి గణితసారసంగ్రహ మను గ్రంథమును రచించియుండె ననియు దాని నీమల్లనకవి యాంధ్రీకరించె ననియు నెలుగంటి పెద్దనకవి తన భిన్నప్రకీర్ణగణితమున నీ క్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈ వీరాచార్యుఁడు తొమ్మిదవ శతాబ్దివాఁడందురు.

క. ఘనుఁడై వీరాచార్యులు
తనమహిమను వెలయఁజేసె దసవిధగణితా
లను పద్ధతులు ధరిత్రిని
మనుపే యష్టాధికారములు మొదలనియున్.

శా. వీరాచార్యులు సంస్కృతాన గణితాల్ విఖ్యాతిగాఁజేసెఁదా
నారూఢింబది పావులూరికవిమల్లుం డద్ది తెల్గించె నన్
బేరేగాని గుణింపలేరు గణకుల్ భిన్నప్రకీర్ణంబు లీ
తీరైన న్నెలుగంటిపెద్దన యతిన్ దెల్పెన్ గుణింపన్ ధరన్.

ఈ గ్రంథమునుగూర్చి వేమూరి విశ్వనాథశర్మ యమ్. ఏ. గారొక వ్యాసమును భారతిలో వ్రాసియున్నారు. మల్లన రచించిన పదిగణితములను గలిగియున్న గ్రంథమునకు సారసంగ్రహ గణితమని పేరు.

అందు మొదటి గణితమును పావులూరి గణితమందురు. ఇందుఁ బావులూరు గ్రామ ప్రాంతములయందు నాఁడు వాడుకలో నున్నమానములు కొలఁతలు తెలుపఁబడినవి. తక్కిన గణితముల పేర్లివి. (౨) భాగహార గణితము (౩) సువర్ణ గణితము (౪) మిశ్రగణితము (౫) భిన్న గణితము (౬) క్షేత్రగణితము (౭) ఖాతగణితము (౮) ఛాయాగణితము (౯) సూత్రగణితము (౧౦) ప్రకీర్ణగణితము.

వీరాచార్యుల గణితసారసంగ్రహము కర్ణాటక భాషలోనికిఁ గూడ ననువదింపఁబడియెనఁట. పావులూరిగణిత మాంగ్లేయ భాషలోనికిఁ బరివర్తనము సేయఁబడియె నని విశ్వనాథశర్మగారిట్లు వ్రాసియున్నారు.

"నూటయిరువది సంవత్సరముల క్రితము "బెంజమిన్ హైన్" అనునతఁడు సామర్లకోటలో కంపినీయేజంటుగా నుండెను. అతఁడు పావులూరి మల్లన్న గణితములోని క్షేత్రగణితము నింగ్లీషులోనికి తర్జుమా చేసెను. అప్పటికే యీగణితశాస్త్రములో ప్రవీణత నొందిన కరణాలరుదుగ నుండిరనియు, ఒకసంవత్సరము ప్రయత్నింపగా బందరు సమీపమున నొక వృద్ధబ్రాహ్మణుఁడు లభించెననియు అయనవలన పావులూరి గణితము విషయమై సర్వమును నేర్చుకొని క్షేత్రగణితము నింగ్లీషులోనికి మార్చెననియు హైను దొరగారు వ్రాసిరి"

ఐరోపీయపండితులకు హైందవశాస్త్రములయం దెంత గౌరవమున్నదియు, వారీవిషయమున నెంతశ్రద్ధ వహించినదియు దీనివలన దెలియుచున్నది. ఇది రచియింపఁబడి తొమ్మిదివందల సంవత్సరములయినది. ఆంధ్రులు దీనివంకఁ జూడకుండుట విచారకరమైనవిషయము.

*
* *

# ౯. వేములవాడ భీమకవి

## ఇతవి జన్మకథ

ఈ కవి చరిత్రాంశము లన్నియు ననుమానాస్పదములై వివాదాంశములతోఁ గూడియున్నవి. ఇంత యగమ్యగోచరమయిన కవి చరిత్రమింకొకటి లేదు. ఈతని జన్మకథయే యద్భుతమయినది. వేములవాడ యను గ్రామమున సోమన యనునొక నియోగిబ్రాహ్మణుఁ డుండెను. ఆతని యేకపుత్రికకుఁ బసితనముననే వివాహము చేసిరి. రజస్వల కాకపూర్వమే యామెవితంతువయ్యెను. సోమనభార్య యదివఱకే కాలధర్మము నొందియుండుటచే నాతఁడీకుమార్తెను దనయొద్ద నుంచుకొని దుఃఖపూరితమగు నా సంసారము నీదుచుఁ, దనకుమార్తెకు విద్యచెప్పి యామెచే భారత భాగవత రామాయణములు జదివించికొని వినుచు నామెకర్థముఁ జెప్పుచు జీవయాత్ర గడుపుచుండెను. వారియాదాయముకూడ స్వల్పమగుటచే నామెయాయూరిధనికులయిండ్లకడ కేఁగి వారికిఁ బనులు చేసిపెట్టుచు వారిపిల్లలకుఁ బాటలు పద్యములు చెప్పుచు వారిచ్చినది దెచ్చుకొనుచుఁ దండ్రిసేవయు భగవద్ధ్యానమును జేయుచుఁ దనజీవితమును బరమపవిత్రముగా గడుపుచుండెను. ఇట్లుండఁగా నాయూరువారు కొందఱొకనాఁడు, భీమేశ్వరస్వామి యుత్సవమును జూచుటకై దక్షారామమున కేఁగుచు, నీవితంతువును గూడ రమ్మనిపిలచిరి. మొదట యామెతండ్రిని విడచి వెళ్ళుట కంగీకరింప లేదు కాని యొకటి రెండు దినముల కేమియని వారు బలవంతము చేయుటచేఁ దండ్రి నొప్పించి వారితోఁగూడ భీమేశ్వరదర్శనార్థము దక్షారామమునకుఁ బోయెను. వారిలో సంతానములేనియువ

తులు కొందఱు స్వామికడ సాష్టాంగపడి తమకుఁ గుమారుఁడు కలిగిన చోఁ బుట్టెడు నేయి దీపము వెలిగింతుమని మొక్కుకొనుచుండుటను జూచి, యా వెత్తిముద్దరాలు తనకుఁగూడఁ గుమారుఁడు కలిగినచో నట్లేచేయుదునని భక్తిపూర్వకముగా మ్రొక్కుకొనియెను. సంతానము లేని స్త్రీ సంఘములో నీచముగాఁ జూడఁబడు నను విషయమే యా నిమిషమునందామె మనసులో నుండెను. కాని తనకు సంతానముకలుగునవ కాశ మున్నదా లేదా యను ప్రశ్న యప్పుడామెకుఁ దట్టలేదు. ఆమెకు గర్భము కలిగినది. మాసములు గడచినకొలఁది నూరువారిలో గుస గుస లారంభమైనవి. తండ్రికుమార్తెను బిలిచి యిదేమి! ఆశ్చర్యమైన స్థితివని యడిగెను. ఆమె తండ్రికి నమస్కరించి జరిగినవృత్తాంతమును జెప్పి తనశీలమునందు దోషము లేదని చెప్పెను. తనకుమార్తె శీల మునుగూర్చి యాతనికి సంశయము కలుగలేదు. క్రమముగా నీవార్త గ్రామమున వ్యాపించెను. స్వల్ప సంఖ్యాకులు "ఏమో! భగవంతుఁ డఘటనాఘటనసమర్థుఁడు. ఏమిచేయ లేఁడు? అయినను మన కెందుల" కనిరి. బహుసంఖ్యాకులు వేళాకోళయు చేయమొదలిడిరి. తుదకా తండ్రియుఁ దనయయు వెలివేయఁబడిరి పిమ్మట నామెకొక కుమా రుఁడు కలిగెను. వానికి భీమేశ్వరుఁడని పేరు పెట్టి యామె పెంచుకొను చుఁ దనచేతనైనంతవఱకు విద్యాబుద్ధులను గఱపుచుండెను. కొంత వయ సు వచ్చినపిమ్మట నాతఁడు వీధిలో నాడుకొనఁబోయినప్పుడు తోడి పిల్లలు కొందఱీతనిని "విధవకొడుకని"కని 'ముండకొడుకు' "కనియననారం భించిరి. వారు తననుద్దిట్టుటకై యీమాటలు నుపయోగించుటలే దనియు వాస్తవమునే వర్ణించుచున్నారనియు నాతఁడు గ్రహిం చెను. దీనికిఁదోడు ఊరివారిలో నే శుభాశుభములు జరిగినను దనను గాని తనతల్లినిగాని పిలుచుటలేదు. ఈవిషయమునుగూర్చి యొక నాఁడు తల్లితోఁ బ్రస్తావింపఁగా నామె జరిగిన యావదుదంతమును

గుమారున కేతెంచెను. వాస్తవమును దెలుపుటకా భీమేశ్వరుఁడు దక్కొరులు సమర్థులు గారని తలంచి యాతఁడు భీమేశ్వరాలయమున కేఁగి యచ్చట స్వామి నారాధించుచు నిరశనవ్రతముం బూనియుండ స్వామి యాతనికిఁ గన్పడి, "వత్సా! నిక్కముగా నాతనయుండవు. నీతల్లి నిర్దోషి. నీవు నాయనుగ్రహమునఁ బండితుఁడవై, త్రికాలవేది వై, నీకుఁగల కళంకముంబాసి పండితమాన్యుఁడ వయ్యెదవు పొమ్మ! ఎల్లెడల నీవాక్కమోఘమై వర్ధిల్లునని యనుగ్రహించెనఁట! భీముఁ డింటికిఁబోయి తల్లితో భీమేశ్వరుఁడు తన కొసంగిన వరములఁ దెల్పి యామెను సంతోషమునందేల్చి, విద్యాభివృద్ధి సేసికొనుచు, సమయ ముకొఱ కెదురుచూచుచుండెనఁట! ఇంతలో నాయూర నొక బ్రాహ్మణునియింట శుభకార్య మొకటి గాఁగా నాతఁడాయూరివారి నందఱిని భోజనమునకుంబిలిచి, విస్తరులలో పదార్థములను వడ్డించెను. ఈ భీమునిఁ బిలువలేదు. ఇతఁ డాతనియింటికిఁ బోయి తలుపుసందున నుండి చూచి, 'మీయన్నము సున్నముగాను, మీపప్పులు కప్పలుగాను' అని యనెనఁట. అమోఘవచస్కుఁడగు నాతఁడనిన రీతిగనే యన్నము సున్నమై పప్పలు కప్పలై దుముకులాడ నారంభించెనట! అదిగని యాబ్రాహ్మణు డాశ్చర్యమనస్కుడై చేయునది లేక వీధిలోనికి వచ్చి యాతనిం జూచి నీ మహిమ యద్భుతమైనది. నీవు మరల సున్నము నన్నముగాను గప్పలను బప్పలుగాను జేయుము. అట్లొనర్చినచో నిన్ను మాలోఁ గలుపుకొందుమని వేఁడుకొనఁగా నాతఁడట్లే యొనర్చి వారితోఁగలసి విందారగించెనఁట! అంతటనుండి యాతని వెలి పోయినది. పండితులాతనిని గౌరవింపఁజొచ్చిరి.

ఇది యాతని జన్మకథనము. ఈకథ నిప్పుడెవ్వరు నమ్మెదరు? అయిన నీకథ నిన్న నేఁడు వచ్చినది కాదు. భీమకవియే తనతండ్రి

ుమేశ్వరుఁడని చెప్పుకొనుచున్నట్లు క్రిందిచాటుధారవలనఁ దెలియవచ్చు చున్నది.

మ. ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ; దక్షారామ భీమేశ నం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకట నానాకావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా!

ఈ వేములవాఁడ భీమకవి సంస్కృతమున నొకజ్యోతిశ్శాస్త్రమును రచియించె ననియుఁ దాను దాని నాంధ్రీకరింపఁబూనినట్లునుఁ జెప్పి యొకానొకకవి తన గ్రంథారంభమందీ భీమకవి జననకథ పైనివాసినదాని కించుక మార్పుతో గ్రంథస్థముఁ జేయుచు నీక్రింది సీసమాలికను రచియించియున్నాఁడు. ఈకవియెవ్వఁడో తెలియదు.

సీ. శ్రీకరంబై ధరఁ జెలువుగాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీఱ
భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
కోర్కులొసఁగుచుఁ గొమరు మిగుల
నొకనాఁడు తత్పురియువతులు కొందఱు
భక్తి భీమేశ్వరు భవనమునకుఁ
బోయి పుత్త్రులవేఁడ ముగత్వమున నొక్క
విధవకుమారుని వేడ్కఁగోర
నాలేమ ముగ్ధత కపహాసించుచు నల
భీమేశ్వరుఁడు పుత్త్రుఁ బ్రీతి నొసఁగ
నాకాంత గర్భిణియై కాంచెఁ దనయునిఁ
గలియుగాదిని బ్రేమ కడలుకొనఁగఁ

ప్రభవవర్షంబున శ్రావణమాసంబు
శుక్లపక్షంబున శోభనంబు
మీఱఁ బంచమి శుక్రవారంబునను హస్త
యందుఁ గన్యాలగ్నమందు వెలయ,
వెలిపెట్టిర శాంత విధవపుత్త్రినిఁ గాంచె
నని నింద మెడఁ గట్టె నఖిలజనులు
వంతఁ దత్తనయుండు నైదేండ్లబాలుఁ డై
పురి బాలకులతోడఁ బొసఁగ నాడ
జనులెల్ల గోళకుండని నింపఁ జేసిన
రోషించి యాతండు దూషితి యని
దా నెత్తి తల్లిపై నేయఁబోయిన నది
భీమేశ్వరుఁడు తండ్రి వ్రేయుమనిన
వెసఁ జని యాతని వ్రేయ నుంకించిన
భీమేశ్వరుఁడు దయపెద్ద గలిగి
ప్రత్యక్షమయి, వత్స! రమ్మని తగఁ జేఱి
పశుపక్షిమృగములఁ బ్రాణికోట్ల
కల్పించు కడునున్న మదియును నడచును
చెప్పిన కవనము యుర్విలోనఁ
గలిగించు శక్తియుఁ గర మొప్ప జనులకు
బిడ్డలనాయువుఁ బెంపుదనర
సంపదలొసఁగెడి సామర్థ్యమును మఱి
కానిది యౌనని యైన దెల్ల
గాదని యట్టుల శాసించుబలమును
మను ధాఁ గలుగునదియును దెలుపఁగఁ

ప్రావీణ్యమును నిచ్చి ప్రబలుము నీవని
వరమిచ్చెఁ బదియారు వత్సములకు
నాతనికి సహాయమైు సరస్వతియును
నతఁడెట్లు చెప్పిన నట్లు చేయుచునుండె
సరి లే కీర్తిచే జగతి వెలసి

గీ. యతఁడు చెప్పినశాస్త్ర మంతధికభక్తి
కలిగి నిజమని తలఁచినఁ గల్గుశుభము
కోర్కు లెల్లను ఫలియించు గురుతరముగ
సకల జనులకుఁ దప్పదు జగతిలోన.

నమ్మినను నమ్మకపోయినను నీతని జన్మకథయిది. మహాపురుషు లొనర్చిన ఘనకార్యములనే మనము గమనింపవలయును. కాని వారి జన్మరహస్యములతో మనకుఁబనిలేదు. శుకమహర్షి శుకగర్భమునుండి జన్మించెను. ప్రతివ్రతయైన మరియమ్మకు భర్తసంపర్కము కలుగక ముందు కన్యకగానుండగా ఏసుక్రీస్తుజన్మించెను. అతఁడు పరిశుద్ధాత్మ స్వరూపుఁడనియు, నాతిని తల్లిని ద్యజింపవలదనియు దేవుఁడు ఏసుక్రీస్తుతండ్రికి స్వప్నములోఁ గన్పడి చెప్పెను. ఈ సీసమాలికలోఁ జెప్పఁబడిన జన్మకాలమునుబట్టి కవికాలనిర్ణయమును జేయయత్నించితినిగాని యది కుదురలేదు. క్రీ. శ. ౧౦౭౭ మొదలు ౧౩౨౭ నడుమ తొమ్మిదిసారులు ప్రభవాబ్దములు వచ్చినవి. ఇందేసంవత్సరమునను శ్రావణశుక్లపంచమి శుక్రవారము కాలేదు. ఒక్క ౧౩౨౭ లో మాత్రము శుక్రవారమయినది కాని యావాఁడు చిత్తానక్షత్రమైనది కావున నీకాలము సత్యమగుట కనువుగాదు.

*
* *

## నివాసము

భీమకవి చరిత్రాంశము లన్నిఁటివలెనే యాతని నివాసము వివాదగ్రస్తమేయైనది. నిజాము రాష్ట్రమందలి వేములవాడ యని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మొదలగువారును గోదావరి మండల మందలి వేములవాడయని బ్ర. శ్రీ. వీరేశలింగంపంతులుగారు మొదలగు వారును నభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. ఇందునుగుఱించి విపులముగా చర్చలు జరిగియున్నవి. ఆచర్చల సారాంశము వ్రాసి నను, నెంతయో గ్రంథమగును. గ్రంథవిస్తర భయమున నాచర్చల నిట వ్రాయలేదు.

భీమకవి నివాసము గోదావరిమండలములోని వేములవాడ యని యే నాయభిప్రాయము. దీనితో సంబంధించిన వాదోపవాదములను జదివి చూచిన పిమ్మట కూడ నాయభిప్రాయము మారలేదు. ఇందలి యుక్తిప్రయుక్తులన్నియు పోతనామాత్యుని యొంటిమిట్ట, వరంగల్లు వాదములను బోలియున్నవి. "దక్షారామ భీమేశనందనుఁడన్" అను పద్యమును భీమకవి చెప్పెనని యంగీకరించితిమేని, గోదావరిమండల వాదమునకు బలమెక్కువగలదని యొప్పుకొనక తప్పదు. నిజాము రాష్ట్రమందలి పూర్వపు వెలిగందల మండలమందు (ఇప్పటి కరీం నగరమండలము) నున్న వేములవాడ యందలి రాజేశ్వరుఁడే భీమేశ్వ రుఁడనియు, భవిష్యోత్తర పురాణములో దానికి దక్షవాటియనియు నందలిదేవునకు భీమేశ్వరుఁడనియు సంజ్ఞలీయఁబడినవనియుఁ దెలిపెడి వాదము నందంత బలములేదు. భీమకవి యాపద్యమును జెప్పి నపుడు, తనకాలమున వాడుకలోనున్న నామములనే యుదాహరించు నుగాని ఎక్కడనో మారుమూల భవిష్యోత్తర పురాణములలోనున్న గ్రామనామమును చెప్పెనని తలంచుట సమంజసము కాఁజాలదు. ఈ విషయమున నిఁకఁ బెంచి వ్రాయుటవలనఁ బ్రయోజనము లేదు.

ఇతని గ్రంథములు : జ్యోతిషగ్రంథము.

ఇతఁడు భూతభవిష్యద్వర్తమాన కాలములయందలి కొందఱు వ్యక్తులజాతకముల నొక గ్రంథముగా వ్రాసియుంచెననియు జాతకభాగమునం దితఁడు గొప్పపండితుఁడనియుఁ జెప్పెదరు. దక్షిణదేశమున భృగునాడి, బృహస్పతినాడి మొదలగు నాడీగ్రంథములనుగూర్చి మనము వినుచున్నాము. భీమనాడి యనుపేర నట్టినాడీగ్రంథ మొకటి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందున్నది. కాని యందట్టివిశేషము లేమియు లేవు. భీమకవి జ్యోతిసామృతసారమని యొకగ్రంథము ముద్రిత మైనది. ఇది భీమకవి కృతిమనని నిశ్చయముగా జెప్పఁజాలము.

రాఘవ పాండవీయము.

ఇతఁడాంధ్రమున రాఘవపాండవీయమను నొక ద్వ్యర్థి కావ్యమును రచియించెననియు, దానిని బరిశీలించుటకై నన్నయభట్టునకీయఁగా నదిబైటకు వచ్చినచోఁ దనభారతమునకు గౌరవముండదని నన్నయ దాని నణఁచివేసెననియు నొకకథ వాడుకలో నున్నది. దీనిని గ్రంథస్థముచేసినవాఁ డప్పకవి.

గీ. భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయంబు నడఁచె
ఛందము నడంప నీవక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచె దాని

గీ. ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున, నా
మీఁదట రాజనరేంద్ర
క్ష్మాదయితునిపట్టి దాని మహిఁ వెలయించెన్,— అప్పకవీయము

రాఘవపాండవీయమును నన్నయభట్టు నశింపజేయగా, నందులకుఁ బ్రతీకారముగ భీమన నన్నయ రచించిన యాంధ్రశబ్ద చింతామణిని నశింపజేసెనని పైపద్యములలో నప్పకవి జెప్పియున్నాఁడు. ఇది కేవలము కల్పితకథ. నన్నయవంటి యుత్తమపురుషుఁడు, మహాకవి శ్రీమహాభారతరచనమునకుఁ బూనుకొనిన యుభయభాషాపండితుఁడొక చిన్నకావ్యమును బాడుచేసెనని చెప్పుటకంటె హాస్యాస్పదమాయిన విషయమింకొకటి యుండదు. రెండర్థములుగల రాఘవపాండవీయము వలన తన భారతమునకు గౌరవము తగ్గిపోవునని తలంచునంతటి యవివేకికాఁడు నన్నయ. పింగళి సూరన రచించిన రాఘవపాండవీయమువలన నన్నయ భారతమున కేమైన ప్రతిష్ఠతగ్గినదా. భీమకవి తిట్టుకవియనియు శాపానుగ్రహ సమర్థుడనియుఁ బ్రసిద్ధి కలదుకదా! తన రాఘవపాండవీయమును బాడుచేసిన నన్నయను దిట్టకుండ, శపింపకుండ, నూరకుండునా? రాజరాజనరేంద్రుని తోడఁ జెప్పి తగిన ప్రతీకారము సేయఁదలపెట్టునుగాని దొంగవలె నాతని గ్రంథమును నాశనము చేయునంతటి నీచకార్యమునకు గడంగునా? ప్రతీకారమావిధముగాఁ జేయఁదలపెట్టినాఁ డన్నను; ఏభారతమునో నశింపజేయఁ దలపెట్టినాఁ డనిన విశేషముండునుగాని తొంబదితొమ్మిది శ్లోకములు గల యొక చిన్నపొత్తమును జింపివేసినాఁడనిన నేమిలాభము! నన్నయ తాను రచించిన తొంబదితొమ్మిది శ్లోకములను మఱల రెండుమూఁడు దినములలో రచింపఁగలఁడని భీమన యనుకొనలేదందురా? తనకుఁ దొందరపనియుండి దర్శనమీయ లేదన్న స్వల్పకారణము మీఁదఁ గళింగగంగును రాజ్యభ్రష్టునిగాఁ దిట్టిన భీమన తనగారాబు పుత్రికయైన రాఘవపాండవీయ కావ్యమును భూమిపై లేకుండఁజేసిన నన్నయభట్టు నొక్కమాటయైన ననకుండ నూరకుండునా? భీమకవి చాటుధార లిప్పుడుగూడ నెన్నియో ప్రచారములోనున్నవి. కాని

నన్నయభట్టును డిట్టిదని తెలిపెడి యొక్కపద్యమైనఁ గూడ లేదు. ఈ విషయముల నన్నిటిని బరిశీలించి చూచినచో నప్పకవి వ్రాఁతయందు సత్యము లేదని తోఁపఁగలదు. నన్నయయు, భీమకవియుఁ గూడ దమ కారోపింపఁబడిన యపవాదములనుండి విముక్తు లయ్యెదరుగాత! భీమకవి రాఘవపాండవీయమును రచింపనే లేదని యనరాదు. పింగళి సూరనార్యుఁడు తన రాఘవ పాండవీయమునందుఁ జెప్పిన యీక్రింది పద్యములవలన భీమకవి రాఘవపాండవీయమును రచించెనను ప్రతీతి యానాఁటి కున్నదనియు, గ్రంథమప్పటికే నామమాత్రావశేషమయ్యె ననియుఁ దెలియవచ్చుచున్నది. ఈ పద్యములు కృతిపతి యైన వేంకటాద్రిప్రభువు కవినిగూర్చి పలికినవి.

"రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబిఁక నందునుం దెనుఁగు కబ్బంబద్భుతం బంద్రు ద
క్షుం డెవ్వాఁడిల రామభారతకథ ల్జోడింప భాషాకృతిన్.

ఉ. భీమన తొల్లి చెప్పెనను పెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గానరటుండనిమ్ము నా
నామహితప్రబంధ రచనాఘనవిశ్రుతి నిక్కఁగల్గుటన్
నామదిఁ దద్ద్వయార్థకృతి నైపుణిమ్ముం గలదంచు నెంచెదన్.

అథర్వణ భారతాదుల కెట్టిగతి పట్టియుండెనో, అట్టి గతియే భీమకవి రాఘవపాండవీయమునకును బట్టియుండును. ఒక్క రాఘవపాండవీయమునకే కాదు. ఈ భీమకవి కృతములని చెప్పఁబడు గ్రంథముల కన్నిటికిగూడ నిట్టి గతిపట్టుట విచారకరమైన విషయము.

## నృసింహపురాణము

ఈభీమకవి నృసింహపురాణము రచియించెనని యొకవాడుక కలదు. భీమన నృసింహపురాణములోనివిగా నీక్రిందిపద్యములు లక్షణ గ్రంథములయం దుదాహరింపబడినవని బ్ర. వేటూరి ప్రభాకరశాస్త్రిలు గారు తమ చాటుపద్యమణిమంజరిలో వ్రాసియున్నారు.

క. ఈ క్షితికి వచ్చి ముందుగ
దాక్షారామమున వారతరుణుల నృత్యం
బీక్షించి యంతకంటెను
దక్షిణమున నేర్చి రంభ గతవేష్టఁగఁగా.

క. కెంజిగురుసకుం గఠినత
వంజకుఁ బాల్ పిచ్చుగుంటువానికిఁ బరువుల్
నంజుడుకుఁ గమ్మదావి చు
లంజెకు మేలెందులేదు రా విటరాయా!

అట్లే యీక్రిందిపద్యమును బ్ర. మానవల్లి రామకృష్ణకవిగా రుదాహరించియున్నారు.

ఉ. వాండిమి నల్లసిద్ధి జనవల్లభుఁ డోర్చినరాజు భీతుఁడై
యాంధ్రను గానకుండ వృషభాంకము బెట్టికొనంగ జూచితో
నేండిది యేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో
మాండవ కంటిలోడిదోర మూర్తివహించిన ప్రెుక్కిరంగనల్

కస్తూరిరంగకవి తన రంగరాట్ఛందములో నీక్రిందిపద్యము భీమకవి నృసింహపురాణములోనిదని యుదాహరించియున్నాఁడు.

క. మానవనాథుఁడు గంగా
స్నానానంతరము సకలదానములు మహా
దీను లగు విప్రకోటికి
సేనాదయతోడ నిచ్చి శివు సేవించెన్.

నృసింహపురాణ మెచ్చటను లభించుటలేదు.

## శతకంధర రామాయణము

ఇతఁడు శతకంధర రామాయణమును రచించెనని చెప్పుదురు. ఆ గ్రంథములోని వని లక్షణగ్రంథములలో నీక్రిందిపద్యము లుదాహరింపఁబడెనని బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులు గారాంధ్రకవుల చరిత్ర మునందిచ్చియున్నారు.

క. భువిఁబుట్టి పీఁచ మడఁచెను.
దివిజారితుల దిసేశదీప్తు లశర రా
ఘవుఁ డనుచు మునులు పొగడిరి
దివిని దివౌకసులు మిగుల దీవించి రొగిన్.

ఉ. కలగకుఁడీ నభశ్చరులు కంపముఁ జెందకుఁ డెప్డుఁ గిన్నరుల్
తలఁకకుఁడచ్చరల్ మునులు తత్తరమొందకుఁడేను వచ్చి మీ
యలజడు లెల్లఁబాపెదము నందఱుఁగాచెద నంతవట్టు మీ
గలిబిలి మానియుండుఁడని కైటభమర్దనుఁడోలిఁ బల్కినన్.

నృసింహపురాణమును, శతకంధర రామాయణమును భీమ కవికృతము లని సంతోషింత మనుకొన్నను బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రమున "ఇందఱు కవుల పొగడ్త కర్హుడైన భీమనచే రచియింపఁబడిన యుద్గ్రంథమేదియో నాకింతవఱకుఁ దెలియ

రాతున్నది. నృసింహపురాణమని యొకరును శతకంధరరామాయణ మని యొకరును భీమకవి కృతములని చెప్పిరి. కాని యట్టివైష్ణవ గ్రంథములను వీరశైవుఁడును శివపుత్త్రుఁడునైన భీమకవి రచియించి యుండునని గ్రంథములను జూచి తృప్తినొందువఱకును నేను విశ్వసింపఁ జాలను." అనివ్రాసి యీగ్రంథకర్తృత్వము ననుమానించినారు. నేను మొదటచెప్పి నట్టీకవి చరిత్రాంశములలోఁ బ్రతివిషయమును సంశ యాస్పదముగనే యున్నది.

## కన్నడ బసవపురాణము

పాలకురికి సోమనారాధ్యుఁడు రచియించిన యాంధ్ర ద్విపదబస వపురాణము నీభీమకవి కన్నడీకరించెనని బ్ర. శ్రీ వీరేశలింగముపంతులు గారు సిద్ధాంతీకరించుచు నాంధ్రకవుల చారిత్రమునఁ గొన్ని వాక్యము లను వ్రాసియున్నారు. నావాక్యములతో వానిని మరల వ్రాయుట నాయనమాటలనే వ్రాయుటయందికనియెంచి యట్లుచేయుచున్నాఁడను.

"నేనుచూచినంతవఱకు భీమకవి విరచితకృతినిగూర్చి నాకొక్క- యాధారము కనఁబడుచున్నది. కృష్ణదేవరాయనికిఁ గొంచెము ముందున్నవాఁడయి ౧౫౧౦ వ సంవత్సరప్రాంతమునందు బసవపురాణ మును బద్యకావ్యమునుగా రచియించిన పిడుపర్తి సోమనాథకవి భీమ కవి బసవపురాణమును రచియించెనని తన గ్రంథముయొక్క ప్రథమా శ్వాసములో నీక్రిందిపద్యమునందుఁ జెప్పియున్నాఁడు.

సీ. విరచించె జైమినివేదపాదస్తవం
బాకపాదమునను వేదోక్తినిలిపి
భారభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత

సరవి శ్రీనాథుఁడా చరిత పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి
యాతండు పద్యకావ్యము చేసె నైషధ
మంచితహర్ష వాక్యములఁ బెట్టి
సోమగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణనఁ జేసెఁ
గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చి నెగడు.

ఈ కవి శ్రీనాథునికిఁ దరువాత నేఁబది యఱువది సంవత్సరములకే యున్నవాఁడగుటచేత నాకాలపుసంగతులను జక్కఁగా నెఱిఁగినవాఁడు. పాల్కురికి సోమనారాధ్యుఁడు తెలుఁగున రచించిన ద్విపదకావ్యములు రెంటిలో పండితారాధ్యచరితము నక్కడక్కడ ద్విపదలుంచుచు శ్రీనాథుఁడు పద్యకావ్యమునుగాఁ జేసెననియు, బసవపురాణమును భీమకవి పద్యమునుగాఁ జేసెననియు కవి చెప్పుచున్నాఁడు. తనకుఁబూర్వము నందే భీమకవి బసవపురాణమును పద్యకావ్యమునుగాఁ జేసియుండిన యెడలఁ దాను మరలఁ బసవపురాణమునే పద్యకావ్యమునుగా రచింప వలసిన యావశ్యక మేమి వచ్చినది? ఏమియు రాలేదు. మహాకవి యైన భీమనకంటెఁ దానెక్కువ ప్రౌఢముగాను మనోహరముగాను రచియింపఁగలుగుదు నన్న నమ్మకముచేతనా? కాదు. అందుచేత భీమకవి బసవపురాణమును పద్యకావ్యముగా రచించినది తెలుఁగు భాషలోఁ గాదనియు, వేఱొకభాషలోననియు నిందువలనఁ దేలుచున్నది. కవి శ్రీనాథుఁ డారాధ్యచరిత్రమును బద్యకావ్యమునుగాఁ జేసె నని చెప్పి దానిక్రిందనే సంబద్ధమంతగాఁ గనఁబడని నైషధభాషాంతరీ

కరణకథనము నుగ్గడించుట * భీమకవిది భాషాంతరమనియు, నైషధము నందువలెనే ప్రతి భాషాంతరీకృత గ్రంథమునందును మూలగ్రంథ వాక్యములు కొన్నిపడుట యనివార్యమనియు, చూపుటకొఱకై యున్నది. ఆకాలమునందు భీమకవి తన భాషాంతరమునందు మూలగ్రంథవాక్యములనే కొన్నిటిని బెట్టెనని జనులు నిందించుటవలన నిట్లు వ్రాయవలసి వచ్చియుండును. భీమకవిది భాషాంతరమైనచో నది యేభాష! వైష్ణవ మతగ్రంథములు సాధారణముగా నఱవములో నుండునట్లే శైవమత గ్రంథములు కన్నడములోనుండునుగాన గర్ణాటకభాషయని వేఱుగఁ జెప్పవలసినపని లేదు. ఆకాలమునందలి తెలుగుపండితుల కందఱికిని సంస్కృత కర్ణాటకభాషలు సాధారణముగా వచ్చుచుండెడివి. అందుచేతఁ దెనుఁగును సహితము కర్ణాటకమనుచుండుట యప్పుడప్పుడు కలదు. శ్రీనాథుఁడు తన భీమఖండములో నేమనెనో చూడుఁడు.

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
రెవ్వ రేమన్న నండ్రు గాకేల కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

భీమకవి పాల్కురికి సోమనాథకవికృతమైన ద్విపద తెలుఁగు బసవపురాణమును గర్ణాటకభాషలో భామిఁచష్పది పద్యములతో నెనిమిదాశ్వాసముల మహాకావ్యమునుగాఁ జేసెను. ఈకవి యారాధ్య బ్రాహ్మణుఁడనియు, బసవపురాణము భీమకవీశ్వర రగడ యను

* పై పద్యమును, పిడుపర్తి సోమనాథకవి, భీమకవి భాషాంతరీకరణమును సమర్థించుటకై వ్రాసినాఁడనుటకంటె తన గ్రంథమునందు పాల్కురికి సోమనాథుని మూలకావ్యమునందలి వాక్యములు వచ్చిపడినను చదువరులు తనయందు గ్రంథచౌర్యము నారోపింపకుండుటకై వ్రాసియుండెనని భావించుట సమంజసమని నా యభిప్రాయము.

పుస్తకములను రచించెననియు, ఈతనిని సుమారు ౧౩౫౮ సంవత్సర ప్రాంతమునందున్న పద్మణాంకుఁడు ౧౫౮౫ వ సంవత్సరప్రాంతము నందున్న విరూపాక్ష పండితుఁడు మొదలైన వీరశైవ కవులు నుతించి యుండిరనియు, కర్ణాటక కవిచరితము చెప్పుచున్నది. ఆరాధ్యబ్రాహ్మణు లాంధ్రులలో తప్ప నితరులలో లేరు. భీమకవి తాను శివకవిదేవపుత్రుఁడ ననియు, ఉభయ కవిత్వసమర్థుఁడననియు బసవపురాణములో నీక్రిందిపద్యమునఁ జెప్పుకొని యున్నాఁడు.

విమల సద్గురుసేవె యాలి జం
గమభుజనే యలి లింగనిష్ఠా
సమతె యలి తనుమనధంగళని త్రభవభక్తి ॥
సమయవార్ధివివర్ధనోశ్వజ
హిమగు శివకవిదేవ నాత్మజ
సుమతి భీమ నుభయకవిత్వసమర్థను సుకవడె.

భీమకవి తనబసవపురాణమును శాలివాహనశకము ౧౨౯౧ కి సరియైన సౌమ్యసంవత్సర శ్రావణబహుళ దశమీ గురువారము ముగించితి నని పుస్తకాంతమున నీక్రిందిపద్యములలోఁ జెప్పికొనెను.

కోవిదరు కేళ్వొళ్ళి తెనలుదు
దేవవిధినయనేందు సంఖెగ
ళో విశకవరుషం గళాగలుసౌమ్యవత్సరద ॥
శ్రావణబహుళపక్ష దశమీ
జీవవార దొళాది వృషభేం
ద్రావతారద బసచరితె సమాప్తి యాయితు.

దీనినిబట్టి భీమకవి శకసంవత్సరము ౧౨౯౧ కి సరియైన క్రీస్తుశకము ౧౩౬౯ వ సంవత్సరమున బసవపురాణమును రచించి ముగించెనని

తెలియవచ్చుచున్నది. గాన నితఁడు ౧౩౭౦-౧౩౯౦ వ సంవత్సర ప్రాంతమున నుండియున్నవాఁడని నిస్సందేహముగా సిద్ధాంత మగుచున్నది. బసవపురాణమునందుఁ గవియే శివలెంకమంచన పండితుఁడును గురుమల్లికార్జున పండితుఁడును ప్రసాదించిన "యుద్దండమతి"తో గృతిచేసెనని చెప్పుకొని యుండుటచేతను, ఈతనిది యుద్ధండలలిత ధారాళకవిత్వ మని యితరులు పొగడియుండుటచేతను,

"వచియింతు వేములవాడ భీమునభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు"

అని శ్రీనాథుఁ డీతనికవిత్వమును శ్లాఘించుట వింత కాదు. భీమకవి కవిత్వముయొక్క యుద్దండలీల కొంత తెలియుటకును, అతఁడు పాల్కురికి సోమనాథుని బసవపురాణమును భాషాంతరీకరించెనని తేటపడుటకును బయిపద్యము క్రింద రెండుపద్యములను గూడ నిం దుదాహరించుచున్నాను.

శిక్షితప్రతి పక్షసజ్జన
పక్షసాక్షె దుష్టరాజస
దృక్షదక్షముఖక్షయా మఖశిక్షితక్ష్వేడ॥
త్ర్యక్షగణపసముక్ష కరుణా
వీక్షణా జగద్రక్షణా గుణవి
చక్షణా బసవసూక్తిగె అక్షయ రక్షిసెంమునను ॥౧॥
ఇదు సకలమహేశ్వరామళ
పదపయోజపరాగమదష
ట్పది యెని పాల్కురికె సోమేశ్వరన కారుణ్య॥
ఒదవి దక్షిణాప్రపూరిత
హృదయశ్రీభీమకవి ప్రణీతా
భ్యుదయ బసపురాణ కథెయొళు అష్టమాశ్వాస॥"

శ్రీపంతులుగారింతదూరము వ్రాసినను, ఈకన్నడ బసవపురాణకర్త
వేములవాడ భీమకవి యని నిస్సంశయముగాఁ జెప్పుటకు వీలులేదనియే
తోఁచుచున్నది. గ్రంథాదిని గ్రంథాంతమునను భీమకవి యని మాత్ర
మే చెప్పఁబడినది. వేములవాడ భీమకవి యని యెచ్చటను జెప్పి
యుండలేదు. ఈతని తండ్రి శివకవిదేవుఁడు. వేములవాడ భీమకవి
తండ్రిని గూర్చినకథ పైని జెప్పబడి యున్నదికదా! కన్నడ బసవపురా
ణకర్త తండ్రి శివదేవుఁడని చెప్పినచో, నీకథకుఁ గొంత సరిపోయి
యుండును. మధ్య 'కవి' శబ్దము నుపయోగించి యుండుటచే, నీభీమ
కవి తండ్రి కవిత్వమును జెప్పఁగల వాఁడయి యుండినట్లు తోఁచుచున్న
ది. ఈభీమకవియే వేములవాడ భీమకవియని మనము నమ్మితిమేని,
వేములవాడ భీమకవి జన్మముతో సంబంధించినకథను త్రోసివేయవలసి
యుండును. కన్నడబసవపురాణము నందెచ్చటనైన వేములవాడ శబ్ద
ముపయోగించి యున్నచో నాతనిని వేములవాడ భీమకవిగా మన
మంగీకరించి యాతని జన్మకథను బుక్కిటపురాణముగాఁ దీసివేయ
వచ్చును. పిడపర్తి సోమనాథకవియైనను "భీమసుకవియని చెప్పెనే
కాని వేములవాడ భీమకవియని చెప్పలేదు. కన్నడ బసవపురాణకర్త
యారాధ్యబ్రాహ్మణుఁడని కన్నడకవి చారిత్రకారులు వ్రాసియుండుట
వలనను, ఆంధ్ర బ్రాహ్మణులలోతప్ప నారాధ్యబ్రాహ్మణు లింకొక
తెగలో లేరు కావునను నీపురాణకర్త వేములవాడ భీమకవి యని
తలంపుఁడని పంతులుగారనుచున్నారు ఆంధ్రారాధ్య బ్రాహ్మణులలో
వేములవాడ భీమకవితప్ప నింకొక భీమకవి లేఁడని ధ్రువపడువఱకును
నీతనిని వేములవాడ భీమకవియని తలంచుటెట్లు? శివకవి కుమారుఁ
డైన భీమకవి యింకొకఁడుండెనని యేల యనుకొనఁగూడదు? వేముల
వాడ భీమకవి తాను దక్షారామ భీమేశనందనుఁడ" నని చెప్పుకొని
యున్నాఁడు. వీరశైవులు తండ్రిపేరు చెప్పరు కావున వేములవాడ

భీమకవి భీమేశ్వరపుత్త్రుఁడనని చెప్పుకొనియున్నాఁడని కొందఱనవచ్చును. అట్లయినచో బసవపురాణమునందును నట్లే చెప్పుకొనునుగాని శివకవికనూజాతుఁడనని చెప్పుకొనియుండఁడు. వేములవాడ భీమకవి తండ్రిపేరు చెప్పుకొనని వీరశైవుఁడని భావించితిమేని, బసవపురాణకర్తయు నాతఁడు నొక్కరు గారనియే చెప్పవలసివచ్చును. వేములవాడ భీమకవి వీరశైవుఁడు కాఁడనియు నృసింహపురాణమును, శతకంధర రామాయణమును రచియించెనని లక్షణగ్రంథములలోని పద్యములు చెప్పుచుండుటచేత నాతఁడు శివకేశవులయందు సమాన గౌరవము గలవాఁడనియుఁ దలంచుట సమంజసముగా నుండును. కన్నడబసవపురాణకర్త వీరశైవుఁడని పైకన్నడ పద్యములలోని "విమలసద్గురుసేవెయలి జంగమ భజనెయలి లింగనిష్ఠాసమతెయలి" యను పదముల వలనఁ దెలియుచున్నది. వేములవాడ భీమకవి నృసింహపురాణమును జేసియుండునని మనము నమ్మితిమేని యీ బసవపురాణకర్త వేములవాడ భీమకవికంటె భిన్నుఁడని నిశ్చయింపవలసియుండును. పైకన్నడ పద్యములోఁ జెప్పఁబడిన యుభయకవితా సమర్థత, కర్ణాటాంధ్రముల యందని యనుటకంటెఁ గర్ణాటసంస్కృతములయందని యనుట సమంజసముగా నుండును. ఆపక్షములో నీభీమకవి యాంధ్రకావ్యారచనమును గాంచినట్లు గన్పట్టదు.

కర్ణాటక బసవపురాణమునఁ దత్కర్తయగు భీమకవి "శివలెంకమంచన పండితుఁడను గురుమల్లికార్జున పండితుఁడును ప్రసాదించిన 'యుద్దండమతి'తోఁ గృతిచేసెదనని చెప్పుకొని యుండుటచేతను, కవితనిది యుద్దండ లలితధారాళకవిత్వ మని యితరులు పొగడియుండుటచేతను, "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాట" అని శ్రీనాథుఁడు పొగడియుండుట మూలముననుఁ, కర్ణాటబస

బసవపురాణకర్త వేములవాడ భీమకవి యని పంతులుగారు నిశ్చయించి యున్నారు. కేవలము 'ఉద్దండ' శబ్దము నాధారముగా చేసికొనియిట్లు నిర్ణయించుట "బాదరాయణ" సంబంధ మగునేమో యని భయపడు చున్నాఁడను. మంచెన మల్లికార్జున పండితుల శిష్యుఁడైన భీమన మఱియొకఁ డని భావించుటయే సమంజసమని తోఁచుచున్నది. వేములవాడ భీమకవి యాపండితుల శిష్యుఁ డను ప్రతీతి లోకమున లేదు. మల్లికార్జున పండితుఁడు పన్నెండవ శతాబ్దివాఁడు.

కన్నడ బసవపురాణము క్రీ. శ. ౧౩౬౯ సంవత్సరమునఁబూర్తి యయ్యెననుట స్పష్టముగదా! అప్పటికా భీమకవికి నలువది సంవత్సరముల వయసుండెనని తలంచితిమేని, శ్రీనాథుఁడు ౧౩౬౦ సంవత్సర ప్రాంతమున జన్మించినవాఁడు కావున తనకంటె దాదాపు ముప్పది యేండ్లుమాత్రమే వయసునఁ బెద్దవాఁడైన భీమకవిని బూర్వకవినిగా నన్నయాదులతోపాటు నుతించునా యని సంశయము కలుగుచున్నది. కాని కన్నడ బసవపురాణకర్త వేములవాడ భీమకవి యని యితరకారణములచే ధ్రువపడి నప్పుడీ సంశయము నిలువఁజాలదు. శ్రీనాథుఁడు వేములవాడభీమకవిని నుతించిన గ్రంథము కాశీఖండము. శ్రీనాథుఁడు దానిని క్రీ.శ. ౧౪౩౫ ప్రాంతమున రచియించియుండెను. అప్పటికి బసవపురాణకర్త దాదాపు నూఱేండ్లక్రిందటివాఁడై యుండును. కావున నాతనిని శ్రీనాథుఁడు నుతించినాఁ డనుటలో విరుద్ధమేమియు నుండదు. కాని శ్రీనాథుఁడు కన్నడబసవపురాణమును జూచి, యా భీమకవిని, వేములవాడ భీమకవినిగా భావించి, యాతని నుతించినాఁ డనుటకంటె, నాతడు యేనృసింహపురాణమునో చదివి యందలి నృసింహావతార వర్ణనాదులను జూచి, యందలి కవికత్వమునకు మెచ్చుకొనియు నాతఁడు తిట్టుకవియు నిగ్రహానుగ్రహ సమర్థుఁడునై చెప్పిన పిడుగులవంటి చాటుధారలను వినియు నాతని కవిత్వలీల యుద్దండ

మైనదిగాఁదలంచి "యుద్దండలీల" యని నుడివినాఁడని చెప్పుట సమంజసముగా నుండును.

## సుమతీశతకము

ఈ భీమకవి సుమతీశతకమును రచియించె నని కొన్ని లక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములను బట్టి తెలియుచున్నది. అందొక పద్యమిది

క. కాదన్నవాఁడె కరణము
వా దడచినవాఁడె వేడి వసుధేశుకడన్
లేదన్నవాఁడె చనవరి
గాథలు పెక్కాడువాఁడు కావ్యుఁడు సుమతీ!

సుమతీశతక కర్త బద్దెన యని కొందఱనుచున్నారు వేములవాడ భీమకవి సుమతీశతకమును రచియించెనని చెప్పుటకుఁ బ్రబలములైన యాధారములు లేవు.

## కవిజనాశ్రయము

ఇఁక నీతఁడు రచియించె ననెడు కవిజనాశ్రయమును గూర్చి యాలోచింతము. భీమకవి ఛందశ్శాస్త్రము నొకదానిని రచియించి యుండెనని యెల్ల రంగీకరించియున్నారు. లక్షణవేత్తలు తమతమ లక్షణగ్రంథములలో భీమనఛందస్సునుండి పద్యముల నుదాహరించి యున్నారు. ఆ ఛందోగ్రంథముపేరు కవిజనాశ్రయము. ఈతని గ్రంథము లన్నిటివలెనే యీ కవిజనాశ్రయ కర్తృత్వముకూడ వివాదాంశమే యైనది. అనేక తాళపత్రప్రతులను విమర్శించి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు క్రి. శ. ౧౯౧౭ సంవత్సరములో నొక కవిజనాశ్రయ ముద్రితప్రతిని ప్రకటించినారు. అందు గ్రంథాంతగద్యమున "ఇది వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన కవిజనాశ్రయ

శ్రావకాభరణాంక విచిత్రంబైన కవిజనాశ్రయఛందంబునందు దోషాధికారము" అని యున్నది. (ఇందుసంజ్ఞాధికారము, వృత్తాధికారము జాత్యధికారము, షట్ప్రత్యయాధికారము, దోషాధికారము అని యైదధికారము లున్నవి) ఈగద్యయందు కవిబిరుదములే కాని కవినామము లేదు. కాని గద్యకు పైనున్న,

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పె జనులకుఁ దెలియన్.

అను పద్యమునుబట్టి కవి జనాశ్రయకర్త మల్లియకుమారుడైన రేచన యని తెలుచున్నది. అతఁడు సుకవి జనాశ్రయుఁడగుటచే గ్రంథమునకుఁ గవిజనాశ్రయమని పేరువచ్చెనని మనమూహింపవచ్చును. గ్రంథమునం దచ్చటచ్చట 'మల్లియ రేచా' యని సంబోధనము లుండుటచే, రేచనయే యాత్మసంబోధనము సేయుచు నీగ్రంథమును రచించెనేమో యని తోఁచును. కాని, వేములవాడ భీమకవియే యీ కవిజనాశ్రయమును రచించి, ద్రవ్యలోభముచే జైనవైశ్యుఁడైన రేచనపేరు పెట్టెనని పండితులభిప్రాయ పడుచున్నారు. ఇప్పుడు ముద్రితమైన ప్రతిలో భీమకవి పేరు లేనేలేదు. కృత్యాది ౪ వ పద్యములో

క. అనవద్యకావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియరే
చన సుకవి కవిజనాశ్రయ
మను ఛందముఁ దెనుఁగుభాస నరుదుగఁ జెప్పెన్.

అని రేచనపేరే యున్నది. కాని భీమకవిపే రందునులేదు. ఇది భీమనకవి కృతమని చెప్పుట కాధారమేమున్నది? ఈ ప్రశ్నకు సమాధానముగా ముద్రితప్రతియం దీక్రింది యేడుపద్యములుగల యవతారిక యొకటి చేర్పఁబడినది. ఈపద్యములు పరిషత్తువారికి లభించిన పది ప్రతులలోను ఒకప్రతిలో నున్నవఁట!

క. శ్రీవల్లభు యతిగణ సం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్,
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు మురారి భక్తితో వినుతింతున్. ౧

క. శ్రీకరముగ రేచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీఛందము
లోకంబా ననఁగఁ దెలుఁగులో నొనరింతున్. ౨

క. వేమనవాడ [1] ను వెలసిన
భీమేశ్వరుకరుణ గల్గు భీమసుకవి నేఁ
గోమటి రేచనమీఁదను
నీ మహిఁ గవులెన్న ఛంద మొలమి రచింతున్. 3

క. లచ్చన మెఱుఁగనికవులను
జిచ్చియని సుకవివరులు చేపట్టరు గా
మెచ్చరు వివేకి నృపతులు
మెచ్చిన యవివేకి నృపులు మిడుకరె రేచా! ౪

(1) 'వేములవాడ" అని సవరణ.

క. ఆ చంద్రతారకంబుగ
భూచక్రములోన సుకవి పూజిత మగుచున్
ఏ ఛంద మమరుచుండును
నా ఛందము నీదుపేర నమరును రేచా! ౫

క. రేచన సంతోషిల్లఁగ[2]
భూచక్రములోన భీమపురహరుకృపచే
[3] ఏఛందము సుకవులు బ్రదు
కేచందము తెరువు దాని నేరచియింతుఁ[?]. ౬

క. నినునీవె పొగడువైఖరి
నొనరించెదఁ దెనుఁగుబాస నొప్పగ ఛందం
బున గనక కవిత చెప్పిన
వినలచ్చనము వాఁడు వెంగలి రేచా! ౭

ఇవిగాక యాప్రతిలోనే మఱి రెండు పద్యము లున్నవఁట! అవి యనన్వయములుగా నుండుటచేత నందుఁ జేర్పఁబడిన భీమనకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింప వలనుగాక యవి పై యవతారికలోఁ జేర్చి ముద్రింపక పీఠికలో మరియొకచోట ముద్రించినారు. ఆ పద్యము లివి.

క. పరగిన విమలయశోభా
సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిల కళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై. ౧

(2) సంతోషింపఁగ యని సవరణ

(3) ఏఛందము సుకవులు బ్రతుకేఛందము తెరువు దాని నే రచియింతుఁ[?].

క. అసమాన దానరవితన
యసమానోన్నతుఁడు యాచకాభరణుఁడు ప్రా
ణసమాన మిత్రుఁ డీకృతి
కి సహాయుఁడుగా నుదాత్తకీర్తిప్రీతిన్. 3

ఈ పద్యము లన్నిప్రతులలోను లేక యొక ప్రతిలోమాత్రముండుటచే నివి యెవ్వరో లేఖకులు రచించి యాప్రతిలోఁ జేర్చి యుందురని సంశయము కలుగుచున్నది. ఇందలి మొదటిపద్యమించుక మార్పుతో ననంతుని ఛందమునం దున్నది. నాల్గవపాదములో తుదను "ననంత శయనుఁ దోయజనాభున్" అని యనంతుని ఛందమునందున్న దానిని మార్పుచేసి "మురారి భక్తితో వినుతింతున్" అని యీ యవతారికలోఁ జేర్చినాఁడు. దీనినిబట్టి యీ యవతారిక కవిజనాశ్రయకర్త గాక మఱి యెవ్వరో రచియించినట్లు గన్పట్టుచున్నది. అనన్వయము లని చెప్పఁబడిన పద్యములలో, భీమనగాక భీమన యగ్రసుతుఁడు సహాయుఁడుగా నీకృతి రచియింపఁబడినట్లు స్ఫురించుచున్నది. ఇది యంతయుఁ జూడఁగా మనకుఁ దెలియని రహస్య మిందిమిడియున్నట్లు తోఁచుచున్నది. చూడఁగాఁజూడగా బ్ర. వీరేశలింగముపంతులుగారనిన ట్లీకవి జనాశ్రయము వేములవాడ భీమకవికృతము కాదని దృఢపడుచున్నది. కవిజనాశ్రయ తాళపత్ర ప్రతులపై భీమనఛందస్సుఅని యుండవచ్చును. రేచనపేరుతో భీమకవియో భీమనాగ్రసుతుఁడో కవిజనాశ్రయమును రచియించి యుండవచ్చును కాని యతఁడు వేములవాడ భీమకవి యని యనుటకు ప్రక్షిప్తము లని యెంచఁదగిన పై యవతారికలోని "వేమనవాడ" యను పద్యముదక్క యితరాధారములులేవు. వేములవాడ భీమకవిని వర్ణించిన శ్రీనాథాదికవు లెవ్వరు నాతనిని లక్షణవేత్తయని చెప్పలేదు. అప్పకవి, కవిజనాశ్రయములోని

పద్యములను లక్ష్యములనుగా గైకొనెనే గాని కవిజనాశ్రయకర్త యెవ్వఁడో చెప్పలేదు. ఒకవేళ అప్పకవ్యాదిలాక్షణికులు కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి యని చెప్పినను, వారికి భీమపద్యము నొకరుగా భ్రమించి యుండవచ్చును. అయిన నివి యూహలే గాని సత్యములని చెప్ప వీలు లేదు.

కవిజనాశ్రయ తాళపత్ర ప్రతులను బరిశీలించినచో నవి విశేష పాఠభేదములతోఁ గూడి యున్నట్లు గన్పట్టుచున్నది. జాత్యధికారమున కందపద్యలక్షణము, ౩, ౪, ౫ పద్యములలోఁ జెప్పియు, పునరుక్తిగా ౬ వ పద్యమును జెప్పినారు. ఇదియించుక మార్పుతో తిమ్మకవికృత సులక్షణసారమునం దున్నది. దీనిని బట్టి ప్రతిలేఖకులు తమ యిచ్ఛవచ్చిన మార్పులను గావించిరనుట స్పష్టము. "ఎక్కటీవడిని" గూర్చి వ్రాసిన పద్యములో "కమలాధీశా!" యనియు, 'జననుతభీమశరూజా!' యని సంజ్ఞాధికారమున ౧౧ వ పద్యమునను సంబోధనము లున్నవి. ఇవి మల్లియరేచని కన్వయింపవు. "శ్రీదేవీపతిరేచఁడు" అని యీ గ్రంథమునఁ జెప్పఁబడి యుండుటచే నీ రేచని భార్య శ్రీదేవి యైయుండునని తోఁచుచున్నది. ఆపక్షములో 'కమలాధీశా' యనుశబ్దమీ రేచనయందు వర్తించిన వర్తింపవచ్చును. అప్పకవి రేఫశకట రేఫముల భేదమునుగూర్చి వ్రాయుచు,

తే. తెల్లునని ముందు భీమన చెప్పెననుచుఁ
గలుపుదురు రేఫములును ఱకారములును,
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద
లంటను నేల విభజింతురని తెలియరు.

క. వలసిన రేఫఱకారము
లంటవుఁ దా నొకటి కొక్కటని భీమనయే

పలుకుట గలిగిన వాతఁడు
గలిపినలక్ష్మి మొక్కలేనఁ గనఁబడకున్నే.

అనివ్రాసియున్నాఁడు ఈ భీమన యెవ్వఁడు ? కవిజనాశ్రయ కర్తయా? కవిజనాశ్రయమున రేఫఱకార విషయము గన్పట్టను. వేములవాడ భీమకవి చెప్పినను లోకోక్తిపై నాధారపడి వ్రాసిన పద్యములివి.

కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి కాఁడని బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారును, మానవల్లి రామకృష్ణకవిగారును, చిలుకూరి వీరభద్రరావుగారును నభిప్రాయపడి యున్నారు. అదియేసత్యమని నాయభిప్రాయము.

## హరవిలాసము

కస్తూరిరంగకవి తన యానందరంగరాట్ఛందమున భీమన హరవిలాసములోని వని యీక్రిందిపద్యముల నుదాహరించి యున్నాఁడు.

క. భువిలో మిత్రుం డగువాఁ
డవిరతియును వేఱులేక యాత్మీయమహో
త్సవము ఱకృత్యంబుల న
ధ్యవసాయం బెఱుకపఱుపఁ డను సంప్రీతిన్.

క. ఎంతయును దుస్తరంబు దు
రంతరసంసారవారిరాశి యఁట వెసన్
గంతుగొను మానవుండొక
యింత శివస్మరణ చేసి యేచినసూక్తిన్.

ఈభీమన యెవ్వరో తెలియదు. వేములవాడ భీమకవి హరవిలాసము రచించెనని యిదివఱకెవ్వరును జెప్పలేదు. విన లేదు. శ్రీనాథుఁ

ను రచించిన హరవిలాసమునం దీపద్యము లుండియుండునని చెప్పటకుని గాని యాందీపద్యములు కన్పట్టలేదు.

ఈ రంగరాట్ఛందమునందే యీక్రిందిపద్యములు భీమనఛందము లోనివని యుదాహరింపఁబడినవి.

క. వినఁబడు దీర్ఘము విషమను
ననిరొండివర్ణమ్ము సంయుతాక్షర మైనన్
మనుపటిగుణములు విడివడి
తనరఁ గవేతొక్కగుణముఁ దాల్చును బేర్మిన్.

క. అకచటతప లీయాఱును
ప్రకటితముగ ఋతులఁ గిరులఁ బదునొక్కంటన్
వికటముగఁ బూని చెప్పిన
నకటా మఱి మడియకుండ నజుఁడో హరుఁడో.

ఈ రెండును గవిజనాశ్రయమున లేవు.

### భీమకవిని నుతించిన యితర కవులు.

వేములవాడ భీమకవిని నుతించినవారిలో మొట్టమొదటివాఁడు శ్రీనాథుఁడే. అతఁడు తన కాశీఖండమున

సీ. వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు దిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు

పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శైవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు

నైషధాది మహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యపేర !

అని నుతించియున్నాఁడు. ఈ పద్యమునందలివరుస కాలక్రమము నుబట్టి యుండెనని భావించితిమేని, భీమకవి నన్నయభట్టునకుఁ బూర్వుఁడని చెప్పవలసి యుండును. కస్తూరిరంగకవి తన యానందరంగరాట్ఛందమున ఆదిమసుకవి భీమనకు దండము పెట్టి నన్నయభట్టుకు నర్థి మ్రొక్కి యని చెప్పుచు నన్నయభట్టునకు పూర్వమున స్తుతించియున్నాఁడు. ఈ గ్రంథమున నెచ్చట నీతని పేరు చెప్పవలసివచ్చినను, "ఆదిమకవి భీమన" యని వ్రాయుచు వచ్చినాఁడు.

ఈ భీమకవి నాదిమకవి యని వ్రాయుటకు కస్తూరి రంగకవికి శ్రీనాథుని పైపద్యమే యాధారమో, మఱియొక యాధారమేమయిన కలదో తెలియలేదు. పైనిజెప్పిన పద్యములకుఁదోడు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు భీమకవి నన్నయకుఁ బూర్వుఁడని చెప్పుటకు నందులకు నిదర్శనము కొఱకు వైలము భీమనపైని వేములవాడ భీమకవి చెప్పెనని చెప్పఁబడు "గరళపుముద్ద" చాటుధార నుదాహరించి వైలము భీమన శా. శ. ౯౩౫ సంవత్సరము నాఁటి వాఁడనియు నందుచే, భీమకవి నన్నయకుఁబూర్వుఁడనియు నిర్ధారణ మొనర్చియున్నారు. నన్నయకుఁబూర్వుఁడు కాకపోయినను, నాతనితో సమకాలికుఁడని చెప్పుటకు సత్యాసత్యములు నిర్ణయింపఁజాలని రాఘవపాండవీయకథ యొకటి యున్నది. దీనినన్నిఁటిని గలిపి చూచితిమేని భీమకవి నన్న

యీభట్టునకుఁ బూర్వపువాఁడేమో యని దృఢమైన యనుమానమేర్పడక మానదు. కాని, శ్రీనాథునకు బూర్వమునందున్న కవులెవ్వరు నీతని స్తుతింపకపోవుటచేత నీతఁడు నన్నయకుఁ బూర్వుఁడని యనుట కవకాశము లేకున్నది. నిజముగా నీతఁడు నన్నయకు బూర్వుఁడే యైనచోఁ దిక్కన, కేతన, పెద్దన మొదలగువారెవ్వరు నీతని నుతింపకుండుటకుఁ గారణముగుపడదు. శ్రీనాథునకుఁ దరువాతివార లనేకు లీతనిని దమతమ గ్రంథములలో స్తుతించి యుండుటయు శ్రీనాథునకుఁ బూర్వపుఁ వా రీతనిని దలపెట్టకపోవుటయుఁ జూడ నీతఁడు శ్రీనాథున కించుక పూర్వుఁడో, శ్రీనాథునితో సమకాలికుఁడో యై యుండునని తోఁచును. కాని, కవులు నుతింపని కారణమున నీతని నర్వాచీనుఁడని సిద్ధాంతీకరించరాదు. కవులు తలపెట్టకపోవుట కనేక కారణము లుండును. నన్నెచోడుని నుతించినకవులే కన్పడరు. అట్లనియాతనిని నవీనుఁడని తలంపరాదు కదా! ఈభీమనకవిని స్తుతించిన కవులపద్యములను గొన్నిఁటి నీ క్రింద నుదాహరించుచున్నాఁడను.

క. భీమేశ్వరుఁ డీతఁడు మా
నామమువాఁ డనుచు వ్రాసె నాలుకతుద వా
గ్భామిని బీజాక్షర మా
భీమనఁ దలఁచినను గల వభీష్టఫలంబుల్

పట్టమట్టి సరస్వతీ సోమయాజీ - పృథుచరిత్రము

క. వేములవాడక సుఖియై
వేములవాడం జరించి వేములవాడన్
దా మెఱసిన భీముని నుత
భీముఁ బలభీము వినుతభీముఁ దలఁతున్.

కొఱవిగోపరాజు - విక్రమార్కచరిత్ర

"రమణీయ పాకాభిరామ భీమ"

కట్టమూరి కామేశ్వరకవి 'కర్మవిపాకము'

"భీమనిఘణిబంధ పేశలంబు"

పొత్తపి వెంకటరమణకవి 'లక్షణశిరోమణి'

"ప్రథమకవిస్వాంతభీమభీమ"

పిండిప్రోలు లక్ష్మణకవి — 'లంకావిజయము'

"వాక్ప్రతిష్ఠితదక్షవాటీమహాస్థానభీమ, వేములవాడభీమ"

పెదపాటి సోమనాథుఁడు 'అరుణాచలపురాణము'

"ఛందో నిబంధనచాతురీధౌరేయ వాగ్ధామ వేములవాడభీమ"

ఆంధ్రకవిరామయ్య — విష్ణుకాంచీమహాత్మ్యము"

ఇతని చాటుధారలు: కాలము

దురదృష్టవశమున నీతనిగ్రంథము లేవియు లభింపక పోవుటవలనను, లభించిన గ్రంథములీతనివగునో కాదో యని యనుమానాస్పదములుగ నుండుటచేతను భీమకవిని గూర్చిన సత్యాంశము లేవియు మనకుఁ దెలియలేదు. ఇఁక నీతఁడు రచించినవని చెప్పెడు చాటుధారలున్నవి. వానివలన నీతఁడు తిట్టుకవి యనియు. నిగ్రహానుగ్రహసమర్థుఁడనియుఁ దెలియునే కాని యీతని కవిత్వగుణము గాని యీతని కులగోత్రాది విషయములు గాని తెలియవు. ఆచాటుధారలనుబట్టి యీతని కాలమును నిర్ణయింపఁగలమేమో చూడవలసియున్నది. ఆ చాటుధారలయొక్క కర్తృత్వముకూడ వివాదాంశమే.

ఆచాటుధారలివి :—

౧. మైలమ భీమనపైఁ జెప్పినది.

౨. చోక్కనృపాలునిపైఁ జెప్పినవి.

౩. కళింగ గంగుపైఁ జెప్పినవి.

౧. నల్లసిద్ధిపైఁ జెప్పినది.

౧. తెలుంగాధీశునిపైఁ జెప్పినది.

౧. త్యాగిపోతరాజుపైఁ జెప్పినది.

వీనినిట క్రమముగా విమర్శించి చూతము.

౧. మైలము భీమనపైఁ జెప్పినది.

అప్పకవ్యాదులు భీమన చాటుధారయని

చ. గరళపు ముద్దలోహ మవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటికరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణ గుణాభిరాముఁడగు మైలము భీమన ఖడ్గసృష్టికిన్.

లక్షణవేత్తలు తమగ్రంథములయందు వ్రాసిన వ్రాఁతలుదక్క వీపద్యము వేములవాడ భీమకవి రచించెననుట కాధారములు లేవు మైలము భీమన విజయనగర సంస్థానాధీశు లగు పూసపాటివారి మూలపురుషుఁడైన మాధవవర్మ సంతతిలోనివాఁడని, ఓరుగంటి సోమశేఖరకవి తన రామకృష్ణార్జునరూపనారాయణీయ కృత్యాదియందు చెప్పియున్నాఁడు.

"ఈ మైలము భీమనశాసనము అమరావతిలోని అమరేశ్వరుని దేవళముపై నున్నట్లును, అది శాలివాహనశకము ౧౨౭౫ సంవత్సరమైనట్లును "Elliot Morbles" అను పుస్తకమువలనఁ గాన్పించును." అని గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవిజీవితములలో వ్రాసియున్నారు.

ఈపద్యమునే ద్వాత్రింశన్మంత్రి చరిత్రములో ఖడ్గతిక్కన[1] వారి త్రమున నుదాహరించుచు, నీపద్యమందలి "భీమన"యను పేరునకు బదులుగా తిక్కనయని యుంచి, యీపద్యమును వేములవాడ భీమకవి

1 ఖడ్గతిక్కనను గూర్చి తెలిసికొనవలసియున్నచో నీగ్రంథమున తిక్కన సోమయాజికవి చరిత్రమునఁ జూడుఁడు.

ఖడ్గతిక్కనపై రచియించె ననియు, ఖడ్గతిక్కన తల్లి ప్రోలాంబయని యు, పెంపుడు తల్లి మైలాంబ యనియు, వ్రాసియున్నారు. కాని యీకథ విశ్వాసార్హమైనది కాదు. ఈఖడ్గతిక్కనకే రణతిక్కనయని నామాంతరము. ఇతఁడు రణములో నిహతుఁడైనప్పుడాతని భార్య భీమకవికి నమస్కరింపఁగా నాతఁడామెను "దీర్ఘసుమంగలీభవ" యని యాశీర్వదించి,

క. గుణముల విధాన మగుమన
రణతిక్కఁడు తాఁగళేబరంబును శిరముఁ
గణకమెయిఁగలయఁ బ్రతుకును
బ్రణుతాఖిల వైరిమకుట భాసితపదుఁడై.

అను పద్యమును జెప్పి శిరమును మొండెము నేకముగాఁ జేర్చి యా తనిని బ్రదికించెననియు నొకకథ చెప్పెదరు. కాని యిదియు విశ్వా సార్హమైనది కాదు. రణతిక్కన శిరసును దన పాతివ్రత్య ప్రభావముచే దెలిసికొని దానితో నాతనిభార్య సహగమనముచేసెనని ప్రతీతికలదు. కాని యాతిక్కన మరలఁ బ్రతికెనని యెవ్వరును జెప్పలేదు. వినను లేదు. కావున నీ "గరళపుముద్ద" వేములవాడ భీమకవి రచించినది కాదని చెప్పవచ్చును.

౨. చొక్కనృపాలునిపైఁ జెప్పినవి—౩.

ఈ భీమకవి చాటుధారలు, చొక్కనృపాలునితో సంబంధించి నవి మూఁడుకలవు. చొక్కరాజనునాతఁ డొకనాఁడుద్యానవనములో మల్లెసాలస్తంభముమీఁదఁ గాలు చాచుకొని కూరుచుండి యచ్చట నున్న భీమకవిని జూచి యీ స్తంభమును మరల వృక్షమునుగాఁ జేయఁ గలవా యని యడుగఁగా నతఁడీక్రిందిపద్యమును జెప్పెనట!

శా. ఆ సీతాఘ్న్యపదాన శృంఖల పదాభ్యాలంబిత స్తంభమా!
నేనే వేములవాడ భీమకవి నేనిం జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోన్నవమహాపుష్పోప గుచ్ఛంబులన్
నానాపక్వఫల ప్రదాయి వగుమా నాకల్పవృక్షాకృతిన్.

అంతట నా పందిరిగుంజ కొమ్మలతోను బత్రములతోను చిగుళ్ళతోను పుష్పములతోను ఫలములతోను పూర్వ మరణ్యములో నున్నట్లు మహావృక్షమై యా రాజు కాలు దానిలోపల చిక్కువడి పోయెనట. అక్కడ నున్నవారందఱు నాకవిశక్తికత్యాశ్చర్యమగ్నమానసులైరట. అప్పుడు రాజు తనకాలూడఁదీసికొనలేక మరల నావృక్షమను పందిరి కంబముగా జేయవలయునని భీమకవిని బ్రార్థింపఁగా నతఁడు

ఉ. శంభువరప్రసాదకవి సంఘవరేణ్యుఁడ నైన నావచో
గుంభన చేయ నెంతొ యనుకూలత నొంది తనూన భావనన్
గుంభినిఁ జొక్క నామనృపకుంజరు పందిటిమల్లె సాలకున్
స్తంభము రీతి నీతనువుఁ దాలిచి యెప్పటియట్లయుండుమా!

అనుపద్యమును జెప్పి మరలయథాపూర్వకముగా పందిరి స్తంభమును గా మార్చివేసెనఁట"

ఈ చొక్కనృపాలుఁ డెవ్వరో తెలియుటలేదు. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు "పైపద్యములోని "శృంఖల పదాభ్యాలంబిత" యను వాక్యమును దీసికొని "శృంఖలుఁ"డని మొదటిపద్యములోను, చొక్కనృపాలుఁ"డని రెండవపద్యములోను చెప్పిన వారిరువురు నొక్కపురుషుఁడనియు, నీరెండునుగూడఁ గళింగదేశాధిపుని జేక్లనియు, కళింగ పట్టణమునకు 'శృంఖలా'దీవి యని పేరున్నదనియు జెప్పుచు నామముల కుదాహరణముగా భీమకవి రచించినదియే యని యీక్రింది సీసపద్యము నిచ్చియున్నారు.

సీ. యోజనద్వయ విశాలోన్నతిం జెలువొందు
పట్టణం బనరు శోభావిభూతి
హాటకరత్న కవాటానుమోదమై
సూటి మించును గంచుకోట మహిమ
నూటొక్కగుళ్ల చెన్నుగ శివానందమై
నిత్యోత్సవక్రీడ నెమ్మిఁ దనరు
వంశధారానదీవారాశిసంయుత
సాగరగంభవిస్రంభ మమరఁ

తే. గడిఁది రాజకళింగ భూకాంతునకును
దనరు నవలక్షకాళింగ మనఁగ నొప్పి
శృంఖళద్వీప మనఁగఁ బ్రసిద్ధిమించు
గణనకెక్కెఁ గళింగపట్టణము ధాత్రి.

శ్రీరామమూర్తి పంతులుగారే యొకచోట, 'ఇతఁడు చళుక్యవంశపు రాజగు చొక్కనృపాలుసభ నున్నట్లు కొన్నికొన్ని పద్యంబులచేఁ గాన్పించుచున్నది. ఆ చొక్కనృపాలుఁడు రాజరాజ నరేంద్రుని వంశజుఁడు." అని వ్రాసియున్నారు. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులు గారు "రాజనరేంద్రుని యనంతరమునఁ జోళులు వేఁగిదేశము నాక్రమించు కొన్న తరువాత పంద్రెండవ శతాబ్ద మధ్యమునఁ దెనుఁగు దేశములోఁ గొంతభాగమున రాజ్యము చేయుచుండిన చళుక్య వంశజుఁడగు చొక్క రాజు కాలమునందు భీమకవి యున్నట్లు కొందఱు చెప్పుచున్నారు." అని వ్రాసి యున్నారు.

అప్పకవి, యీక్రిందిపద్యము భీమకవి చాటుధార యని అప్పకవీయములో నుదాహరించియున్నాఁడు.

ఉ. చక్కదనంబు తీఱియగు సాహిణిమాఱఁడు మాకు నైకవడిన్
చొక్కపడంగఁ గలంతు చలము న్బలముంగల యాచళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కుల మంటలు రాలఁజూచి
నన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికి వచ్చిన రిత్తపోవునే.

ఈ పద్యము వేములవాడ భీమకవి రచించెనని యనుట కప్పకవి వ్రాఁతతప్ప మఱియొక యాధారము లేదు. ఇది భీమకవి కృతమని మనము నమ్మితిమేని, భీమకవి కాలములోనే, ఇరువురు చొక్కనృపాలురుండుట యసంభవము. కావున, నీపద్యములోఁ జెప్పఁబడిన చొక్కనృపాలుఁడును, పైపద్యమునకు సంబంధించిన చొక్కనృపాలుఁడును, ఒక్కఁడే యనుటకు సంశయింప నక్కఱలేదు "చళుక్యపుం జొక్కనృపాలుఁడని చెప్పుటచే నాతఁడు చాళుక్య వంశములోని వాఁడని యొప్పుకొనక తప్పదు. పశ్చిమ చాళుక్యులలోఁ గాని, తూర్పుచాళుక్యులలోఁగాని, నేనెఱిఁగియున్నంతవఱకు చొక్కనృపాల నామధారులెవ్వరును లేరు. కాని నెల్లూరు మండలములోని గూడూరుతాలూకాలో రెడ్డిపాలెమునకు 'శివారు' గానున్న పాండురంగ మునందలిపాండురంగాలయములోనున్న శాసనములలో నొకదానియందు "చొక్కనాయనారని నామాంతరముగల కులోత్తుంగ చోళుని" పేరుతో నొకశాసనమున్నది (నె. శా. సం. ౪౪౬ వ పుట సంఖ్య ౯౬) ఈ శాసనము పూర్తిగాఁ బ్రకటింపఁబడక పోవుటచే, నీకులోత్తుంగ చోళుఁ డెవ్వఁడో, ఈతని కాలమెద్దియో, తెలిసికొనుట కవకాశము లేకపోయినది. కులోత్తుంగచోళులు మువ్వురున్నారు. మొదటి యాతఁడు శా.శ ౯౯౧-౧౦౩౮ మధ్యను రెండవయాతడు ౧౦౫౪-౧౦౬౭ వ నడుమను, మూఁడవవాఁడు ౧౧౦౦-౧౧౭౭ మధ్యను

రాజ్యము చేసినవారు. చోక్కనృపాలునకు వైరియని పై పద్యములోఁ జెప్పఁబడిన సాహిణిమారఁడు ప్రతాపరుద్రుని సేనాధిపతియని చెప్పఁబడినట్టి సాహిణిమారఁడని యెంచితిమేని, యాతఁడు పైని జెప్పిన ముప్పురు కులోత్తుంగ రాజుల కాలములోను లేక వారిలో మూఁడవ యాతనికిఁ బిమ్మట దాదాపు ఎనుబది సంవత్సరములలో నున్నవాఁడు. కావున నీపద్య మర్ధములేని దగుచున్నది. ప్రతాపరుద్రుని కాలము నాఁటికి చాళుక్యవంశ మంతరించిపోయినది. చాళుక్యవంశములోని చోక్కనృపాలుని తీసికొనినచోఁ బ్రతాపరుద్రుని సాహిణిమారయను వదలివేసి యంతకుఁ బూర్వమున మఱియొక సాహిణి యున్నాఁడని తలంపవలసియున్నది. ఆపక్షములోఁ బైనిజెప్పిన ముప్పురు కులోత్తుంగ చోళులలోను, మొదటియాతఁడు. భారతకృతిపతియు, చళుక్యవంశపు రాజచంద్రుఁడు నగు రాజరాజుయొక్క కుమారుఁడగుటచే నాతఁడే చళుక్యపు చోక్కనృపాలుఁడనియుఁ, దక్కినయిరువురు. చోడులుగాఁ బరిగణింపఁబడిరనియు, మొదటియాతనికే చోక్కనాయనా రను నామాంతర మున్నదనియు నూహింపవచ్చును. ఈ యూహలు సత్యము లయ్యెనేని, యాతనిపైఁ బద్యములను జెప్పినభీమకవి శా. శ. ౯౯౭-౧౦౩౭ (క్రీ. శ. ౧౦౭౫-౧౧౦౮) మధ్యనున్న వాఁడని చెప్పవచ్చును. కాని దీనికొక యభ్యంతరము గన్పట్టుచున్నది.

భీమకవి మొట్టమొదట నీచోక్కనృపాలుని దర్శనమునకు వెళ్ళి నప్పుడు నీవే రేమియని ప్రశ్నింపఁగా

"సీ. గడియలోపలఁదాడి కడఁగి మ్రుత్తునియఁగాఁ
దిట్టినమేధావిభట్టు కంటె
రెండుగడెల బ్రహ్మదండి మండ్లన్నియు
డుల్లఁదిట్టిన కవిమల్లు కంటె

మూఁడుగడియలకు మొనసి యత్తినగండి
పగులఁ దిట్టితికవిభానుకంటె
నరజాములోపలఁ జెఱువు నీళ్లింకంగఁ
దిట్టినబడబాగ్ని భట్టుకంటె
నుగ్రకోపి నేనునోపుదు శపియింపఁ
గ్రమ్మఱింప శక్తిగలదు నాకు
పట్టిమ్రానఁ జిగురుపుట్టింప గిట్టింప
బిరుదవేములాడ భీమకవిని."

అని ప్రత్యుత్తరమిచ్చెననియు, నందుమీఁదట పందిరిస్తంభమును వృక్షమును గావింపుమని యాతఁడడిగె ననియు నొకకథ కలదు కాని యది నమ్మఁదగినది కాదు. ఈపద్యము భీమకవికృతము కాదు. మహాకవియయిన భీమకవి "వేములవాడ" యని ప్రయోగించి యుండఁడు. శ్రీనాథుఁడు వేములవాడ భీమకవిని బొగడియుండుటచే భీమకవి శ్రీనాథునకుఁ బూర్వుఁడనుట నిశ్చయముకదా! పైసీసపద్యములోని మేధావిభట్టును ప్రౌఢకవి మల్లనయు శ్రీనాథునకుఁదరువాతివారు. మేధావిభట్టు తాటిచెట్టును భూమిపైఁబడుమని తిట్టినపద్యమిది:—

క. సాళువపెదతిమ్మమహీ
పాలవరుఁడు వీఁడె వచ్చెఁబద్యముగ్రాయున్
గేలను లే దాకొక్కటి
తాళమ ముత్తునియలగుచు ధరపైఁబడుమా!

ఈపెదతిమ్మభూపాలుఁడు పదునైదవశతాబ్దియందలివాఁడు. ప్రౌఢకవి మల్లన బ్రహ్మదండిచెట్టున ముళ్లు డుల్లునట్లు రచించిన పద్యమిది:—

క. గుడియన్న నృపతిఁ బొడఁగన
నడువంగాఁ గొండపల్లి నగరిపడమటన్

గుడిరొండమమడమఁ గాడిన
చెడుముండలు బ్రహ్మదండిచెట్టున ఁదుల్లున్.

ఈమల్లన క్రీ. శ. 15 వ శతాబ్ది ప్రాంతమువాఁడని యాతనిచరిత్ర మునఁ జెప్పియున్నాఁడను. భీమకవి వీరికంటెఁ బూర్వుఁడని నిశ్చయ మైనప్పుడు వీరేశలింగముపంతులుగారనినట్లు 'అప్పకవీయములో నుదా హరింపఁబడిన పైపద్యముల నన్నిటిని జదివి నడుమను గొంత తనకవి త్వముపెట్టి వ్యాకరణ జ్ఞానముచాలని యిటీవల మహాకవి యెవ్వఁడో భీమకవిపేరుపెట్టి యీపద్యము నల్లియుండు"నని స్పష్టమగుచున్నది. ఈ పద్యము భీమకవిది కాదనుట నిశ్చయము. ఇట్టిపద్యమువలన సత్య మును గనిపెట్టుటలో చరిత్రకారులకు మఱింతకష్టము కలుగుచుండును. ఈ పద్యములను దీసివేసినచోఁ బైని జెప్పినకాలము నిర్బాధకముగ నుండును.

(3) కళింగగంగుపైఁ జెప్పినవి—౪

ఈ భీమకవివని చెప్పెడు కళింగ గంగరాజుతో సంబంధించిన పద్యములు నాలుగున్నవి. భీమకవి కళింగగంగు దర్శనార్థమై పోయి "కవీశ్వరుఁడు వచ్చె"నని చెప్పుమని ప్రతీహారితోఁ జెప్పి పంపఁగా నచట నున్నవారిలో నొకరు, ఆకవిపేరెవరో తెలిసికొని రమ్మని యాతనిని మరలఁ బంపనందుపై భీమకవి యీక్రిందిపద్యమును వ్రాసి యిచ్చెనఁట!

క. శాపానుగ్రహపటువును
దాపాఁడెడికవుల నెత్తిదంపంబనఁగా
భూపాలసభలఁ బూజ్యుఁడ
నాపేరే భీముఁడండ్రు నరవరవినుమా!

ఈపద్యమును జూచి కావ్యాంతర నిమగ్నుఁడైయున్న రాజు "యిప్పు డు సందడిగానున్నది. సంకడిలీతిచతరువాత నిమ్మ" ని చెప్పు. పొమ్మ అనియెనఁట! భీమకవి యామాటలను విని కోపించి,

ఉ. వేములవాడ భీమకవి వేగమెచూచి కళింగగంగు తా
సామముమాని కోపమున సందడి దీఱినరమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోషమిఁక ముప్పదిరెండు దినంబులావలన్
జామునకర్థమున్ దతనిసంపద శత్రులఁ జేరుగావుతన్.

అనుపద్యమును జెప్పెనఁట! ఆవాక్యము శాపమయి తగులఁగా శత్రురాజు లాతని రాజ్యమాక్రమించుకొని యాతనిని వెడలఁగొట్టిరఁట; తరువాత నతఁడు శత్రుభీతిచేత మాఱువేషముతో నూరూరఁ దిరుగుచు నొకనాఁటిరాత్రి చీకటిలో భీమకవి యింటిముందఱి పాఁతరగోతిలో గాలుజాఱిపడి, అంతబ్రతుకు బ్రతికిన మహారాజున కిప్పు డొక్క కాలిదివ్వెటియైన లేకపోయె నే యని ఖేదపడెను. అప్పుడు పాదప్రక్షాళనమునకయి వెలుపలికి వచ్చిన భీమకవి యామాటలు విని నీవెవ్వడ వని యడుగఁగా నేను వేములవాడ భీమకవి చేసినజోగినని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అందుమీఁద భీమకవి

చ. బిసరుహగర్భువ్రాఁతయును, విష్ణునిచక్రము వజ్రివజ్రమున్
దెసలను రామబాణము యుధిష్ఠిరుకోపము హానిశాపమున్
మసకఁపుఁబాముకాటును గుమారునిశక్తియుఁ గాలుదండమున్
బశుపతికంటిమంటలును బండితవాక్యము రిత్తవోవునే.

అని పలికి యాతనిపైఁ గరుణించి,

ఉ. వేయి గజంబులుండఁ బదివేలతురంగములుండ నాజిలో
రాయలఁ గెల్చి సజ్జనగరంబునఁ బట్టము కట్టుకోవడిన్

రాయకళింగగంగ కవిరాజు భయంకరమూర్తి చూడఁ దాఁ
బోయిన మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠినాఁటికిన్.

అనుపద్యమును మరలఁజెప్పి యాశీర్వదించెను. ఈ యాశీర్వచన ప్రభావముచేత నాతఁడు భాగవతులలోఁ గలసి సజ్జనగరమునకుఁబోయి, అక్కడిరాజు తనశత్రువు నవమానించుటకయి రాజకళింగగంగు వేషము వేసెదరా యని భాగవతులనడుగఁగా వారియొప్పుకొండని చెప్పి రాత్రి వేళ తానావేషమువేసికొని, వేషమునిమిత్తమని తనఖడ్గమును గుఱ్ఱమును రాజువలనఁ బడసి యశ్వారోహణముచేసి యాటనెపమున నిజముగా రాజకళింగగంగే వచ్చెనని జనులాశ్చర్యపడ రాజును సమీపించి తనచేతి ఖడ్గధారతో నాతనిశిరస్సు ఖండించి తాను సింహాసనమెక్కి కూరుచుండెను.

ఈపద్యములు నాలుగు నొకరాజునకు సంబంధించిన వగుటచే నిందెంతవఱకు సత్యమున్నదని యోచించిచూతము. ఇందుకొఱకు మనకు 'కళింగగంగు' అనురాజును, అతనిని జయించిన రాయలును, సజ్జనగరమును గావలయును. ఈవిషయమునఁ గవిజనాశ్రయముద్రిత ప్రతి పీఠికలో శ్రీ జయంతి రామయ్యపంతులుగారిట్లు వ్రాసియున్నారు.

"ఈ పద్యములును జాటువులే కాఁబట్టి ప్రబలప్రమాణములు కావని తోఁపవచ్చును చాటువులేమైనను భీమకవికృతములని యన్ని మతములవారు నేకగ్రీవముగ నంగీకరించి యుండుటచేతను, మొదటి పద్యములో భీమునపేరుండుటవలనను నీపద్యముల ప్రామాణ్యమును బాధించుహేతువులు లేకుండుటనుబట్టియు వానినాధారముగా గ్రహించుట కాక్షేపముండఁగూడదని నాయభిప్రాయము ఈపద్యములలోఁ గళింగ గంగు రాయకళింగగంగునని పేర్కొనఁబడిన రాజెవ్వఁడో నిర్ణయింప వలయును. ౧౧౧ వ శతాబ్దము మొదలు రమారమి యఱువదిసంవత్స

రములు కళింగదేశము ననంతవర్మ యనునామాంతరము గల చోళ కళింగ గంగదేవుఁడు పాలించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఈ రాజు కాలమునఁబుట్టిన మూఁడు తామ్రశాసనములు "ఇండియన్ ఆంటిక్వరీ" అను పత్రిక ౧౮ వ సంపుటములోఁ బ్రకటింపఁబడియున్నవి. వానిలో నీతని పట్టాభిషేక కాల మిట్లు వివరింపఁబడినది.

శకాబ్దే నందరంధ్రగ్రహగణగణితే (౯౯౯) కుంభసంస్థే దినేశే
శుచేపక్షే తృతీయా యుజిరవిజదినే రేవతీభే నృయుగ్మే
లగ్నే గంగాన్వవాయాంబుజవనదివకృ ద్విశ్వవిశ్వంభరాయా
శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధి రధిపశ్చోడగంగో భిషిక్తః

ఈ కాలమునందే, రాజరాజచోడగంగనురాజు వేంగీదేశమును పాలించుచుండెను. ఇతఁడు రాజరాజనరేంద్రుని పౌత్రుఁడు. కాంచీపురము రాజధానిగా వేంగీచోళదేశముల నేకచ్ఛత్రముగా నేలిన కులోత్తుంగ చోళుని యగ్రపుత్రుఁడు. తండ్రి యాజ్ఞానుసారముగ వేంగీదేశమును బాలించెను. అతఁడు ౧౦౦౬ వ శకాబ్దమునం దభిషిక్తుఁడైనట్లు ఎపిగ్రాఫియాఇండికా యనుపత్రిక ౬ వ సంపుటమునఁ బ్రకటింపఁబడిన టేకిశాసనమునందిట్లు చెప్పఁబడి యున్నది.

"శాకాబ్దేరసఖాంబరేందుగణితే (౧౦౦౬) జ్యేష్ఠేమాసేసితే
పక్షే పూర్ణతిథౌ దినే సురగురో ర్జ్యేష్ఠాం శశాంకే గతే
సింహే లగ్నవరే సమస్తజగతీ రాజ్యాభిషిక్తో ముదే
లోకస్యా ద్యహాతిస్మ పట్ట మనఘః శ్రీరాజరాజో విభుః

ప్రస్తుత విచారమునకు భీమన కాశ్రయుఁడైనరాజు వీరిరువురిలో నెవ్వఁడైన నొక్కటియే. కాని కళింగగంగనుసంజ్ఞ యనంతవర్మ చోడగంగదేవునకే సార్థకమగును. అతఁడు ౯౯౯ వ శకసంవత్సరమాదిగా నించుమించు ౬౦ సంవత్సరములు రాజ్యము చేసెను.

భీమకవి యాతని రాజ్యకాలము పూర్వభాగములో నుండెననిన ౯౨౮ శకాబ్దమునఁ బట్టాభిషిక్తుఁడైన రాజరాజునాస్థానకవియగు నన్నయభట్టు నకు రమారమి ౧౦౦ సంవత్సరముల తరువాతివాఁడగును. భీమకవి యనంతవర్మ రాజ్యాపసానదశయందుండె ననుకొన్నచో మఱి ముప్పది నలువది సంవత్సరముల తరువాతివాఁడగును. కాని, శ్రీరామమూర్తి గారనుకొనునట్లు నన్నయభట్టుకంటెఁ బ్రాచీనుఁడు కాఁడు. వీరేశలింగ ము పంతులుగారెంచినట్లు ౧౨ వ శతాబ్దమువాఁడును గాఁడు. ౧౨ వ శతాబ్దారంభము వాఁడగును."

వీరేశలింగము పంతులుగారీ కాలము నంగీకరింపక, సాహిణి మారనియొక్కయు, చోక్కనృపతి యొక్కయు కాలమే భీమకవి కాల మని నిర్ణయించి, భీమకవిపైనిజెప్పిన కళింగగంగుకాలమువాఁడు కాఁ డనియు తరువాతనున్న వేఱొకకళింగగంగు కాలములో నుండియుండు ననియు, ఎంచవలసి యున్నదని వ్రాసియున్నారు శ్రీరామయ్యపంతు లుగారు చూపిన యాధారములు నాకును దృప్తికలిగింపలేదు. ఇంక నేమయిన శాసనాధారములు లభించునేమో యని శాసనసంపుటము లను బరికింపగా నీకవి కాలనిర్ణయమునకుఁ దోడుపడునట్లుగాఁగనుపట్టిన రెండుశాసనములు నాకంటఁబడినవి. ఇవి రెండును గోదావరీమండ లములోని ద్రాక్షారామ భీమేశ్వరాలయము నందున్న శిలాశాసనములు (ద. హిం. శా. సం. ౪ సంఖ్య. ౧౩౬౩-౧౧౫౩) వివాదాంశమగుట చే పాఠకుల సౌకర్యముకొఱకు వానిని బూర్తిగా నిట వ్రాయు చున్నాఁడను.

## No. 1363

"...... శ్రీమతి సంధివిగ్రహిపదః శ్రీ చోడగంగప్రభోః కాయస్థాన్వయ వార్ధివర్ధనవిధో రాసీత్కలానాన్నిధేర్నా.........

రేచ్చనామ యస్య విదితః శ్రీబద్దనామా పితా శాకాబ్దే గణితే గణేశశరవ్యోమేందుభిః పుణ్యాశ్చ స్థానె రామశివాసిసే భగవతే దీపం ప్రదీపద్యతిః భీమేశాయ సనక్షిణాయనదినే ప్రాచా దఖణ్డజ్వలం శ్రీమాన్ రేచననామధేయ విదితః ప్రత్యక్షకల్పద్రుమః॥ శకవర్ష ౧౦౩౦ స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజుల ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సర ౩౯ శ్రాహి. దక్షిణాయన సంక్రాంతిం ద్రికలింగ్గేశ్వ రుని సన్నిధివిగ్రహి రేచన అఖండవర్తి దివియ ౧ దీనికి నాచంద్రార్క ము నెయి పరియించువారు గాంగిలరమున వెద్దియబోయు నాయవ యుం గాటియబోయు నాయయును దొడ్డియబోయు బదియయు తల రాసిగా నావియ బెరసిన బోలు నల్వురుం బూన్టగాం ప్రోలబోలనా వియవసమున......"

## No. 1153

"జయతి వినయవర్తిత్యాగసత్యప్రసూతస్థిరతరగుణలక్ష్మీశ్రీకర్మనిర్మాణదక్షః నిజవిశదయశః శ్రీ ......మకేస్మి స్నిజవంశ వారిధిలసచ్ఛీ జ ంశు రింసస్థలభాగ్రిజ ద్విరదమా రిదంసు రనఘః శ్రీబుద్ధవర్మనృపః జి.........భుజాసిఖణ్డిత రిపుస్తోమ ........నీ దానసముద్ర ఇత్యతులిత ప్రఖ్యాత నామోన్నతః (౨) తద్వంశజేష్వథగుణ వ్రజసంయుతేషు గచ్ఛ త్స్వనేక ధరణిజన వల్లభేషు శ్రీకొణ్డ్యదేసటి రభూ ద్విపులేషు శ్రీదుర్జ యాన్వయ లసద్గృహ రత్నదీపః (౩) కణ్డ్రివాడివిషయంచ్చ సకొణ్డ కోనరాష్ట్ర మలబద్ధలితాలిః రాజలాంచ్ఛనసమున్నత ముద్య(ద్రాజభీమ ధరణీశ్వరరత్నాత్ (౪) తస్మాత్ ఖ్యాతవిచార శ్చజాతః పోతస్సుతో త్తమః తస్యానుజో మహాతేజా భీమో భీమపరాక్రమః ॥౫॥ రాయః కొణ్డోనఖో గణ్డః కేతః పోత సుతోత్తమః బాదః పశుపతి ర్గణ్డ ఇత్యాసు స్తనయా స్తతః ॥౬॥ త త్రాసీ న్మహనీయకీర్తి లతి కాకాన్దాల

వాలోలోల్ల సత్తౌజన్యాది మహాగుణైకవసతిః శ్రీకోనపోతః కృతీ
జిత్వాయ స్త్రీకలింగ్గ వల్లభమహో రాజేంద్రచోడాంయ వైప్రాదా
ద్దుర్జయ వంశరాజ తిలకః కాలింగ గణ్డద్విపాణ ॥౭॥ యఃకులోత్తుంగ
చోడస్య కానుజ్యే నాలభద్విభుః వెంగ్గీంద్రనామదేయంచ వేంగీగ్రామ
సహస్రకం ॥౮॥ తస్య జ్యేష్ఠోమహాతేజా రాజరాజన్నృపోత్తమః తత్పుత్రః
పోతభూపాల శ్శత్రుహంత్రా భవద్భువి॥౯॥ పుత్రో తస్యయశోధవస్య
సుమతేః పోతస్య చూడామణే ర్భూప.......వదుర్జయాన్వయవతాం
శ్రీరాజరాజాధిపః తొణ్డ....రితో....యే ష్వవధిఃః క్రూరారినిర్దారణ
ప్రాణ్డశ్చణ్డపరాక్రమో వితనుతే కీర్త్యానమో ఘోర్వ్య మ్మదా ॥౧౦॥
లక్ష్మీరివప్రియతమా.......వశేశ్వదురగాధిప భూషణస్య పెద్దాంబికాస్య
ధః శ్వే.......నిజకులాంబుధి చంద్రలేఖా జాతః ప్రతాప.......దమ
ధ్యస్థః శశ్వద్భీమేశ్వరో హరః కైలాస.......ప్రతిపిణ్ణ మలంజహౌ॥౧౧॥
శాకాబ్దేచంద్రశైలాంబర శశిగణితే మేషసంక్రాన్తికాలే....ప్రయాతస్య
భీమము క్తత్వర్ధమ్ స్వానుజస్య త్రిభువనగురవే దీప మాచంద్రతారం
దాక్షారామాధిపాయ స్థిరతర మదిశద్భీమనాథాయ భక్త్యాశకవర్ష
౧౦౭౧ శ్రీకులోత్తుంగ్గ చోడదేవర విజయరాజ్య సంవత్స ౧౭ శ్రాహి
విష్ణువు సంక్రాన్తినిమిత్తమున శ్రీమన్మహామండలేశ్వర కొనకణ్డ్రివాడి
భీమయ తనతమ్ముణ్డు పోతయకు ధర్మార్థముగా శ్రీభీమేశ్వర మహా
దేవరకుం బెట్టిన అఖణ్డవర్తి లోహదణ్డుది ౧ టికి బోలు నలువరుం
బూట్టుగా రెణ్డవు నడపున ముదువన నావని వసమూనం బెట్టిన ఇనుప
ఎడ్లు ౫౦ టికి నిత్యపడి గొలవంగల త్రిభువనాంకుశనేతిమాన ౧.
లికితసూరాచార్యాణాం॥

౧౩౬౩ సంఖ్య గల శాసనములో, త్రికళింగాధిపతియైన చోడ గంగు నొద్ద మంత్రిగా నుండిన కాయస్థుఁడగు రేచన ద్రాక్షారామ భీమేశ్వరున కఖండదీపము నేర్పాటుచేసినట్లు చెప్పఁబడి యున్నది.

భీమకవి యీగంగునుద్దేశించి "రాయకళింగగంగు" అను పద్యమును రచించియుండెనా యని యోచింపవలసియున్నది. కవిజనాశ్రయ పీఠికలో నిరువురు గంగులను గూర్చి చెప్పఁబడినది. ఒకఁడు మహాభారత కృతిపతి యైన రాజరాజునకుఁ బౌత్రుఁడు. రాజేంద్రచోళుఁడని నామాంతరము గల కులోత్తుంగ చోళునకుఁ బుత్రుఁడు. ఇతఁడు ఒక్క సంవత్సరము మాత్రమే వేఁగి సింహాసనమునందుండి, పినతండ్రి దల్లిదండ్రులను వదలియుండుట కిష్టములేక చోళదేశమున నున్న తండ్రికడకుఁ బోయెను. అతఁడిచటకు మరల రాలేదు. అందుచే నీచోడగంగు పైనిజెప్పిన ౧౩౬౩ వ సంఖ్యగల శాసనములోని గంగుగాఁడు.

కవిజనాశ్రయ పీఠికలోని రెండవగంగు అనంతవర్మయనునామాంతరము గలిగిన చోడగంగు ఇతఁడు శా. శ. ౯౯౯ వ సంవత్సరములోఁ బట్టాభిషిక్తుఁడై దాదాపు డెబ్బది సంవత్సరము లవిచ్ఛిన్నముగా రాజ్యముచేసిన మహాపరాక్రమశాలి. ఈతని శాసనములు పెక్కులున్నవి. ఈతని శాసనము లన్నిటియందును శ్రీమదనంతవర్మ విజయ రాజ్య సంవత్సరముల సంఖ్య యుదాహరింపఁబడియున్నది. కొన్నిటియందు శాలివాహన శకాబ్దము లీయఁబడినవి. ఈతఁడు శా. శ. ౯౯౯ వ సంవత్సరమున నభిషిక్తుఁడైనట్లొక శాసనమునందుఁ జెప్పఁబడియున్నను శాసనములయం దీయఁబడిన విజయరాజ్య సంవత్సరముల లెక్క శా. శ. ౯౯౬ నకు సరిపోవుచున్నది. ఈ భేదవిచారణ మిట ననావశ్యకము— కొన్నిశాసనములయం దీతనిని త్రికళింగాధిపతి యని కూడాఁ జెప్పబడి యున్నది. చోడగంగునామము కూడ నీతనికికొన్ని శాసనములయం దీయఁబడినది. స్థూలదృష్టిచేఁ జూచినప్పు డీతఁడును పైని వ్రాయఁబడిన రేచనశాసనమునం దుదాహరింపఁబడిన గంగుడు, ఒక్కఁడే యని తోఁచును కాని విమర్శించి చూచినచో వీరిరువురును భిన్నవ్యక్తులని స్థిరపడును. అనంతవర్మ చోడగంగు శాసనములలో, అనంతవర్మ విజయరాజ్య సంవత్సరములే యుదాహరింపఁబడినవి.

కాని ఒక్కదానియం దైనను విష్ణువర్ధనరాజుల విజయసంవత్సరము లుదాహరింపఁబడి యుండలేదు. అనంతవర్మ, వేఁగిరాజుల యాధిపత్యము నంగీకరించినట్లు గనఁబడదు. చాళుక్యరాజులలో విమలాదిత్యుఁడు (రాజరాజుతండ్రి) వేంగి సింహాసన మధిష్ఠించిన కాలమువఱకు మాత్రమే కళింగదేశాధిపతులు వేంగిదేశాధిపతులకుఁ గప్పములు గట్టుచున్నట్లును రాజరాజు కాలములో వేఁగి ప్రభుత్వమును ధిక్కరించి కప్పములను గట్టుట మానివేసినట్లును చరిత్రలవలనఁ దెలియుచున్నది. శేవనశాసనము శా శ ౧౦౩౦ సంవత్సరము నాఁటిది. అందు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల విజయరాజ్య సంవత్సరములు ౩౬ అని యుదాహరింపఁబడినది. ఆకాలముననే పుట్టబడిన యనంతవర్మ శాసనములలో ననంతవర్మ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములని యున్నదికాని విష్ణువర్ధనరాజ విజయసంవత్సరముల నీయలేదు. అందుచే నీయుభయులు నొక్కరుగారని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇప్పటి గోదావరిమండలమున కీశాన్యముగ నున్న బస్తరు రాజ్యమును జయపురము సంస్థానములోని కొంతభాగమును పూర్వము త్రికళింగమని పిలువఁబడుచుండెడి దనియు దానికి, చక్రకూటము రాజధానియనియు చరిత్రకారులు వ్రాసియున్నారు.

పైని వ్రాసిన రెండవశాసనమును గూర్చి విచారింతము. దుర్జయ రాజవంశజుఁడైన కొండరాజనునాతఁడు భీమరాజువలన కణ్డ్రివాడి విషయము కోనరాష్ట్రమును పొందెను. అతని వంశవృక్షమిది:—



ఈశాసనము నాల్గవ పోతరాయనికొఱ కాతనియన్నయైన భీమ రాజు, వ్రాయించినది. శాసనకాలము శా. శ. ౧౦౭౧ సంవత్సరము. పైవంశవృక్షము నందలి భీమరాజు కుమారుఁడైన రెండవ పోతరాజు త్రికళింగాధిపతిని జయించి, కళింగ దేశపు మదవృతేనుగులను దెచ్చి రాజేంద్రచోడున కిచ్చినట్లును, అందులకా కులోత్తుంగచోడుఁడు సంత సించి యా కోనపోతరాజునకు వేఁగీంద్రుఁడను పేరును, వేఁగిదేశమంద లి వేయి గ్రామములను ఇచ్చినట్లును చెప్పఁబడినది. శాసనకర్త కోనపోతరాజు పినతాత శాసన కాలము నుండి యేఁబది సంవత్సరము లను దీసివేసినచో శా.శ. ౧౦౨౦ ప్రాంతమున పోతరాజు త్రికళింగాధి పతిని జయించినాఁడని చెప్పవచ్చును. ఈ రెండు శాసనములను గలిపి చదివినచో, నీపోతరాజు రేచనశాసనమునందలి చోడగంగును జయిం చి, భారతకృతిపతియైన రాజరాజు కుమారుఁడగు రాజేంద్రచోడుఁడని నామాంతరము గల కులోత్తుంగచోడునకు సామంతునిగాఁజేసి తాను వేఁగిదేశము నందలి కొంతభాగముపై నధికారమును సంపాదించెనని తెలుచున్నది. ఈకులోత్తుంగ చోడునకు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజని బిరుదునామమున్నది. ఈ బిరుదునామము నుదాహరించిన యీకులోత్తుంగచోడుని శాసనము లనేకములున్నవి. ఈతని రాజ్యా రంభకాలము శా. శ. ౯౯౧ వ సంవత్సరము. అప్పటినుండి లెక్క చూచినచో రేచనశాసనకాలము ౩౯కి సరిపోవుచున్నది. ఈ త్రిలింగా ధిపతి యైన చోడగంగు అంతకుపూర్వము కళింగరాజులక్రిందనో, చేదిదేశాధిపతుల క్రిందనో సామంతుఁడుగా నుండియుండును. రాజ రాజు జీవితకాలములో యువరాజుగానున్న రాజేంద్రచోడుఁడొకసారి త్రి.౪౦౧, చేదిదేశములపై దండువెడలి వారినిజయించి విశేషధనమును అసంఖ్యాక గజములను దెచ్చియుండెను. రెండవసారి యీకోనపోత

రాజు త్రికళింగాధిపతిని జయించి యాతనిని కులోత్తుంగచోళునకు సామంతునిగాఁ జేసెను. ఈ చోడగంగు యొక్క పూర్వోత్తర విషయములతోడను, పోతరాజు యొక్క వంశావళితోను మనకిపుడు ప్రసక్తిలేదు. ఈ త్రికళింగగంగునే భీమకవి చూడఁబోయి యవమానితుఁడై "రాయకళింగగంగ" అను పద్యమును జెప్పియుండును. ఆశాపోక్తిదేనైనను గాకపోయినను కోనపోతరాజుచే గొంత కాలమాతఁడు రాజ్యభ్రష్టుఁడైయుండును. భీమకవిచెప్పిన "వేయిగజంబులుండ" అను పద్యములో "రాయలుఁ గెల్చి" అనువాక్యములోని 'రాయలు' కోనపోతరాజున కగ్రజుఁడై రాజ్యభారమువహించిన రాయలై యుండును. (పైవంశవృక్షమును జూడుఁడు) ఈపద్యములోని సజ్జనగరము, త్రికళింగదేశములోని యేదైన పట్టణమైయుండును. లేదా చక్రకూటమునకు నామాంతరమై యుండును. లేదా పద్యములోని సజ్జనగరము 'చక్రనగరమునకు' బదులుగా పాఠకుల నోళ్ళులంబడి సజ్జనగరమై యుండును. ఈ శాసనములనుబట్టి భీమకవి కాలము క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ అని చెప్పవచ్చును. విమర్శాదక్షక బిరుదాంకితులగు నడకుదుటి వీరరాజు పంతులుగారు భారతి సం॥ ౧౧ భా ౧. పుల ౩౫౫ లో, కళింగదేశప్రభువగు అనంతవర్మ చోడగంగ దేవుఁడే భీమకవిచే శపింపఁబడి యనుగ్రహింపఁబడినవాఁ డనియు. నాతఁడు శా శ. ౯౯౯ వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై యుండె ననియు, శా. శ. ౧౦౧౩ సం॥ మీన మాసమున బహుళపంచమీ దివసంబున ౩౦౦ మంది బ్రాహ్మణులకు ఖోన్న (కోర్ని) గ్రామమును దానము చేసి నట్లొక శాసనము కలదనియు, భీమకవి రాజునను గ్రహించి చెప్పిన "వేయిగజంబులుండ" అను పద్యములోని "మీనమాసమునఁ బున్నమ వోయిన షష్ఠినాటికిఁజ" అను వాక్యములయందలి తిథియును, శాసనమునందలి తిథియును, సరిపోయినవనియు కవియనుగ్రహముచేఁ బునః

రాజ్యము తనకు సంప్రాప్తమైన సంతోషమునకే యీ రాజు బ్రాహ్మణులకు సమ్మానించి యగ్రహారము నొసంగెననియు వ్రాసి యున్నారు. కాని యీ యనంతవర్మ "రాజ్యభ్రష్టుఁ"డయ్యెననుటకు నిదర్శనములు లేవు. ఈతని శత్రువు రాయరాయధాయఁడను గన్పట్టుట లేదు. కాకతాళన్యాయమున మీన బహుళ పంచమినాఁడు బ్రాహ్మణుల కొక యగ్రహారము నిచ్చుటయు, భీమకవి చెప్పిన పద్యములో "మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠి" యని యుండుటయు సంభవించినంతమాత్రమున ననంతవర్మ చోడగంగు భీమకవిచే శపింపఁబడిన వాఁడని నిర్ధారణము చేయుటకుఁ దగినబలము చాలదు.

ఈ యనంతవర్మ చోడగంగు కాలచుర్య రాజగు రత్నదేవుని వలన నోడింపఁబడెనని చరిత్రకారు లనుచున్నారు. అతఁడు రత్నదేవుఁడు కాని రాయలుకాఁడు. అనంతవర్మ విజయరాజ్య సంవత్సరము లవిచ్ఛిన్నముగా నీయఁబడుటచే నాతఁడు కొంతకాలము రాజ్యభ్రష్టుఁ డయినట్లును గన్పట్టదు. కాలచుర్యుఁడగు రత్నదేవునితో జరిగిన యుద్ధము, పైని జెప్పిన శా. శ. ౧౦౦౩ నకు తరువాత చాలకాలము నకు. అందుచే శ్రీవీరరాజు పంతులుగారి యూహ నిరాధారమైనది.

## (ర) నల్లసిద్ధిపైఁ జెప్పినది ౧.

భీమకవి నృసింహపురాణములోనిదని లక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములో "వాండిమినల్లసిద్ధి జనవల్లభుఁడొప్పెన రాజు భీతుఁడై" యనినపద్యము. (ఈపద్యము పైని వ్రాయఁబడినది.) నందలి నల్లసిద్ధినిబట్టి భీమకవి కాలమును నిర్ణయింపవచ్చునేమో చూతము. ఇతఁడు నృసింహపురాణ కృతిపతియై యుండును. కృతిపతి వంశములోని పూర్వుఁడై యుండుననుటకు కూడ నవకాశము

కలదు. కాని ప్రస్తుతము కృతిపతియే యనుకొందము. మధురాంతక పొత్తపిచోళులలో, నల్లసిద్ధియను నాతఁడున్నాఁడు. ఈ పొత్తపిచోళులనుగూర్చి నన్నెచోడుని చారిత్రమున వ్రాసిన వాక్యములనుజూడ నగును. ఈనల్లసిద్ధి మహారాజు శాసనములు నెల్లూరు మండలములో గనబడుచున్నవి. (నె. శా. సం. పుటలు 219, 406 432, 836, 853) ఇతఁడు భారతకృతిపతియైన రాజరాజకుమారుఁడగు కులోత్తుంగచోడదేవుని సామంతుఁడై నట్లా శాసనములలోఁ గులోత్తుంగుని పేరుదాహరింపఁబడి యుండుటనుబట్టి తెలిసికొనఁదగియున్నది. కొందఱితనిని మూఁడవకులోత్తుంగుఁడని యందురుకాని యాశాసనములయందుఁ జెప్పఁబడిన బిరుదములనుబట్టి మొదటి కులోత్తుంగచోడుఁడని నేనూహించుచున్నాఁడను. శా. స. ౧౧౨౮ నాటి యొకశాసనమునం దింకొక నల్లసిద్ధి యున్నాఁడు. కాని, యందు కులోత్తుంగుని నామములేదు. ఈనల్లసిద్ధికి మధురాంతక పొత్తపిచోళ బిరుదములేదు. పైనల్లసిద్ధి శాసనములు శా. శ. ౧౦౨౦-౧౦౩౫ నడుమనున్నవి. నృసింహపురాణము భీమకవికృతమై, యాగ్రంథము నల్లసిద్ధికో యాతని మంత్రులకో కృతి యీయఁబడిన నూహించితిమేని భీమకవి యా కాలమునం దున్నమాట నిశ్చయమేకదా? పైనిజెప్పిన కళింగగంగుకాల యీకాలముతో సరిపోవుచున్నది. ఈ యూహలు సత్యములయ్యెనేని భీమకవి కాలము క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ అగును.

గోదావరీమండలమువాఁడైన భీమకవి ఇటు తూర్పునకు త్రికళింగమునకుఁ బోయి కళింగగంగును దిట్టుటయు, నటు పశ్చిమమునకు మూఁడు నదులను దాఁటి నెల్లూరునకుఁ బోయి నల్లసిద్ధికిఁ గృతి యిచ్చుటయు చేయఁగలిగెనా? యని సంశయము కలుగవచ్చును. కాని

యిది యొక యాక్షేపణము కాఁజాలదు. పాకనాఁటివాఁడైన శ్రీనాథుఁడు, కర్ణాటకమునఁ గనకాభిషేకమంది, నిజాము రాష్ట్రమునందలి రాచకొండలో సత్కారమును బడసి మూఁడునదులను దాఁటి రాజమహేంద్రవరము వచ్చి కృతులనీయలేదా?

(౫) తెలుంగాధీశుని పైఁ జెప్పినది ౧.

వేములవాడ భీమకవి మఱియొక చాటుధార యిది:—

మ. ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ దాక్షారామ భీమేశనం
దనుడన్ దివ్యవిషామృత ప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాదిసుగంధ వస్తువులు వేగందెచ్చి లాలింపురా!

శ్రీనాథకవి కూడ నిట్టిదే యొక చాటుధారను రచించి యున్నాఁడు ఆపద్యమిది :—

శా. ఒక్కయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాట్బృందారక శ్రేణికిన్
దాక్షారామ పురీవిహారవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

కాకతాళీయముగ నీ కస్తూరిదాత రెండుపద్యములలోను, తెలుంగాధీశుఁడే యయినాఁడుగాని శ్రీనాథుని తెలుంగాధీశుఁడు సాంపరాయని కుమారుఁడు, భీమకవిదాత యెవ్వరి తనయుఁడో చెప్పలేదు. శ్రీనాథుఁడొక్క కస్తూరినే యాచించినవాఁడు. భీమకవి ఒక్కకస్తూరినే యడుగలేదు. కస్తూరి, మంచిగంధము మొదగుల సుగంధ ద్రవ్యములను శీఘ్రముగాఁ దెచ్చి లాలింపుమని యాదేశించినాఁడు. ఇచ్చిన

కస్తూరియొక్క వినియోగమును శ్రీనాథుఁడు తెల్పినాఁడు. వానిచేఁ దనను బూజింపుమని మాత్రమే చెప్పినాఁడు. ఈ తెలుంగాధీశులిద్దరును ఒక్కరేయని తలంచుటకుఁ దగిన యాధారములు లేవు. తెలుఁగు రాయ నామధారులు పెక్కురున్నారు. శ్రీనాథుని తెలుంగాధీశునిఁ గూర్చి యాతని చరిత్రమున వ్రాయుచున్నాఁడను. శ్రీనాథుని తెలుంగాధీశుఁడు కవులకుఁ గస్తూరికాదానము సేయుటలోఁ బ్రఖ్యాతివహించినవాఁడయినట్లు ధ్వని వినవచ్చుచున్నది. భీమకవి తెలుంగాధీశున కట్టి ప్రఖ్యాతి యున్నట్లులేదు. తెలుఁగురాయ నామధారులు పెద్దాపురం సంస్థానాధిపతులగు వత్సవాయివారి పూర్వులలోనే యిరువురున్నట్టు ఏనుఁగు లక్ష్మణకవి రచించిన రామవిలాసములోని యీక్రింది రెండుపద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగా రుదాహరించి యున్నారు.

క. ఆ మాచనృపతిసుతుఁడు మ
హామహుఁ డెలిపోతన క్ష్మాధీశ్వరుఁ డా
శ్రీమంతు సుతులు జగదభి
రాములు శ్రీ తెలుఁగురాయ రామనరేంద్రుల్.

మ. అచలాధీశ్వర ధీర రేకపలి దుర్గాధ్యక్షు విద్వేషిరా
ట్ప్రచయోద్వేల బలావలేప తిమిరప్రద్యోతనున్ విక్రమా
ర్క చరిత్రోత్తమ కావ్యనాయకుని వేడ్కం బ్రస్తుతింపందగున్
సుచరిత్రాఢ్యుని వత్సవాయ తెలుఁగుక్షోణీశ చూడామణిన్.

ఇందులో మొదటి తెలుఁగురాయలు గుడిమెట్ట త్యాగి పోతరాజునకు మనుమని మనుమఁడు. రెండవ తెలుఁగురాయలు మొదటి తెలుఁగురాయల కగ్రజుని కుమారుఁడు. వీరిరువురిలో నెవరికాలమునందు భీమకవి యున్నాఁడన్నను త్యాగి పోతరాజునకును భీమకవికిని సంబంధ ముండదు. వీరిరువురును గాక యింకను మఱికొందఱు తెలుఁగురాయ

లున్నారు. మడికిసింగన కవిశాస్త్రయుండైన ముప్పడినాయకునితండ్రి కూడ తెలుంగురాయండే. ఇతండు క్రీ. శ. పదునాలుగవ శతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాండు. నెల్లూరు శాసన సంపుటములలో ౧౧౮౪-౧౨౦౫ పేజీలలోని శాసనములయందలి తెలుంగురాయం డొకండుకలండు. ఇతండు సాంబువరాయల కొడుకు. శా.శ. ౧౨౮౯-౧౨౯౦ ప్రాంతములయం దున్నవాండు. ఇంకను వాఙ్మయమును, శాసనములను బరికించినచో మఱికొందఱు తెలుంగురాయ నామధారు లు లభింపవచ్చును. భీమకవి యేం దేతెలుంగురాయలను సంబోధించె నో తెలిసికొనుట కవకాశము లేదు. ఇంతకు నీపద్యములోని 'తెలుంగాధీశ' యను పదమునకు 'కళింగాధీశ' యను పాఠాంతర మున్నదని కొందరు చెప్పుచున్నారు. అది సత్యమయ్యె నేని, తెలుంగురాయ నామధారు లను వెదకినలాభము లేదు. రాయకళింగ గంగున కీ పద్యము నయువర్తిం పంజేసి ఆతని దర్శనమునకుం బ్రథమమున వెళ్లినప్పుడో, ఆతనిని తిరిగి యనుగ్రహించిన పిమ్మటనో భీమకవి యాతనిని సంబోధించుచు నీ పద్యమును జెప్పియుండునని యూహించితిమేని, యాకళింగగంగు కాలమే భీమకవికాల మని నిర్ణయించి యూరకొనవచ్చును. తెలుంగా ధీశ "పదమునకు "తెలంగాధీశ" "తెలంగాధీశ" యను పాఠాంతరములు కలవని చెప్పుచుం గొంద ఱాశబ్దముల నాధారముగాం జేసి కాలనిర్ణ యము చేయం దొడంగిరి. కాని యవి తృప్తికరములుగాం గన్పడ లెదు. కళింగాధీశుండు పైనిజెప్పిన త్రికళింగాధిపతియేయని యనుకొంటిమేని క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ నడుమ భీమకవి యున్నాండని తేలుచున్నది.

(౬) త్యాగిపోతరాజుపైం జెప్పినది ౧.

వీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున "భీమన దేశసంచారము వెడలినప్పుడు తనగుఱ్ఱము గుడిమెట్టులోని పోతరాజు

పొలములోఁ బడఁగా రాజు దానిని కట్టిపెట్టించి విడువకున్న మీఁదట భీమన యాతనిని తిట్టినపద్యమని యొకటి చదువుదురు. ఆపద్యము వెల్లూరి తిరుమలయ్య చెప్పిన ట్లప్పకవి చెప్పుచున్నాఁడు. కాని ఈ ప్రాంతములయం దది భీమకవిదిగానే చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్నది. గుడిమెట్ట పాలించినది చాగి (సాగి) పోతరాజుగాని శ్రీపతిరాజు పోతరాజు కాఁడు ఈపోతరాజు పెద్దాపురం సంస్థానాధిపతులగు వత్సవాయవారికి మూలపురుషుఁడు. గుడిమెట్ట యనుగ్రామము కృష్ణామండలములోని నందిగామకు నైఋతిమూలను నాలుగు క్రోశముల దూరమున నున్నది. ఇది పూర్వము చోళవంశపురాజులలో నొక తెగవారికి రాజధానిగా నుండెను. ఆకాలమునందు గుడిమెట్టకు రాజుగానుండిన త్యాగిపోతరాజు బ్రాహ్మణులకును దేవాలయములకును బహుమాన్యము లిచ్చెను. త్యాగి పోతరాజు శా. శ ౧౧౨౧ అనఁగా హూణశకము ౧౧౯౯ వ సంవత్సరమున (విజయవాడ) బెజవాడలోని మల్లేశ్వరస్వామికి భూమి యిచ్చినట్లు కనకదుర్గగుడి స్తంభములలో నొక దానిమీఁద వ్రాయఁబడియున్నది. ఆకాలమునం దీయన పేరుగల శిలాశాసనము లనేకములు కానవచ్చుచున్నవి. అందు ౧౨౧౨ సంవత్సరములో నొకటి యనుమంచిపల్లెలోను, ఇంకొకటి నడికూడిలోను, ౧౨ ౩ లో నొకటి బెజవాడలోను, మఱియొకటి గుడిమెట్టలోను, ౧౨౩౦ లో మూఁడు నవాబుపేటలోను బహుశాసనము లున్నవి. గుడిమెట్టలోని యొకదానిలో పోతరాజు రాజేంద్రచోడుని కొడుకై నట్లున్నది. పోతరాజు త్యాగశీలుఁడని విని భీమకవి యక్కడికిపోయి నప్పుడు రాజాతనిగుఱ్ఱమును కట్టి పెట్టించి విడువక పోఁగా,

చ. హయ మది సీత; పోతవసుధాధిపుఁ డారయ రావణుండు; ని
శ్చయముగ నేను రాఘవుఁడ; సహ్యజ వారిధి; మారుఁడంజనా

ప్రియతనయుండు లచ్చిన విభీషణుఁ డాగుడిమెట్టలంక; నా
జయమును బోతరక్కసుని చావును నేడవనాఁడు చూడుఁడీ

అను పద్యమును జెప్పి రాజును శిక్షించెనని పెద్దలు చెప్పెదరు." అని యింతదూరమువ్రాసి, పిదపఁ దామేర్పరచుకొనిన కాలమున కిది సరిపోవదను కారణముచే "అప్పకవి చెప్పిన ట్లీపద్యము రెల్లూరి తిరుమలయ్య చేసినదే యయి యుండవచ్చు" నని వ్రాసి యీకథను తీసివైచిరి. కాని భీమకవి కాల మితర కారణములచే నిర్ధారితమై యీ కథ దానికి తోడుపడునట్లు కన్పట్టెనేని, ఈకథ భీమకవితో సంబంధించినది కాదని త్రోసివేయ నక్కరలేదని నా యభిప్రాయము.

చాగి పోతరాజులు ముగ్గురున్నారు. వీరేశలింగము పంతులుగారు పైనుదాహరించిన శాసనములు రెండవ పోతరాజువి. రెండవ పోతరాజునకు మొదటి పోతరాజు పితామహుఁడు. మొదటి పోతరాజు కుమార్తెయైన పోతులదేవి యొక్కయు, మంత్రియైన కనలియ సింగన ప్రెగ్గడ యొక్కయు తమ్ముఁడైన కల్లయనాయకుని యొక్కయు శాసనములు శా. శ. ౧౦౭౯- ౧౦౮౨ లో (ద. హిం. శా. సం ౬ సంఖ్య ౨౧౮; ౨౪౭) గన్పట్టుచున్నవి. వీనినిబట్టి మొదటి పోతరాజు కాలము శా. శ. ౧౦౪౦-౧౦౫౦ ప్రాంతమై యుండును. భీమకవి తిట్టిన దీపోతరాజునే యని యూహించితిమేని భీమకవి కాలము క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ అని పైనిజెప్పిన కాలముతో సరిపోవుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నిత్యాగి పోతరాజు వంశవృక్షమిట నీయలేను.

## కా ల ని ర్ణ య సా రాం శ ము లు

ఈ కవి కాలనిర్ణయమునగూర్చి యింతవఱకుఁ జేసిన విమర్శనములోఁ దేలినసారాంశములివి.

౧. ఇతఁడురచియించినవని చెప్పెడు నృసింహపురాణ శతకంధర రామాయణములు కనపడుటలేదు. కన్నడ బసవపురాణములు కనపడుట లేదు. కన్నడబసవపురాణ కవి జనాశ్రయము లీతనివి కావు.

౨. ఇతఁడు శ్రీనాథునకుఁ బూర్వుఁడనుట నిశ్చయము.

3. "గరళపుముద్ద" "గడియలోపలఁ దాడి" యను పద్యము లీతనివి కావు.

౪. కన్నడ బసవపురాణము నాధారముగాఁజేసికొని, యాంధ్ర కవుల చరిత్రనిర్ణయించిన యీతనికాలము (క్రీ. శ. ౧౩౪౦-౫౦ ప్రాంతము) సరియైనది కాదు.

౫. కవిజనాశ్రయ పీఠికలోఁ జెప్పఁబడిన చోడగంగు లిరువురు లో నెవ్వఁడును భీమకవి చెప్పిన రాయకళింగగంగు కాఁడు.

౬. త్రికళింగాధిపతియని శాసనములలోఁ జెప్పఁబడిన గంగు భీమకవి జెప్పిన రాయకళింగగంగు అగునెడల, ఆశాసనములనుబట్టి భీమకవి క్రీ. శ ౧౦౯౮- ౧౧౦౮ లో నున్నవాఁడగును.

౭. చాళుక్యప్రచాళుక్యరాజు మొదటి కులోత్తుంగుఁడని, రెంచి సాహిణిమారఁడు రెండవప్రతాపరుద్రుని సేనాపతి గాక, మఱియొకఁ డని యంగీకరించితిమేని, యప్పుడు భీమకవి కాలము క్రీ. శ. ౧౧౦౦ ప్రాంతమగును.

౮. "కాయమదిసీత" యను పద్యములోని గుడిమెట్ట చాగి పోతరాజు మొదటి పోతరాజైనచో భీమకవికాలము క్రీ. శ. ౧౧౧౦- ౧౧౨౦ అగును.

౯. నృసింహపురాణములోని పద్యమందలి నల్లసిద్ధి శాసనముల లోని కులోత్తుంగుఁడు మొదటికులోత్తుంగుఁడని రెంచితిమేని, ఆశాస నములనుబట్టి భీమకవి క్రీ. శ. ౧౦౭౮-౧౧౧౩ మధ్యనున్నవాఁడగును.

౧౦. "ఘనుఁడన్" అను పద్యములోని "తెలుంగాధీశ" యను దానికి "కళింగాధీశ" అను పాఠాంతరము నంగీకరించినచో భీమకవి క్రీ. శ. ౧౧౦౦ ప్రాంతమం దున్నవాఁడగును.

ఈ విమర్శనమును బట్టి భీమకవి కాలము క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ నడుమనున్నవాఁడని యంగీకరింపవచ్చునని నా నిశ్చితాభిప్రాయము. ఇత రాధారము లేవియైన లభించి మార్పు చెందిన నేతప్ప భీమకవి కాలమిదియే యని యంగీకరింతము.

పైని జెప్పిన ౧౩౫౩ సంఖ్యగల శాసనకర్తయగు రేచన, కవి జనాశ్రయ ప్రణీతకవి యగు రేచన యేమో! అని యూహించితిని కాని, అతఁడు కాఁడని తేలినది. శాసనకర్త రేచనతండ్రి శ్రీకంఠుఁడు. కవి జనాశ్రయ రేచన తండ్రి మల్లియ. సంశయాత్మకములైన ౩-౮ పద్యములును చాటుధారలును దక్క నీమహాకవి గ్రంథములలోని పద్యములను చదివిచూడఁజాలకపోవుట విచారకరమైన విషయము.

ఈ భీమకవి శాపానుగ్రహ సమర్థతను దెలుపు కథలనేకములు (గ్రంథరూపమునఁగూడ) ప్రచారములో నున్నవి. అవి యాతనికాల నిర్ణయమునకు గాని పాండిత్యమును దెలుపుటకుఁ గాని తోడుపడునవి కాకపోవుటచేతను, ఇదివఱకే యీతని చారిత్ర మతి విస్తరమగుట చేతను, నాకథలు సత్యములని యనుట కాధారములు లేకపోవుటచేతను వాని నిటఁ జెప్పలేదు.



## దుర్గేశనందని [ఆఱవముద్రణము] 2-8-0

చక్కని నవల విమల సమయజ్ఞత - ప్రభుభక్తిపరాయణత; జగత్సింగుని ఔదార్యము. ధైర్యసాహసములు వర్ణనాతీతములు. మదాసు టెక్ట్సుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుచేయబడినది.

## నవాబునందిని [పునర్ముద్రణము] 2-4-0

రచయిత:- శ్రీచాగంటి శేషయ్యగారు.

దుర్గేశనందినియందలి మిగిలిన కథావిశేషములన్నియు "నవాబునందని" యందు చదువవలయును.

## రాధారాణి [పునర్ముద్రణము] 0-8-0

నిరుపేదబాలిక 'రాధారాణి' గొప్పధనవంతుడు దేవేంద్రనారాయణరాయి. దైవికసమావేశము—వీరిరువురి ప్రణయగాథ.

## నూతన గ్రామపంచాయితీల చట్టము

## (1950 సం॥ నెం 10 రు ఆక్టు రు 8-0-0)

1950 సంవత్సరములో నూతనముగా మదాసు గవర్నమెంటు వారిచే చేయబడిన గ్రామపంచాయితీల చట్టము అంతయు చక్కని తెలుగుభాషలోనికి తర్జుమా చేయబడి ప్రతి సెక్షనుకును విపులమగు వ్యాఖ్యానము వ్రాయబడెను.

తెలుగుదేశపు ప్రజలకు మంచి తెలుగులో ప్రకటింపబడిన ఈ పుస్తకమునే అన్నిపంచాయితీలు ఉపయోగించుకొనుచున్నవి ప్రతి గ్రామపంచాయితీయందును యీపుస్తకము తప్పక ఉండవలయును. కావున వెంటనే మీకాపీలకు ఆర్డరు పంపించగోరుచున్నాము.

## విశ్వప్రియత్నము [పునర్ముద్రణము]

ఇందలిరంగములును, పాత్రములును నాంధ్రదేశమునకు సంబంధించినవి కథాకల్పనము, పాత్రగుణపోషణము మొదలగునవి యిందు జక్కగా ప్రదర్శింపబడినవి. ఇదిసాంఘికనవలయైనను, నపరాధపరిశోధక నవలాలక్షణములచే న[illegible]రముగ నలరారుచున్నది. మంచి గ్లేజు కాగితము, చక్కని అచ్చు! [illegible] పేజీలు రు 3-0-0

౧. ఇతఁడురచియించినవని చెప్పెడు నృసింహపురాణ శతకంధర రామాయణములు కనపడుటలేదు. కన్నడ బసవపురాణములు కనపడుట లేదు. కన్నడబసవపురాణ కవి జన్మాశ్రయము లితనివి కావు.

౨. ఇతఁడు శ్రీనాథునకుఁ బూర్వుఁడనుట నిశ్చయము.

౩. "గరళపుముద్ద" "గడియలోపలఁ దాడి" యను పద్యము లితనివి కావు.

౪. కన్నడ బసవపురాణము నాధారముగాఁ జేసికొని, యాంధ్ర కవుల చరిత్రనిర్ణయించిన యీతనికాలము (క్రీ. శ. ౧౩౪౦-౫౦ ప్రాంతము) సరియైనది కాదు.

౫. కవిజనాశ్రయ పీఠికలోఁ జెప్పఁబడిన చోడగంగు లిరువురు లో నెవ్వఁడును భీమకవి చెప్పిన రాయకళింగగంగు కాఁడు.

౬. త్రికళింగాధిపతియని శాసనములలోఁ జెప్పఁబడిన గంగు భీమకవి జెప్పిన రాయకళింగగంగు అగునెడల, అశాసనములనుబట్టి భీమకవి క్రి. శ ౧౦౯౮- ౧౧౦౮ లో నున్నవాఁడగును.

౭. చాళుక్యపుచొక్కరాజు మొదటి కులోత్తుంగుఁడని, రెంచి సాహిణిమారఁడు రెండవప్రతాపరుద్రుని సేనాపతి గాక, మఱియొకఁ డని యంగీకరించితిమేని, యప్పుడు భీమకవి కాలము క్రీ. శ. ౧౧౦౦ ప్రాంతమగును.

౮. "కాయమదిసీత" యను పద్యములోని గుడిమెట్ట చాగి పోతరాజు మొదటి పోతరాజైనచో భీమకవికాలము క్రీ. శ. ౧౧౧౦-౧౧౨౦ అగును.

౯. నృసింహపురాణములోని పద్యమందలి నల్లసిద్ధి శాసనముల లోని కులోత్తుంగుఁడు మొదటికులోత్తుంగుఁడని రెంచితిమేని, ఆశాసనములనుబట్టి భీమకవి క్రీ. శ. ౧౦౭౮-౧౧౧౩ మధ్యనున్నవాఁడగును.

౧౦. "ఘనుఁడన్" అను పద్యములోని "తెలుంగాధీశ" యను దానికి "కళింగాధీశ" అను పాఠాంతరము నంగీకరించినచో భీమకవి క్రీ. శ. ౧౧౦౦ ప్రాంతమం దున్నవాఁడగును.

ఈ విమర్శనమును బట్టి భీమకవి కాలము క్రీ. శ. ౧౦౮౦-౧౧౫౦ నడుమనున్నవాఁడని యంగీకరింపవచ్చునని నా నిశ్చితాభిప్రాయము. ఇత రాధారము లేవియైన లభించి మార్పు చెందిన నేతప్ప భీమకవి కాలమిదియే యని యంగీకరింతము.

పైని జెప్పిన ౧౩౫౩ సంఖ్యగల శాసనకర్తయగు రేచన, కవి జనాశ్రయ ప్రణీతకవి యగు రేచన యేమో: అని యూహించితిని కాని, అతఁడు కాఁడని తెలిసినది. శాసనకర్త రేచనతండ్రి శ్రీఖండుఁడు. కవి జనాశ్రయ రేచన తండ్రి వాల్లియ. సంశయాత్మకములైన ౩-౮ పద్యములును చాటుధారలును దక్క నీమహాకవి గ్రంథములలోని పద్యములను చదివి చూడఁజాలకపోవుట విచారకరమైన విషయము.

ఈ భీమకవి శాపానుగ్రహ సమర్థతను దెలుపు కథలనేకములు (గ్రంథరూపమునఁగూడ) ప్రచారములో నున్నవి. అవి యాతనికాల నిర్ణయమునకు గాని పాండిత్యమును దెలుపుటకుఁ గాని తోడుపడునవి కాకపోవుటచేతను, ఇదివఱకే యాతని చారిత్ర మతి విస్తరమగుట చేతను, నాకథలు సత్యములని యనుట కాధారములు లేకపోవుటచేతను వాని నిటఁ జెప్పలేదు.



## దుర్గేశనందని [ఆఱవముద్రణము] 2-8-0

చక్కని నవల విమల సమయజ్ఞత - ప్రభుభక్తిపరాయణత; జగత్సింగుని ఔదార్యము. ధైర్యసాహసములు వర్ణనాతీతములు, మద్రాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుచేయబడినది.

## నవాబునందిని [పునర్ముద్రితము] 2-4-0

రచయిత:- శ్రీచాగంటి శేషయ్యగారు.

దుర్గేశనందినియందలి మిగిలిన కథావిశేషములన్నియు "నవాబునందని" యందు చదువవలయును.

## రాధారాణి [పునర్ముద్రితము] 0-8-0

నిరుపేదబాలిక 'రాధారాణి' గొప్పధనవంతుడు దేవేంద్రనారాయణరాయి. దైవికసమావేశము—వీరిరువురి ప్రణయగాథ.

## నూతన గ్రామపంచాయితీల చట్టము (1950 సం॥ నెం 10 రు ఆక్టు రు 8-0-0)

1950 సంవత్సరములో నూతనముగా మద్రాసు గవర్నమెంటువారిచే చేయబడిన గ్రామపంచాయితీల చట్టము అంతయు చక్కని తెలుగుభాషలోనికి తర్జుమాచేయబడి ప్రతి సెక్షనుకును విపులమగు వ్యాఖ్యానము వ్రాయబడెను.

తెలుగుదేశపు ప్రజలకు మంచి తెలుగులో ప్రకటింపబడిన ఈ పుస్తకమునే అన్నిపంచాయితీలు ఉపయోగించుకొనుచున్నవి ప్రతి గ్రామపంచాయితీయందును యీపుస్తకము తప్పక ఉండవలయును. కావున వెంటనే మీకాపీలకు ఆర్డరు పంపించగోరుచున్నాము.

## విశ్వప్రయత్నము [పునర్ముద్రణము]

ఇందలిరంగములును, పాత్రములును నాంధ్రదేశమునకు సంబంధించినవి కథాకల్పనము, పాత్రగుణపోషణము మొదలగునవి యిందు జక్కగా బ్రదర్శింపబడినవి. ఇదిసాంఘికనవలయైనను, నపరాధపరిశోధక నవలాలక్షణములచే నతివిస్తారముగ నలరారుచున్నది. మంచి గ్లేజుకాగితము, చక్కని అచ్చు! [illegible] పేజీలు రు 3—0—0